The Largest
Circulated
Telugu Monthly

# చతుర

ఫిబ్రవరి 1991




మధ్యయుగాలనాటి పవిత్ర మఠాన్ని
పురుషుల కామకేళీ మందిరంగా మారుస్తూ,
ర్మనీ నియంత హిట్లర్ జరిపిన ప్రయోగం
తెరవెనుకగాథ 'మదనసదనం'

ఉషాకిరణ్ మూవీస్

# అమ్మ

రామోజీరావు

సురేష్‌కృష్ణ

గణేష్‌పాత్రో వేటూరి కీరవాణి అనూర్

గౌతంరాజు భాస్కరరాజు రఘురాం అట్లూరి రామారావు





# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

----- కూపన్ -----

ఫిబ్రవరి చతుర నవల 'మదనసదనం'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# చమురు ప్రపంచం

## బయటబట్టలారేయడం శిక్షార్హమే!

బట్టలు మేడమీద ఆరవేసినందుకుగాను ఓ భార్యాభర్తలకు వెయ్యిపౌండ్లు చేతి చమురు వదిలించాడో ఇంగ్లాండ్ జడ్జిగారు. అసలు విషయమేమంటే- ఇంగ్లాండులోని బర్మింగ్ హామ్ లో సొంతంగా ఇల్లు కొనుక్కొని కాపుర ముంటున్నారు డేవిడ్, ఆలీస్ దంపతులు. భార్యా భర్తలిద్దరూ ఉద్యోగస్థులే కావడంతో ఏరోజు బట్టలారోజు ఉతుక్కోవడానికి వారికి వీలయ్యేది కాదు. అందుకని సెలవుదినాలైన శని, ఆదివారాల్లో చాకిరేవుపెట్టి బట్టలు ఉతుక్కొని తమ మేడమీద ఆరవేసుకునేవారు. వాళ్లఇంటికి ఎదురుగా ఓ'రియల్ ఎస్టేట్' ఆఫీసు వెలిసేవరకూ అంతా సవ్యంగానే జరిగిపోయింది. ఆ తర్వాతే వాళ్లకి కష్టాలు మొదలయ్యాయి. కారణం 'రియల్ ఎస్టేట్' యజమాని మిస్టర్ జోర్డాన్ డీసెన్సీకి ప్రాణం పెట్టే మనిషి. తన ఆఫీసేకాక పరిసర వాతావరణం కూడా గొప్పగా, హుందాగా ఉండాలంటాడు ఆయన.

ప్రతి శని ఆదివారాల్లోనూ డేవిడ్ దంపతులు తన ఆఫీసు ఎదురుగా బట్టలు ఆరేయడం ఆయనకెంతో చిరాకు కలిగించింది. దానివల్ల డీసెన్సీ కొరవడి ఇళ్ల అద్దెలు బాగా పడిపోతున్నాయని ఆయన అభిప్రాయం. అందుకే అలా చేయవద్దని కావాలంటే దొడ్డివైపు బట్టల్ని ఆరేసుకొమ్మని వాళ్లకి సలహా చెప్పాడు.

సహజంగానే అతని సలహాను పెడచెవిని బెట్టారు డేవిడ్ దంపతులు. 'మా ఇల్లు... మాఇష్టం...' అనే ధోరణిలో వారు ప్రవర్తించసాగారు. చేసేదిలేక కోర్టుకెక్కాడు మిస్టర్ జోర్డాన్.



కేసును కూలంకషంగా పరిశీలించి జోర్డాన్ వాదన సబబేనని తీర్పునిచ్చాడు జడ్జి. బట్టలు ఎప్పుడూ ఇంట్లోనే దొడ్డివైపే ఆరేసుకోవాలి తప్ప వాకిట్లో ఆరేయకూడదని చెబుతూ కోర్టు ఖర్చుల క్రింద డేవిడ్ దంపతులు జోర్డాన్‌కు 1000 పౌండ్లు ముట్టచెప్పాలని కూడా తేల్చిపారేశాడాయన. పాపం! డేవిడ్ దంపతులు...!

## వికలాంగుడి సంగీత ప్రతిభ!

అవడానికి వికలాంగుడే అయినా మద్రాస్‌కి చెందిన బాలకుమార్ దావే అపురూపకళాకారుడు. సంగీత ప్రపంచంలో అనితరసాధ్యమైన కృషిచేసి, దాదాపు 54 రకాల వాద్యాల్ని అద్భుతంగా వాయించే నేర్పు సంపాదించాడతను.

దురదృష్టవశాత్తూ ఐదేళ్ల వయసులో సోకిన జ్వరం మెల్లమెల్లగా పక్షవాతంలోకి దింపడంతో శరీరంలోని కుడి భాగమంతా చచ్చుబడిపోయిందతనికి. దయనీయమైన అతని స్థితికి జాలిపడకపోగా స్కూలు పిల్లలంతా హేళన చేస్తూ ఆటపట్టించసాగారు. వారి బాధపడలేక చదువుమానేసి ఇంట్లోనే ఉండిపోయాడు బాలకుమార్. కాలక్షేపంగా ఉంటుందని బంధువొకాయన ఓ చిన్న మౌత్ ఆర్గాన్ని అతనికిచ్చాడు. సరదాగా దాన్ని ఊదుతూనే అందులోని మెలకువలన్నింటినీ వంటపట్టించుకున్నాడా కుర్రాడు. అందులో అతను చూపిస్తున్న ప్రతిభ చుట్టుప్రక్కల వారందరినీ ఆకట్టుకొంది. ఆ తర్వాత తమ ఏరియాలోనే నివసిస్తున్న ఒకానొక ఆంగ్లో ఇండియన్ వద్ద గిటారు కూడా నేర్చుకోవడం మొదలెట్టాడతను. అదే సమయంలో అతని కుటుంబం మైలాపూర్‌కు మారడం- అక్కడ ధనరాజ్ అనే సంగీత విద్వాంసునితో పరిచయం కావడం జరిగిపోయాయి. బాలకుమార్ ఆయన వద్ద గిటార్ వాదనని శాస్త్రీయంగా అభ్యసించడం మొదలుపెట్టాడు. ధనరాజ్ ఎంతటి గొప్పవాడంటే- నేటి ప్రముఖ సినీ సంగీత దర్శకుడైన ఇళయ రాజా కూడా ఒకప్పుడు ఆయన శిష్యుడే.

ఆయనవద్ద సంగీతం అభ్యసిస్తూనే మరోప్రక్క ప్రయివేటుగా లెదర్‌టెక్నాలజీలో యమ్మే చేశాడు బాలకుమార్. ఆ తర్వాత క్రీ.శ 6-13 శతాబ్దాలమధ్య దక్షిణ హిందూ దేశంలో ప్రసిద్ధంగా ఉన్న వాద్యపరికరాలమీద డాక్టరేట్ కూడా చేశాడతను. ఆకారణంగా దక్షిణదేశంలోని గుళ్ళూ గోపురాలు తిరిగి తిరిగి ఎంతో అధ్యయనం చేశాడు. అంతేకాదు నాటి ప్రాచీన పరికరాల్ని శిల్పాలలో చూసి, కళాకారులసాయంతో తిరిగి వాటిని రూపకల్పన చేసి ప్రము



ఖుల ప్రశంసలు చూరగొన్నాడు. మామూలు వ్యక్తులకి కూడా సాధ్యంగాని ప్రతిభ బాలకుమార్ సొంతం. ఏకకాలంలో అతను నాలుగు వాద్యాల్ని వాయించి 'వన్‌మేన్ ఆర్కెస్ట్రా'గా పేరు తెచ్చుకున్నాడు.

'కమీషనర్ గాయత్రి' అనే తమిళ చలన చిత్రానికి సంగీత దర్శకత్వం వహించాడు బాలకుమార్. జేసుదాస్, బాలూ, సుశీల వంటి హేమాహేమీలంతా ఆయన నేతృత్వంలో పాడారు. కాని దురదృష్టవశాత్తు ఆ చిత్రం ఇంతవరకూ విడుదల కాకపోవడంతో బాలకుమార్ ప్రతిభ ప్రపంచానికి తెలియరాలేదు. తనకు మరో అవకాశం వస్తే తన సత్తా చూపించగలనని చెబుతున్నాడు బాలకుమార్ దావే. అతని దీక్షా దక్షతలు అనితర సాధ్యమేనని అనడం అతిశయోక్తికాదని మీరూ ఒప్పుకుంటారు గదా!

## అవార్డులు వద్దనేవాళ్లు

అధికారం కోసం రాజకీయనాయకులు రిగ్గింగులు, గృహదహనాల వంటి అరాచకాలకు పాల్పడుతుంటే- అవార్డులకోసం కళాకారులు ఆ రాజకీయనాయకుల కాళ్లా వేళ్లా పడుతున్న రోజులివి. పతకాల కోసం ప్రఖ్యాత క్రీడాకారులుసైతం ఉత్ప్రేరకాల్ని ఆశ్రయిస్తున్న కాలమిది. కాని గౌరవప్రదమైన, విశ్వవిఖ్యాతమైన అవార్డులనే తిరస్కరించిన మహానుభావులూ ఒకప్పుడు ఉండేవారంటే మనం ఆశ్చర్యపడకతప్పదు. అలాంటివాళ్లని ఈ కాలపు మేధావులు 'పిచ్చోళ్లు' అనుకున్నా ఆశ్చర్యపడక్కర్లేదు.

ప్రఖ్యాత ఆంగ్ల రచయిత జార్జి బెర్నార్డ్‌షాకి 'పిగ్‌మాలియన్' రచించినందుకుగాను 1938లో ఆస్కార్ బహుమతి ప్రకటించారు. కాని ఆ మహానుభావుడు దాన్ని తిరస్కరించి, తన సాహిత్యానికి అవార్డులు, బహుమతులు కొలబద్దలుకావని ఘంటాపథంగా చెప్పాడు.

అలాగే డాలీ నిఖోలస్, జార్జి, సీకత్ అనే హాలీవుడ్ నటులూ ఆస్కార్ అవార్డులు తిరస్కరించి చరిత్రకెక్కారు.

ప్రఖ్యాత స్వీడిష్ కవి గారిఫీల్డ్ కవిత్వానికి నోబుల్ బహుమతి ప్రకటించినపుడు ఆయన దాన్ని తిరస్కరించాడు. ''స్వీడన్‌లో తప్ప నా కవిత్వాన్ని మరే దేశస్థులు చదవలేదు. అలాంటపుడు ఆ ఉన్నత పురస్కారానికి నేను అర్హుడిని కాను'' అని ఆయన వివరణ యిచ్చాడు. అదే విధంగా 1958లో తనకు ప్రకటించిన నోబుల్ బహుమతిని తిరస్కరించాడు ప్రముఖ రష్యన్ రచయిత బోరిస్ పాస్టెర్‌నాక్.



ప్రపంచ శాంతికి కృషిచేశాడని 1973లో లీడ్యూక్ థోకి నోబుల్ శాంతి బహుమానాన్ని ప్రకటించగా ఆయన దాన్ని అందుకోడానికి విముఖత ప్రదర్శించాడు.

జీన్‌పాల్ సాత్రే సాహిత్యకృషికి 1964లో నోబుల్ బహుమతి వచ్చింది. ఆయన దాన్ని తిరస్కరిస్తూ ''ఈ బహుమతి బుట్టెడు బంగాళాదుంపలపాటి చేయదు. కనుక నాకు అక్కర్లేదు'' అని నిర్భయంగా ప్రకటించాడు.

ఔరా! ఎంత గొప్ప వాళ్లీ మేధావులు?

# వేలంలో ఓ ఆఫీసర్‌గారు!

స్థిరచరాస్థుల్ని వస్తు సామగ్రిని వేలం వేయడం మనం తరచూ వింటూనే ఉంటాం కంటూనే ఉంటాం. అయితే ఒకానొక ఆఫీసరు గారు తననితాను స్వయంగా వేలంవేసుకోవడానికి సంసిద్ధుడయ్యాడంటే మనం ఒక పట్టాన నమ్మలేం. కాని ఎవరు నమ్మినా నమ్మకపోయినా ఆ వింత సంఘటన మాత్రం పంజాబ్‌లో గత సంవత్సరం జరిగింది.




అసలు విషయం ఏంటంటే— సంగ్రూర్‌లోని పబ్లిక్ వర్క్స్ డిపార్ట్‌మెంటులో డిప్యూటి కమీషనర్‌గా పనిచేస్తున్న దయాల్‌సింగ్, అంతకుముందువరకూ లూధియానాలో పనిచేశాడు. అక్కడ ఆయన కుటుంబం ఉండేందుకు ఉచితంగా ప్రభుత్వం ఓ పెద్ద క్వార్టర్‌ని కూడా ఇచ్చింది. అయితే ఆ తరువాత ఆయనను సంగ్రూర్‌కు బదిలీ చేశారు. బదిలీచేసే ముందు ఇక్కడ కూడా క్వార్టర్ ఇస్తామని చెప్పడమైతే చెప్పారుగాని 'ఇదుగో... అదుగో..' అంటూ జరుపుళ్లు పెట్టడం సాగించారా శాఖవారు. ఆ కారణంగా కుటుంబాన్ని లూధియానాలోని తన పాత క్వార్టర్‌లోనే ఉంచి తను మాత్రం సంగ్రూర్‌లోనే తంటాలుపడుతూ వచ్చాడా పెద్దమనిషి. అయితే సంగ్రూర్‌లో ఆయనకి క్వార్టర్స్ కేటాయించకపోగా లూధియానాలోనున్న క్వార్టర్‌కి నెలకి అక్షరాలా ఇరవై వేల రూపాయలు అద్దె చెల్లించాలంటూ ఆయనమీద వత్తిడి తెచ్చింది ప్రభుత్వం. కేవలం నెలకు 5000 రూపాయల జీతం తప్ప ఇతరత్రా రాబడిలేని ఆ నిజాయితీ ఆఫీసరుగారి పని కుడితిలోపడ్డ ఎలుకలా తయారైంది. చేసేదిలేక సంగ్రూర్ టౌన్ హాలులో తననితాను 20,000 రూపాయలకు వేలం వేసుకొని అద్దె సొమ్ము చెల్లిస్తానని తమ శాఖవారికి సంజాయిషీ ఇచ్చుకున్నాడాయన. ఆయన వేలానికి సిద్ధపడినా ఆయన్ను పాడుకొనేవారు కావద్దూ... పాపం!

# 'పంతులుగారి పట్నవాసం'పై చతుర సమీక్షలు



డిసెంబరు నెల 'చతుర'లో ప్రచురితమైన కాశీవిశ్వనాథ్ నవల 'పంతులుగారి పట్నవాసం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.



## సరయిన ఎన్నిక

**(ప్రథమ బహుమతి రు.100/- పొందిన సమీక్ష)**

"మర్రి విత్తంత చిన్న పద్యంలో మహా వృక్షమంత అనుభవం ఇవ్వగలవాడే మహాకవి" అన్నారు. అలాగే వందపేజీల చిరునవలలో తరతరాల భారత ఆచారాలు, సాంప్రదాయాలలోని మూఢపద్ధతులను, ఛాందన స్వభావాలను ఎద్దేవా చేస్తూ, అలాగే అందులోని మంచిని, మంచిముత్యాల్లా అలంకరించుకోవాలని స్పష్టంగా కళ్లకు కట్టినట్లుగా 'పంతులు గారి పట్నవాసం' నవలద్వారా తెలియజేశారు కాశీవిశ్వనాథ్‌గారు. కథాబలంగల మంచిరచనల వేదిక 'చతుర' అని మరోసారి రుజువైంది.

నిన్నటితరం ముసుగులోనించి ఇప్పుడిప్పుడే కళ్లు తెరుస్తున్నవారికి, పద్ధతులు, పట్టింపులని మడికట్టుకు కూర్చుండే చాదస్తులకు, ఈ నవల చల్లని వెన్నెలధార అవుతుంది.

ఆధునిక లక్షణాలకు ఏవిధంగా నోచుకోని ఓ కుగ్రామంలో నూతిలో కప్పలా జీవిస్తూ తుప్పుపట్టిన పద్ధతులనే తు.చ. తప్పకుండా పాటిస్తూ వస్తున్న నరసింహం పంతుల్లాంటి వారికి నేటియుగం త్రేతాయుగంకాదు. 'సూపర్, సూపర్ కంప్యూటర్ యుగం' అని తెలియజేయడమే ఈ నవల సారాంశం. పంతులుగారు బస్సులో నలుగురికీ నాలుగు మాటలు అంటించి నాలుగు జొన్నకండెలు యివ్వడం చూస్తే, తిట్టినా పెట్టేవారుండద్దూ అనిపిస్తుంది.

పెద్ద కుటుంబాలు సామరస్యంగా ఎలా జీవించాలో చెబుతూ, పద్ధతులు, ఆచారాలని భీష్మించుకు కూర్చునే పాతకాలపు పెద్దలతో సర్దుకుపోవడమే కాకుండా, కాలంతోపాటు మార్పులు రావాలని పంతులుగారి కొడుకు చలపతి కుటుంబసభ్యులు పంతులుగార్కి ఓర్పుతో తెలివిగా నచ్చచెప్పడం హర్షదాయకం. నత్ప్రౌరులు కావడానికి మాతృభాష, నీతి బోధనలు ధార్మికాలని చలపతి గ్రహించడం, ఆచరించమనడం మంచినిర్ణయం.

నేటి సమాజం వక్రమార్గంలో ప్రయాణిస్తోందనడానికి ఆనందరావులాంటి రాజకీయ నాయకులు వారి సమర్థనలు, కట్నాలు, కోడళ్లు, అత్తల కీచులాటలు నిదర్శనాలు. నరసింహం పంతులుగార్కి డెబ్బై ఎనిమిదేళ్లైనా సంపూర్ణ ఆరోగ్యంగా వుండటానికిగల మార్గాలు అందరికి ఆచరణీయాలు. తడి, మడి ముసుగులో ఉన్న నరసింహం పంతులు కామేశ్వరమ్మలాంటి వారికి నేటి ప్రపంచం





శాస్త్రవిజ్ఞానంతో ఎంత స్పీడుగా ప్రయాణి స్తోందో ప్రత్యక్షంగా చూపించి పాత చింత కాయ పద్ధతులలోని తప్పొప్పులను వారే తెలిసికొని వేసుకొనేటట్లు చేయడానికి రచయిత తగిన పాత్రలు, ప్రదేశాలు, సంఘటనలు ఎన్నిక చేసి మంచి టెక్నిక్ ఉపయోగించారు.

"నీ కర్మకు నీవే కర్తవు, కనుక నీ భవిష్యా న్ని నీవే నిర్మించుకో" అన్న వివేకానంద సూ క్తిని సుజాతకు, రవీంద్రలకు వర్తింపచేస్తే బాగుండేది. అలా కాకుండా ఆచారాలే అరోప్రా ణంగా బ్రతికే నరసింహం పంతులు దంపతు లను పరివర్తకులను చేసి వారి చేతే సుజాత, రవీంద్రల పెళ్లి జరిపించడం ద్వారా నవలను సుఖాంతం చేయడం ఊహించని మలుపైనా రచయిత సందేశానికి సరైన నిర్ణయమనే చె ప్పాలి.

ముగింపులో 'నాగరికత ఎక్కడ కొమ్మలు రెమ్మలు వేసినా ఆ వృక్షానికి వేళ్ళు మన గ్రామాలలోనే ఉన్నాయి'' అని నరసింహంగా రు అన్న మాటలు అక్షరసత్యాలు.

మొత్తంమీద నవల నవ్విస్తూ, మెదడుకు మేతవేస్తూ, మనల్ని నూతన భావాల వైపుకు మళ్లిస్తూ, ఎక్కడా ఆగకుండా చదివించే రచనా పటుత్వం కలిగుందనడంలో సందేహంలేదు. ఇటువంటి మంచి సందేశాత్మక నవల అందించిన రచయిత గారికి, చతురకు కృత జ్ఞతాభివందనములు.

-అర్జి గోవింద్, నల్లబిల్లి.

## వెరయిటీ హీరో...!

*(ద్వితీయ బహుమతి రు.75/-పొందిన సమీక్ష)*

కాశీ విశ్వనాథ్‌గారి 'పంతులుగారి పట్న వాసం' నవలలో నర్సింపంతులు పాత్రను వెరైటీగా సృష్టించారు. ఎంత హోదాలో ఉన్న వాళ్లనైనా 'ఒరేయ్' అనిపిలుస్తూ వాళ్ళ లోపా లను వాళ్ల మొహాన్నే నిర్మొహమాటంగా అనేసే నర్సింపంతులు మాటలు అటు నవ్వు పుట్టించేవిగానూ, ఇటు ఆలోచింప చేసేవిగా నూ కూడా ఉన్నాయి. ఏ కొత్త వస్తువును చూసినా దీనిని తయారు చేసిందెవరు? దీనికి ఎంత ఖర్చయి ఉంటుంది? అని నర్సింపంతు లు అడిగేతీరు ఆయా విషయాలలో అతనికు న్న ఆసక్తిని, ఉత్సాహాన్ని తెలియజేస్తుంది. పాఠకులకు చక్కని హాస్యాన్ని అందించటంతో పాటు రాజకీయాలు, రాజకీయనాయకుల పోక డలను వ్యంగ్యంగా చిత్రించారు.

'ప్రజలచేత ఛీ అనిపించుకున్నవాడు చీఫ్ మినిష్టరయిపోతాడు. పో అనిపించుకున్నవా డు ప్రైమ్మినిష్టరయిపోతాడ'ని ఆనందరావు పాత్రద్వారా ఈనాటి రాజకీయనాయకుల నైజా న్ని చక్కగా చెప్పించారు. గవర్నమెంట్ ఆసు పత్రికి వెళ్లే ఒక సామాన్యుడైన రోగి ఎన్ని తంటాలు పడి వైద్యం చేయించుకోవలసి వస్తుందో రచయిత బాగా చూపించారు. నర్సింపంతులు సినిమా షూటింగ్ చూడటాని కి వెళ్లినపుడు అక్కడ ఫైటింగ్ సీన్‌లో రౌడీలు ఒకళ్ళ తరువాత ఒకళ్లు నాయకుడి మీద కలియబడటం చూసి యుద్ధ నీతిని సినిమా ల్లో చక్కగా పాటిస్తున్నారని పంతులు పాత్ర ద్వారా చెప్పించి సినిమా ఫైట్స్‌ని రచయిత చక్కగా విమర్శించారు. నవల ఆసాంతం ఆసక్తికరంగా సాగినా ముగింపు నాటకీయంగా అనిపించింది.

-ఎం.లక్ష్మి, తిరుపతి.

## తరాల అంతరం

*(మూడవ బహుమతి రూ.50/-పొందిన సమీక్ష)*

**చ**క్కటి కథాశైలితో వేగంగా నడిచిన 'పంతు లుగారి పట్నవాసం' చిన్నచిన్న సందేశాలతో, చిరుహాస్యంతో సాఫీగా సాగిపోయింది. రెండు తరాలకీ గల అంతరాన్ని వివరిస్తూ ప్రతీత రంలోని మంచిని సమర్థిస్తూ కథాగమనం కుంటుపడకుండా చెప్పగలిగేరు. గంగా స్నానం కంటే విధవరాలి సౌభాగ్యం ముఖ్య మని, తాజ్‌మహల్ కంటే కులమతాలకు అతీ తమైన ప్రేమజంటల అనుబంధం గొప్పదని, అలాగే పట్నాల వృద్ధిళ్ళు పల్లెటూళ్ళన్నమాట మరవకూడదని అందరికీ హత్తుకునేలా చెప్పా రు.

నేటి విద్య గురించి పంతులుగారి పలుకు లు ఆలోచింప చేసేలా ఉన్నాయి. సుమతీశ తకం, భర్తృహరి సుభాషితాలు, వేమన పద్యా లు విన్న పిల్లలేరి? ఎంత ఇంగ్లీషు స్కూలు

అయితే మాత్రం మంచి విషయాలు బోధించ కపోతే ఎలా అన్న మాటతో చలపతేకాదు మనమందరం ఆలోచనలో ఆవేదనలో పడ తాం. జీవితానికుపయోగపడే ఒక్క సుభాషిత మూ చెప్పని ఈ చదువుల అర్థం ఏమిటి? "విద్యయొసగు వినయంబు" అనే పద్యం తిరగరాసి "విద్యయొసగు గర్వంబు" అని అనుకునేలా ఉన్నాయి నేటి విద్యార్థుల ప్రవర్త నలు. మనదేశ సంస్కృతి, మన కవులు వీరికి తెలుసా? కీట్సు తెలునుకాని నన్నయ్య ఎవరో తెలిసిన విద్యార్థులెంతమంది?

ప్రపంచంలో ఏ మూల ఏమి జరుగుతోందా అని దినపత్రిక కొని మరీ చదువుతాం కానీ పక్కవీధిలో ఎవరికేమైందో పట్టించుకోలేం.

ప్రజానాయకుడిగా నిలబడుతున్న నీ అర్హ తలేంటి అన్న ప్రశ్న మనమందరం ఎలక్షన్ల రోజున మనింటి కొచ్చే అభ్యర్థిని అడగాలను కొని ధైర్యం చేయని ప్రశ్నే. "ఆంధ్రామొ త్తంమీద నాలుగు సారా ఫ్యాక్టరీలున్నాయండి" అనే జవాబు నేటి ఎమ్మెల్యేలదే. గాంధీ, నెహ్రూలు పుట్టిన దేశంలో ఇలాంటి నాయకు లు పుట్టడం గొప్పమార్పేమరి. కానీ లౌక్యం అంటూ నడిచే చలపతిలాంటి వారిలాగే మన మూ ఈ సమాజస్థితికి కారకులం కాదా?

అయితే ఈ పంతులుగారి క్యారెక్టర్ లాంటివి ఇంతకు ముందు సాహిత్యంలో ఉన్నందున కొత్త నవల చదువుతున్న భావన రాదు. కథ చివరలో మిగతావారంతా వారి ప్రోగ్రెసివ్ థింకింగ్‌ని పక్కకి పెట్టేసి పంతులు గారిచే ఎలాగైనా ఓ మహత్కార్యం చేయించా లనుకున్నట్లుగా పెళ్ళికి వెనుకడుగు వేసారని అనిపిస్తోంది. అంతేకాదు వీరి వివాహం ఒక మంచిపనే అనుకున్న పంతులుగారు, అంద రినీ అదిలించి మరీ దారికి తెచ్చే అధికారం, చేవ ఉన్న మనిషి ఎవరికీ చెప్పకుండా ఈ పెళ్ళి జరిపించాడంటే అసహజంగా ఉంది. అలాకాకుండా వారందరిని తన సహజధోర ణితో ఒప్పించి ఆ పెళ్ళి చేసి ఉంటే అది నవలకి చక్కటి ముగింపు ఇచ్చేది.

ఇలాంటి చిన్నచిన్న విషయాలు వదిలేస్తే మొత్తంగా ఒక చక్కని నవల చదివామని పిస్తుంది. ఇలాంటి నవల అందించిన చతు రకు అభినందనలు.

-డి.అపర్ణ, విశాఖపట్నం.

## మార్పుకు స్వాగతం

*(నాలుగవ బహుమతి రు.25/- పొందిన సమీక్ష)*

**'పం**తులుగారి పట్నవాసం' నవల చదువు తుంటే ఇదివరకు నేను చూసిన 'ఆడదే ఆధారం' అనే సినిమా నా మనసులోమెది లింది. ఈ నవలలోని పంతులుగారి పాత్ర ఆ సినిమాలోని 'విసు' పాత్రను పోలివుంది. 'ఆడ దే ఆధారం' సినిమా ఈ నవలకు పూర్తిగా ఆధారం అని చెప్పలేం కాని కొంత పోలిక ఉంది. ఆ సినిమాలో విసు కూడా ఈ నవల లోని పంతులుగారిలాగే ఇరుగుపొరుగు ఇళ్ల లోని సమస్యల్ని పరిష్కరిస్తూ ఉంటాడు.

ఇకపోతే ఈ నవలలో రచయిత విమ ర్శించని విషయంలేదు. సమాజంలోని చెడు గునంతా పంతులుగారి పాత్రద్వారా తూర్పార బట్టారు. ఎన్నికల్లో గూండాయిజం, అన్‌పార్ల మెంటరీగా సాగే అసెంబ్లీ సమావేశాలు, ప్ర స్తుతం వస్తున్న తీవ్రవాదాన్ని ప్రేరేపించే సిని మాలు, అవినీతికి ఆలవాలమైన అనుపత్రు లూ, వరకట్న వేధింపులూ, కులమత ద్వేషా లూ- ఇలా ఒకటేమిటి సమాజంలో ఉన్న కుళ్ళునంతా కళ్లకు కట్టినట్లు వివరించి కడిగి పారేసారు. చాదస్తంతో 'పంతులుగారు' వెలిబు చ్చిన అభిప్రాయాల వెనకదాగిన నిజాలు ఆలో చింపచేస్తాయి. ఉదాహరణకు 'లేడీస్ అండ్ జెంటిల్‌మన్' అనే సంబోధనలో మగాళ్లకు 'జెంటిల్' పదాన్ని చేర్చి ఆడవాళ్లకు ఆ పదం చేర్చకపోవడం. పంతులుగారి విమర్శలు సభ్యసమాజానికి విసిరిన సవాళ్ళు.

నవల చివరగా సాంప్రదాయ బద్ధుడైన పంతులుగారు ఒక విధవకు వర్ణాంతర వివాహం తన చేతుల మీదుగా జరిపించడం కొసమెరుపు! ఇది మారుతున్న సమాజంతోపా టు మనమూ మారాలి అని అన్యాపదేశంగా ఆయన ఇచ్చిన సందేశం! మార్పుకు ఆహ్వానం!

-గుబ్బల సత్యనారాయణమూర్తి, ఏలేశ్వరం.





## సంతృప్తినిచ్చిన నవల

(అయిదవ బహుమతి రు:25/-పొందిన సమీక్ష)

సున్నితమైన హాస్యంతో, సునిశితమైన వ్యంగ్యంతో నిండిన ఈ నెల 'చతుర' నవల 'పంతులుగారి పట్నవాసం' ఒక చక్కని నవల చదివిన అనుభూతిని మిగిల్చింది. కాశీ విశ్వనాథ్‌గారు తమ సహజశైలితో నేటి రాజకీయ పరిస్థితులు మున్నగువాటిని గురించి సూటిగా దెప్పిపొడవకుండా పంతులుగారి పాత్రద్వారా, ఆయన ఆవేదనద్వారా తెలియజెప్పడం చాలా బాగుంది. ఆనాటి కాల పరిస్థితులను, నేటి పరిస్థితులను తలచుకొంటే ఎవరికైనా ఆశ్చర్యం, ఆవేదన కలగక మానవు. అదే మనింట్లోనున్న ఎవరైనా పెద్దవాళ్లు ఈ మాటలే అంటే దానిని చాదస్తంగా కొట్టిపారేస్తాం. కాని అదే విషయం పంతులుగారి మాటలలో వింటూంటే ఎంతో బాధగా అనిపించింది.

సహజంగా వృద్ధులకి, ముందు తరంవారికి నాటి పరిస్థితులను, నేటి పరిస్థితులను బేరీజు వేసుకొని బాధపడటం అలవాటే. కాని ఒక విధంగా చూస్తే ఆనాటి పరిస్థితులే మంచివేమో. కుళ్లురాజకీయాలు, కులమత సంఘర్షణలు ఇవేవీ లేని ఆ కాలమే మంచిదనిపిస్తోంది నేటి పరిస్థితులు చూస్తుంటే.

చివరగా- మొత్తం కథంతా ఒక ఎత్తు; ఆయన జరిపించిన విధవా వివాహం ఒక ఎత్తు. ద్వైదీభావంతో కొట్టుమిట్టాడుతున్న తన సంతానానికి కనువిప్పు కలిగేలా, ప్రేమించుకున్న జంటకు న్యాయం జరిగేలా ఆయన జరిపించిన వివాహం పంతులుగారిని ఉన్నత శిఖరాలమీద నుంచోబెట్టింది.

ఎంత సంఘ సంస్కరణాభిలాషులుగా చెప్పుకొన్నా విధవా వివాహం తన ఇంట్లో, తనవారికి జరపడానికి వెనుకంజ వేసేవారున్న ఈరోజుల్లో పంతులుగారి ఆలోచనా సరళి, ఆయన జరిపించిన వివాహం ఆయన్ని మహొన్నతుడిగా మలచాయనడంలో సందేహం లేదు.

ఏవో ఒకటి రెండు చిన్నచిన్న లోపాలు తప్పితే మొత్తంమీద ఈ నెల 'చతుర' మంచి నవల చదివిన తృప్తిని కల్గించింది.

-పావని, ఫెర్టిలైజర్ సిటీ.

## అభినందనీయ చైతన్యం

(ఆరవ బహుమతి రు:25/- పొందిన సమీక్ష)

ఒక ఉత్తమ రచయిత కలంనుండి జాలువారిన రచన పఠితులకు విజ్ఞానదాయకమైనదైనా అవుతుంది, వినోదాత్మకమైనదైనా అవుతుంది. విజ్ఞానము, వినోదాల మేళవింపుతో చదువరులకు తమ ఇంటికే ఒక సనాతన ఛాందసుడు అతిథిగా విచ్చేసిన భావన కలిగిస్తూ ఆహ్లాదకరమైన సన్నివేశాలతో శ్రీ కాశీ విశ్వనాథ్ రచించిన 'పంతులుగారి పట్నవాసం' చదువుతున్నంతసేపు మనసును మురిపించింది.

రాహుకాలం చూసుకొని కోర్టుకు వెళ్ళమని లాయరు కొడుక్కి సూచించే తాతగారి అమాయకత్వం, మడికట్టుకోకుండా వంటచేస్తున్న కోడలు ఎంతో దారుణమైన నేరం చేస్తున్నట్లు ఆరాటపడిపోయిన మామ్మగారి సనాతనత్వం మనల్ని గతంలోకి తీసుకెళ్లాయి కొద్దిసేపు.

నేటి సమాజంలో చదువుకోవాలన్నా మంచి ఉద్యోగం సంపాదించాలన్నా అడుగడుగునా పోటీలు తప్పనిసరి అవుతున్న తరుణంలో ఉన్నత విద్యకోసం ఇంగ్లీష్ చదువులను ఆశ్రయించిన కొడుకులకూ, మనవలకూ నాటి చదువుల విలువల్ని భర్తృహరి సుభాషితాలు, సుమతీశతకం, వేమన శతకాల్లోని నీతిని, పరమార్థాన్ని విపులీకరించడమే కాక నేటి విద్యావిధానంలో లోపాల్ని, తరాలవారీగా అంతరించిపోతున్న విద్యావిలువల్ని సునిశితంగా విమర్శించారు నర్సింహం పంతులుగారు. ఇక్కడే ఆయన మేధాశక్తి మనకు తెలుస్తుంది.

ఈ రెండు నెలల్లోనూ పట్నం వాతావరణంలో నాగరికత, పిల్లల పద్ధతులు, కాలగమనంలో మార్పులు, పిల్లలతో వాదనలు బోధనలతో పరిణితి చెందిన మనిషిగా మార్పుచెంది అభ్యుదయవాదిగా తన పిల్లల్ని మించిపోయి ముందడుగువేసి మనవరాలు ప్రేమించిన పరాయి రాష్ట్రంవాడికిచ్చి స్వయంగా వివాహం జరిపించడం చదువరులు ఊహించలేని మార్పే. అది అభినందించదగ్గ గొప్ప చైతన్యం.

-పి. ప్రవీణ,గుడివాడ.



చతుర

సంపుటి: 14 సంచిక: 1 ఫిబ్రవరి 1991

జర్మనీ నియంత అడాల్ఫ్ హిట్లర్ ప్రపంచాన్నంతటినీ పాదాక్రాంతం చేసుకునే లక్ష్యంతో ద్వితీయ ప్రపంచ సంగ్రామాన్ని ప్రారంభించాడు. ఈ యుద్ధంలో యూరప్‌లో సాధించిన సైనిక విజయాలతో తల తిరిగిపోయి, ప్రపంచం మొత్తాన్ని జయించి మహా ఆర్యసామ్రాజ్యాన్ని స్థాపించాలనుకున్నాడు. దానికి అవసరమైతే మూడవప్రపంచ సంగ్రామాన్ని కూడా జరపాలనుకున్నాడు. ఆ మహాయజ్ఞానికి నాజీయిజాన్ని ఉగ్గుపాలతో రంగరించుకుని పెరిగిన జాతి అవసరమని భావించి, విచక్షణమరచి సభ్య ప్రపంచం సిగ్గుతో తలలువంచుకునే 'కొత్తజాతి' సిద్ధాంతాన్ని రూపొందించాడు. మానవ నాగరికతకు మూలమైన వివాహవ్యవస్థను సమూలంగా ధ్వంసం చేసి 'పునస్సృష్టి' జరపాలని ఆదేశించాడు. ఈ ప్రయోగాన్ని అమలు జరపడానికి బవేరియాలోని పురాతన క్రైస్తవ మఠాన్ని ప్రయోగశాలగామార్చి దానికి 'మదనసదనం' అని పేరు పెట్టాడు. దేశంలోని అందమైన, ఆరోగ్యవంతమైన కన్నెపిల్లలను ఎంపిక చేసి బలవంతంగా ఈ మదనసదనానికి చేర్చాడు. తన యుద్ధయంత్రాంగంలోని బలిష్ఠులైన యువసైనికాధికారులను ఎంపిక చేసి, ఆ పిల్లలపై ప్రయోగించి బలవంతపు గర్భాదానాలతో 'పుత్రకామేష్టి' జరిపించాడు. ఆ నాజీ నరహంత సృష్టించిన అతిహేయమైన సంస్కృతిని కండ్లకు కట్టేలా ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత లూయి ఛార్లెస్ రోయర్ చిత్రించిన 'మదనసదనం'కు శ్రీకాంత్ స్వేచ్ఛానువాదం ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్రనవల.

ఇతిహాసపు చీకటికోణం
అట్టడుగునపడి కాన్పించని
కథలన్నీ కావాలిప్పుడు
దాచేస్తే దాగనిసత్యం

# మదనసదనం

**1943** వసంతకాలంలో ఒక ఉదయం. చలి కొరుక్కుతింటూవుంది. తెరలు తెరలుగా కురుస్తున్న పొగమంచు ఇంకా సరిగ్గా తెల్లారనేలేదని చెబుతూవుంది. అలాంటి సమయంలో యిద్దరు జర్మన్ అధికారులు ఆ హొటల్‌లో బ్రేక్‌ఫాస్ట్‌కు కూర్చున్నారు. రైన్ నదీతీరాన్ని నేత్రానందంగా చూస్తూ ఉపాహారం తినాలనుకున్న వాళ్ళు టెర్రస్ మీదకే బ్రేక్‌ఫాస్ట్ తెమ్మని సర్వర్‌ను ఆదేశించారు. ఆ యిద్దరూ మూడేళ్ళుగా దేశమంతా తిరుగుతున్నారు. అందుకే వాళ్ల శరీరాలు చలీ, ఎండా మాకేం లెక్కన్నట్లుగా గట్టిపడి కరుకుదేలి వున్నాయి.

"రెండు పిట్టలు దొరికాయి, ఫర్వాలేదుగా" అని వారిద్దరిలో ఒకరు మరొకరితో చెప్పాడు. అలా చెప్పినతని పేరు సర్జన్ మేజర్ హెన్రిక్ ఊర్జెర్. క్లుప్తంగా డాక్టర్ అంటారతన్ని. ఎర్రటి తలతో, నీలిరంగు కళ్లతో తమాషాగా వుంటాడు. అలా అంటూనే పగలబడి నవ్వాడతను. ఆ నవ్వుకు ముక్కుమీది బంగారు ఫ్రేమ్ కళ్లజోడు గడగడలాడింది.

దానికి సమాధానంగా రెండో అధికారి కూడా పిరగబడి నవ్వాడు. ఆ నవ్వులో అధికారగర్వం కొట్టొచ్చినట్లు కనిపిస్తూవుంది. "మనం ఈ రేటును ఇలాగే కొనసాగిస్తే మన మదనసదనం ముందు పారిస్ బలాదూర్ అవుతుంది" అంటూ మరోసారి సకిలించి నిగనిగ మెరిసే బూట్లతో ధగధగలాడుతున్న తన కాళ్ళను మరో కుర్చీమీద పడేశాడు. బద్ధకంగా చుట్ట దమ్ము లాగుతూ వున్నాడు.

కందగడ్డలాంటి ఎర్రమొహంతో డాక్టర్ పచార్లు చేస్తూవున్నాడు. మరో క్షణంలో అతడు వడివడిగా మెట్లుదిగి తోటలోకి వచ్చాడు. ఆకులన్నీ రాలిపోయి కొత్త చిగుర్లకోసం నిరీక్షిస్తూ మోడుగా మిగిలిన ఆ చెట్లమీదుగా ఈడ్చికొడుతున్న తడిగాలిని ఆఘ్రాణిస్తూ అతడు అటూయిటూ తిరుగుతున్నాడు.

అలా కాలుగాలిన పిల్లిలా షికార్లు కొడుతూ వున్న డాక్టర్‌కు అప్పుడే హొటల్ వంటగది నుండి ఓ పెద్ద బాల్చీ మోయలేక మోస్తూ బయటికి వస్తూవున్న ఓ పడుచుపిల్ల కనిపించింది. ఆమె ఆ బాల్చీ బరువుకు ఒకవైపు ఒంగిపోతూవుంది. ఆమె వేసుకుని ఉన్న స్కర్ట్ గాలికి మడతపడుతూవుంటే అనాచ్ఛాదితంగా వున్న ఆమె పిక్కలు కనిపిస్తూవున్నాయి. హఠాత్తుగా సుడి తిరిగిన గాలి, ఆ అమ్మాయి స్కర్ట్‌ను సాంతం ఎగరేసింది. నిగనిగలాడే ఆమె తొడలు డాక్టరు కంటబడ్డాయి. పడుచుదనం హొయలు చిందే అంత అందమైన తొడలను ఆ సర్జన్ తన జీవితంలో చూసి ఎరగడు.

ఆ నిగారింపులు చూస్తూనే డాక్టర్ ఆనందంతో లొట్టలేస్తూ "అప్సర... అప్సర" అంటూ గంతులేయసాగాడు. ఆ అమ్మాయి అతని గడబిడకు బిత్తరపోయి ఆగిపోయింది. ఆమె చేతిలోని బాల్చి కిందకు జారింది. ఎదురుగా నిల్చుని తనవేపే గుటకలు మింగుతూ మింగేసేలా చూస్తూ గుటకలు మింగుతూన్న అతన్ని చూస్తూనే ఆ అమ్మాయి సిగ్గుతో ముడుచుకుపోయింది. భయభీతితో వళ్ళు జలదరించింది. బొమ్మలా ఉన్నచోటనే నిలుచుండిపోయింది.

"ఇలా రా... భయపడకు... దగ్గరకి రా" సర్జన్ స్వరం సాధికారంగా పిలిచింది.

ఆ అమ్మాయి తల దించుకుని భయం భయంగా అతని దగ్గరకు నడిచింది.

"తల పైకెత్తు"-

ఆ మాట వింటూనే అంత చలిలోనూ ఆ అమ్మాయికి చిరుచెమటలు పోశాయి. చెప్పినట్లు చేసింది.

"నీ వయసు...?"

"ప... ప... పద్దెనిమిది సార్"

పరిపూర్ణంగా వికసించిన ఆమె నవయవ్వనపు సొంపులన్నింటినీ డాక్టరు తన కళ్ళతోనే తాగేస్తూ ఆనందంగా ఆ అమ్మాయి భుజం తట్టాడు. ఒంటి ఎత్తు పల్లాలన్నింటినీ చేత్తో తడిమిచూశాడు. సిగ్గూ ఎగ్గూ వదలి ఆ అమ్మాయి పిరుదులు గట్టిగా వున్నాయో లేదో పరీక్షించడానికంటూ గట్టిగా నొక్కిచూశాడు. అతని చేష్టలకు ఆ అమ్మాయి భయంతో గజగజలాడింది.

"ఆ బాల్చీ అలా పారేసి ఇలా నాతో రా" అంటూ ఆజ్ఞాపించాడు.

ఆ పిల్ల కాలు కదిపేవరకూ కూడా ఆగకుండా చేయి పుచ్చుకుని చరచరా టెర్రస్





మీదికి లాక్కుపోయాడు.

టెర్రస్‌మీద కుర్చీలో కూర్చుని, మరో కుర్చీ మీద కాళ్ళు బార్లా జాపి, నిద్రమత్తులో జోగుతూ వున్న కల్నల్ ఈ చప్పుడుకు లేచి సరిగ్గా కూర్చున్నాడు. ఎదురుగా కనిపిస్తున్న పిల్లదాన్ని చూసి సంతోషంతో నకిలిస్తూ ''ఇది మరో కటా?'' అని ప్రశ్నించాడు.

''ఊఁ... నాకు దొరికినవాటన్నిట్లోకీ ఫస్ట్‌క్లాస్ సరుకు. ఈ పిల్లను చూడు. దాని వయసు జూడు. సొగను జూడు. దాని వంపులు,సొంపులూ అన్నీ జూడు'' అంటూ గంతులేస్తున్నాడు డాక్టర్.

కల్నల్ ఆ అమ్మాయిని జుర్రేసినట్లుగా చూశాడు. ''చూడ్డానికి బాగానే వుంది. ఆరోగ్యం గూడా బాగున్నట్లేనా?''

''ఆ విషయం కూలంకషంగా పరీక్షించి చూద్దాం... రా కల్నల్'' అంటూ డాక్టర్ గదిలోకి దారితీశాడు.

అది తనకేమంత ఆసక్తిలేని విషయమన్నట్లుగా నటిస్తూనే కల్నల్ మహోత్సాహంతో డాక్టరును అనుసరించాడు. డాక్టరు తన చేతికి చిక్కిన పిల్ల సుతిమెత్తని మణికట్టును అలాగే గట్టిగా ఒడిసిపట్టి ఆ పిల్లను బరబరా హొటల్ రూంలోకి లాక్కెళ్ళాడు.

గదిలోకి వెళ్లటంతోనే డాక్టర్ గది తలుపులకు తాళం బిగించి ''పిల్లా... బట్టలూడదియ్'' అంటూ గర్జించాడు.

ఆ గద్దింపుతో హడలెత్తి మూగపోయిన ఆ పిల్ల గుడ్లనీరు గ్రుక్కుకుంటూ శిలాప్రతిమలా చేష్టలుడిగి నిలుచుండిపోయింది.

''ఊఁ... క్విక్.. త్వరగా..'' తిరిగి డాక్టర్ గళగర్జన వినిపించింది. ఇంకాస్త ఆలస్యమైతే డాక్టరు ఆ పిల్ల బట్టలన్నీ లాగేసేటట్లున్నాడు. అసలే భయంతో కుంచించుకుపోయివున్న ఆ పిల్ల గజగజలాడుతూ అసంకల్పితంగానే తన బట్టమీద వేసుకుని వున్న ఏప్రాన్ విప్పింది. బ్లౌజ్ గుండీలు లాగి కింది స్కర్టును వదిలేసింది.

''ఊఁ... దగ్గరగా రా.. ఆ లోబాడీ గూడా విప్పేయ్.''

ఆ అమ్మాయి సిగ్గుతో, భయంతో కుంచించుకుపోతూ ఒక చెయ్యి ఎత్తి ముఖానికి అడ్డంగా పెట్టుకుని లోబాడీ ఊడదీయసాగింది. ఆ పిల్ల చంకల్లోని మిలమిలలు డాక్టరు కంటపడ్డాయి.

కల్నల్ వెంటనే ఆ పిల్ల మీదికి లేడి మీదకు దూకే సింహంలా దూకి ఆ పిల్ల రెండు చేతులూ పైకెత్తి ఆ బాడీని తలమీదుగా లాగి అవతల విసిరేశాడు. ఆ లాగుడుకు ఆ అమ్మాయి జుట్టుముడి వీడింది.

పోతపోసిన బంగారురంగులో మిలమిలలాడే ఆ పిల్ల జుట్టు మేలి జలతారులా విరబడి, నగ్నంగా వున్న ఆ పిల్ల భుజాల్ని కప్పివేసింది.

''అబ్బ... ఎంత అందమైన తలకట్టో'' అంటూ కల్నల్ లొట్టలేశాడు.

''ఇంతకూ పిల్లది ఆరోగ్యంగా ఉన్నట్లేనా?'' అంటూ డాక్టరును ప్రశ్నించాడు.

''అదే చూద్దాం. పిల్లా ఇలా దీనిమీద పడుకో'' అంటూ భీతహరిణిలా భయంతో వణికిపోతూన్న ఆ పిల్లను డాక్టరు సోఫా వద్దకు లాక్కెళ్ళాడు. ''భయపడకు... నిన్ను నేనేం రేప్‌చెయ్యను. నేను డాక్టర్ను. అర్థమైందా?'' అంటూ ఆ అమ్మాయిని సోఫామీద పడవేసి వళ్లంతా పట్టిపట్టి పరీక్షించసాగాడు. పరీక్షిస్తున్నంతసేపూ డాక్టరు ఆ అమ్మాయిని బుజ్జగించినట్లుగా మాట్లాడసాగాడు.

''ఇంతకూ నీ పేరేమిటమ్మా? అన్నదమ్ములూ, అప్పచెల్లెళ్ళూ ఎవరైనా వున్నారా? మీ అమ్మ, నాన్న ఏం చేస్తూవుంటారు? అబ్బ... ఎంత అందం. చిదిమి దీపం పెట్టుకోవచ్చు. ఇంతకూ నీవు ఎన్నాళ్లబట్టి ఇక్కడ పనిచేస్తున్నట్లు?'': ఇత్యాది ప్రశ్నలన్నీ అడుగుతున్నాడు. డాక్టరు బుజ్జగింపులకు, లాలింపులకు, చూపే మర్యాదకూ ఆ అమ్మాయి కాస్త తేరుకుంది.

''నాకే జబ్బూ లేదు డాక్టర్. నిజంగా అమ్మతోడు''

''అబ్బే... అలాంటిదేమీ లేదమ్మాయి. నీలాంటిదానికి జబ్బు అంటుతుందా అసలు'' అంటూ కల్నల్‌వైపు తిరిగి ''అరటి బోదెలా పెరిగింది. మచ్చలేని మాణిక్యం'' అంటూ, ''చూడమ్మాయి... నీవు వెళ్ళి వెంటనే మీ ఓనరుని తీసుకురా'' అన్నాడు.

''ఓనరెవరో నాకు తెలియదండి. నేనెన్నడూ మేనేజర్‌తోనే మాట్లాడి ఎరగను. ఆ సారుతో

ఉషాకిరణ్ మూవీస్



రామోజీరావు మౌళి

A.P. FILM PUBLICITY CLEARANCE COMMITTEE
Approved
A.P.F.C.C.
HYDERABAD

రామప్రసాద్ వేటూరి కీరవాణి పి.యస్.ప్రకాష్ శ్యామ్‌ముఖర్జీ శ్రీనివాసరాజు కళ అట్లూరి రామారావు

నాకెప్పుడూ పనిపడలేదు సార్" అంటూ నసిగింది.

ఆ మాటలకు డాక్టర్ పకపకా నవ్వి "పోనీ ఎవరితో మాట్లాడతావో చెప్పు" అని అడిగాడు.

"నేను వంటవాడితో తప్ప మరెవరితోనూ మాట్లాడను"

ఆ మాటతో కల్నల్‌కు నవ్వు వచ్చింది. "పోనీ ఇలా చేద్దాం" అంటూ కాలింగ్ బెల్ నొక్కసాగాడు. ఆ మోతకు పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చిన వెయిటర్, వంటగదిలో పడి వుండే పనిపిల్ల వంటిమీద నూలుపోగైనా లేకుండా డ్రాయింగ్‌రూంలో నగ్నంగా నిలబడి వుండటం చూసి మతిబోయినంతపనై తన చేతిలోని ట్రేని అలాగే జారవిడిచాడు.

"మీ మేనేజరును పిలు" కల్నల్ హూంకరించాడు.

మరో ఐదునిమిషాలలోపే ఆ గదికి పరుగెత్తుకొచ్చిన మేనేజర్ ఆ గదిలోని దృశ్యంచూసి అవాక్కయినాడు. అంతలోనే తేరుకుని అధికారులిద్దరికీ కలిపి ఒక నలాంగొట్టి "ఏం సెలవు" అన్నట్లుగా చూశాడు.

"ఏయ్ మేనేజర్... ఈ పిల్లను మేం తీసుకెళతాం" అన్నాడు కల్నల్ బట్టలు కట్టుకుంటున్న ఆ అమ్మాయిని తన చేతిలోని బెత్తంతో చూపుతూ.

కల్నల్ మాటలు వింటూనే మేనేజర్ ముఖం కందగడ్డలా ఎరుపెక్కింది. అసలే యుద్ధం జరుగుతూ వుంది. ఇట్లాంటి సమయంలో వీళ్ల మాటలు వినకపోతే తన మెడకాయమీద తలకాయ వుండదు. కానీ ఇదంతా ఏదో గంద్రగోళంలా వుంది. ఈ కల్నలూ, ఈ డాక్టరూ యిద్దరూ కలిసి ఈ హోటళ్లలో కాల్‌గరల్స్ ఏమైనా వున్నారేమోనని కూపీలు లాగుతున్నారేమో. తమ హోటల్లో ఈ పిల్ల వ్యభిచారం కోసం వుందని అనుమానిస్తూ వున్నారేమో.

"కల్నల్ సారూ... ఈ రాష్ట్రం హోల్‌మొత్తంలో మా హోటల్‌కు మాగొప్ప పేరుంది. ఆమాటకొస్తే జర్మనీదేశం హోల్‌మొత్తంలోనే మంచి పేరుంది. మా హోటల్‌లో పనిచేసే ఏ వంటపిల్లగానీ, మరే పిల్లగానీ దీనిలాగా సిగ్గూ ఎగ్గూ విడిచి ప్రవర్తించడం ఎన్నడూ జరగలేదు. మీలాంటి పెద్దవారిముందు వెధవ్వేషాలేసిన దీన్ని యిప్పుడే ఈ క్షణమే, మీ కళ్ళెదుటే డిస్మిస్ చేసేస్తున్నా సార్" అంటూ విన్నవించుకున్నాడు.

"నువ్వనుకున్నట్లు యిక్కడేం జరగలేదు. ఈ పిల్లను మేం కావాలని మావెంట తీసుకుపోతున్నాం" అని చెప్పాడు సర్జన్.

తానిదేం నమ్మలేనట్టుగా మేనేజరు ఆ యిద్దరు అధికారులవంకా మార్చిమార్చి చూశాడు. సర్జన్ చెప్పింది నిజమేనన్నట్టుగా కల్నల్ కూడా తల ఊపాడు.

దీనితో మేనేజరు ముఖం ఇంకా ఎర్రబడింది- "సార్... ఇలాంటి విషయం మా హోటల్లో జరగటం యిదే మొదటిసారి సార్. ఇంతకుముందెప్పుడూ ఇలాంటి తప్పుడు పని జరగలేదు సార్. మమ్మల్ని క్షమించండి సార్" అంటూ మొరపెట్టుకోసాగాడు.

"సర్జన్... అతనికి ప్రభుత్వ ఉత్తర్వు చూపించు" కల్నల్ సకిలించాడు. సర్జన్ తన లెదర్‌కోటులో నుంచి ఒక సంచి బయటకు తీశాడు. దానిలోవున్న పత్రం బయటపెట్టి విప్పసాగాడు. ఆ పత్రంమీదున్న సీలు చూస్తూనే మేనేజరు భయభక్తులతో నిలుచుని, "సార్... నన్ను... క్షమించండి సార్. ఇదంతా నాకేం తెలియదు. నేనేదో అనుకున్నా..." అంటూ నంగినంగిగా మాట్లాడాడు.

కల్నల్ తన కళ్లజోడులోనుంచి మేనేజరును పైకీ, కిందకీ పురుగును చూసినట్టు చూశాడు.

"ఊఁ... బయట మాకెవరూ దొరకనట్టు మీ హోటల్‌లో అంట్లుతోముకునే పనిపిల్లతోటి లంజరికం చెయ్యడానికి మేం నీ హోటల్‌కు వచ్చామనుకుంటున్నావ్‌గదూ! అయినా ఈ పిల్లుంది చూశావ్! మిగతా పనిపిల్లలందరిలా లేదు. మిసమిసలాడుతూ కళ్ళు జిగేల్‌మనిపిస్తూ వుంది. ఇంత అందమైన పిల్లను ఏరి పనిలో పెట్టుకున్న నీ టేస్టును మేం మెచ్చుకుంటున్నామోయ్! మేనేజరూ... బహుశా నీకు గుర్తు లేదనుకుంటాను- నువ్వు చేసే ఉద్యోగంలో మనుషులను గుర్తు పెట్టుకోకపోవటం క్షమార్హంగాదోయ్. నన్ను సరిగ్గా కళ్ళుపెట్టుకుని చూడు. పదేళ్ల క్రితం... సరిగ్గా 1933లో నా రాణీతో కలసి నీ హోటల్‌లో దిగాం"

అంటూ నెత్తిమీది టోపీ తీసేశాడు. జుత్తంతా రాలిపోయి నిగనిగలాడే బట్టతల. దానికి కిందుగా, చెంపలపైగా వలయాకారంగా మిగిలి అక్కడక్కడా నెరసిన జుత్తుతో ఆ తల చాలా తమాషాగా వుంది. "ఇప్పటికైనా గుర్తొచ్చిందా? ఇంతకీ నేనెవరో తెలుసా? కల్నల్ కౌంట్ గంథర్ ఓంకోల్జ్" అంటూ దర్పంగా చేతిలోని బెత్తాన్ని బూట్లకు తాటించాడు.

మేనేజరు పొట్ట వంగడానికి మొరాయిస్తున్నా, మోకాళ్లదాకా వంగి కల్నల్‌కు సలాం చేశాడు "అవునవును... గుర్తుంది, బాగా గుర్తుంది. మీరు నన్ను క్షమించితీరాలి" అంటూ.

వీళ్ళు మాటలు, మర్యాదల్లో వుండగా ఆ అమ్మాయి త్వరత్వరగా బట్టలు తొడుక్కుని, అక్కడనుండి బయటపడటానికి వడివడిగా ద్వారంవైపు వెళ్లసాగింది.

"ఏయ్ పిల్లా... పారిపోకు. ఇంతకూ నీపేరేంటి?" అంటూ అడిగాడు డాక్టర్.

"నాపేరు.. నాపేరు.. లీసెల్" అంటూ భయంతో వణకసాగింది.

"ఈ అమ్మాయి పేరు ఎలిజిబెత్ షాఫ్" అంటూ సరిదిద్దాడు మేనేజరు.

"పాపం ఈ పిల్ల తల్లి విధవరాలండీ" అంటూ మేనేజరు సమస్త వివరాలను ఒక కాగితం మీద రాసి కల్నల్‌కు అందించాడు.

"సరే... ఈ పిల్లను తీసుకెళ్ళి, దానికి రావలసిన జీతభత్యాలన్నీ సరిగ్గా లెక్కచూసి యిచ్చేసి, తిరిగి వెంటనే ఆ పిల్లను వెంటబెట్టుకుని యిక్కడికి తీసుకురా. తెలిసిందా?" అంటూ హుంకరించాడు కల్నల్.

"చిత్తం చిత్తం... రామ్మా లీసెల్" అని దారితీశాడు మేనేజరు.

మేనేజరూ, వంటపిల్లా భయభక్తులతో వంగివంగి సలాములు చేస్తూ అక్కడినుండి బయటపడిన వెంటనే డాక్టరు పగలబడి నవ్వసాగాడు. "మనం చాలా చాలా గొప్పపని చేస్తున్నట్లు ఈ తొత్తు కొడుక్కి నమ్మకం కలిగించాం" అంటూ డాక్టరు యింకా నవ్వుతూనే వున్నాడు.

"నేను అమ్మాయిలను బట్టలు విప్పమన్నప్పుడు చిత్తశుద్ధితో నా వృత్తి ధర్మాన్ని నిర్వహిస్తున్నాను. సైన్యంలోకి రిక్రూట్‌చేసుకునేటప్పుడు శరీరధారుఢ్యం, ఆరోగ్యాల గురించి పరిశీలించిన విధంగానే ఈ రిక్రూట్‌మెంట్‌లో కూడా చేస్తున్నాను. ఈ విషయంలో నాకు వ్యక్తిగతమైన యిష్టాయిష్టాలు లేవు. ఈ పని చేస్తున్నందుకు నేనేమీ సిగ్గుపడటం లేదు" అంటూ డాక్టరు తనను తాను సమర్థించుకునే ధోరణిలో మాట్లాడాడు.

జాతి పరిశుద్ధత, పవిత్రత విషయంలో నాజీ ప్రయోగాన్ని అమలుజరిపేందుకోసం హెర్ హిట్లర్ స్వయంగా సర్జన్-మేజర్ హెన్రిక్స్ ఊర్జేర్‌ను ఎంపిక చేశారు. అతనిలో తనకు కావలసిన ఉత్తమ లక్షణాలన్నీ ఉన్నాయని హిట్లర్ భావించాడు. 1914-1918 మధ్యకాలంలో జరిగినయుద్ధంలో ఈ డాక్టర్ జూనియర్ మెడికల్ ఆఫీసరుగా పనిచేసి, యుద్ధరంగంలో ధైర్యసాహసాలను ప్రదర్శించి మెప్పు పొందాడు. యుద్ధానంతరం పౌరజీవితంలోగూడా జీవశాస్త్రరంగంలో విశేషంగా కృషిచేసి తనవృత్తిలో ప్రశంసలు అందుకున్నాడు. ఆయన జీవశాస్త్ర రంగంలో చేసిన కృషిని బెర్లిన్ వైద్య విజ్ఞాన పరిషత్తు గుర్తించి గౌరవించింది. దానితో ఆయన హెర్‌హిట్లర్ దృష్టిని ఆకర్షించాడు. హిట్లర్ తాను తలపెట్టిన పునఃసృష్టి శిబిరాన్ని నిర్వహించడానికి అన్నివిధాలుగా తగినవ్యక్తి ఈయనే అని భావించి ఎంపిక చేశాడు.

ఒక వివాదాస్పదమైన సిద్ధాంతం సత్యమని రుజువుచేయడానికి ఎట్టకేలకు అవకాశం లభించిన ఒక పండితుడు లేదా శాస్త్రవేత్త ఎంత ఆనందం చెందుతారో అంత సంబరంగా ఈ కొత్త బాధ్యత స్వీకరించాడు డాక్టర్. ఒక శాస్త్రవేత్తకు తన ప్రయోగాలను కొనసాగించడానికి మానవజాతికంటే ఫలప్రదమైన రంగం మరొకటేముంటుంది? ప్రపంచచరిత్రలోనే అపురూపమైన, అసదృశమైన ఒక కొత్త తరాన్ని సృష్టించడానికి జర్మన్ మహిళాలోకంలోని అందమైన అమ్మాయిలు, జర్మన్ యువకుల్లోని ఆరోగ్యవంతులైన బలశాలురూ తన ఆధీనంలో వున్నారు. ఇతర దేశాల్లో మేలుజాతి సంతాన ఉత్పత్తికి కారకులైన శాస్త్రవేత్తలు తమ ప్రయోగాలను జంతువులకు మాత్రమే పరిమితం చేసుకున్నారు. ఫ్రెంచి, ఇంగ్లీషు పశువైద్య శాస్త్రవేత్తలు, పశుపాలకులు మేలు





జాతి సంకర గుర్రాలను సృష్టించారు. ఇదే శాస్త్రీయ సిద్ధాంతాన్ని మానవజాతికి వర్తింప జేయడానికి ఏ శాస్త్రవేత్తా ఆలోచించలేదంటే వారికి దమ్ములు లేవనుకోవాలి. ఇంతటి సాహ సోపేతమైన ప్రయోగ పథకాన్ని రూపొందించి, అమలుజరపడం ఒక్క హిట్లర్‌కు మాత్రమే చెల్లింది.

ఇది ఎంతో తేలిక. పందాల్లో గెలిచి ఛాంపియన్ అయిన రేసు గుర్రాల్ని గుర్రపుశా లలో వుంచి, వాటిచేత ఏవైనా ఆడగుర్రాలను దాటిస్తే అవి అపురూపమైన రత్నాల్లాంటి పిల్ల లను ఈనడం లేదా! బలానికీ, అందానికీ మారుపేరైన జాతిగిత్తలను ఏవైనా ఆవులతో కలిపితే అవి పాలదిగుబడిని, వెన్నను అధి కంగా యిచ్చే పెయ్యదూడలను ఈనడం లేదా! చివరకు జాతి కుక్కలు గూడా తమ జాతుల ప్రత్యేకతను నిలుపుకుంటూనే వున్నాయి. కానీ, స్త్రీపురుషులు మాత్రమే! ఇప్పటివరకు అవకాశం దొరికితేనే దొంగచా టుగా సంతానోత్పత్తికి పూనుకొంటున్నారు.

అవకాశమా... రాగబంధురమైన మోహా వేశం గురించి చర్చించే సౌందర్యభావుకులను వాళ్ళచావు వాళ్ళను చావనీ! ప్రేమంటే ఏమిటి? ఈ ప్రేమోపాసనా పండితులూ, నిసర్గ సౌందర్యారాధకులూ చిరునవ్వులు చిలకరిస్తా రు. అసలు ప్రేమంటే ఏమిటి? నిజంగా అలాంటిదొకటుంటుందా? ప్రేమ అంటే కాంక్ష. కానీ కాంక్ష అనేది కేవలం సంభోగ భావనకు వ్యక్తీకరణ మాత్రమే. స్త్రీ పురుషులను ఒక దగ్గరకు చేర్చి, పరస్పరం ఒకరినొకరు తాకేట ట్లు చేస్తేనే ఈ కాంక్షను రేకెత్తించవచ్చునని డాక్టరుకు తెలుసు. అందమైన స్త్రీపురుషుల ను ఒక గదిలోవేసి, వాళ్ళ వంటి మీది బట్టలు లాగెయ్. కృతకమైన వారి నైతిక సూత్రాధర్మ భయాలను పోగొట్టు. ఒకరి సరసన ఒకరిని నిలబెట్టు. వారిలో కాంక్ష రేకెత్తకపోతే ఒట్టు.

ప్రేమ... ప్రేమ అనేది కేవలం కవుల కల్పన. మానవజాతి ఆవిర్భవించిన తొట్టతొలి దశలో ప్రేమ అనేది అసలు వుందా? గుహా మానవుడు తన ఆడదాన్ని ప్రేమతోనే ఎంచు కున్నాడా! స్త్రీపురుషులు చేసే అన్నిపనుల్లోకి అత్యంత సహజమైన, స్వభావసిద్ధమైన సంభో గక్రియను ఈ ప్రేమ అనేది అసహజం చేస్తు న్నది. సంభోగం అనే శరీర ధర్మానికి కృతక మైన అందాల ముసుగు తొడుగుతూ వున్నది. ఏదో ఊహాత్మకమైన, రసభావయుక్తమైన మాన సిక భావాన్ని దానికి ఆపాదిస్తూవున్నది. చివ రకు ఆ క్రియకు ప్రేమ అనే దివ్యత్వాన్ని గూడా ఆపాదిస్తూ వున్నది.

చివరకు మతం గూడా దీనికి 'విశ్వాసం, వి ధేయత' అనే పదాలతో అనేక సూత్రాలనూ, కట్టుబాట్లనూ ఏర్పరచి ఈ ప్రేమ అనే పదాన్ని వశీకరణ మంత్రంగా, సమ్మోహకరంగా చేయ డానికి దోహదం చేసింది. ప్రకృతి సూత్రాలకు గూడా విరుద్ధమైన మరో తెలివితక్కువపని 'ఒకే భార్య, ఒకే భర్త' అనేది. వాడుగానీ, అదిగానీ యేడిస్తే కట్టుకున్నవాళ్ళతోనే ఏడ్వాలి. చస్తే వాళ్ళతోనే చావాలి. ఈ విధంగా ఈ నిషిద్ధఫలానికి అపురూపమైన మాధుర్యా న్ని సమకూర్చి, దానిపేరు ఎత్తితేనే ఎవరూ తట్టుకోలేకుండా చేసింది.

ఇదంతా కేవలం అర్థరహితమైన, సారహీ నమైన చెత్త. స్వేచ్ఛామానవభావనకు ఉచిత మైంది గాదు. మరో యిరవై సంవత్సరాల్లో పై మాటల్లోని సత్యాన్ని సమస్త ప్రపంచమూ గ్ర హిస్తుంది. అప్పుడు చరిత్ర హిట్లర్ మేధా సంపత్తిని గుర్తిస్తుంది. అలాగే హిట్లర్‌కు సహా యకునిగా పనిచేసి ఒక కొత్త మానవజాతిని, స్వచ్ఛమైన ఆర్యజాతిని సృష్టించిన తనను గూడా ప్రపంచం గుర్తించకపోదు. ఇలా తలపో స్తూ వున్నారు డాక్టర్.

కౌంట్ గంధర్ ఓంకోల్జ్ అనే ఆ కల్నల్‌గారు మాత్రం పూర్తిగా భిన్నమైన మనిషి. అంద మైన అమ్మాయిలను ఎంపికచేసి తోలుకొచ్చేప నిలో ఆయనను ప్రభుత్వం డాక్టర్‌గారికి సహా యంగా నియమించింది. అయితే అమ్మా యిల ఎంపిక విషయంలో అంతిమ నిర్ణయం మాత్రం కల్నల్‌దే. ఈ కల్నల్‌గారు బహు గ్రంథసాంగుడు. విలాసపురుషుడు. తనకు కా వాల్సిన ఆడవాళ్లను ఎంచుకొనడంలో దిట్ట. అందుకే ఇలాంటిపనికి ఈయనే తగినవాడని యెంచి ఈ పని అప్పగించడం జరిగింది. ఆశ్విక దళాధిపతిగా జీవితం ప్రారంభించిన ఇతగాడు ఆ తర్వాత ఇంగ్లాండు, జారిస్టు రష్యాలోని జర్మన్ రాయబార కార్యాలయాల్లో సైనిక ప్రతినిధిగా పనిచేశారు. ఈ రెండుదేశా ల్లో ఎంతోమంది ఆడవాళ్లతో గడిపి, వాళ్లను



వదిలించుకొనడానికి కోర్టు మెట్లుగూడా యెక్కిన ఘనుడు. జర్మనీలో ఈ రసికరాజు అనుభవించిన అమ్మాయిలను లెక్కించడం సాధ్యంగాదంటారు.

ఓంకోల్జ్ జర్మన్ ప్రభువంశానికి చెందినవాడు. అయినా రాజకీయపరమైన అధికార బాధ్యతలను తీసుకోలేదు. ఇతనికి అందమైన అతివల్లో తప్ప మరే ఇతర పనుల్లోనూ ఆసక్తిలేదు. హిట్లర్ జాతిపథకంలోకి అమ్మాయిలను రిక్రూట్ చేయడంలో ఇతను సర్వాధికారాలతో తనకున్న అన్ని గులలూ తీర్చుకోవచ్చు. కొన్నిసార్లు అతను రిక్రూట్ చేసిన యువతులను తన స్వంతానికి వాడుకున్నా, జాతిపథకం అమలుకోసం ఇంకా ఎంతోమంది అమ్మాయిలు మిగిలేవుంటారు. అయితే పాపం ... ఎంత రసికుడైనా అతనికి సంతుమాత్రం లేరు. అందుకే ఇతగాడు ఎంత అందగాడైనా, ఎంత బలిష్ఠుడైనా ఇతగాడికి పిల్లాడు పుట్టి ఉయ్యాలలూగే ప్రమాదం మాత్రం లేదు.

ఆ అమ్మాయి తిరిగి మెల్లిగా వాళ్ల దగ్గరకు వచ్చింది. తన భుజాలమీదే వేలాడుతూ వున్న కేశరాసినంతా చక్కదిద్ది సిగకట్టుకుని, బూట్లు తొడుక్కుని మరీ వచ్చింది.

"ముందు మేనేజర్, తరువాత నీవూ లోనికి రండి. మీ ఇంటికి ఎలా వెళ్లాలో మేనేజర్‌కు దారి చెప్పు" డాక్టర్ ఆదేశించాడు.

"మా అమ్మదగ్గరికా... మా ఇంటికా?" అంటూ ప్రశ్నించిందా అమ్మాయి లీసెల్.

"అవును"

ఈ సమాధానంతో అడవి గులాబీ రెక్కల్లాంటి ఆమె చెక్కిళ్లు రంగుమారి కుంచించుకుపోయాయి. ముఖం కందగడ్డలా ఎరుపెక్కింది. ఎందుకంటే ఇంత గొప్ప మనుషుల్ని ఏనాడూ తన ఇంటికి తీసుకెళ్లలేదామె.

★ ★ ★

రైన్ నదిని దాటిన తర్వాత ఆ అమ్మాయి కారు ఏవైపు తిరగాలో ప్రతివీధి మలుపులోనూ మేనేజరుకు సూచనలిస్తూవుంది. డ్రైవరు ఆ సూచనలను నిశ్శబ్దంగా పాటిస్తూ వున్నారు.

పాతబస్తీలోని ఒక చిన్న ఇంటిముందు కారు ఆగింది.

"పద్మం బురదలోనే పుడుతుంది" అంటూ కల్నల్ గొణుక్కున్నాడు.

పాతవై పడిపోవడానికి సిద్ధంగా, ఇరుకుగా, చీకటిగా వున్న రెండు వరుసల మేడమెట్లు ఎక్కి వాళ్లు ఆ యింటిగుమ్మం ముందుకు చేరారు.

లీసెల్ తలుపు తడుతూ "అమ్మా... నేనువచ్చా... తలుపు తెరు" అంటూ పిలిచింది.

తలుపు తెరిచిన వృద్ధురాలు వయసులో బాగా అందంగా ఉండి ఉండాలి. దరిద్రమూ, దుఃఖమూ కలగలిసి ఆమెను వయసుమీరక ముందే ముదుసలిని చేశాయి. తన కూతురు ఇద్దరు అధికారుల మధ్య నిలబడి వుండటం చూడ్డంతోనే, ఆ ముసలామె భయంతో గిట్టకరుచుకుపోయింది. ఆమె చేతిలోని చీపురుకట్ట జారిపోయింది.

"మేము లోనికి రావచ్చా?" డాక్టర్ అడిగాడు.

ఆమె సమాధానం కోసం ఆగకుండానే డాక్టర్ ఒక్కడుగు వెనుకకు తగ్గి, కల్నల్ ముందుగా లోనికి వెళ్లడానికి వీలుచేశాడు.

చిన్న ఇల్లు. ఒకే గది. దానిని ఆనుకుని చిన్న వంటగది. ఇంటిని చూస్తే దరిద్రదేవతకు నిలయమని అనిపిస్తూవున్నా, పరిశుభ్రంగా మాత్రం వుంది. గోడమీద ఒక సైనికుని ఫోటో వేలాడుతూ వుంది. ఆ సైనికుడు మృతిచెందినవాడని తెలియడానికి వీలుగా శిలువ వేలాడుతూ వుంది.

"కూర్చోండి బాబయ్యా" అంటూ ఆ ముసలామె రెండు కుర్చీలు వారికి దగ్గరగా జరిపింది.

ఆమె తన కూతురిపక్కనే నిల్చుంది. లీసెల్ భయంతో తన తల్లిని అతుక్కుపోయి నిలుచుంది.

"మీ అమ్మాయిని మేము మావెంట తీసుకెళ్లడానికి వచ్చామమ్మా" అంటూ డాక్టరు సంభాషణ ప్రారంభించాడు.

"మా అమ్మాయిని తీసుకెళ్తారా! నా బిడ్డ ఏంతప్పు చేసిందయ్యా" అని ముసలామె భయంగా అడిగింది.

"తప్పేమీ చేయలేదమ్మా! నీ బిడ్డ నీకు పేరు, ప్రతిష్ఠా తెస్తుంది. చాలా మంచిపిల్ల. పైగా అందమైంది. ఈ పిల్లకు మేము పెళ్లిచె





య్యాలనుకున్నాం''

లీసెల్ తల్లిపేరు ఫ్రావూ షాప్. డాక్టరు మాటలు వినడంతోనే ఆమె గుండె నిండుగా నవ్వింది. ఆమె భయంపోయింది. "దయగల ప్రభువులు. కానీ మా పిల్ల పెళ్లికి మీ సాయం అవసరంలేదు. ప్రస్తుతం యుద్ధరంగంలో సైనికుడిగా వున్న హాన్స్‌ను మీరు తిరిగి ఇంటికి రప్పించగలిగితే మాపిల్ల పెళ్లయిపోతుంది'' అని చెప్పింది.

ఆ మాటకు డాక్టర్ తల అడ్డంగా వూపాడు. "లేదమ్మా... మన శత్రువులు లొంగిపొయ్యేవరకూ మీ కుర్రాడిని తీసుకురాలేం. ఒకవేళ తిరిగివచ్చినా అతగాడు నీ కూతుర్ని పెండ్లిచేసుకోడానికి వీల్లేదు. నీ కూతురికి అంతకన్నా ఇంకా గొప్ప భవిష్యత్తు వుంది''

"ఏందయ్యా ఆ భవిష్యత్తు?'' అంటూ ముసలామె మెటికలు విరిచింది.

"నీ బిడ్డ ఒక కొడుకుని అచ్చం అతని తండ్రిలాంటివాణ్ణి కనాలి. ఆ బిడ్డ జర్మనీలోని పిల్లలందరికంటే అందగాడూ, ధైర్యసాహసాలుగలవాడూ, బలవంతుడూ అవుతాడు''

ముసలామెకు ఒక్కమాటా అర్థంగాలా అంతా తికమకగా వుంది. ఆమెకు అర్థమైందల్లా ఏమిటంటే ! ఎవడో ముక్కూముఖమూ తెలియనివాడికి కట్టబెట్టేందుకు తన కూతుర్ని తీసుకెళ్లబోతున్నారని.

"నాబిడ్డను తీసుకెళ్లి ఎవరికిచ్చి చేస్తారో చెప్పండయ్యా'' ఆ తల్లి ప్రశ్నించింది.

"మేమేం చెప్పగలం? మాకు తెలియదు''

"అంటే లీసెల్ స్వయంగా తనకు కాబోయే భర్తను తానే ఎంచుకుంటుందా?''

"ఊఁ హుఁ''

"అయితే నా బిడ్డకు వరుడిని చూసేదెవరు?''

ఈ ప్రశ్నకు సమాధానంగా ఇద్దరు అధికారులూ లేచినిలబడి నాజీ శాల్యూట్ చేశారు. "మన దైవం ఫ్యూరర్ పెళ్లికొడుకును చూస్తారు'' అంటూ చెప్పారు.

"హెర్ హిట్లర్'' ఆశ్చర్యంగా, నమ్రతతో అడిగింది ముసలమ్మ "అయ్యా పెద్దబాబులూ... దేవుడి మీదొట్టు ! మీరు చెప్పేదేమిటో నాకు ఒక్క ముక్క అర్థమవలా. మేము పేదోళ్ళం. పనీపాటూ చేసుకుని పొట్టపోసుకునే వాళ్ళం. మన ఫ్యూరెర్‌కు మేమెవరమో, ఎట్టా బతుకుతూ వున్నామో తెలియనే తెలియదు. ఆయనకు నా బిడ్డకు మొగుణ్ణి చూసేటంత అక్కరేమొచ్చింది బాబూ?'' ముసలామె నిలదీసినట్లుగా అడిగింది.

కల్నల్‌కు ఆ ఇంటినుండి బయటపడటం ఎప్పుడెప్పుడా అనిపిస్తూ వుంది. పక్కనేవున్న మురికి గుంటల్లోని గబ్బంతా ఆ ఇంటిని చుట్టుముడుతూ వుంది. అందుకే అతడు డొంకతిరుగుడు మానేసి సూటిగా సమాధానం చెప్పి వెంటనే అక్కడనుండి బయట పడాలనుకున్నాడు. "చూడు ముసలమ్మా... ఫ్యూరర్ ఆదేశం ప్రకారం జర్మనీ దేశం మొత్తంలోనే అతి అందమైన ప్రదేశంలో ఒక గ్రామాన్ని కట్టారు. దానికి 'మదన సదనం' అని పేరుపెట్టారు. జర్మనీలోని అందమైన, ఆరోగ్యవంతమైన వయసు పిల్లలందర్నీ ఆ గ్రామానికి వంపుతాము. మరోవైపు మన సైన్యంలో ధైర్యసాహసాలకు పేరుమోసిన అందమైన, బలిష్ఠులైన యువ సైనికులనుగూడా ఎంపికచేసి ఆ గ్రామానికి వంపుతాము. అక్కడకు చేరిన యువసైనికులు తమకు నచ్చిన అమ్మాయిని ఎంచుకుని వాళ్ళకు బిడ్డల్ని పుట్టిస్తారు''

"ఆ సైనికులు ఈ అమ్మాయిల్ని పెళ్ళి చేసుకుంటారా?'' ముసలామె అనుమానంగా అడిగింది.

దానికి కల్నల్ భుజాలెగరేస్తూ, "బహుశా చేసుకోవచ్చు. అయితే పెళ్ళికంటే ముఖ్యవిషయమేమిటంటే ఈ అమ్మాయిలకు పిల్లలు పుట్టితీరాలి''

"అంటే మీరు చెప్పేదేందయ్యా... నా బిడ్డ, దానితోపాటు అక్కడకుచేరిన పిల్లలందరూ వాళ్ళ ఇష్టప్రకారం వాళ్ళకు నచ్చిన మొగుళ్ళను ఎంచుకొని పెళ్ళిచేసుకోరా?''

"లేదు...ఎంచుకునేది అమ్మాయిలు గ్గాదు. తమకు నచ్చిన ఆడవార్ని యెంచుకునే హక్కు యుద్ధవీరులకే వుంటుంది'' కల్నల్ తీక్షణంగా చెప్పాడు.

"అంటే, నాబిడ్డ ఎవుడికి బడితే వాడికి బలవంతంగా లొంగిపోవలసిందేనా?'' అంటూ ముసలామె ఆగ్రహంతో ఆక్రో

సించింది. ఆ సైనిక దుస్తులను చూస్తే తనకు గౌరవం వున్నా కల్నల్ చెప్పిన మాటలు వింటూంటే వంటికి కారం రాసుకున్నట్లుగా వుంది ఆమెకు.

"ఆ సైనికులు ఈ పిల్లల్ని ఎలా ఎంచుకుంటారయ్యా! ఈ పిల్లలెవరో వాళ్ళకు ఏం తెలుసు? ఇంతకు ముందెన్నడూ వాళ్ళు ఈ పిల్లల ముక్కూముఖమూ కూడా చూసి ఎరుగరుగదా!"

"వాళ్ళు వీళ్ళను చూస్తారులే. బట్టలన్నీ లాగేసి నగ్నంగా వున్నప్పుడు! మంచి పిల్లలు పుట్టడానికి అదిచాలదూ" కర్కశంగా చెప్పాడు కల్నల్.

ఆ మాటతో ముసలమ్మ కోపం కట్టలు తెంచుకుంది. "అంటే- అంటే... మీరు చెప్పే ఆ గ్రామం వట్టి సానికొంపవన్నమాట. నా బిడ్డ నా బిడ్డ... ఏపాపం యెరుగని బంగారుతల్లి... ఆ సానికొంపకు రాదు. మీ వెంట అసలే రాదు. ఇంక మీరు దయచెయ్యవచ్చు" అంటూ అంగలార్చింది.

డాక్టర్ తన సంచిలో నుంచి హిట్లర్ ఆదేశాన్ని బయటికి తీసి చూపుతూ "నీవు దీనిని చదవగలవను కొంటా" అని అడిగాడు.

"అది చదివే మాత్రం చదువు నాకూ వచ్చులే"

"అయితే చదువు. ఈ కింది సంతకం ఎవరిదో కూడా చూడు" అంటూ అందించాడు.

ఆ పత్రాన్ని చదివి ఆమె వెక్కిళ్ళుపెట్టి ఏడ్చింది. లీసెల్ తల్లిని కరుచుకుని బావురుమంది.

శిరసావహించవలసిందే. మేము నీ కూతురికి బెర్లిన్ వెళ్ళడానికి టిక్కెట్టు ఇస్తాం. అక్కడి అధికార్లు ఈ అమ్మాయిని జాగ్రత్తగా రైలు దించి చేరవలసినచోటికి భద్రంగా పంపుతారు. ఈ అమ్మాయి ఎల్లుండిలోగా బెర్లిన్ చేరకపోతే పోలీసులు మీ ఇంటిని వెదుక్కుంటూ వస్తారు. బెల్లెవ్యూ హొటల్ నుండి ఈ అమ్మాయికి నెలసరి అందవలసిన జీతం ప్రతినెలా నీకు ముడుతూ వుంటుంది. అందువల్ల నీకు ఇల్లు గడవడానికి ఏ ఇబ్బందీ వుండదు. ఏదో హొటల్ వంటగదిలో పాచిపనిచేసుకుని బతికే నీ బిడ్డ 'మదనసదనం'లో మహారాణీలా దేవేంద్రభోగం అనుభవిస్తుంది. ఆ భోగం ఇక్కడుంటే నీకూతురు ఈ జన్మలోనేగాదు మరో యేడు జన్మల్లోగూడా అనుభవించలేదు. సరే... ఇక మేం వస్తాం" అంటూ చరచరా బయటికి నడిచాడు.

కల్నల్ చరచరా మెట్లు దిగుతూ వుంటే, డాక్టర్ మాత్రం వెక్కివెక్కి ఏడుస్తూవున్న ఆ తల్లిమీదికి వంగి ఓదార్పుగా భుజం తట్టాడు "నీ మనమణ్ణి చూసి నీవు గర్విస్తావమ్మా... అతను వీరుని కొడుకు. మన జాతి గర్వించే మణిదీపం అవుతాడు" అంటూ ఊరడించాడు.

కాని ఈ ఓదార్పులేమీ ఆమె దుఃఖాన్ని ఉపశమింపజేయలేదు. ఆమె పెద్దపెట్టున రోదిస్తూనే తన కూతురువంక చూసింది. "అమ్మా... నాకేవీరుడూ వద్దమ్మా... నా హేన్స్ నాక్కావాలి" అంటూ లీసెల్ తల్లిని కరుచుకుని బావురుమంది.



కల్నల్ లేచాడు- "ఈ కథ ఇంతేనమ్మా. మా అందరిలాగే నువ్వుగూడా ఈ శాసనాన్ని

ఒక బూడిదరంగు చిన్నకారు వచ్చి యుద్ధవిమాన పైలట్ల భోజనశాల ముందు ఆగింది.

వెర్నెర్ హార్న్ ఆ కారెక్కి డ్రైవరు పక్క సీట్లో కూర్చుని వాచీ టైం చూసుకున్నాడు.

"పాలాయిస్ డి వైల్లట్" అంటూ చెప్పాడు.

"అది పారిస్‌లో వుందా లెఫ్టినెంట్?" డ్రైవరు ప్రశ్నించాడు.

ఆ అధికారి ఆ డ్రైవరు వైపు చురుకుగా చూసి "అంటే పారిస్‌లో ఏదెమిటో, ఏదారి ఎక్కడ వెళుతుందో నీకు తెలియదా?" అని ప్రశ్నించాడు.

"లేదు సార్... నేను మూడు రోజుల క్రిందటే కొత్తగా వచ్చాను"

"అ... హాఁ ఊరా. దారీ తెలియనివాణ్ణి డ్రైవరుగా వేశారన్నమాట. బాగుంది. తిన్నగా ముందుకుపో ! నీకు దారి నేచూపుతా"

కారు సెంట్రీగేటు వద్ద ఆగింది. ఒక సార్జెంట్ వచ్చి లెఫ్టినెంట్ పాస్ తనిఖీచేసి కారును వదిలిపెట్టాడు.

తనకు చిరపరిచితమైన గ్రామీణ ప్రాంతాన్నంతటినీ పరికించి చూశాడు హార్న్. సముద్రంలాగా అన్నివైపులా దిగంతాల్ని తాకుతూ వున్న సువిశాలమైన మైదానం. అస్తమిస్తూవున్న సూర్యుడు ఆకాశంలో పయనిస్తూవున్న లోహవిహంగాల రెక్కల మీద ప్రతిఫలిస్తూ వున్నాడు. ఆకాశమంతా దూదిపింజల్లాంటి తెల్లటి మబ్బులతో నిండివుంది.

సుదీర్ఘమైన, తిన్నని రోడ్డు ముందంతా పరచుకొని వుంది. ఈ క్రిందివిధంగా హెచ్చరిక రాసివున్న ఒక సైనుబోర్డు వెనక్కి వెళ్ళిపోయింది.

"వాహనాలు జాగ్రత్తగా నడపవలెను.

ఇది ఎయిర్ ఫీల్డ్. ముందున్న మూడు కిలోమీటర్లూ ప్రమాదకరం"

"ప్రమాదకరం ! అదీ ప్రత్యేకించి పైలట్లకు. నా జన్మలో ఇలాంటి ఎయిర్ ఫీల్డ్ చూడనే లేదు. ఎయిర్ ఫీల్డ్‌కు అడ్డంగా రోడ్డు నిర్మించాలన్న వెధవ ఆలోచన ఎవడికొచ్చిందో, అది గూడా టెల్లి వరుసలతోనూ, హైఫ్రీక్వెన్సీ టవర్స్ తోను నిండిన రోడ్డు. అబ్బా... ఈ ఫ్రెంచివాళ్ళున్నారే... వీళ్ళంతా మనం ధ్వంసంచేసి వుండాల్సింది" అంటూ హార్న్ తనలోతాను గొణుక్కుంటున్నాడు.

"మనం తప్పకుండా ధ్వంసంచేసి వుండాల్సింది సర్" అంటూ డ్రైవరు అందుకున్నాడు.

"ఊఁ... ముందు రోడ్డు జాగ్రత్తగా చూసి బండినడుపు". హార్న్ కసురుకున్నాడు.

ఆ సమయంలో ఒక విమానం రొదచేసుకుంటూ అతి క్రిందుగా, వీళ్ళ తలలను తాకుతుందా అన్నంత క్రిందుగా పోతూవుంది. దానికి భయపడిన డ్రయివర్ అసంకల్పితంగా తన తల కిందికి వంచుకున్నాడు.

"కాల్పులు జరిగేటప్పుడు ఎన్నడూ నీవు యుద్ధరంగంలో లేవా?" అంటూ వెర్నర్ ప్రశ్నించాడు. ప్రతి అడ్డమైన దానయ్యనూ డ్రయివరుగా నియమించడంపట్ల అతనికోపం ఇంకా తగ్గలేదు.

"నా తొడలో తుపాకీగుండు ఇంకా అలాగే వుంది. అందుకే నన్ను డ్రయివర్‌గా మార్చారు సర్" అని చెప్పాడు డ్రైవర్‌గా వున్న వ్యక్తి.

అప్పటికిగానీ ఆ లెఫ్టినెంట్ డ్రయివర్‌ని తేరపారజూడలేదు. సైనిక పతకాలనన్నింటినీ అతను ధరించి వుండటం చూసి, తాను అంతకుముందు కోపంలో వ్యాఖ్యానించినందుకు లెఫ్టినెంట్ విచారం ప్రకటించాడు.

"నీవు చాలా మంచిసైనికుడివి. 'జింక్‌క్రేట్స్'చూసి భయపడకు. ఈ చుట్టుపట్ల చాలా వున్నాయి. ఆఁ... ఎడమకు తిరుగు" ప్రేమగా చెపుతున్నాడు హార్న్.

అధికారి ప్రేమగా మాట్లాడటంతో డ్రయివరుకు ఉత్సాహం ఇనుమడించింది. ఆ ప్రాంతంలో చిన్నచిన్న ఇళ్లున్నాయి. కుటుంబ స్త్రీలు దుకాణాల ముందు క్యూలో నించుని కన్పించారు. వారినిచూసి "పారిస్ ఇదేనా లెఫ్టినెంట్?" అంటూ ప్రశ్నించాడు డ్రయివరు.

"కాదు... ఇడియట్... ఎడమపక్క పోనీ... అదేవస్తుంది"

కారు భవంతిని చేరగానే "ఇక్కడే ఆగు.. కారు దగ్గరే వుండు. ముందుకెళ్ళావా తప్పిపోతావ్. జాగ్రత్త" అంటూ హార్న్ కారు దిగివెళ్ళాడు.

హార్న్ మెల్లిగా మెట్లు ఎక్కి లోపలికెళ్లి తన టిక్కెట్టు చూపించాడు. విశాలమైన ఆడిటోరియంలోకి ప్రవేశించాడు. సుప్రసిద్ధ వాగ్గేయకారుడు స్విట్జ్‌ముల్లర్ నిర్వహించే 'వాంగ్నెర్'

ప్రదర్శనకు జనం ఇసుకవేస్తే రాలనంతగా వచ్చారు. ఈ నృత్యగాన ప్రదర్శనకోసం స్పిట్జ్ ముల్లర్ బెర్లిన్ నగరంనుండి ప్రత్యేకంగా వచ్చారు. రాజకీయ ప్రముఖులు, జర్మన్ ఉన్నతాధికారులతోపాటు, ఫ్రెంచి సంగీత ప్రేమికులు కూడా అత్యధిక సంఖ్యలో ఈ ప్రదర్శనకు హాజరయ్యారు. హార్న్ ధరించిన ఉన్నత సైనిక పతకాలపై ప్రేక్షకుల దృష్టిపడుతూ వుంటే వాళ్ళచూపులను ఖాతరుచేయకుండా అతను తన శ్రేణి అధికారులకోసం రిజర్వుచేసిన స్థానాల్లో, తన సీటు వెతుక్కుంటూ వెళ్లి కూర్చున్నాడు.

ముల్లర్ వేదిక మీదికిరాగానే హర్షధ్వానాలు మిన్నుముట్టాయి. అతను గుమ్మడికాయలా పొట్టి మనిషి. జుత్తు మాత్రం నల్లగా పొడుగ్గా వుంది. ఆ భావుకుని కళ్లు అతను ధరించిన మందపాటి కళ్ళజోడు అద్దాలగుండా బయటికి చొచ్చుకుని వస్తున్నాయి. అతను తన చేతిలోని బెత్తం ఎత్తుతూనే సంగీతంలో తన సత్తాఏమిటో చూపించాడు.

ఆ వాగ్గేయకారుడు భయానక, బీభత్సరసాన్నీ, మధుర, మంజుల, మనోజ్ఞ శృంగారాన్నీ అద్భుతంగా వినిపించి శ్రోతలను మైమరపించి ఉర్రూతలూగించాడు. అతని చేతిలోని బెత్తం మంత్రదండంలాంటిది. అది మాటల్లో చెప్పలేనంతటి మధురిమలను సృష్టించి శ్రోతలను మరోలోకాలకు కొనిపోయింది. కచ్చేరీమధ్య విరామసమయంలో శ్రోతలు గుంపులు గుంపులుగా బయటికి వచ్చారు.

వెర్నర్ ఈ సంగీత స్రవంతిలో పూర్తిగా మునిగివున్నాడు. బయటికి వచ్చి సిగరెట్ ముట్టించినా, అతను సంగీత ప్రపంచంలోనే మైమరచిపోయాడు. ఆ జంత్రగాత్ర సమ్మేళనమే అతని చెవుల్లో మార్మోగుతూ వుంది. బయట జనాలు చేసే సద్దుగానీ, మాట్లాడే మాటలుగానీ అతని చెవిని చేరడంలేదు. అతను తాగుతున్న సిగరెట్ పొగ వలయాలుగా తిరుగుతూ పైకి వెళుతూ వుంది. ఆ పొగవలయాల్లోగూడా అతను ఏదో సంగీతరసానందాన్ని పొందుతూవున్నాడు.

అవ్యక్తమధురానుభూతిని అనుభవిస్తూ చేతనాచేతన స్థితిలో వున్న అతని భుజం తట్టాడు మరో మేజర్. "తోటి మేజర్‌కు శాల్యూట్ చెయ్యాలని మరచిపోయావా మేజర్" అంటూ.

ఆ మాటలతో ఇహలోకంలోకి వచ్చిన వెర్నెర్ హార్న్ అటెన్షన్ ఫోజులో శాల్యూట్ చేశాడు. "సారీ మేజర్... నేను మిమ్మల్ని చూడలేదు" అంటూ.

"సరే... దానికేంలే. నిన్ను చాలాసేపటి నుండి చూస్తూవున్నా. నీవు సంగీతమంటే చెవి కోసుకుంటావని నాకు తెలియదే. నీవు ఈ సంగీతానికి మంత్రముగ్ధుడివై చప్పట్లు చరుస్తూ వళ్ళుమరచి ఆడావు సుమీ"

ఈమాటలకు ఆ యువసైనికాధికారి సిగ్గుపడిపోయాడు. మేజర్ అతని భుజం మీద చేయివేసి, "యువకుల్లో ఉత్సాహం ప్రశంసనీయమైంది. ఆఁ... నీవిప్పుడు పారిస్‌లో వున్నావన్నమాట. నన్ను హెర్‌క్లూగ్ అని మాత్రమే పిలువు. నేనీరోజు నీకు మేజర్ని కాను, ఎందుకంటే నీవీ సాయంత్రం మాతోగడుపుతున్నావు. నా భార్య నా కూతురు కూడా చాలా ఆనందిస్తారు" అని ఆహ్వానించాడు.

మేజర్ మాటలకు వెర్నర్ కొంత తటపటాయిస్తూ— "సార్... నేను తిరిగి మకాంకు వెళ్ళిపోవాలి" అని చెప్పాడు.

"రాత్రి బయట గడిపేందుకు పాస్‌లేదా?"

"ఉంది... కానీ నా డ్రైవరు నాకోసం ఎదురు చూస్తూ వుంటాడు"

"అతన్ని వెనక్కు పంపేయ్. నీవింకేం చెప్పకు, లెఫ్టినెంట్, ఈ విరామానంతరం నీవు వెంటనే మా బాక్సులోకి వస్తున్నావు. ఆ బాక్సు ఎవరిదో ఊహించగలవా? సాక్షాత్తు ఈ సంగీత సామ్రాట్టుదే"

"స్పిట్జ్ ముల్లర్‌దా?"

"మరెవరిదనుకున్నావ్... ఈ సంగీత కచ్చేరీ అవుతూనే ఆయన గూడా మనదగ్గరకొచ్చేస్తారు. ఈలోగా నీవు ఆయన కూతుర్ని కలుసుకోవచ్చు. ఆ అమ్మాయి మా ఎర్నాకు స్నేహితురాలు. ఆ అమ్మాయి తండ్రిగారి సంగీతమంటే నీవు ఎంత చెవి కోసుకుంటావో నేను చెబితే, మీయిద్దరూ వెంటనే స్నేహితులైపోతారు. వెళదాంపద"

వాళ్ళు తిరిగి బాక్సులోకి వెళ్ళేటప్పుడు చెప్పాడు మేజర్, తాను ఎలా ఈ సంగీతభవనానికి వచ్చాడో. స్పిట్జ్ ముల్లర్ పారిస్ వస్తున్న





ట్లు తెలిసి, ఆయనను తనతోపాటు వుండమని కోరుతూ ఉత్తరం రాశాడు.

"ఈ సంగీత సామ్రాట్ తలవుంది చూశావ్. ఎప్పుడూ గాలిలో విహరిస్తూ వుంటుంది. పాపం... ఆయన దాన్ని ఏ పారిస్ హోటల్లోనో పారేసుకోవచ్చు. సెయింట్‌జర్మయిన్ నేనుండే చోటు! అది చాలా ప్రశాంతంగా వుంటుంది. అక్కడ చాలామంచి అడవి కూడా వుంది"

"మీరు సెయింట్ జర్మయిన్-ఎన్-లాయిలో వుంటున్నారా మేజర్?"

"అవును... అందమైన భవనం. దానిలో కూర్చుంటే సైన్‌నది కనిపిస్తుంది. పారిస్ నగరమంతా కళ్ళముందు ఉన్నట్లుగా వుంటుంది. చూద్దూగానీలే లోనికి పద"

ఓ అమ్మాయి బాక్సు తలుపు తీసింది. ఆ అమ్మాయి చిన్నది. బొద్దుగా గుమ్మడికాయలా వుంది. అయినా చాలా అందగత్తె. ఆ అమ్మాయి లెఫ్టినెంట్‌ను చూస్తూనే సిగ్గుపడింది.

"నీకు హీరోను తెచ్చానమ్మా" అంటూ "వెర్నర్, నీకు నా భార్యా, బిడ్డా గుర్తున్నారుగా. ఇక ఈ రెండో అమ్మాయి వుంది చూశావ్. ఈమె స్విట్జ్ ముల్లర్ కూతురు. ఈమె తండ్రే నిన్నింత వరకూ సంగీత రసార్ణవంలో ఓలలాడించింది"

మేజర్ భార్యకు అభివాదరీ చేశాడు వెర్నర్! ఆమె అతన్ని ప్రేమతో ఆలింగనం చేసుకుంది. "నిన్ను అనుకోకుండా చూడ్డం చాలా ఆనందం కలిగించింది వెర్నర్. ఎర్నా నిన్ను ముందే గుర్తు పట్టింది. మీఇద్దరూ ముద్దు పెట్టుకోరా" అంటూ అడిగింది.

ఎర్నా బుగ్గలమీద వెర్నర్ ముద్దు పెట్టుకున్నాడు. ఆ అమ్మాయిగూడా మహోత్సాహంగా వెర్నర్‌కు ముద్దుపెట్టింది. తర్వాత అతడు ముల్లర్ కూతురికి అభివాదం చేశాడు.

సంగీత సామ్రాట్టు కూతురు చాలా పొడగరి. ఎలాంటి ఆభరణాలు ధరించకపోయినా, పొడవాటి నల్లని గౌనులో ఆమె అప్సరసలా వుంది. ఆమె తన నల్లటి కురులను మధ్యపాపిటతీసి, రెండు పాయలుగా విడదీసి, రెండు పక్కలా చెవులకు దగ్గరగా వచ్చేటట్లు బన్ ముడివేసింది. ఆమె పెదాలకు ఎలాంటి రంగూ పులమకుండానే దొండపండ్లలా వున్నాయి. ముఖం కోడిగ్రుడ్డు ఆకారంలో కోలగా అందాలను విరజిమ్ముతూ వుంది.

"ఈయన మీనాన్నగారి సంగీతం వింటూ మైమరచిపోయాడు. ఇంకాస్త వుంటే స్పృహతప్పి పడిపోయేవాడు. మీనాన్నగారి దగ్గర ఏం మహాత్యం వుందోగానీ, మా సైనికాధికార్లనందరినీ సంగీతం మత్తులో ముంచేస్తున్నారు" అన్నాడు మేజర్.

"ఆ వాద్య సమ్మేళనం అలాంటిదనుకుంటా" అంటూ ముల్లర్ కూతురు బదులు చెప్పింది.

"కావచ్చు... నేనింతగా సంగీతానికి తన్మయం చెందడం ఇంతకుముందెన్నడూలేదు" వెర్నర్ ఆరాధనా భావంతో చెప్పాడు.

పైన బాక్సులో కూర్చుని వాళ్ళలా మాట్లాడుకుంటూ వుంటే, కింద వేదిక మీద సంగీత కళాకారులు శృతులు సవరిస్తూవున్నారు. శ్రోతలను మైమరపించేట్లుగా వేణుగానం ఆరంభమైంది.

"ష్... మాట్లాడకండి. సంగీతం మొదలౌతూ వుంది. వెర్నర్, ముందు కుర్చీలో ఇద్దరమ్మాయిలకూ మధ్య కూర్చో" అంటూ ఆర్డర్ వేశాడు మేజర్.

"మరి మీ శ్రీమతిగారూ..."

"ఇది నా ఆర్డరు... అంతే! నువ్వొక్కడ హీరోవి. ఈ హాల్లోవున్న వాళ్ళందరికంటే ఎక్కువగా సైనిక పతకాలు గెలుచుకొని ప్రభుత్వ మెప్పు పొందినవాడివి. ఇరవై ఏడు యుద్ధ విమానాలను కూల్చడం సామాన్యమనుకున్నావా!" అంటూ మెచ్చుకోలుగా చెబుతూవున్నాడు మేజర్.

ఎర్నా తండ్రి చెప్పేమాటలు వింది. ఆమె కళ్ళు ఆనందంతో విప్పారాయి. ఈ మాటలు సంగీత సామ్రాట్టు కూతురు హెడ్విగ్ గూడా విందిగానీ, ఆమె మొఖంలో ఎలాంటి మార్పులేదు. సంగీతం ప్రారంభమౌతూనే ఆమె అందులో లీనమైంది. తొలుత ఆమె నాసికాపుటాలు అదిరాయి. తర్వాత నెమ్మదిగా ఆమె బుగ్గలు తళుకులీనాయి. జంత్రవాద్య సమ్మేళనంలోని ఆరోహణ, అవరోహణ క్రమాలతోపాటు ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు లయబద్ధంగా పెరుగుతూ, తగ్గుతూ వుంటే ఆమె ధరించిన





గౌనుకింద చిన్న అందమైన లేత రొమ్ముల మధ్య విభజన రేఖలు స్పష్టంగా గోచరిస్తూనే వున్నాయి.

మేజరు క్లుగే సంగీతంకంటే సంగీతసామ్రాట్టు కూతుర్ని ఎక్కువగా గమనిస్తూ, 'పాపం ఈ పిల్లకు పిల్లి పీకడానికి కండగూడా లేదు' అనుకున్నాడు. వెర్నర్ మాత్రం సంగీతంలో పూర్తిగా నిమగ్నమైనాడు. మేజరు కూతురు ఎర్నా చేయి మాటిమాటికీ తన చేతులమీద పాడాడుతూవున్న విషయం కూడా అతనికి తెలియదు. సంగీతకచ్చేరీ ముగిసేనరికి తన్మయావస్థలోవున్న అతను కుర్చీలోనుండి లేవలేకపోయాడు. అలాగే కూర్చునే అభినందించాడు.

కొద్దిక్షణాల తరువాత సంగీతసామ్రాట్టు స్పిట్జ్‌ముల్లర్ నాజీ సైనికాధికారుల అభినందనలను వినమ్రతతో అందుకుంటూ బాక్సువద్దకు వచ్చాడు.

"ఇదో సంగీతసామ్రాట్... జర్మన్ వైమానిక దళంలోని మొనగాణ్ణి మీకు పరిచయం చేస్తూవున్నా. ఈయనే లెఫ్టినెంట్ వెర్నర్ హార్న్. ఇరవైఏడు శత్రువిమానాలను కూల్చిన వీరుడు" అంటూ మేజర్ పరిచయం చేశాడు.

"భేష్! భేష్... నా అభినందనలు అందుకో. ఇరవై ఏడు యుద్ధవిమానాలను కూల్చావా? ఇంతకూ నీ వయసెంత?"- అని అడిగాడు స్పిట్జ్‌ముల్లర్.

"నా వయసు ఇరవై సర్... కానీ మేజరుగారు అతిశయోక్తులు చెబుతున్నారు. నేను ఏవిధంగానూ జర్మనీ వైమానికదళంలో మొనగాణ్నిగాదు. నా కంటే ఎక్కువ యుద్ధవిమానాలను కూల్చినవాళ్లు మరో ఆరుగురు వున్నారు"

"ఇంతకంటె నమ్రతగల హీరోను నువ్వు మరెవర్నైనా చూశావా? పాపం? కొడుకు విజయాలకు ఆనందించడానికి ఇతని తండ్రిలేరు. ఆయన మేజర్. యుద్ధపు తొలిరోజుల్లో యుద్ధరంగంలోనే మరణించారు" అంటూ వివరించాడు మేజర్.

ఒక్కక్షణం అక్కడ నిశ్శబ్దం అలముకుంది. హెడ్విగ్ నీలికళ్ళు ఆర్ద్రంగా మారాయి.

"సరే... అందరూ కారెక్కండి. సెయింట్‌జెర్మయిన్ వెళదాం. నా కార్లో అందరికీ కూర్చోడానికి చోటుంది. అది ఏంకారనుకున్నావ్? మెర్సిడెస్" అంటూ చెబుతున్నాడు మేజర్.

మెర్సిడెస్ చాలా పెద్దకారు. అదలావెళ్ళి ఓ భవంతి వద్ద ఆగింది. డ్రయివరు దిగి పాతకాలంనాటి ఇనుపగేటు తెరిచాడు. ముందంతా ఫ్రెంచివారి పద్ధతిలో వున్న ఉద్యానవనం. మధ్యలో బాట. దీనికి ఇరువైపులా చెట్ల వరుసలు. బాటకు చివర అందమైన పురాతన భవనం.

మేజర్ తన అతిథులను భవనంలోకి తీసుకెళ్ళడానికి ముందు భవనం చుట్టూ తిప్పి చూపాడు. భవనంచుట్టూ పచ్చని పచ్చిక లాన్ వుంది. అది భవనానికి అలంకారంగా నిలిపిన చిరుస్తంభాల వరుస వరకూ వచ్చి ఆగింది. వారి కాళ్ళకు దగ్గరిలో సైన్ నది వుంది. భవనానికి కుడిపక్కన వున్న అడవి జీమూతాలను పరిచినట్లుగా వుంది. ఎడమవైపున ఎర్రని మైదానం. ఎదురుగా చూస్తే దూరంగా ఏదో వెలుగు రేఖ ఆవరించినట్లు కనిపిస్తూ వుంది. అదే పారిస్ నగరం. పైన ఏదో బ్రహ్మాండమైన వెలుతురు బుడగలాంటిది కనిపిస్తూ వుంది. 'శాక్రీకోయెర్ శిఖరం' అనుకున్నాడు వెర్నర్.

"వెర్నర్... ఏమిటోయ్ పెద్ద ఆలోచనలో పడిపోయావు?" మేజరు గర్వంగా ప్రశ్నించాడు.

"ఈ దివ్య భవనం నుండి చూస్తే యిదంతా ఏదో మహాద్భుతంలావుంది సార్"

"ఇదిగో చూడబ్బాయ్... పధ్నాల్గవ లూయీ చక్రవర్తి యిక్కడికి కొన్ని అడుగుల దూరంలోనే పుట్టాడు తెలుసా? నా చిట్టి తల్లి ఎర్నా గనుక పెళ్లిచేసుకుని నాకొక మనవణ్ని అందిస్తే, లూయీ చక్రవర్తి పుట్టిన చోటనే నామనవడు గూడా పుడ్తాడు. నిజంగా పధ్నాల్గవ లూయీ చక్రవర్తి హయాంలో ఫ్రాన్స్‌కు ఎంతటి వైభవోజ్వల యుగం"

ఇదివిని మేజర్ భార్య భుజాలెగరేసింది. "అయ్యో మేజరు గారూ... వరస చూస్తే మిగిలిన జీవితమంతా సెయింట్-జెర్మయిన్‌లోనే గడపాలని అనుకుంటున్నట్లున్నారు. ఎర్నాకు పెళ్లయి, అది ఒకింటిదయ్యేటప్పటికి యుద్ధం ముగుస్తుంది. దేవుని దయవల్ల ఈ యుద్ధం త్వరగా ముగియాలని నేనుకోరుకుంటున్నాను.

ఏమంటావ్ వెర్నర్?''

"అవునవును... యుద్ధం త్వరగా ముగిస్తేనే మంచిది''

"అందరం అదే ఆశిద్దాం. హిట్లర్‌కు జయ మగుగాక''! అన్నాడు మేజర్.

అతిథులందరూ "హెయిల్ హిట్లర్'' అంటూ కోరస్ అందుకున్నారు.

ఈ జయజయధ్వానాలతో హెడ్విగ్ శృతి కలపలేదని ఆమె తండ్రి మాత్రమే గమనించాడు.

టెర్రస్ పై రాత్రిపూట అందరికీ విందు జరుగుతూవుంది. అతిథులందరికీ షాంపేన్ సర్వ్‌చేశారు. ఒక నౌకరు ఐస్ బక్కెట్లతో షాంపేన్ తెచ్చాడు.

"ఇది కల్తీ లేని సరుకు. నిజమైన ఫ్రెంచి సరుకు. నీకు యిష్టమేగద ముల్లర్?''- మేజర్ ప్రశ్నించాడు.

"ఫ్రెంచి షాంపేన్ అంటే నేను గొంతుకోసుకుంటా. మీరు అదృష్టవంతులు. మరి మాకు బెర్లిన్‌లో ఈ సరుకు ఎప్పుడోగానీ దొరకదు. పైగా బ్లాక్ మార్కెట్‌లో కొనుక్కోవాలి'' అంటూ సంగీత సామ్రాట్ నిట్టూర్చాడు.

"నీకాభయం అవసరంలేదు. ఎంత కావాలంటే అంత తాగు... అందిస్తూ వుంటా''- అంటూ మేజర్ గొప్పలు పోయాడు.

ఎర్నా లెఫ్టినెంట్ పక్కనే కూర్చుంది.

"ఆ యుద్ధ విమానాల ఆకాశయుద్ధం గురించి చెప్పరూ. అబ్బా... అవి పక్షు గగుర్పొడిచేటట్లు ఎంత అద్భుతంగా వుంటాయో'' అంటూ ఎర్నా గారాలుపోతూ వుంది.

"నీవనుకున్నంత అద్భుతంగాయేం వుండవు. అవన్నీ ఒకటే మూసలో వుంటాయి. ఆకాశంలో శత్రు విమానం కనబడుతూనే దాని తోక వెంట పరుగెత్తాలి. ఎన్నిసార్లు వీలైతే అన్నిసార్లు దాని మీద కాల్పులు జరపాలి. ఆ దెబ్బలను అది తప్పుకుందనుకో నీ విమానాన్ని డైవ్ కొట్టించి, తిరిగిదాని వెంటపడి కాల్చాలి. నీ డైవ్ వృధా అయిందనుకో నీపని యికనంతే... గోవిందో గోవింద. ఇదే ఆకాశంలో జరిగే డాగ్‌ఫైట్''! అంటూ వివరించాడు వెర్నర్.

"మీరు చెప్పేంత తేలికగాదని నాకు తెలుసులే''! అంటూ ఎర్నా సన్నాయి నొక్కులు నొక్కింది.

"అదేం లాభంలేదు ఎర్నా... ఆ కుర్రాడు నోర్విప్పి ఏమీ చెప్పడు. చాలా మితభాషి. ముల్లర్‌గారు గనుక అంగీకరిస్తే ఆయన స్వంతంగా బాణీలు కట్టిన గీతాలు విందాం. బ్రహ్మాండమైన పియానో వుంది మన దగ్గర, ఏమంటారు?'' అని అడిగాడు మేజర్.

"బాబ్బాబు... నేను చాలా అలసిపోయాను. మా అమ్మాయి హెడ్విగ్ పియానో బాగా వాయిస్తుంది. ఈ రోజుకు నన్నొదిలేసి మా అమ్మాయి సంగీతం వినండి'' అంటూ అటుతిరిగి, "ఇంతకూ ఆ దయ్యం ఎక్కడ?...'' అన్నాడు.

ఆకాశ యుద్ధంలో తన వీరోచిత కృత్యాలు చెప్పమని వెర్నర్‌ను ఎర్నా అడుగుతూ వున్న సమయంలోనే హెడ్విగ్ అక్కడనుండి అదృశ్యమైంది. ఆ అమ్మాయి టెర్రస్ మీద దూరంగా చిన్న స్తంభాన్ని ఆనుకు నిలుచుని వెన్నెల వెలుగులో ప్రకృతి దృశ్యాలను తిలకిస్తూ వుంది. ఆమె తండ్రి బతిమాలి, బామాల్తేనే ఆమె పియానో వద్ద కూర్చుంది.

ఆమె తన అందమైన వేళ్ళతో సుతారంగా పియానో వాయిస్తూవుంది. ఆ సంగీత పరికరం కూడా ఆమె చెప్పినట్లు వింటూ శ్రవణ పేయంగా పాడుతూ వుంది.

వెర్నర్ ఆ సంగీతంలో మునిగిపోయాడు. తన్మయత్వంలో మునిగి సంగీతలోకాలకు వెళ్ళిపోయాడు. సంగీతంలో వుండే మాధుర్యం అతన్ని ముంచేసింది. ఆ సంగీతంలోని ప్రేమ రసైక భావన, నిరాకారమైన దుఃఖమూ ఆ సమయంలో ఆ లెఫ్టినెంట్ మానసిక స్థితికి తగినవిధంగా వుంది. ఆ అమ్మాయి వేళ్ళు పియానో మెట్లపై పడి రాగ వరసలాలాపిస్తూ వుంటే, లెఫ్టినెంట్‌కు తన నరాలనే మీటినట్లుగా వుంది.

హెడ్విగ్ పియానోపై వివిధ బాణీలు వాయించి చివరకు చోపిన్ సంగీతంతో ముగించింది.

"కొంచెం ఆనందకరమైన గీతాలు వాయించి వుండవచ్చుగదమ్మా'' అంటూ సంగీత సామ్రాట్టు గొణిగాడు.




"ఇది మన కాలానికి తగిన థీమ్‌సాంగ్ నాన్నా"! అంటూ ఆ అమ్మాయి బదులు చెప్పింది.

మేజర్ కూతురు ఎర్నాకు సంగీతజ్ఞానం లేదు. కనీసం ప్రేమ సంగీతం తెలిసినా చోపిన్ సంగీతానికి హృదయం పులకించి వుండేది. అయితే హెడ్విగ్ సంగీతానికి లెఫ్ట్‌నెంట్ తన్మయత్వం చెందడాన్ని ఆ అమ్మాయి పసిగట్టింది. హెడ్విగ్ పియానో వాయిస్తూ వున్న సమయంలో ఆ అమ్మాయి హెడ్విగ్‌నూ, వెర్నర్‌నూ మార్చి మార్చి చూస్తూ వుంది. వాళ్ళిద్దరిలో ఎలాంటి భావాలు చోటుచేసుకుంటున్నాయో కనిపెట్టడం ఆ అమ్మాయి లక్ష్యం. వాళ్ళిద్దరినీ చూస్తూ వుంటే ఆ అమ్మాయి హృదయం ఈర్ష్యతో వేగిపోసాగింది.

"సైనిక కేంద్రానికి ఎన్ని గంటలకెళ్ళాలి?" వెర్నర్‌ను అడిగాడు మేజర్.

"సరిగ్గా ఉదయం ఐదు గంటలకు! యుద్ధ విమాన పైలట్లకు శిక్షణయిస్తూ ఉన్నాను" అంటూ వెర్నర్ చిరునవ్వు నవ్వి, "అదేమంత పెద్దపని గాదు. కేవలం రిహార్సల్ చేయించడంలాంటిది" అని నీళ్ళు నమిలాడు.

"ఆషామాషీగా చెబుతావేం. ఈ శిక్షణ గూడా యుద్ధంలాంటిదే. అత్యవసరమైందీ, అతి ప్రమాదకరమైందీ గూడా" మేజర్ మందలించాడు.

"చాలా ప్రమాదాలు జరిగాయా?" అని అడుగుతూ వుండగా ఎర్నా గొంతులో వణుకు పుట్టింది.

"ఏవో వృత్తిపరమైన యిబ్బందులు వస్తూ వుంటాయిగదా" అంటూ వెర్నర్ భుజాలెగురవేశాడు.

"నీవు చాలా ధైర్యసాహసాలు గలవాడివి లెఫ్టినెంట్"

"అబ్బే... అదేంలేదు. నేను వట్టి భయస్థుణ్ణి. నాకు చావంటే భయం. కంట్రోల్స్ దగ్గర లేకుండా వుంటే అప్పుడు నాకంటే పిరికివాడెవడూ మా శిక్షణా కేంద్రంలోనే వుండడు. అయితే అది కొంచెం సేపేననుకోండి. అయినా నన్ను మరో మూడు వారాల్లోనే నా దళంలోకి పంపిస్తామని వాళ్ళు వాగ్దానం చేశారు లెండి"

"మూడు వారాల్లోనా... ఇంత త్వరగానా?" అంటూ ఆశ్చర్యపోయింది ఎర్నా. ఈ మాటలు ఆ అమ్మాయి ఎంత నిస్పృహతో అన్నదంటే, అక్కడున్నవాళ్ళందరి కళ్ళూ ఆమె మీదనే కేంద్రీకృతమయ్యాయి.

"భయపడకు... మనవాడు కొత్త విజయాలు తెస్తాడమ్మా. అతను శిక్షణా కేంద్రంలో కంటే యుద్ధరంగంలోనే భద్రంగా వుంటానని నీకు చెప్పాడమ్మా, అంతే" అంటూ కూతురికి సర్దిచెప్పాడు మేజర్.

తనను పొద్దు పొడిచేసరికే నిద్రలేపమని చెప్పి తన పడకగదికి వెళ్ళిపోయాడు వెర్నర్.

★ ★ ★

వెర్నర్ వేకువఝామున లేచి కిందకు దిగేసరికి ఎర్నా కారువద్ద వేచివుంది. ఆమెను చూసి వెర్నర్ ఆశ్చర్యపోయాడు.

ఆమె బట్టలు గూడా సరిగ్గా వేసుకోలేదు. జుట్టంతా చిందరవందరగా భుజాల మీద వేలాడుతూవుంది. అలాంటి సమయాల్లోనే తను చాలా అందంగా కనిపిస్తానని ఆ అమ్మాయికి బాగా తెలుసు.

"మీకు వీడ్కోలు చెప్పడానికి వచ్చాను. మనమిద్దరం కలిసి బ్రేక్‌ఫాస్ట్ తీసుకుందామా? వెళ్ళడానికి యింకా టైముందిగా"

"నీ యిష్టం. పద" అంటూ డైనింగ్ రూంకు దారితీశాడు వెర్నర్. చాలా విశాలమైన డైనింగ్‌రూంలో వాళ్ళిద్దరే వున్నారు. రాత్రి విందులో మిగిలిపోయిన పదార్థాలన్నింటినీ ఎర్నా లెఫ్టినెంట్ ముందుకు త్రోసింది. అతని పక్కన కూర్చుని రొట్టెకు వెన్నరాసి యిచ్చింది. కాఫీ కలిపి యిచ్చింది.

"రాత్రి మీకు ఆనందంగా గడిచిందా?"

"బ్రహ్మాండంగా గడిచింది. మీ తల్లిదండ్రులు నాకు యిది పరాయి యిల్లు అని అనిపించనంత యిదిగా నన్ను చూశారు. సంగీత స్వామాట్ అద్భుతమైన మనిషి"

"అంత అద్భుతమైన మనిషా? మరి ఆయన కూతురు?"

"ఆ అమ్మాయి గొప్ప పియానో విద్వాంసురాలు"

"అంతేగాదు మరి చాలా అందగత్తెగూడానిపించలేదూ" అంటూ ఎర్నా కనురెప్పలల్లా

ర్చి, వెర్నర్‌వైపు భావయుక్తంగా క్రీగంట చూసింది. అతను ఏమంటాడో వినాలని, అతని ముఖంలో ఎలాంటి భావాలు కలుగుతాయో చూడాలని ఈర్ష్యగా అతన్నే చూస్తూవుంది. ''ఆ అమ్మాయి గుబుళ్ళమారి గురివి. చిత్రమైన మనిషి. ఎవరికీ అంతుచిక్కదు''- అంటూ తానే ఆ అమ్మాయిపై తీర్పు యిచ్చింది.

''అవును... అలాగే అనుకోవచ్చు''- అన్నాడు వెర్నర్ అనాసక్తంగా.

''మీ మగాళ్ళున్నారే... వాళ్ళు ఎవరికీ అంతుచిక్కని చిత్రమైన ఆడాళ్ళంటేనే పడిచస్తారుగదూ'' అంటూ నిట్టూర్చి, అంతలో సర్దుకుని, ''నీవెప్పుడూ నాకు ఉత్తరాలైనా రాయలేదేమ్మా'' అంటూ గారాలు పోయింది.

''మేజర్‌గారు ఎక్కడున్నారో తెలియందే ఎలా రాయడం?''

''మా బెర్లిన్ అడ్రస్‌కు రాయొచ్చుగా'' అంటూ బుంగమూతి పెట్టింది.

''సారీ ఎర్నా... నిజం చెప్పాలంటే నేను ఎప్పుడూ, ఎవరికీ ఉత్తరాలు రాయను. అసలు ఎవరికీ ఉత్తరాలు రాయాలని గూడా అనుకోను''

''మీ స్నేహితులకు గూడా రాయరా?''- అంటూ ఎర్నా కళ్ళు దించుకుంది.

''నాకు స్నేహితులే లేరు''

''ఒక్క స్నేహితురాలుగూడా లేదా?''

''లేదు... లేదంటే లేనేలేదు''

ఈ సమాధానంతో ఎర్నా మనసు కుదుటపడింది. ''మీకు ఒక స్నేహితురాలు కావాలి తెలుసా... ఎప్పుడూ మీ గురించి ఆలోచించే స్నేహితురాలు'' అంటూ క్రీగంట చూసింది.

దీనికి వెర్నర్ సమాధానమేమీ ఇవ్వలేదు. ఈ అమ్మాయికి సమాధానం చెప్పడం అతనికి చాలా ఇబ్బందిగా ఉంది. తన ముఖ కవళికలు దాచుకోడానికి అతను కాఫీకప్పు పైకెత్తి పట్టుకుని కాఫీ తాగనారంభించాడు. ఎర్నా చిన్నప్పుడే పిలకజడతో, వయసు వచ్చీరాక ముందే వెర్నర్ వైపు ఆశగా మింగేసేటట్లు చూస్తూ వుండేది. బాల్య చాపల్య జనితమైన ప్రేమభావన యింకా ఆ పిల్లను వదల నందుకు వెర్నర్‌కు కోపం వస్తూ వుండేది.

వెర్నర్ ఇదంతా ఆలోచిస్తూ యిబ్బందిగా, మౌనంగా కూర్చునిపోవడంతో ఎర్నాకు ప్రోత్సాహం లభించినట్లయింది. తన చేతివేళ్ళతో గోముగా లెఫ్టినెంట్ చెయ్యి నిమురుతూ, ''నీకు తెలియదా వెర్నర్, నేను నిన్ను ప్రేమిస్తున్నానని? నేను ఎప్పుడూ నిన్ను ప్రేమిస్తూనే వున్నాను... తెలుసా''

''ఎప్పుడూనా?'' అంటూ లెఫ్టినెంట్ చేతిలోని కప్పు కిందపెట్టాడు. ఇదంతా చూస్తే అతనికి నవ్వు వస్తూవుంది. అతను ఎర్నా చేతిలోని తన చేతిని వదిలించుకుని మెల్లిగా నవ్వాడు. ''చూడు ఎర్నా... అది ఊహ తెలిసీ తెలియని వయసులో వుండే బాల్యచాపల్యం. దాన్ని ప్రేమ అనడం తప్పు. పోయినసారి నేను నిన్ను చూసేనాటికి నీ వయసు పదిహేనేళ్ళే. తెలుసా?''

''ఇప్పుడు నేనింకా పెరగలేదాయేం. నేనిప్పటికీ నిన్నే ప్రేమిస్తూవున్నా'' - అంటూ ఎర్నా గారాలుపోయింది.

''నాన్‌సెన్స్'' అంటూ వెర్నర్ తాను కుర్చున్న కూర్చీలో యిబ్బందిగా కదిలాడు. ''అమ్మాయ్... నీవు చెప్పేది నిజమే అయినా నువ్వు ఈ ప్రేమా గీమా ఇదంతా మరిచిపోవడం మంచిది. యుద్ధ సమయంలో పెళ్ళిగురించి తెలివితక్కువవాళ్ళూ, మదపిచ్చాళ్ళూ మాత్రమే ఆలోచిస్తారు''

''ఇతరులు సలక్షణంగా పెళ్ళిచేసుకోవడం లేదా! పెళ్ళిగురించి ఆలోచించడం తెలివి తక్కువతనం, ఉన్మాదం మనకే ఎందుక్కావాలి?''

''ఒకటి రెండు రోజుల సౌఖ్యం కోసం ఒక ఆడదాని జీవితాన్నంతటినీ నాశనం చేసే స్వార్థపరుణ్ణి కాను నేను''

''ఓ... వెర్నర్! నీవంటే నాకు యెంతయిదో నీకు తెలియదు. నీతో ఒక్కరోజు సుఖంగా గడిపినా నా జీవితం మొత్తాన్ని త్యాగం చేయగలను'' ఉద్వేగంతో చెప్పింది ఎర్నా.

''అవ్వ, నీ అధికప్రసంగం'' అంటూ నాలిక కరచుకొని, అనునయించే ధోరణిలో ఎర్నా చేతిని తన చేతిలోకి తీసుకుని, ''చూడు ఎర్నా... ఇవి చాలా భయంకరమైన రోజులు. మనం విజ్ఞతతో ప్రవర్తించాలి. కాస్త వివేకంతో ఆలోచించడానికి ప్రయత్నించు'' అంటూ





హితవు చెప్పాడు.

"ప్రేమలోపడ్డ ఆడదానికి విజ్ఞత, వివేకం వుండవు" అంటూ నిష్కర్షగా చెప్పింది ఎర్నా.

లెఫ్టినెంట్ వాచీ చూసుకున్నాడు. కుర్చీలో నుంచి చివాల్నలేచి. "ఇప్పటికే ఆలస్య మైంది... వస్తా" అంటూ బయలుదేరాడు.

"వెర్నర్... నేను చెప్పేది కాస్త విను"

"ఊహుఁ... ప్రయోజనం లేదు ఎర్నా! నేను చెప్పవలసినదేదో అంతా చెప్పేశాను" అంటూ వెర్నర్ ముందుకు కదిలాడు.

ఆ అమ్మాయి రెండు చేతులతో అతన్ని చుట్టేసి గట్టిగా కౌగలించుకుంది. ఆమె శరీరపు వెచ్చటి స్పర్శానుభూతి అతనికి తెలుస్తూనే వుంది.

"నీవు నన్ను పెళ్ళిచేసుకోవద్దు వెర్నర్. యుద్ధం ముగిసిన తరువాత గూడా నీకు యింకా నేను కావాలనిపిస్తే నీ కోసం నేను వేచివుంటాను వెర్నర్. ఈలోగా నేను నీదాన్ని. నీదాన్నే వెర్నర్. ఎప్పుడేం జరిగినా ఫర్వాలేదు కానీ నాకు ఆ మధురమైన ఆనందఘడియ అనుభూతం కావాలి వెర్నర్. కాదనకు... జీవితాంతం ఈ మధురక్షణాలను తలుచుకుంటూ గడిపేస్తాను" అంటూ ప్రణయోన్మాదిలా మాట్లాడసాగింది.

"ఎర్నా... ఏమిటీపిచ్చి. నిన్ను నీవు సంభాళించుకో" అంటూ లెఫ్టినెంట్ తనను పెనవేసుకుని వున్న ఎర్నాచేతులను బలవంతంగా విడదీశాడు. "నీవు చెప్పేదేమిటో నీకు తెలియదు ఎర్నా... నీవు మేజర్ క్లుగే కూతురువనే విషయం గుర్తుపెట్టుకో... గుడ్‌బై" అంటూ అడుగులు ముందుకేశాడు.

ఎర్నాకు దుఃఖం పొర్లుకొచ్చింది. "చివరకు వీడ్కోలు చెప్పేటప్పుడన్నా ముద్దివ్వవా?" అంటూ నిష్ఠూరాలాడింది.

"ఓ... దానికేం" అని నవ్వుతూ, "అయితే యిది ఒక స్నేహితుడిచ్చే వీడ్కోలు ముద్దు".

"ఇక్కడపెట్టు!" అంటూ ఎర్నా చెంప చూపించింది. వెర్నర్ ముద్దుపెట్టుకోనడానికి వంగగానే, ఎర్నా వేగంగా తలతిప్పి అతని పెదాలకు తన పెదాలను చేర్చి గాఢంగా ముద్దుపెట్టుకుంది. తన రెండు చేతులనూ అతని మెడచుట్టూ వేసి తాదాత్మ్యం చెందింది. ఆ అమ్మాయి శరీరంలోని ప్రతి అణువూ ప్రేమ పారవశ్యంతో వణికి పోతూవుంది. ప్రేమమైకంలో చేతనాచేతన స్థితిలోకి జారుకుంటూ వుంది.

"వెర్నర్... నాకు నీవు చెప్పే వివేకం, విజ్ఞతా వద్దేవద్దు. నీవు ఇక్కడ వుండగానే నేను నీదాన్ని కావాలనుకున్నాను. నన్ను నీ భార్యగా వుండనీ వెర్నర్... నీ భార్యగా వుండనీ" అంటూ ప్రణయోన్మాదంతో మాట్లాడసాగింది. "నీ భార్య... నీ భార్య" - అంటూ అదేమాటను పదేపదే ఉచ్ఛరిస్తూ, అలౌకికానందం అనుభవిస్తూవుంది.

అయితే వెర్నర్ మాత్రం ఆమెతో సహకరించలేదు. ఎర్నా ప్రణయోన్మాదం తనను వెర్రెక్కిస్తున్నా అతను తమాయించుకున్నాడు. టోపీ చేతిలోకి తీసుకున్నాడు.

"నేను వెళ్ళితీరాలి... గుడ్‌బై ఎర్నా. మీ తల్లిదండ్రులకు చెప్పు" అంటూ పెద్ద పెద్ద అడుగులేస్తూ సాగాడు.

ఎర్నా అతనితోపాటు తాను అడుగులేస్తూ వడివడిగా తలుపుదాకా వెళ్ళింది.

"తిరిగివస్తావుగా. తప్పకరావాలి. నామీద ఒట్టు"

లెఫ్టినెంట్ ఆగి, ఆ అమ్మాయి చేయి ముద్దుపెట్టుకుని, "తప్పకుండా వస్తా, ఒట్టు" అంటూ వెళ్ళిపోయాడు.

వెర్నర్ కారు ఏటవాలు ప్రదేశం నుండి కిందికిదిగి సైన్‌నది వెంట బాటపై పరుగుపెడుతూవుంది. ఒక టగ్‌బోటు నదిలో కలదిరుగుతూ చిన్ననౌకలను ఒకచోటికి చేరుస్తూ వుంది. ఒక మనిషి చివరినౌక టిల్లర్‌ను అంది పుచ్చుకున్నాడు. ఒక స్త్రీ అతనితోపాటే నుంచుని వుంది. ఆమె చేతిలో పసిపాప వుంది.

గత రాత్రి మేజర్ క్లుగే అన్నమాటలు వెర్నర్ తలపునకు వచ్చాయి. "ఎర్నాగనుక నాకొక మనవణ్ణి యిస్తే..." వెర్నర్ తనలోతాను పెద్దగా నవ్వుకున్నాడు. ఈ యుద్ధం క్లుగే వైఖరిలో అతని కుటుంబంవల్ల ఎలాంటి మార్పుతెచ్చిందో ఆలోచిస్తూ మరోసారి నవ్వుకున్నాడు.

ఒకప్పుడు వెర్నర్ తండ్రి హార్స్ట్ క్లుగే కలసి ఒకే స్కూల్లో చదివేవారు. తదనంతరం బాగా చదువుకుని గొప్ప పండితుడిగా ప్రసిద్ధికెక్కిన హార్స్ట్ చాలీచాలని జీతంతో ప్రొఫెసరయ్యాడు. పొట్టపొడిచినా అక్షరంముక్క రాని మొద్దబ్బాయి క్లుగే మాత్రం సకలదేశాల ఉత్పత్తుల ను దిగుమతి చేసుకునే పెద్ద ధనాఢ్యుడైన వ్యాపారి అయ్యాడు. బెర్లిన్‌లోకల్లా అందమైన గ్రూన్‌వాల్డ్ ప్రాంతంలో అతనికి ఓ పెద్దభవనం వుంది. తన అంతస్తులో వచ్చిన మార్పును పదిమందికీచూపి గొప్పలు చాటుకొనడం క్లుగేకు యిష్టం. అందుకే తన చిన్ననాటి స్నేహితుడు హార్స్ట్‌ను తన బంగళాకు ఆహ్వానించి సమస్త మర్యాదలూ చేసేవాడు. ఆ రోజుల్లో వెర్నర్‌వాళ్ళమ్మాయి మీద కన్నేస్తే ఇదే క్లుగే ఎంత అల్లరి చేసి వుండేవాడో. అతనిని ఎంతగా అవమానించి వుండేవాడో!

నేడు అదే వెర్నర్ జర్మన్ వైమానికదళంలోని యోధానుయోధుల్లో ఒకడు. దాదాపు అన్ని ప్రభుత్వ ప్రకటనల్లోనూ తరచుగా అతని పేరే వినిపిస్తూ వుంటుంది. తన అల్లుడు యుద్ధవీరుడైవుంటే యుద్ధం ముగిసిన తరువాత శాంతికాలంలో బెర్లిన్ ఉన్నత సమాజంలో గొప్పపెట్టుబడిగా పనికొస్తాడు.

ఈ కారణంతో ఎర్నాగూడా వెర్నర్ అంటే పడి చస్తూ వుంది. అది వెర్నర్‌కు అనవసరం. ఎర్నా తన వళ్ళోవాలి, ఆమె పెదాలను తన పెదాలకు అదిమి ముద్దిచ్చినప్పుడు తనలో చిన్న చిరుకంపన కలిగినమాట నిజమే. కానీ తనకు ఎర్నా అవసరం లేదు. అసలు ఏఆడదీ అవసరం లేదు.

వెర్నర్ యిప్పటికీ అస్ఖలిత బ్రహ్మచారి. వెర్నర్ శరీరధార్ఢ్యమూ, అతని కీర్తిప్రతిష్టలూ చూసి సెలవుల్లో అతను యింటికి వచ్చినప్పుడు, ఊర్లోని పెళ్ళిగాని ఆడపిల్లలందరూ అతనంటే పడిచచ్చేవారు.

వెర్నర్‌కు తన తల్లి అంటే ఆరాధన. ఆమెకు తన తండ్రి మీద ఎంత ప్రేమో! అది చూసినవాళ్లకు ఈర్ష్య కలిగేది. తన తల్లి ప్రపంచంలోని స్త్రీత్వమంతా మూసపోసినట్లుండేది. అందం, సౌకుమార్యం, సౌజన్యం, ప్రేమాదరాలు అన్నీ కలబోసిన పరిపూర్ణ మహిళగా వుండేదామె. ఆమెమీద తనకున్న భక్తిప్రపత్తుల వల్లనే వెర్నర్ విచ్చీవిరియని వయసులో ప్రేమా గీమాలాంటి ఎలాంటి పొరపాట్లూ చెయ్యలేదు. ఎర్నాయేగాదు తనంతే వెంపర్లాడే ఏ ఆడపిల్లా వెర్నర్‌కు అంతగా నచ్చలేదు.

నూనూగుమీసాల నూత్నప్రాయంలోనే ఆడదాని ఆకర్షణకు లొంగే ప్రమాదం ఒకటి దాపురించినా, అది జయప్రదంగా తప్పిపోయింది. ఒకరోజు సాయంత్రం వెర్నర్ పరీక్షలు ముగిసిన సంతోషంలో తాను మరో ముగ్గురు స్నేహితులతో కలిసి ఒక బారులో బీర్ పార్టీ చేసుకుంటున్నాడు. ఇంతలో బజారు ఆడాళ్లు బిలబిలమంటూ బార్‌లోకి వచ్చారు. వారికెక్కడా గిరాకీ తగల్లేదు కాబోలు. ఈ పిల్లకాయల్ని పట్టుకున్నారు. వాళ్లుగూడా బాగా కుర్రసరుకే. మాంచి మదించిన ఆవుపెయ్యల్లా కండలూ, కైవారాలతో తమ అందాలన్నింటినీ ఈ కుర్రవాళ్ళముందు పరిచారు. అంతకుముందెన్నడూ ఆడగాలి యెరగని ఆ కుర్రాళ్ళు ఆ ఆకర్షణకు తలకిందులయ్యారు.

వెర్నర్‌ను గూడా ఓ గుంట పట్టుకుంది. అతనుగూడా అందివచ్చిన ఆనందాన్ని ఆలస్యం లేకుండా జుర్రుకుందామని, వంటిమీద బట్టలు ఊడదీస్తూ అంతలోనే తాను తప్పు చేస్తున్నానన్న స్పృహలోకి వచ్చాడు. అందాలన్నీ తన ముందుపరిచిన ఆ బజారుగుంట మాట్లాడే బూతులు, దాని హావభావాలతో వెర్నర్ భయపడిపోయాడు. అది చౌకబారు సెంటు పూసుకొని వుంది. ఆ సెంటూ, దాని వంటి చెమట కలిసిన దుర్గంధం ఆ గదంతా నిండేసరికి వెర్నర్‌కు తలదిమ్మెక్కింది. అది తనను రెచ్చగొట్టడానికి నగ్నంగా, భయోద్విగ్నంగా డాన్సు ప్రారంభించి, బూతుపాటలు పాడుతూ వుంటే ఆ కామపిశాచం బారినుండి ఎలా తప్పించుకోవాలో తెలియక గిజగిజలాడిపోయాడు.

ఇదేనా స్వర్గద్వారం? ఇదేనా నిషిద్ధ స్వర్గం! నిషిద్ధ ఫలం? మన కవులు గానంచేసిన అపారప్రేమ పారావారం యిదా? ఆలోచిస్తే వెర్నర్‌కు తలదిమ్మెక్కింది.

వెర్నర్ త్వరత్వరగా బట్టలు తగిలించుకున్నాడు. తన అవస్థ చూసి ఆ వేశ్యకు కూడా




జాలికలిగినట్లుంది.

"ఇదో అబ్బాయీ ... ఆడదంటే ఏందో తెలవని వసోడివిగానీ... ఇంత పిరికిగొడ్డువి. నిన్ను పాడుజెయ్యడమెందుకుగానీ... నీ జేబులు యిదిలిచ్చి ఆ డబ్బులు నా మొగానేసిపో" అంది ఆ బజారు వేశ్య.

బతుకుజీవుడా! అనుకుంటూ ముందు మాట్లాడిన రేటుకంటే పదింతలు ఎక్కువిచ్చి అక్కడనుండి తిరిగి చూడకుండా పారిపోయాడు వెర్నర్.

ఈ సాహసప్రణయం భగ్నమైన తరువాత యింటికి వెళ్ళాలంటే అబ్బాయికి భయంపట్టుకుంది. గంటలకు గంటలు వీధులన్నీ తిరిగి చివరకు యింట్లో దూరాడు. బాత్‌రూంలో దూరి ఆ బజారు మనిషి తాకిన బట్టలన్నీ విప్పేసి, శుభ్రంగా స్నానంచేసి బయటికివచ్చాడు. ఇదంతా యెందుకంటే తాను చేసిన ఘనకార్యం తాలూకు ఆనవాళ్ళు తెలియకుండా కప్పిపుచ్చుకొనడానికి మాత్రంగాదు. తన తల్లి ఒకవేళ తనను దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంటే ఆమె చేతులుగానీ, శరీరంగానీ మలినం కాకూడదనే యిదంతా చేశాడు.

వెర్నర్ తల్లికి తన సుపుత్రుడు చేయబోయి వైఫల్యం చెందిన ఘనకార్యం గురించిగానీ, దరిమిలా తన తల్లి తనను తాకి మైలపడిపోతుందేమోనని అతను అనుభవించిన చిత్త క్షోభ గురించిగానీ తెలియనే తెలియదు. తర్వాత కొద్దిరోజులకే ఆమెకు ఇన్‌ఫ్లుయెంజా జ్వరం పట్టుకుంది. అది బ్రాంకో-న్యుమోనియాగా మారింది. వెర్నర్ తన తల్లి మంచం వదలిపెట్టి ఎరగడు. తల్లి జబ్బు పెరిగేకొద్దీ అతను ఆందోళనతో బావురుమనేవాడు.

ఒకరాత్రి, అదే ఈ భూమిమీద ఆమె ఆఖరురాత్రి. అప్పటికి ఆమె భర్త ఆమెకు సేవలు చేసి అలసిపోయి ఒకగంటైనా విశ్రాంతి తీసుకుందామని అవతలికెళ్ళాడు. ఆమె బలవంతాన కళ్ళువిప్పి కొడుకు చేయి గట్టిగా పట్టుకుంది. అతని ముఖాన్ని తడుముతూ తన ముఖం దగ్గరకు లాక్కుంది. మెల్లిగా రహస్యం చెప్పేదానిలా కొడుకు చెవిలో గొణిగింది- "వెర్నర్... ఈ ఆఖరుక్షణంలోనైనా నేను నీకు నిజం చెప్పి తీరాలి. మీ తండ్రి... నీవు యిప్పుడు నాన్నా అని పిలుస్తున్నావే... అతను నీ తండ్రి కాదు"

ఈ మాటలకు వెర్నర్ దిగ్భ్రమచెందాడు. కళ్ళనిండా నీరుచిమ్ముతుండగా 'అమ్మా' అని బాధగా మూల్గాడు.

"అవును బాబూ... ఇది నిజం. నేను సంధి ప్రేలాపన ప్రేలడంలేదు. నేను చెబుతూ వున్నది, నా మానసికస్థితి సక్రమంగా వుండే చెబుతున్నాను. నా బాబూ... నేను చనిపోవడానికి ముందే నన్ను నీవు క్షమించాలి. నాకు పాపవిమోచనం కలిగించాలి నాయనా"

వెర్నర్ తన చెవులను తానే నమ్మలేకపోయాడు. కానీ నమ్మక తప్పేదేముంది. జ్వరంతో కాగిపోతూవున్న ఆమె చేతిలోని తన చేతివేళ్ళు చల్లబడుతూ వున్నాయి. తన గుండెను ఎవరో అదిమినట్లుంది. బహుశా అది ఆగిపోతుందేమో. ఆగిపోతూ వున్న గుండెకు తిరిగి రక్తప్రసరణ జరుగుతున్నట్లుగా వుంది.

"చెప్పు బాబూ... చెప్పు... నీవు నన్ను క్షమిస్తావా లేదా?" చనిపోతున్న ఆమె హీనస్వరంతో గొణుగుతూ వుంది. "నా పాపానికి జీవితమంతా పరిహారం చెల్లిస్తూనే వున్నాను బాబూ?"

"అయితే నా తండ్రి పేరేమిటో చెబుతావా?" వెర్నర్ తల్లిని ప్రశ్నిస్తూ వుంటే అతని గొంతు మూగపోయింది. మాట నంగినంగిగా వస్తూ వుంది.

ఈ ప్రశ్న అనంతరం యిద్దరిమధ్యా చాలాసేపు మౌనం రాజ్యమేలింది. ఆమె అంతిమక్షణాల్లో శక్తి పూర్తిగా ఉడుగుతూ వున్నట్లుంది. అందుకే సమాధానం చెప్పలేకపోతూ వున్నదేమో! చివరకు ఆమె బలవంతాన పెదవి విప్పింది.

"అతను ఈ ప్రపంచంలో లేడు బాబూ... ఇక అతని పేరెందుకు? ఒకవేళ అతను బతికివున్నా నీ ప్రేమకు తగినవాడుకాదు"

వెర్నర్ ఇక తల్లిని మరేమీ అడగలేదు.

ఆమె కళ్ళు మూతలుపడ్డాయి.

అది వెర్నర్‌పాలిట భయంకరమైన కాళరాత్రి. తాను విన్నది మననం చేసుకుంటూ వుంటే, అతని కళ్ళ ఎదుటనే అతని ప్ర



# ఫారెక్స్-ఎగ్ పాల లాగే సులభంగా జీర్ణమవుతుంది

ముందుగానే వండబడిన ఫారెక్స్-ఎగ్. ఆరు నెలల వయసు నుంచీ మీ పాపాయికి ఒకే ఉత్పాదన ద్వారా గ్రుడ్లు మరియు పాలలోని సమ్పూర్ణమైన పోషణను అందించండి.




ప్రొటీన్ సమృద్ధి

ఫారెక్స్:
పెరుగుదలకు రుచికరమైన విధానం

ఏదుకాణంలోనైనా సాదుపైన ఒకే ధరలో దొరుకుతోంది.

GX/188.90. TI

పంచం కుంచించుకుపోతూ వుంది. చిన్నప్పటి నుండీ అల్లారుముద్దుగా పెంచి పెద్దచేసిన తల్లి తన కళ్ళ ఎదుటనే మరణిస్తూ వుండడం ఒక్కటే గాదు, తన తల్లి యెంతో ఉత్తమురాలనుకున్నాడు. ఇంతకంటే దొడ్డయిల్లాలు ఈ ప్రపంచంలో మరెవరూ ఉండదనుకున్నాడు. తన తల్లిపై తాను అంత ఆరాధన పెంచుకున్నాడు. ఈ గౌరవ మర్యాదలన్నింటికీ తాను తగనని ఆమే స్వయంగా తన నోటితోనే చెప్పింది.

అయినా అతను తల్లి మంచం వద్దే వున్నాడు. మరి కొన్నిగంటల్లోనే ఈ జీవి శాశ్వతంగా నిష్క్రమిస్తుంది. పాపంచేసినా, పుణ్యంచేసినా తనను కన్నతల్లి. అందుకే అతను ఆమె పడక పక్కనే తలవైపు నిలుచుని వున్నాడు. చివరకు ఆమె కోమాలో నుండి తేరుకుని తిరిగి కళ్ళు విప్పింది. వెర్నర్ ఆఖరుసారి తల్లిని ముద్దుపెట్టుకున్నాడు.

''నిన్ను క్షమించానమ్మా'' అంటూ ''అయితే అమ్మా... నీవు నాకు చెప్పిన విషయం హార్న్‌గారికి... అదే నా తండ్రికి తెలుసా?'' అని ప్రశ్నించాడు.

''తెలుసు. కానీ బాబూ... నీకు ఈ విషయం చెప్పినట్లు ఆయనకు ఎన్నడూ తెలియనీకు'' అంటూ గొణిగింది.

''అలాగేనమ్మా'' అంటూ వెర్నర్ తల్లికి వాగ్దానం చేశాడు. జీవితంలో ఆ వాగ్దానాన్ని నిలుపుకున్నాడుగూడా. ఆ తర్వాత ఆ తండ్రీకొడుకుల జీవితం బాధగా, భారంగా గడిచింది. భార్య చేతిలో మోసపోయిన భర్త ఆమెను ఎన్నడో క్షమించివుంటాడు. ఆమె చేసిన పాపాన్ని బహుశా పూర్తిగా మరచిపోయేవుంటాడు. ఆమె మృతి ప్రొఫెసరుకు తీరని వేదన కలిగించింది. అతను కుంగిపోయాడు. తన తండ్రి తన తల్లి చేసిన పాపాన్ని క్షమించి వుండవచ్చుగానీ, ఆ చేదునిజాన్ని మాత్రం మరచిపోలేదని వెర్నర్ భావించాడు. వెర్నర్ తన తల్లిమీద వర్షించిన ప్రేమనంతా, తనను స్వంతకొడుకులాగా ప్రేమించి పెద్దచేసిన వ్యక్తిమీదికి మరల్చాడు. ప్రొఫెసర్ అంటే అతనికి గొప్పభక్తి. దానిని అతను తన మనసులోనే దాచుకున్నాడు. ఆ భక్తిశ్రద్ధలు నేడు పిచ్చిప్రేమగా పెల్లుబికాయి. దానిలో కృతజ్ఞతకంటే జాలి అధికం.

తన జన్మ మోసపూరితమైనదని తెలుసుకున్న వెర్నర్ అంతులేని నిరాశా నిస్పృహలకు లోనయ్యాడు. బహుశా భార్యచేత మోసపోయిన ఆ భర్తగూడా యింత నిస్పృహకు లోనుకాలేదేమో. వెర్నర్ ఎప్పుడూ తన తరగతిలో మొదటివాడుగా వుండేవాడు. అలాంటి వాడు రెండువారాలపాటు స్కూలు పక్కకే వెళ్ళలేదు. అతను తిరిగి స్కూలుకు వెళ్ళసాగిన తరువాత పుస్తకాలపై విరుచుకుపడ్డాడు. పిచ్చిపట్టినరీతిగా చదవసాగాడు. అతని ప్రధాన విషయం తత్వశాస్త్రం. తన స్వీయభావాలను మరుగుపరచుకోవడానికి అతను యితరుల భావాల్లో మునిగిపోయాడు. ఈ దశలో 'ఈ ప్రపంచంలో సమస్త విషయాలకు మూలం చెడుగే'నని చాటిచెప్పే సిద్ధాంతం ఒకటి అతని తలకెక్కింది. యవ్వనం యింకా విరిసీ విరియని ఈ కుర్రాడి మనసును ఆ సిద్ధాంతం పూర్తిగా ఆకట్టుకుంది. మానవుని కాంక్షలన్నింటికీ కారణం చెడుగేనని అతను భావించాడు. కామ ప్రకోప భావాలనే అతను ఏవగించుకున్నాడు. కామమే తన తల్లిని పతనం చేసింది. ఆత్మసంయమనం, జితేంద్రియత్వమే ఈ చెడుగులన్నింటికీ నివారణమని అతడు భావించాడు. వీటిని మించిన ఉన్నతభావాలు, ఉన్నతాదర్శాలు ప్రపంచంలో మరేవీలేవని అతని భావన.

వెర్నర్ మానసిక స్థితి ఈరీతిగా వున్న కాలంలోనే ద్వితీయ ప్రపంచయుద్ధం ఆరంభమైంది. అతని తండ్రి ప్రొఫెసర్ హార్న్ యుద్ధం తొలినాళ్ళలోనే సైన్యంలో చేరాడు. అతడు కాల్బలంలో సైన్యాధికారి. అప్పుడే తన పద్దెనిమిదో పుట్టినరోజు జరుపుకున్న వెర్నర్ విమాన దళంలో చేరాడు.

ఈత తెలియని మనిషి నీళ్ళలో దూకినట్లుగానే అతను యుద్ధంలోకి దూకాడు. ఆ భయానకయుద్ధ సుడిగుండంలో పడి కొట్టుకుపోయాడు.

ఇంతకుముందు బతకడమే వ్యర్థమనుకున్న యువతత్వవేత్త తన బతుకుకొక అర్థాన్నీ పరమార్థాన్నీ తెలుసుకున్నాడు. ఇప్పుడతనికి ఒక లక్ష్యముంది. తన దేశ శత్రువులను మట్టుపెట్టడమే అతని లక్ష్యం. బతుకు మీద రోత

అతనికి బ్రహ్మాండమైన ధైర్యసాహసాలని చ్చింది. ఈనాడు అతడు బలవంతుడు. యుద్ధవిద్యలో ఆరితేరినవాడు. మాతృదేశంలో గొప్ప హీరోగా ప్రశంసలందుకుంటూవున్నాడు.

అతను క్లుగే యింటినుండి బయలుదేరి ఎయిర్‌ఫీల్డ్ చేరేసరికి ఎర్నా రూపం అతని మనోఫలకం నుండి పూర్తిగా అదృశ్యమైంది. శిక్షణకు ఉద్దేశించిన యుద్ధవిమానాలు హాంగర్లనుండి దిగి రన్‌వేమీద ఎగరడానికి సిద్ధంగా వున్నాయి. అతను కారు దిగడమే ఆలస్యం యుద్ధవిమానాల దగ్గరకెళ్ళాడు. మార్లీ అడవిలో తాను శిక్షణ గరిపే యుద్ధవిమానాలు పక్షుల్లా పల్టీలు కొడుతూ, ధ్వనివేగంతో పయనిస్తూ విన్యాసాలు చేస్తూ వుంటే అతని మనసు ఆనందంతో గంతులేసింది. తాను గూడా ఆ విమానాల ధ్వనిని అనుకరిస్తూ నోటితో సద్దుచేస్తూ వున్నాడు.

తాను శిక్షణా విమానం ఎక్కించిన తొలివిద్యార్థి అమితమైన సిగ్గరి. భయంతో వణికిపోతూవున్నాడు. వాడికి విమానం కంట్రోల్స్ ముందు కూర్చోవడమేసరిగా తెలియడంలేదు. పదిహేను నిమిషాలపాటు ఆకాశంలో విహరించిన తరువాత ఆ విమానం తిరిగి భూమి మీదికి దిగాలి. విమానాన్ని ఎంతఎత్తునుండి కిందికి దింపాలో ఆ విద్యార్థికి తెలియలేదు. విమానం అతని వశంతప్పింది. హైఫ్రీక్వెన్సీ ఎలక్ట్రిక్ టవర్లలో ఒకదానిని గుద్దుకోబోతూ వుంది. ఇంకా సరిగ్గా తెల్లవారకముందే ఆ విమానంతోపాటు ఆ విద్యార్థి, అతనికి శిక్షణగరపూతూవున్న వెర్నర్ గూడా మాడి మసైపోయి వుండేవాడు. వెర్నర్ ఒడుపుగా కంట్రోల్స్ అందుకుని విమానాన్ని అదుపులోకి తెచ్చాడు. ప్రమాదంనుండి తప్పించాడు. విద్యుత్ తీగలకు కేవలం మూడే మూడడుగులు క్రిందుగా విమానం దూసుకుపోయింది.

అప్పటికే ఆ విద్యార్థికి వళ్ళంతా చెమటలు కమ్మాయి. గండం గడిచిందనుకున్న తర్వాత ఆ విద్యార్థి తన శిక్షకుడి వైపు తిరిగి థాంక్స్ చెప్పాడు.

కోపాన్ని అణచుకుంటూ, పళ్ళు బిగబట్టినప్పటికీ ప్రశాంతంగా వున్న వెర్నర్ ''రేపు నీవు పదాతిదళానికి తిరిగివెళ్ళు'' అని చాలా నింపాదిగా ఆ కుర్రాడిని ఆదేశించాడు.

★ ★ ★





ఆ తర్వాత ఆ శిక్షణాకేంద్రంలో రెండువారాలు గడిచిపోయాయి. యుద్ధరంగంలోకి తిరిగి రమ్మని కోర్ ఉత్తర్వులు అందుకొనడానికి వెర్నర్ ఎదురుచూస్తూవున్నాడు. అంతలో అతనికి వైద్యపరీక్షకు హాజరు కావలసిందిగా తాఖీదు అందింది.

ఈ తాఖీదు చూసేసరికి ఆశ్చర్యం కల్గింది. తనకు జబ్బూ గిబ్బూ యేంలేదు. చాలా ఆరోగ్యంగా వున్నాడు. తాను వైద్యపరీక్ష చేయించుకోవాలని ఎన్నడూ కోరనుగూడాలేదు.

ఉన్నట్లుండి ఈ గత్తరేమిటో అతనికి అర్థంకాలేదు. తనకేమన్నా చూపు మందగించిందనుకున్నారా? నరాలపటుత్వం తగ్గిందనుకున్నారా? శిక్షణ విమానాలను నడిపేటప్పుడు ఆ తెలివిమాలిన విద్యార్థి ఉదంతం ఒక్కటి మినహాయిస్తే ఎలాంటి పొరపాట్లూ జరగనేలేదే. అంతా సజావుగానే జరిగి పోయిందే. వాళ్ళేమని భావిస్తున్నారో అదీచూద్దాం, అనుకున్నాడు.

వెర్నర్ తనకందిన తాఖీదు పుచ్చుకుని, శిక్షణాశిబిరం వైద్యశాఖాధికారి ముందు హాజరయ్యాడు. అతడు నర్మగర్భంగా చిరునవ్వులు చిందిస్తూ వెర్నర్‌ను ఆహ్వానించాడు.

డాక్టర్ చాలాటైం తీసుకుని వెర్నర్‌ను సాంగోపాంగంగా పరీక్షించాడు. ఈ వైద్యుడు యింత జాగ్రత్తగా తన శరీరంలోని ప్రతిభాగాన్నీ ఎందుకు పరీక్షిస్తూ వున్నాడో వెర్నర్‌కు బోధపడలేదు. అంతా అగమ్యగోచరంగా వుంది.

"అంతా ఫెర్‌ఫెక్ట్‌గా వుంది లెఫ్టినెంట్. నీవు డ్యూటీకి అన్నివిధాలా తగివున్నావని నేను సర్టిఫై చేస్తూవున్నా. అదృష్టమంటే నీదే" అంటూ నవ్వాడు డాక్టరు.

"డ్యూటీనా... ఏమిటండీ ఆ డ్యూటీ?" వెర్నర్ ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నవింటూనే డాక్టరు మరోసారి పండ్లిగిలించాడు. అంతలోనే తన పెదాలకు అడ్డంగా వేలుంచుకున్నాడు. "నేనా విషయం నీకు చెప్పరాదు. కల్నల్ నీకు ఉత్తర్వుయిస్తాడు... ఇదిగో యిది తీసుకెళ్ళి కల్నల్‌కివ్వు" అంటూ ఒక సీలు చేసిన కవరును అతని చేతిలో పెట్టాడు.

"కానీ డాక్టరుగారూ? మనం యిద్దరం స్నేహితులం గదా! ఆ సంగతేదో నాకు అంతాగాక

పోయినా కొంచెం చెప్పొచ్చుగా''

''నో... నో... నో... చెప్పనేకూడదు. అయితే నీకు అప్పగించే కొత్త బాధ్యత కష్టమైనదిగా దనీ, ఆనందకరమైనదనీ మాత్రం చెప్పగల ను''

కొన్నిక్షణాల తరువాత వెర్నర్ తన కమాండింగ్ ఆఫీసరు ముందునిలబడి, శాల్యూట్‌చేసి, మెడికల్ ఆఫీసరు యిచ్చిన కవ రు అందించాడు. డాక్టరు పంపిన నివేదిక చదివి కల్నల్ చిరునవ్వులు చిందించాడు.

''శుభవార్త లెఫ్టినెంట్... నేను నిన్ను శలవులో పంపుతున్నాను''

''సెలవు తీసుకోడానికి నాకింకా గడువుంది కల్నల్''

''నాకు తెలుసు. కానీ యిది స్పెషల్‌లీవు. చాలా చాలా ప్రత్యేక తరహా లీవు. నీకేమైనా అభ్యంతరాలున్నాయా?''

''అభ్యంతరాలేమీ లేవుగానీ కల్నల్! ఇదంతా ఏమిటో నాకు తికమకగా వుంది''

కల్నల్‌కు మురికి హాస్యమంటే ఇష్టం. అలాంటివాడు ఈ విషయాన్ని సూటిగా, సక్ర మంగా చెప్పడానికి చాలా యిబ్బంది పడవ లసి వచ్చింది. తనకు సాధ్యమైనంత సర ళంగా అతగాడు లెఫ్టినెంట్‌కు అసలు విషయం చెప్పాడు. అతనిని బవేరియా పంపు తున్నారని చెప్పాడు.

''అవునోయ్ హీరో... ఓ అందాలరాశి, ఓ కుందనం బొమ్మ, అసూర్యంపశ్య, అనాఘ్రాతపు ష్పం నీకోసం అక్కడ ఎదురుచూస్తూ వుంటుంది. ఎందుకని అడగవేం? ఎందు కంటా? నిన్ను సంతోషపెట్టి, నీ వలపుదోచు కొని, నీకు కైపెక్కించి నీవల్ల బిడ్డను కనడానికి. అదృష్టమంటే అబ్బ నీదేనోయ్! అబ్బ... నీ వయసు నాకుంటేనా? నేను మరో ఇరవైయేళ్ళు చిన్నవాడినై వుంటేనా?'' అంటూ కల్నల్ లొట్ట లేసుకుంటున్నాడు.

ఇది విన్న లెఫ్టినెంట్ ఆశ్చర్యంలో మునిగిపో యాడు. ''ఇంతకూ ఆ అమ్మాయి ఎవరు కల్నల్?'' అని ప్రశ్నించాడు.

''ఎవరా? ఎవరంటే... ఏమో నాకేం తెల్సు? కానీ ఒక విషయం మాత్రం చెప్పగలను.. ఆ అమ్మాయి ఎవరో, ఏమోగానీ, అన్నివిధాలా సలక్షణమైన పిల్ల. ఆ అమ్మాయిని అన్ని పరీక్షలూ చేసినట్లు వాళ్ళు నాకు చెప్పారు. జర్మనీలోని అత్యంత ధైర్యసాహసాలుగల అందమైన యువసైనికాధికార్లతో జర్మనీలోని అద్భుత సౌందర్యరాసులైన కన్నెపిల్లలకు కడు పులు చేయించాలనేది మన సర్వసైన్యాధిపతి, మన నాయకుడు, మన ప్రభువు ఫ్యూరర్ పథకం. ఎలావుంది... అద్భుతంగా లేదూ''

ఇది వింటూనే వెర్నర్‌కు మతిబోయింది. కొద్దిసేపు తర్వాత మెల్లిగా అడిగాడు, ''కల్నల్ మీకు వచ్చిన ఉత్తర్వు నాపేరుతోనేవుందా?'' అని.

''అలాంటిదేమీలేదు... నా ఆధీనంలోని సైనికుల్లో బ్రహ్మాండమైన హీరోను, అత్యున్నత బిరుదులూ, పతకాలూ ఎక్కువగా పొందినవాణ్ణీ, ఇరవై అయిదు సంవత్సరాలలోపు వయ సుగల అందగాడు, దేహదార్ఢ్యంగలవాడూ, ప్రత్యేకించి నిర్ణయించినపనికి అన్నివిధాలా అర్హుడని డాక్టర్లచేత సర్టిఫై చేయబడినవాడూ నైన విశిష్టవ్యక్తిని ఎంపికచేయవలెనని నాకు పంపిన ఉత్తర్వులో వుంది.. ఇది చాలా చాలా ప్రత్యేక తరహా డ్యూటీగదా.. దీనికి సరిపడే అర్హతలన్నీ నీకే ఉన్నాయి. అందుకే, నీ రొట్టె విరిగి నేతిలో పడింది'' అంటూ కల్నల్ సంబ రపడిపోయాడు.

''కల్నల్ మీరేమనుకోకపోతే...''

''చెప్పునాయనా... మరేం అనుకోను. ఇంత సిగ్గయితే ఎట్లా!''.

''నేనిప్పుడే పెళ్ళి చేసుకోవాలనుకోవడంలేదు కల్నల్''

''అ హ్హ హ్హ.. పెళ్ళా?'' అంటూ కల్నల్ పైకప్పు ఎగిరిపోయేలా నవ్వాడు. ''పెళ్ళిచేసుకోవాలని ఎవరు చెప్పారయ్యా? నీకు అప్పగించిన డ్యూటీ ఎంతవరకంటే.. నీవు ఒక వారంరోజులు ఓ అందమైన అమ్మాయిని పక్కలో వేసుకుని పడుకోవడం, ఆ పిల్లకు కడుపు చేయడం! ఇదేమంత కష్టమైన డ్యూటీకాదుగా. కేవలం ఏడురాత్రుల ప్రేమ. బైదిబై... నీవు పెళ్ళిచేసుకోవాలనుకున్న నిశ్చిత వధువెవరైనా వుంటే ఆమెకీ విషయం నీవు చెప్పనేగూడదు. అలా చెప్పావనుకో! ఈ అందమైన, ఆహ్లాదకరమైన సాహసకార్యం నుండి




ఆమె నిన్ను వెనక్కులాగే ప్రమాదం వుంది బోధపడిందా?''

కల్నల్ మాటలతో వెర్నర్ చేష్టలుడిగిపోయాడు. అతని ముఖం గంభీరంగా మారిపోయింది. "నాకు నిశ్చిత వధువెవరూ లేరు కల్నల్. అయినా మీరు నా మీద దయ యుంచి ఈ పనికి నాకు బదులు మరెవర్నైనా పంపండి. మీ సైనిక దళంలో ధైర్యసాహసాలకు పేరుగన్నవాళ్ళు అనేకమంది ఉన్నారు. ఈ కార్యానికి ఎగిరి గంతేసే మనిషి మరొకరు మీకు సులభంగా దొరుకుతారు'' అంటూ బతిమిలాడు.

ఈ మాటలకు ఆశ్చర్యపోవడం ఈ దఫా కల్నల్ వంతైంది.

"ఈ చచ్చుపీనుగ నాకు తిప్పలు తెచ్చేటట్టున్నాడు'' అని గొణుక్కున్నాడు కల్నల్. అంతలోనే సర్దుకుని, "నా నిర్ణయం జరిగిపోయింది. నువ్వు బవేరియా వెళ్ళి తీరాల్సిందే. నీవు వెళ్ళనని మొరాయించడానికి కారణమేమిటో అర్థం కావడంలేదు. అసలు నీ కారణాలతో నాకు పనిలేదు. యువసైనికాధికారుల్లో ఎక్కువ పతకాలు గెల్చుకున్నవాడివి నువ్వే. నా డ్యూటీ ముగిసింది. ఇక నీ డ్యూటీ నువ్వు చెయ్యాలి. నిన్ను ఇక్కడున్నట్లుగా వెంటనే బండెక్కించడమే నా ఆర్డర్. సాయంత్రం నీవు బవేరియాకు బండెక్కుతున్నావు'' ఖండితంగా చెప్పాడు కల్నల్.

వెర్నర్ ఇంకా తప్పించుకోవాలనే చూస్తున్నాడు. అందుకే చాలా ఇబ్బందిగా ముఖంపెట్టి విన్నవించుకోసాగాడు. "కల్నల్... ఈ డ్యూటీకి నాకు అర్హత వుందని డాక్టరు చెప్పడం చాలా పొరపాటు. ఆయన ఆవిధంగా ప్రకటించే ముందు నేను ఆయనకొక విషయం చెప్పకుండా దాచాను''.

"ఏమిటి... నీవేం దాచావ్? ఏవైనా గుప్తరోగాలున్నాయా? నీకు వంశపారంపర్యంగా ఏదైనా లోపం వుందా?''

"లేదు కల్నల్... అలాంటిదేమీ లేదు. కానీ..''

"కానీ.. కానీ.. ఏమిటి నా బొంద. అదేదో త్వరగా ఏడ్వు''

"నేను ఎన్నడూ స్త్రీతో పడుకోలేదు'' అంటూ నీళ్ళు నమిలాడు హార్స్.

ఈమాట వింటూనే కల్నల్ పగలబడినవ్వాడు. "చంపావయ్యా! 'నాఉంవుడుగత్తెల్లో ఒకటి అసూర్యంపశ్య, అనాఘ్రాత పుష్పం' అని ఎవరన్నా చెప్పివుంటే అర్థంచేసుకుని ఉండేవాణ్ని. నువ్వేమిటి? ఆడదాని ముఖమే ఎరగనంటున్నావ్... సరే ఈ సైన్యంలో ఏదైనా జరగవచ్చు'' అంటూ నవ్వు ఆపాడు.

కాసేపాగి "నిన్ను చూస్తే నాకు గర్వం! నువ్వంటే ఎంత ఇష్టమనుకున్నావ్? ముందేమి జరుగుతుందోనని నీవు కలవరపడుతున్నావ్. శోభనపు పెళ్ళికూతురివి నువ్వే అయినట్లు సిగ్గుపడుతున్నావ్. అసలు శోభనపు పెళ్ళికూతురు ఎలావుంటుందో తెలుసానీకు? ఏమి జరుగుతుందోననే భయం, అదేదో జరగాలనే కోరిక, సిగ్గు, బిడియం, ఆతురత, కాంక్ష -వీటన్నిటితో కొట్టుమిట్టాడుతూ ఉంటుంది. ఎదురుచూస్తున్న ఆక్షణం గడిచిపోయి, ఆకాస్త మాధుర్యం రుచి చూసిందా! ఇక జూదు నాసామి రంగా! అదే రుచి, అదే అనుభవం యింకాయింకా కావాలని ఆరాటపడిపోతుంది. నీవూ అంతే.. మొదటిసారి కాబట్టి ఇలా మొఖమాటపడుతున్నావ్. కానీ ఈ కాస్త అయిపోతే, మళ్ళీ నా ఛాన్సు ఎప్పుడు వస్తుందాని తపనపడిపోవూ?''

"మళ్ళీ ఛాన్సా... అంటే ఇలాంటిది మళ్ళీ మళ్ళీ వుంటూనే ఉంటుందా?''

"ఉంటుందనే అనుకుంటాను... మన సర్వసైన్యాధిపతి ఈ పునఃసృష్టి కార్యక్రమ ఫలితాలతో సంతృప్తిపడితే, ఈ పుత్రకామేష్ఠి నిరంతరాయంగా, నిత్యకళ్యాణంగా జరుగుతూనే వుంటుంది. ఇప్పటికే బవేరియాలో ఓ వందమందైనా వుంటారు అప్సరసలు. నీ పెట్టాబేడా సర్దుకుని నీ మిత్రులందరికీ వీడ్కోలు చెప్పు. సిగ్గుపడకు. అసలు సిగ్గుపడటానికి యిందులో ఏముందోయ్! నిన్ను అక్కడికి పంపుతూ వున్న డ్యూటీ స్వరూప, స్వభావమేమిటో నాకూ, మెడికల్ ఆఫీసరుకూ తప్ప మరొకరికి తెలియదు. సంతోషంగా వెళ్ళు. అందినంత ఆనందం జుర్రుకో. పుత్రదానం చేసి, విజయుడవై తిరిగిరా'' అంటూ ఆశీర్వదించి మరీ సాగనంపాడు వెర్నర్‌ను.

'సెయింట్-మాలో' అనేది మహామురికిగా వుండే సముద్రపురేవు. ఇక్కడ చీకటి రాజ్యం

చేస్తుంది. వెలుగన్నది లేకుండా ఎప్పుడూ చెమ్మగా వుంటుంది. దీనికి మించిన దుర్గంధ భూయిష్టమైన ప్రాంతం 'ప్లేన్-ఒ-లా-పాష నారా'. ఈ ప్రాంతానికి వెళ్ళే దిగుడుబాటలో వడివడిగా అడుగులేసుకుంటూ వెడుతున్నాడు సార్జెంట్ ఒట్టోవార్‌వూఫ్. ఈ మహామురికి ప్రాంతం ఈ సార్జెంట్‌కు ప్రపంచంలోనే అత్యంత సుందరమైన ప్రదేశంగా కనిపిస్తుంది. అతనెప్పుడూ ఉల్లాసంగా నవ్వుతూ, పేలుతూ వుంటాడు. తాను జయించిన ఈ ప్రాంతంలోని ప్రజలపట్ల అతడు చాలా సౌమ్యంగా ప్రవర్తిస్తూ వుంటాడు.

మార్కెట్ వెనుకనున్న చీకటి గొందిలో ఓ బ్రాంది షాపు ఉంది. ఆ బ్రాందీ షాపును ఓ ఆడకూతురు నడుపుతూ వుంది. యుద్ధానికి ముందు ఈ బార్‌కు చేపలుపట్టే బెస్తవాళ్ళు, నావికులు ఎక్కువగా వచ్చేవాళ్ళు. వాళ్ళు పీక మొయ్యా తాగి, వళ్ళు తెలియకుండా చిందులేసేటప్పుడు మానసికోల్లాసానికీ, సరసానికీ ఓ ఆడది కావాలి. అందుకే ఈ బార్‌ను నడిపే ఆవిడ, తన ఖాతాదార్ల మురికి జోకులకు తట్టుకుని వారిని అన్నివిధాలా ఉల్లాసపరిచే ఓ ఆడదాన్ని మందు పొయ్యడానికి పెట్టుకుంది.

తమ మాతృదేశాన్ని ఆక్రమించుకున్న జర్మన్ సైనికులంటే సెయింట్-మాలో జనానికి అసహ్యం. అలాగే బార్ నడిపే వీరవనితకు గూడా వీళ్ళంటే పరమరోత. అయినా అందరి లాగే ఆమెకూ డబ్బుకావాలి. ఈ యుద్ధంవల్ల జర్మనీ సైనిక నాయకత్వం స్థానికంగా వున్న మత్స్యకారులపై అనేక ఆంక్షలు పెట్టింది. దాంతో వాళ్ళకు బతుకు దుర్భరమైపోయింది. రెండుపూటలా పొయ్యిలో పిల్లిని లేపడమే కష్టమైన వాళ్ళకు తాగితందనాలాడటానికి డబ్బెక్కడ వుంటుంది? అలాగే నావికులకు గూడా కష్టకాలమొచ్చింది. వాళ్ళ జేబులు కూడా ఖాళీ అయ్యాయి.

ఇక సైనికులే ఈ బార్‌కు కొత్త కష్టమర్లు. వీళ్ళందరిలో ఆమెపట్ల కాస్త మంచిగా, ఉదారంగా వుండేవాడు ఈ సార్జెంట్ ఒక్కడే. అతడు మందు అంటే ఎంత లొట్టలేసుకుంటాడో, ఆ మందుపోసే పిల్ల జూలీ అంటే అంతకన్నా ఎక్కువ లొట్టలేస్తాడు. ఆ పిల్ల వీడికంటికి ఘాంచి జున్నుముక్కలా కనిపిస్తుంది. మందు భాయిలంతా ఆ పిల్ల చెయ్యిపట్టుకొని, వళ్ళు నిమిరి, బుగ్గలమీద, రొమ్ములమీద చిటికెలేసి లొట్టలేసి ఆనందిస్తూ వుంటే ఆ పిల్లగూడా వెకిలిగా నవ్వుతూ వీళ్ళను వెర్రెక్కించేది. దాంతో ఆ మందుభాయిలు ఆనందపారవశ్యంతో మరింతగా మందుకొట్టేవారు. జర్మన్లు రాకముందు ఆ పిల్లను నావికులు వాడుకునే వాళ్ళు. ఇప్పుడా పిల్ల జర్మన్‌సైనికుల పరమైంది. ఇలా వాడవదినగా బతికే ఆ పిల్ల వీధిన వెడుతూ వుంటే అందరూ 'బజారు స్త్రీ' అని ఈసడించేవాళ్ళు.

జూలీకి చదువూ సంధ్యా లేదు. అలాని మూర్ఖురాలేంగాదు. యుద్ధానికి పూర్వం యింగ్లీష నావికులతో సంపర్కంవల్ల నాలుగు 'బొట్లేరు ముక్కలు' నేర్చుకుంది. యుద్ధం తర్వాత జర్మనీ సైనికులతో సాంగత్యంవల్ల చాలా జర్మన్‌పదాలు నేర్చుకుంది. వచ్చీరాకుండా మాట్లాడినా ఆ నాలుగు ముక్కలు చాలు సార్జెంట్‌వార్‌వూఫ్‌తో తనపని గడిచిపోడానికి. సరిగ్గా రాకపోయినా తన మాతృభాషలో మాట్లాడే ఆడది దొరికినందుకు సార్జెంట్ సంబరపడిపోతాడు. అందుకే అతగాడు జూలీ అంటే పడిచస్తాడు.

వార్‌వూఫ్ వెళ్ళే సమయానికి ఆ చిన్న బ్రాందీషాపులో తాగేవాళ్ళెవరూ లేరు. లాఫొన్నెల్ మాత్రం కూర్చుని ఏదో అల్లుకుంటూనో, కుట్టుకుంటూనో వుంది. జూలీ అక్కడ కనిపించలా.

పెద్దమ్మా... జూలీ లేదా?'' అని అడిగాడు సార్జెంట్.

''బజారుకెళ్ళింది- ఏవో కొనుక్కోడానికి. ఎంతోసేపు పట్టదు త్వరగానే రావచ్చు. ఓ క్షణం ఓపికపట్టు. ఇంతకూ ఏంతాగుతావ్?'

''అదే... నారోజువారీ సరుకు రెండు గ్లాసులు''

ముసలమ్మ మద్యంసీసా గ్లాసులు తెచ్చి బల్లమీద పెట్టింది.

మరోక్షణంలోనే జూలీ వచ్చింది. ఏదో బుట్ట చేతిలో వుంది. గజంన్నర ఛాతీతో ఆమె నడిచి వస్తూవుంటే వీధిగుమ్మానికి సరిగ్గా సరిపోయింది. సార్జెంట్‌ను చూస్తూనే ఆమె ఆనందానికి పట్టపగ్గాలు లేవు. నావికులు తొడుక్కునే





చారల చారల జెర్సీ వెనుకదాగివున్న విశాలమైన ఆమె వక్షం ఎగిరెగిరిపడింది. ఒకప్పుడు ఒంకులొంకులు తిప్పిన నిడుపాటి ఆమె కురుల్లో చివరి అవశేషాలు స్పష్టంగా గోచరిస్తూవున్నాయి. దట్టమైన కనుబొమల కిందనుండి తీక్షణమైన కనుదోయి మిలమిలా మెరుస్తూ వుంది. రంగద్దిన ఆమె పెదాలు ఓరగా నవ్వుతూ వున్నాయి. ధరించిన చిన్నస్కర్ట్ కింద ఆమెకాళ్ళు మోకాళ్ళదాకా అనాచ్ఛాదితంగా కనిపిస్తూ వున్నాయి. ఆమె రాసుకున్న చౌకబారు సెంటు ఆడవాసనతో కలిసి వింతవాసన వెదజల్లుతూ వుంది.

"ఓ...నువ్వా- ఈ సాయంత్రం నువ్వు రావనుకున్నానే" అంది సార్జెంటును చూసి జర్మనీ భాషలో.

"నాకో వార్తొచ్చింది... ఇలా కూర్చో" అంటూ అతగాడు జూలీ దగ్గరకు చేరి ఆమె భుజాలు రెండూ పొదివిపట్టుకున్నాడు.

"ఇంత ఆత్రమైతే ఎట్లా... సరుకులబుట్ట దించేవరకైనా ఆగలేవా?" అంటూ కోప్పడింది బ్రాందీషాపు యజమానురాలు.

ఈ మాటలకు పకపక నవ్వుతూ "సరే... అలాగేలే. ముందు మాయిద్దరికీ తింటానికి ఏదన్నా ఏర్పాటు చెయ్! చాలా ఆకలిగా వుంది" అని ముసలామెతో చెప్పాడు సార్జెంట్.

సార్జెంట్ మాటలకు ముసలమ్మ భుజాలెగరేసింది. "తింటానికా... ఏం పెట్టమంటావు? ఈ కాలంలో రేషన్‌కార్డులమీద మాకు ఏమిస్తున్నారని" అంటూ గలగలలాడింది.

"ఒక కోడి. వేయించిన బంగాళాదుంపలు. బంగళాదుంపలు కొల్లలుగా వున్నాయిగా. తరువాత ఓ సీసా మాంఛి మద్యం. భయపడకు! వీటన్నిటికీ కలిపి డబ్బు దండిగా యిస్తాలే. అయితే జూలీగూడా నాతోటే భోంచేస్తుంది. ఈ రాత్రికి జూలీ నీవనిమనిషిగాదు కష్టమర్"

ముసల్ది యింకా చిర్రుబుర్రులాడుతూనే వుంది. కానీ రెట్టింపు లాభమైనా ఈ తలమాసినోడిదగ్గర లాగొచ్చు. ఈ ఆలోచనతో, ఆశతో ఆమె సరకులు దాచిన వెనుకగదిలోకి వెళ్ళింది.

జూలీ సార్జెంట్ వంక విచిత్రంగా చూస్తూ అడిగింది "ఈరోజు ఏమైంది నీకు? ఎవరైనా చచ్చారా? చచ్చినోళ్ళ డబ్బు నీకేమైనా దండిగా ముట్టిందా?"-

"అదేంగాదులే దానికంటే గొప్పదే జరిగింది. నేను సెలవుమీద వెళ్తున్నాను. ఈ రాత్రి మన వీడ్కోలు విందు" అని హుషారుగా చెప్పాడు సార్జెంట్.

"సెలవులో వెళుతున్నట్లు నాకెప్పుడూ మాటవరసకైనా చెప్పలేదే?"

"నాకు తెలిస్తేగా నీకు చెప్పడానికి! మరో మూణ్ణెల్లదాకా నాకు సెలవుదొరికే అవకాశమే లేదు. కానీ, రేపే నేను సెలవులో వెళ్ళాలని నాకివ్వాళే చెప్పారు. ఈ సెలవు ఒక బహుమతిలాంటిదనుకో"

"బహుమతా... ఇప్పుడు నీవేమంత గొప్పపనిచేశావని?"- అంటూ అవహేళనంగా నవ్వింది జూలీ.

దాంతో సార్జెంట్‌కు రోషం ముంచుకొచ్చింది: "ఏమన్నావ్?" అంటూ తన ఎదురు రొమ్మున వేలాడుతూన్న పతకాల పటకాను లాగి జూలీ ముఖాన విసిరాడు. ఆ పటకా నిండా పతకాలు అమర్చివున్నాయి. జూలీని ఓరగంట చూస్తూ "ఇవన్నీ ఏమిటనుకున్నావ్?" అని ప్రశ్నించాడు.

"ఇవన్నీ ఈరోజే సంపాదించినవికావుగా" అంటూ జూలీ ముసిముసిగా నవ్వింది.

"కాకపోవచ్చు... ఇవన్నీ లెక్కకు రావనుకున్నావా? అందుకే నేను బ్రహ్మాండమైన ఛాన్సు కొట్టేశాను. వాళ్ళు నాకు ఛార్జీలుగూడా లేకుండా ఉచిత ప్రయాణం కల్పించారు"

"వెళ్ళేది ఇంటికేనా?"

"ఇంటికికాదుగానీ, నేను జర్మనీ వెళ్తున్నాను. అబ్బ... ఎంత అందమైన ప్రదేశం. నిజంగా సైనికుల స్వర్గం; అందమైన అమ్మాయిలతో నిండిన భూలోక స్వర్గం" అంటూ సార్జెంట్ లొట్టలేసుకుంటున్నాడు.

ఈ మాటలు విన్న జూలీ భుజాలెగరేసింది: "అందమైన అమ్మాయిలు ఎక్కడబడితే అక్కడే వున్నారు" అంటూ.

"ఇట్టాంటి సరుకనుకున్నావా? ఇక్కడి అమ్మాయిలు సైనికులకు కారుచౌకగా దొరికేవాళ్ళు. అక్కడి అమ్మాయిలు సాహసంలో విక్ర

మార్కులనిపించుకున్న వీరసైనికులకోసం ఎంపికచేసి ఏరుకొచ్చినవాళ్ళు. అందానికి అందం, వయసుకు వయసు! కన్నుచెదిరే అందం'' అంటూ సార్జెంట్ ఊహాలోకాల్లో తేలి పోతూ వున్నాడు.

''ఆ అందగత్తెలు నీ అంత అందంగా వుంటారా?''- అంటూ జూలీ మేలమాడింది.

''అవును... నా అంత అందంగానే వుంటారు. నేనేం అందగాణ్ణి గాదనుకున్నావా?'' అంటూ సార్జెంట్ రుసరుసలాడుతూ జూలీకి దూరంగా జరిగాడు.

''అరె... ఉన్నట్లుండి ఇదేమిటి? నేనేం తప్పుచేశాను? నేను నీకు నచ్చలేదా ఏంటి?'' అంటూ జూలీ ప్రశ్నించింది. ''ఎప్పుడో ఎక్కడో దొరుకుతారనుకునే అమ్మాయిలను తలచుకుని యిప్పుడే మతిపోగొట్టుకోకు''- అంటూ గోముగా తన రెండుచేతులనూ అతని మెడచుట్టూ వేసింది. ''నువ్ ఎంత అందంగా వుంటావో తెలుసా? అందుకే నీవంటే నేను వడిచచ్చేది. ఆ సంగతి నీకూ తెలుసు. కానీ అక్కడున్న అందగత్తెలు నా అంత యిదిగావచ్చి నీవళ్ళో వాల్తారా?'' అంటూ గారాలుపోయింది.

''వాళ్ళక్కడుంది ఎందుకోసం అనుకుంటున్నావ్... అందుకోసమే. మేము అడగడమే ఆలశ్యం! ఆ అమ్మాయిలు ఎగిరివక్కలోకి రావాల్సిందేతప్ప కాదంటానికే వీల్లేదు''

''అంటే వేశ్యల కొంపలలోలాగానా?''- అంటూ జూలీ రెక్కించింది.

''ఏమన్నావ్? వాళ్ళు పడుపుగత్తెలుకారు. ఎవరిమీదనంటే వాడిమీద పడిదొర్లే మోటు మనుమలు గారు. వాళ్ళను అనుభవించి నందుకు ఒక్కపైసాగూడా యివ్వనక్కర్లేదు. వాళ్ళతో మేము పడుకుంటాం, వాళ్ళను అనుభవిస్తాం. అది మాకిచ్చిన ఆర్డరు. ఇక మా వక్కలో పడుకుంటే ఆ అప్సరసల కర్తవ్యమేమంటే జనాభాను పెంచడం. అదీ మాంఛి జాతిగుర్రాల్లాంటి జనాభాను పెంచడం. మా కర్తవ్యం ఆ అప్సరసలందరికీ పిల్లల్ని పుట్టించడం. ఇది చాలా గొప్ప ఐడియాగదూ'' సార్జెంట్ ఉల్లాసంగా చెబుతున్నాడు.

ఈ మాటలతో జూలీ కన్నులు విప్పారాయి. ''ఇది ఎవరి ఐడియా మహానుభావా? ఆ అమ్మాయిల తల్లిదండ్రులదా?'' అంటూ ప్రశ్నించింది.

''కాదు... ఇది హైకమాండ్ ఐడియా'' అంటూ గొంతు తగ్గించి రహస్యం చెబుతున్నట్లుగా చెప్పాడు.

''ఏమిటీ... హైకమాండ్ ఐడియానా? మీ హైకమాండ్ చాలా గమ్మత్తయిన విషయాలను ఆలోచిస్తుందే'' అంటూ జూలీ వగలబడి నవ్వసాగింది.

నవ్వుతూవున్న ఆమె పెదవులను సార్జెంట్ బలంగా చేత్తో మూశాడు: ''ఇక ఆపు నీ వెకిలినవ్వు. మా హైకమాండ్‌కు మీ ఫ్రెంచివాళ్ళ విమర్శ, ప్రశంసా అవసరంలేదు. నీ చచ్చు వ్యాపారం నువ్ చూసుకో'' అంటూ గద్దించాడు.

జూలీ నవ్వు ఆగిపోయింది. సార్జెంట్ మాటలతో జూలీ ముఖం మాడ్చుకుని నిశ్శబ్దంగా వుండిపోయింది. బ్రాందీషాపు యజమానురాలు వాళ్ళకు తిండీ, మద్యమూ తీసుకొని ఆ గదిలోకి వచ్చినప్పుడుగూడా జూలీ ముభావంగా చిరచిరలాడుతూ వుంది.

తిండి ముగించేవరకుగూడా జూలీ పెదవి విప్పి అతనితో ఒక్కమాటగూడా మాట్లాడలేదు. ముభావంగానే తిండి ముగించింది. బిల్లు కోసం ముసల్ది ఆ గదిలోకి వస్తూనే సార్జెంట్ హుషారుగా బిల్లుతోపాటు టిప్పుగూడా ఎక్కువే యిచ్చాడు.

''జూలీని నావెంట తీసుకెళుతున్నానవ్వా'' అని చెప్పాడు.

ఆ జంట బ్రాందీషాపు వదలి బయటకు వచ్చేసరికి రేవురేవంతా చీకటి కమ్మివుంది. రక్షణ ప్రాకారం మీదికి వెళ్ళేందుకు వాళ్ళు మెట్లెక్కుతూ వున్నారు. ప్రశాంత సముద్రం పెద్దఎడారిలా కనిపిస్తూవుంది. సముద్రజలంమీద పరచుకొన్న వెన్నెల వెండివెలుగులా భాసిస్తూవుంటే, దీపాలులేని నగరం మృతనగరంలా అనిపిస్తూవుంది. పురాతనమైన సెయింట్- మాలో కోటగోడలపైన జర్మన్‌సెంట్రీలు గస్తీతిరుగుతున్నారు. ఆ జర్మన్ సైనికుల బలమైన బూట్లు ఆ పురాతన కోటగోడ రాళ్ళపై లయబద్ధంగా టకటకలాడుతూ వున్నాయి.





జూలీ ఇంకా ముఖం మాడ్చుకుని ముభావంగానే వుంది. ఆమె ఆలోచనలన్నీ భవిష్యత్తుమీద కేంద్రీకృతమయ్యాయి. తన పక్కనున్న ఈ సార్జెంట్ రేపు అతని దేశంవెళ్ళి జరపబోయే రతిక్రీడల గురించి ఈర్ష్యతో ఆలోచిస్తూవుంది. అయితే సార్జెంట్ ఆలోచనలు మాత్రం దానికి భిన్నంగా వర్తమానంలో తిరుగాడుతూవున్నాయి. అతను ప్రేమగా జూలీని దగ్గరకు అదుముకున్నాడు మంచి తిండి, మద్యంలో హుషారెక్కిన అతని మనసు గడిచిందంతా మరిచిపోయి, జూలీతో సరాగానికి సిద్ధంగా వుంది.

"జూలీ... నీకు విషయమంతా చెప్పనేలేదు గదూ! నేనేదో ఆషామాషీగా మాదేశం వెళ్ళడంలేదు. మా సైన్యాధిపతులు మాదేశానికి గొప్పసంతానం కావాలనుకుంటూ వున్నారు. అందుకు అందమైన యువతులు, బలమైన యువకులు అవసరం. అందుకేవాళ్ళు జర్మనీ మొత్తం గాలించి అందమైన, ఆరోగ్యవంతులైన అమ్మాయిలను పోగుచేస్తూవున్నారు. అలాగే బలిష్టులైన సైనికులను కూడా. పిరికిబారని నాలాంటి వీరసైనికులను ఆ అమ్మాయిల ప్రేమికులుగా ఎంపిక చేస్తూ వున్నారు".

"అక్కడి అమ్మాయిలు మిమ్మల్ని పెళ్లి చేసుకుంటారా?" జూలీలో ఈర్ష్య మాత్రమే లేదు. ఎప్పుడడిగితే అప్పుడు తనకు అడిగినంత డబ్బిచ్చే ఒక ప్రియుణ్ని పోగొట్టుకుంటున్నానే అనేబాధ ఆమె మాటల్లో వ్యక్తమౌతూ వుంది.

"పెళ్లా?" అంటూ సార్జెంట్ ఛీత్కరించాడు. "అవునవును... ఒకవారంవుండే పిల్లను పెళ్లి చేసుకుంటున్నాను. ఆ పిల్లకు కడుపైన వెంటనే వాళ్ళు నన్ను దూరంగా తరిమేస్తారు" అని నవ్వసాగాడు.

"తిరిగి యిక్కడికి పంపుతారా" జూలీ ప్రశ్నించింది.

"అవుననే అనుకుంటాను. ఇక్కడ నాకు ఎంతో బాగుంది. సెయింట్-మాలో అంటే నాకు ఎంతో యిష్టం. నువ్వున్నాగూడా" అంటూ సార్జెంట్ జూలీని గట్టిగా ముద్దుపెట్టుకుని, "ఇక వెళ్లాంపద. ఇదే మనమిద్దరం కలిసివుండే ఆఖరురాత్రి. ఒక్కనిమిషంకూడా వృధాకానివ్వడం నాకు యిష్టంలేదు" అంటూ జూలీని పొదివిపట్టుకున్నాడు.

"అలాగేపద" అంటూ జూలీ కదిలింది.

ఈ రక్షణ ప్రాకారానికి వెనుకనే జూలీ స్నేహితురాలు నివసిస్తూవుంది. ఈ ప్రేమికులిద్దరూ తరచు ఆమెగదిని వాడుకుంటూ వుంటారు. జూలీ ఆ గదికి దారితీసింది.

ఆ గది చేరేందుకు ఇరుకైన సన్నని మెట్లు ఎక్కుతూవుంటే సార్జెంట్ బూట్లు శబ్దంచేస్తూవున్నాయి. "ఉష్... బూట్లు టకటకలాడించకు నిశ్శబ్దంగా ఎక్కు" అంటూ జూలీ హెచ్చరించింది.

జూలీ ఆ గదిలోనికెళ్ళి ముసిముసిగా నవ్వినంతనే, ఆ నేస్తురాలు కూడా జూలీ నవ్వుతో శృతికలిపి, తన గదిని ఆ ప్రేమికులకు వదలివేసి బయటికి నడిచింది.

జూలీ వెంటనే తన బట్టలన్నీలాగేసి, సార్జెంట్ముందు నగ్నంగా నిలిచి, తన రొమ్ములతో సార్జెంట్ ఛాతీని బలంగా ఢీకొట్టింది. "ఇదుగో చూడు.. నాదగ్గరలేనివేవో, అదనంగా అక్కడ నీవనుభవించబోయే ప్రియురాలిదగ్గర వున్నాయనుకుంటున్నావా?" అంటూ ప్రశ్నించింది.

"అక్కడున్నవాటిసంగతి తర్వాత. ఇప్పుడు యిక్కడున్నవాటి వరస చూద్దాం" అంటూ ఆర్జెంట్ ఆకలిగొన్నమృగంలా జూలీమీదపడ్డాడు.

అలసిపోయిన సార్జెంట్కాస్త విశ్రాంతిగా వుంటుందని మంచంమీదినుండి లేచి కిటికీదగ్గరకు వెళ్ళాడు. తామున్నది ఐదంతస్తుల భవనం. దాని కిటికీదగ్గర నిలబడితే పురాతన కోటగోడమీద సెంట్రీలు గస్తీతిరిగేదారికి సమంగా కనిపిస్తూవుంది. సార్జెంట్ కిటికీలోనుంచి బయటకు చూస్తే ఎదురుగా సెంట్రీబాక్సు కనిపిస్తూవుంది. దాని ప్రక్కనే ఒక సైనికుడు పిట్టగోడకు చేరగిలబడి, చేతుల్లో తల పెట్టుకుని నిద్రపోతూవున్నాడు.

అదిచూసిన సార్జెంట్ ఆగ్రహం వట్టలేకపోయాడు. "దొంగరాస్కెల్" అంటూ వండ్లు పటపటలాడిస్తూ గర్జించాడు.

ఈ అరుపులకు జూలీ పక్కమీద లేచికూర్చుని కళ్లు నులుముకోసాగింది.

"నీకేమైంది... ఏ దయ్యంపట్టింది? ఎక్కడి కెళుతున్నావ్?"- అని ప్రశ్నించింది.

సార్జెంట్ ఈ ప్రశ్నలకు బదులివ్వలేదుసరి గదా, హడావుడిగా ప్యాంటు తొడుక్కుని, దాదాపు గెంతినట్లుగా బూట్లలో కాళ్ళు దూర్చాడు.

"ఏంజరిగింది? వాళ్ళు దిగుతున్నారా?" అంటూ గాభరాగా అడిగింది జూలీ.

ఒక్కమాటగూడా సమాధానం చెప్పకుండా సార్జెంట్ గదిలోనుండి బయటపడి గబగబా మెట్లు దిగుతూవున్నాడు.

ఎలాంటి సద్దుచేయకుండా పిల్లిలా, అడుగులో అడుగులేస్తూ దుర్గప్రాకారాం వెనుకవైపుగా ఎక్కసాగాడు. నెమ్మదిగా, దొంగలా ప్రాకి నిద్రలో జోగుతూన్న సెంట్రీకి వెనుకపక్కగా పైకెక్కి అతనివీపుమీద బలంగా ఒక్కతన్ను తన్నాడు.

ఆ తన్నుకు ులుంగలు చుట్టుకుపోయిన సెంట్రీ వెంటనే తుపాకీ అందుకున్నాడు. సార్జెంట్‌ను గమనించి శాల్యూట్ కొట్టాడు.

"నిద్రమొహంపందీ" అంటూ గర్జించాడు సార్జెంట్. "ఈరోజు నీ అదృష్టం బాగుంది నేనుగాబట్టి సరిపోయింది. మరొకరైతే నిన్ను కోర్టుమార్షల్‌చేసి వుందురు" అంటూ నాలుగు మిలిటరీ బూతులు తిట్టాడు.

భయంతో వణికిపోతున్న సెంట్రీ క్షమాపణలు చెప్పుకుంటున్నాడు.

సార్జెంట్ అవేమీ వినకుండా మరోసారి బూటుకాలెత్తి సెంట్రీని బలంగా తన్నాడు.

"తొత్తుకొడకా... ఇకనుండైనా డ్యూటీ సక్రమంగా చెయ్, సముద్రాన్ని జాగ్రత్తగా కాపలా కాయి. నీ వెనుక యేం జరుగుతోందోగూడా కళ్లు తెరిచి చూసుకో. లేదా ఇప్పట్లా తన్నులుగాదు. ఏ శత్రువో వచ్చి కత్తి నీ వీపులో దించేస్తాడు. ఇక నువ్వు నీ చౌకీ దగ్గరకెళ్ళు" ఫో! అంటూ గర్జించాడు.

జూలీ గదిలో కిటికీ వద్ద నిలుచుని ఇదంతా చూస్తూ వుంది. మొదట్లో ఆమెకు ఇదంతా వినోదంగా వుంది. కానీ సెంట్రీని సార్జెంట్ రెండో తన్ను తన్నేసరికి ఆమెకు చాలా కోపం వచ్చింది. ఆమెకు అంతకోపం తెప్పించింది సార్జెంటు పశుప్రవృత్తా లేక సెంట్రీ బానిస బుద్ధా! అనేది చెప్పలేం.

సార్జెంట్ చెయ్యాదలచుకున్నదంతా చేసి తిరిగి జూలీ గదికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే జూలీ అంది. "అదేగనుక నీవు మా ఫ్రెంచి సైనికుణ్ణి తన్నివుంటే వాడు నిన్నీపాటికి పచ్చడి పచ్చడి కింద నలగ్గొట్టి సారాయిలో నంజుకు తినివుండేవాడు"

"యుద్ధం అంటే ఇదేనే పిల్లా" అంటూ సార్జెంట్ గర్వంగా నవ్వాడు. "మేము జర్మన్లం, క్రమశిక్షణగలవాళ్లం గాబట్టి ఇక్కడ ఫ్రాన్సులో విజేతలుగా వుంటున్నాం. నీలాంటివాళ్లకు టెంపరరీ మొగుళ్ళం అవుతున్నాం" అంటూ సార్జెంట్ అతిశయంగా భుజాలెగురవేశాడు.



ఓడర్ నది ఒడ్డు వెంట వున్న రోడ్డుపై ఒక కారు అమితవేగంగా పరుగెడుతూ వుంది. ఓడర్‌నది బీరు రంగులో కనిపిస్తూవుంది. పైన ఆకాశంలో దట్టంగా మబ్బులు పట్టి ఏ క్షణంలోనైనా వర్షించడానికి సిద్ధంగా వున్నాయి. ఆ

కారు రెండు ఫర్లాంగులదూరం వెళ్లిందో లేదో చటుక్కున ఆగిపోయింది. డ్రైవరు స్టార్టు చేస్తే బుర్రుమని శబ్దమే తప్ప ముందుకు మాత్రం ససేమీ కదలనని మొరాయిస్తూవుంది.

డ్రయివరు కారుదిగి, బాయినెట్ ఎత్తి కారుకు ఏం జరిగిందో చూస్తూవున్నాడు. లోపల ఇంజనులో ఏదో కలబెడుతూ, అతుకుతూ వుంటే, "ఏమైంది?" అని అడిగాడు డాక్టర్.

డ్రయివరు అతనికేమీ సమాధానం చెప్పకుండా కారు బాగుచేసుకుంటున్నాడు.

"ఇలా అయితే మనం సకాలంలో డిన్నరుకు అందుకోలేం" అన్నాడు కల్నల్.

"ఈ రాత్రికి అక్కడకు జేరితే అదృష్టవంతులమే. ఈ కారు బాగుపడాలంటే మెకానిక్ రావాలి" అని చెప్పాడు డ్రయివరు.

కల్నల్ తాము ఉన్నచోటు వరకాయించి చూశాడు. చుట్టూ కనుచూపు ఆనినంతమేర ఎర్రని ధూసర వర్ణంతో పొలాలు వరచుకొని ఉన్నాయి. "ఈ రాత్రి గడిపేందుకు అనువైన చోటే కనపడ్డంలేదు. కనుచూపు మేర ఎక్కడైనా ఒక్క ఇల్లయినా పొడగట్టడంలేదు" అంటూ గొణుక్కున్నాడు కల్నల్.

కారులో ఉన్న డాక్టరు మాత్రం ఈ ప్రాంతం పటంతీసి, ముందు వరచుకొని చూస్తూ, "ఈ దగ్గర్లోవున్న గ్రామానికి వెళ్ళాలంటే మరో ఐదు కిలోమీటర్లన్నా నడవాలి" అని చెప్పాడు.

"సరే... మన డ్రైవరు వెళ్లి ఎవర్నయినా మెకానిక్‌ను పట్టుకొస్తాడులే" అన్నాడు కల్నల్.

ఈలోగా డ్రయివరు కదలని కారును దారిపక్కకు నెట్టాడు. ఇద్దరు అధికారులూ కారు దిగి నడకసాగించారు.

"అమ్మాయిలను రిక్రూట్ చెయ్యడానికి ఈ దరిద్రపుగొట్టు పల్లెప్రాంతానికి ఎందుకొచ్చామో నాకు ఆశ్చర్యంగా వుంది. సభ్యత, సంస్కారం గలవాళ్లు బస్తీల్లో కొల్లలుగా వుంటే అదంతా వదలిపెట్టి, మరుభూమిలాంటి ఈ ఎడారికి రావడం మన ఖర్మ" అంటూ వాపోయాడు కల్నల్.

"అలా అనకు... బాల్టిక్ సముద్రానికి దక్షిణ తీరానవున్న పొమెరేనియా ఆడవాళ్లున్నారు చూశావ్ ! మన పుత్రకామేష్ఠి పథకానికి బ్రహ్మాండంగా పనికొస్తారు. మొత్తం ప్రషియాలో కంటే ఈ ప్రాంతంలోనే జననాలరేటు బాగా యెక్కువ" సమర్థించాడు డాక్టర్.

ఈ సమాధానం కల్నల్‌కు రుచించలా. ఎటూ గాకుండా మధ్యదారిలో కారు చెడిపోయినందుకు అతనికి చాలా బాధగా వుంది. ఏమీ తోచక మోరపైకెత్తి ఆకాశం వంక చూశాడు. ఆకాశంలో పక్షుల గుంపు, మబ్బులకు ఎదురుగా వరుసతప్పకుండా ఒక క్రమాకారంలో త్వరితగతిని ముందుకు పరుగెడుతూ వున్నాయి.

"ఎంతో శిక్షణ పొందిన వైమానికులు నడిపే మన యుద్ధవిమానాలు గూడా ఇంత క్రమశిక్షణతో, ఇంత సక్రమంగా ఎగురలేవేమో" అన్నాడు కల్నల్ ఆకాశంలోని పక్షుల గుంపును ఆశ్చర్యంగా చూస్తూ.

"మన యుద్ధవిమానాలు అలా ఎగర్లేకేం... బ్రహ్మాండంగా ఎగుర్తాయి. అయినా, ప్రకృతికీ యంత్రాలకీ పోలికేమిటి? మనం ఎంత అనుకున్నా ప్రకృతిని మించిన నైపుణ్యం సాధించడం ఇంకా ఆదర్శంగానే వుంది" అని సమర్థించాడు డాక్టర్. అతడు జర్మన్ సాయుధ బలగాలను పొగడటానికి ఏ చిన్న అవకాశం దొరికినా వదులుకోడు.

కల్నల్ ఇక ఎలాంటి వ్యాఖ్యా చెయ్యలేదు. అతడు భూమి, ఆకాశం కలిసేచోట దిజ్మండలాన్ని పరిశీలిస్తూవున్నాడు. అది చూసేకొద్దీ అతనికి కోపం పెరుగుతూనేవుంది. ఇంతలో దూరంగా పొలాల్లో ఓ యువతి వంగి పారతో తవ్వి దేనికో ఎత్తుతూ కనిపించింది. "అదో... చూడూ... నీ పొమెరేనియన్ పిల్ల" అంటూ అరిచాడు.

"ఆ అమ్మాయిని కనుక్కుందాం. బహుశా ఆ అమ్మాయి మనకు కారు బాగుచేసే గారేజికి దారి చూపించవచ్చు" అంటూ సర్జన్ కల్నల్ ఏం చెబుతాడో వినకుండానే, వడివడిగా పొలాలకు అడ్డంపడి ఆ అమ్మాయి దగ్గరకు పరుగెత్తాడు. దున్నిన నాగటి చాళ్లపై ఎగురుతూ, గెంతుతూ ఉల్లాసం ఉరకలు వేస్తూ వుండగా ఆ డాక్టరు ఆ పిల్లదాని దగ్గరకొచ్చిపడ్డాడు.

ఇక కల్నల్ పరిస్థితి అయోమయంగా

ఉంది. డాక్టరుతోపాటు పోదామంటే ఎదురుగా పొలాలన్నీ బురద బురదగా వున్నాయి. పొలాలకేసి చూశాడు. నిగనిగలాడుతున్న తన బూట్లకేసి చూసుకున్నాడు. ఈ పాడు బురదలో దిగి తన బూట్లను కంపుచేసుకోవడం కల్నల్‌కు ఇష్టంలేదు. అందువల్ల డాక్టరు తిరిగి వచ్చేవరకూ తాను ఉన్నచోటునే వేచి వుండటానికి నిశ్చయించుకున్నాడు.

మరోపావుగంట తర్వాత డాక్టర్ ఆ రైతు యువతిని తన వెంట తీసుకొని కల్నల్ దగ్గరకొచ్చి చేరాడు. "చూడు... కల్నల్ రెండు కళ్లూ పెట్టుకుని చూడు. నేను చెప్పింది నిజమేగదూ ఈ చక్కదనాల చుక్కను చూడు. ఈ పిల్ల విగ్రహం ఎంత బాగుందో చూడు"! అంటూ డాక్టరు సంబరపడిపోతున్నాడు.

పొడవుగా, బలిష్టంగా ఉన్న ఆ యువతి ఆశ్చర్యంగా, కళ్ళార్పకుండా ఈ ఇద్దరు అధికార్లవంకే చూస్తూవుంది.

"నీవు చెప్పింది నిజమే డాక్టర్. ఈ పిల్లను చూస్తే సాక్షాత్తు మన ఫ్యూరర్ హిట్లర్ మురిసిపోతాడు. దీన్ని మనవెంట తీసుకెళ్దాం" అన్నాడు కల్నల్.

"కాస్త ఆగవయ్యా" అంటూ కల్నల్‌ను ఆపి, "ఏయ్ పిల్లా... ఇలారా" అంటూ ఆ అమ్మాయిని పిలిచాడు డాక్టర్.

డాక్టర్ ఆ అమ్మాయిని కారు దగ్గరకు తీసుకెళ్లాడు. వీళ్ల తంతు చూస్తే ఆ పిల్లకు ఏదో ఉల్లాసంగా వుంది. ఆ పిల్లను డాక్టరు బట్టలు విప్పమన్నదే ఆలస్యం, ఎలాంటి సిగ్గూ, బిడియమూ లేకుండా విప్పేసింది. ఆ పిల్ల సిగ్గుతో చెప్పిందల్లా ఒకేఒకమాట "నాకాళ్లు శుభ్రంగా లేవు" అని మాత్రమే.

"నీ కాళ్లతో మాకేం పనిలేదులే" అని అన్నాడు కల్నల్ ఆ అమ్మాయి శరీరంలోని ఒంపు సొంపులన్నింటినీ తదేకదీక్షగా పరికిస్తూ.

ఇదంతా ఇలా ఎందుకు చేస్తున్నారో తనకు తెలుసులే అన్నట్లుగా ఆ పొమెరేనియన్ పిల్ల నవ్వుతూ వుంది.

డాక్టరు ఆ పిల్లను కారులో వెనుక సీటు మీద పడుకోబెట్టాడు. తన సంచీలోనుండి, స్టెతస్కోప్‌ను, మరొక పరీక్షా పరికరాన్నీ బయటికి తీసి, వాటితో ఆ పిల్ల శరీరంలోని ప్రతి అవయవాన్నీ క్షుణ్ణంగా పరీక్షించసాగాడు.

"ఈ అమ్మాయి బ్రహ్మాండంగా పనికొస్తుంది. ఆరోగ్యరీత్యానేగాదు అన్నివిధాలా బాగుంది" అంటూ, "పిల్లా... ఇక బట్టలు తొడుక్కో" అని చెప్పాడు డాక్టరు.

ఆ పిల్ల తన చక్రాల్లాంటి కళ్ళు తిప్పి, ఆ ఇద్దరు పెద్దమనుషులవైపు వింతగా చూసింది. ఈ బడుద్ధాయిలు తనను వాడుకోకుండా తన బట్టలు ఎందుకు విప్పించినట్లు? ప్రత్యేకించి తన సర్వాంగాలనూ పరీక్షించి 'అన్నీ బాగున్నాయని' తెలుసుకొని గూడా తనను ఏమీ చెయ్యలేదంటే వీళ్లలో ఏదో లోపం వుండాలి. బహుశా వీళ్ళు అందుకు పనికిరారెమో అనుకొంది.

"ఇక నే వెళ్ళొచ్చా?" అంటూ వెటకారంగా అడిగింది. ఇలా అడగడంలో 'ఏమీ చేతగాని వాజమ్మల్లారా... ఇంకా ఇక్కడ నేనెందుకురా?' అన్న అసంతృప్తి వ్యక్తమౌతూవుంది.

"నువ్వు వెళ్లడానికి వీల్లేదు, నిన్ను మావెంట తీసుకెళ్తాం" అని చెప్పాడు డాక్టరు.

"ఇంకా ఎక్కడికి?" అంటూ ప్రశ్నించిందా పిల్ల 'ఇక్కడేమీ చేయలేని చవటలు మరెక్కడికో తీసుకెళ్లి మాత్రం చేసేదేముందిలే' అన్న వెటకారం ధ్వనిస్తూవుందాపిల్ల మాటలో.

"ఎక్కడికీ... ఏమిటి?"— ఇవన్నీ తర్వాత చెబుతాంగానీ, ముందు మమ్మల్ని మీ అమ్మా నాన్న వద్దకు తీసుకెళ్ళు. ఇక్కడికి మీ ఇల్లు చాలా దూరమా?" అడిగాడు డాక్టరు.

"ఓ కిలోమీటరుంటుంది" ఆ అమ్మాయి సమాధానం.

డాక్టరు ఒక్కక్షణం ఆలోచించాడు. "కల్నల్... మీరిక్కడే డ్రయివరుకోసం వుండండి. నేను ఈ పిల్లతో కలిసి వాళ్ల ఇంటికి వెళ్ళొస్తాను, మనకు టైం కలిసొస్తుంది" అన్నాడు.

కల్నల్ అంగీకరించాడు. దున్నిన బురద పొలాల్లో అడ్డంపడి పోవడంకంటే ఇక్కడే పడి వుండటం మంచిదనుకున్నాడు.

సర్జన్ బాగా నడిచే మనిషి. కానీ ఆ పిల్ల అంగలు పంగలేసుకుంటూ చెంగు చెంగున లేడిపిల్లలా రెండేసి నాగలి చాళ్లను ఒకేసారి గెంతుతూ వెళుతూవుంటే, ఆ పిల్లను అందుకో

లేక నానా అవస్థాపడుతున్నాడు.

రోడ్డు మీద నుండి ఈ దృశ్యమంతా చూస్తూ ఉన్న కల్నల్ 'అన్నివిధాలా మంచి పిల్ల. అక్కడ మా హీరోలకు స్వర్గసుఖం అంది స్తుంది' అనుకున్నాడు.

ఆ పిల్ల చెంగుచెంగున గంతులేస్తూ వెళు తున్నా, ఆ పిల్ల మనసులో మాత్రం ఏదో భయం బితుకు బితుకుమంటూనే వుంది. 'ఇప్పుడీ అధికార్లకేంకావాలి? వాళ్ళు కోరింద ల్లా ఇవ్వడానికి సిద్ధపడి, అడిగీ అడక్కముందే అందాలన్నీ వాళ్లముందు పరిస్తే అనుభవించ లేకపోయిన చవటలు. వాళ్లకు అయిష్టం కల గడానికి కారణాలేమిటి? తనేమన్నా పొరపాటు చేసిందా? వాళ్ళు బట్టలు విప్పమన్నప్పుడు తాను ఎలాంటి కోపతాపాలూ ప్రదర్శించ కుండా, కనీసం సిగ్గులొలకపోయకుండా, వాళ్ల నోట్లో మాట నోట్లో వుండగానే తనకై తాను వంటి మీద బట్ట లాగేసినందుకు వాళ్లకు తనమీద రోతపుట్టిందా? ఇంత సిగ్గుమాలినదేంరా! అని వాళ్లకు కోపమొచ్చిందా? బహుశా అదే జరిగి వుండొచ్చు. తన శరీరంలోని ప్రతి అంగాన్నీ వాళ్లముందు పరచకుండా, పొంద్రా వెధవ ల్లారా! అని ఉంటే వాళ్ళు తన పొందుకోసం తపించివుండేవాళ్ళేమో' ఇన్ని ఆలోచన లతో ఆ పిల్ల డాక్టరును వెంటబెట్టుకుని ఇంటి కి చేరింది.

ఆ సమయంలో ఆ పిల్ల తండ్రి వ్యవసాయ పనిముట్లు పెట్టిన గదిలో పారకు పిడి అమ ర్చుతున్నాడు. అరవై ఏళ్ల వయసులో ఉన్న అతను ఆరోగ్యంగా, పుష్టిగా ఉన్నాడు. తన కూతురివెంట వచ్చిన కొత్తమనిషిని అతను అనుమానంగా చూశాడు. అతడు ధరించి ఉన్న సైనిక దిరుసు చూస్తూనే, తన చేతిలోవు న్న పారను తుపాకీలా పట్టుకొని శాల్యూట్ చేశాడు.

''ఈ పిల్ల నీ కూతురేనా?'' అంటూ ప్ర శ్నించాడు డాక్టర్.

''అవునయ్యా... ఇది నా కూతురే. దీనిపేరు అన్నా వట్టి గడుగ్గాయి. తవరిపట్ల తప్పేమైనా చేసిందా అయ్యా?''

''అలాంటిదేమీ లేదుగానీ, నేను చెప్పేది ప్రశాంతంగా విను'' అంటూ డాక్టరు ఈ కష్టకాలంలో ప్రతిపిల్లా తన మాతృదేశంపట్ల నిర్వహించవలసిన విద్యుక్తధర్మం గురించీ, తాను లోగడ ఇలాంటి సందర్భాలలో పదేపదే చెప్పిన విధంగానే ఈ ముసలి రైతుకుగూడా ఓపిగ్గా వివరించాడు. దేశభక్తి పాఠాన్నంతాచె ప్పి ''ఈ పిల్లకింకా పెళ్ళికాలేదుగదా?'' అని ప్రశ్నించాడు డాక్టరు.

''లేదయ్యా... తొందర్లో సేద్దామనుకుంటు న్నా'' అని చెప్పాడు ముసలి రైతు.

ఈ సమాధానానికి డాక్టరు చిరునవ్వు నవ్వా డు. ఈ పిల్లకు జరగబోయేదేమిటో అంతా ముందే తెలుసునని గ్రహించాడు.

డాక్టరు చెప్పిందంతా విన్న పిల్లతండ్రి మాత్రం ఇదంతా తనకు సమ్మతం కాదన్నట్లు కనుబొమ్మలు చిట్లించాడు. తన కూతురికి పట్ట బోతున్న మహర్దశను గురించి డాక్టరు చెప్పిన విషయాన్ని అతను అర్థంచేసుకొనకగాదు. పొలంపనిలో తనకు చేదోడువాదోడుగా ఉన్న ఒక మగరాయుడిలాంటి బలమైన పిల్ల ఇక ముందు తనకు సాయంగా ఉండకుండా పోతుందనేదే అతని ఆలోచన.

''మా అన్నా ఉంది జూసారూ... శానా కష్టప డి పనిజేసే పిల్లయ్యా. పని యెగేసే గుణమే లేదు. ఇంటిపనైనా, పొలంపనైనా వొళ్లొంచి మరీ సేస్తది. ఇంతవరకూ సెప్పిన పనేదీ సెడగొట్టి యెరగదు. మా ఆడది- అదే ఈ పిల్ల తల్లి ఎన్నడో కాలం సేసింది. అప్పటాలనుండి ఈ పిల్లనే కనిపెట్టుకొని వొంటరిగా బతుకుతా వున్నానయ్యా'' అంటూ ముసలి రైతు తన గోడు వినిపించుకున్నాడు.

''నీవికమీదట పొలంపనిలో కష్టపడనవస రంలేదు. ప్రభుత్వం ప్రతి నెలా నీ పోషణకు డబ్బు పంపుతుంది'' అని చెప్పాడు డాక్టరు.

ఆమాటతో రైతు ముఖంలోని అసంతృప్తి మటుమాయమయ్యింది. ముఖమంతా నవ్వు పులుముకుంది. రైతుకూ, డాక్టరుకూ మధ్య అప్పటికప్పుడే ఒప్పందం ముగిసింది. ఆ అమ్మాయి చేతికి ఇవ్వవలసిన ప్రభుత్వ పత్రా లు, రైల్వే టిక్కెట్టు, వాటితోపాటే దారి ఖర్చుకు డబ్బూ ఇచ్చివేశాడు డాక్టర్. ఇక ఆ అమ్మాయి మరునాడు ఉదయమే బవేరియా బయలు దేరి వెళ్లాలి.

ఆ సాయంత్రం తండ్రీ కూతుళ్లు తమ

పశువులపాక పక్కనే ఉన్న చిన్న గదిలో తమ పేద తిండి తింటున్నారు. చాలీచాలని ఈ చెత్త తిండి తినడానికి ఇదే ఆఖరు. ఇకమీదట షడ్రసోపేతంగా కోరిన తిండితింటారు.

ఈ ఆలోచనల్లో రైతు చాలా ఉల్లాసంగా ఉన్నాడు. ఇకమీదట ప్రభుత్వమే తనకు మాసం మాసం డబ్బు పంపుతుంది. అంటే తాను ఇక ప్రభుత్వ పింఛనీదారు అయిపోయాడు. ప్రభుత్వం తనకు ఇస్తానన్న డబ్బు యెక్కి తొక్కిగా సరిపోతుంది. ఆ డబ్బుతో పొలంపనికి జీతగాణ్ని పెట్టుకోవచ్చు. తాను ముందు అనుభవించబోయే ఆనందమయజీవితం అతని కళ్ళెదుట కనిపిస్తూ ఉంది.

ఇక రైతు కూతురు అన్నా తన రెండు మోచేతులనూ బల్లమీద మోపి, చూపు ఆకాశంలో నిలిపి ఆనందతరంగాల్లో తేలిపోతూ ఉంది. బవేరియాలో ఎలాంటి అందమైన జీవితం తనకోసం ఎదురుచూస్తూ ఉందోనని ఆలోచిస్తూ ఉంది. ఏమైనా ఇక్కడి కంటే దరిద్రంగా మాత్రం ఉండదు. తన తల్లి చనిపోయిన నాటినుండీ ఇక్కడ తాను అనుభవిస్తూన్న జీవితం తలచుకుంటే ఆమెకి బాధని పించింది. పొద్దస్తమానం నడుంవంచి పొలంలో కష్టపడటం, వెన్ను విరిగేంత బరువు నెత్తికెత్తుకొని యింటికి చేరడం, ఇదే ఇప్పటి తన జీవితం. తను పసితనంలో ఏమానందం అనుభవించిందోగానీ ఆ తరువాత బతుకంతా కష్టాలు, కన్నీళ్లే. తలచుకుంటే చిన్ననాటి రోజులే వేరు. పొద్దున్నే తన ఇష్టమైనప్పుడే నిద్ర లేచేది. తర్వాత బడికెళ్ళేది. ఆ తర్వాత ఆటలే ఆటలు. శీతాకాలంలో నీరంతా గడ్డకట్టి, మంచురాళ్లలా ఉన్న నీటిగుంటల్లో మగపిల్లలూ, ఆడపిల్లలూ కలిసి జారుడు బండ ఆట ఆడేవాళ్లు. వేసవిలో ఓడర్ నదిలో ఈతకొట్టేవాళ్లు. తమమీద ఎవరి పెత్తనం లేదు. తమ యిష్టారాజ్యం. ఈ ప్రపంచంలో ఎవరూ తమ సాటి రారన్నట్లుగా ఉండేదాబాల్యం. అప్పట్లో పల్లె ప్రాంతాలు యిప్పటంత దరిద్రంగా లేవు. ఇలా ఊహాలోకంలో ఎంతో సమయం గడిపిన అన్నా ఇహలోకంలోకి వచ్చింది.

ఆమె తండ్రి మాత్రం రేపటినుండీ కొత్తగా తనకు అందబోయే ఆదాయం గురించి మనసులో మదింపు వేసుకుంటూ, అన్నా తన పక్కన ఉందన్న విషయమే మరచిపోయాడు.

తిరిగి అన్నాకు చిన్ననాటి జ్ఞాపకాలు ముసిరాయి. ఆ కథ తలచుకుంటే అన్నాకు యిప్పటికే వళ్లంతా గిలిగింతలు పెట్టినట్లుంటుంది. అప్పటికి ఆ పిల్లకు నిండా పదమూడేళ్లు. ఆ పిల్ల తన తండ్రితోను, మామతోను కలసి అడవికెళ్లింది. శీతాకాలం కోసం ముందుగానే కట్టెలేరి తెచ్చుకొనడం వారి పని. అదింకా అక్టోబరు మాసమే. అయినా చలిగాలి భయంకరంగా వీస్తూ ఉంది. అప్పటికి ఆ పిల్లకు లోపల లంగాలు, డ్రాయర్లలాంటివేమీ లేవు. అలాంటివి కొనాలన్నా ఆ కుటుంబానికి అసాధ్యం. ఒక స్వెట్టరు, ఒక బరువైన ఉన్ని చొక్కా మాత్రమే ఆపిల్ల తగిలించుకొని ఉంది. ఇంతలో ఉన్నట్లుండి ఓ పెనుగాలి వీచింది. ఆ గాలికి ఆపిల్ల స్కర్ట్ భుజాలదాకా లేచిపోయింది. నగ్నంగా ఉన్న ఆ పిల్ల శరీరాన్ని తన మామ దొంగచాటుగా చూస్తూ గుటకలు మింగుతున్నాడని ఆపిల్ల గ్రహించింది. చూస్తే పొయ్యేదేముంది, అయనకంత యిదిగా ఉంటే ఇంకా బాగా చూసుకోనీ. ఒంటిమీద నూలు పోగులేకుండా తాను నదిలో ఈతకొట్ట లేదా. అప్పుడు మగపిల్లలంతా తనను చూడలేదా. అప్పుడు తానొక్కతే యేంటి... తనయీడు మగపిల్లలూ, ఆడపిల్లలూ అందరూ దిసమొలల్తో ఏటిలో దూకి ఒకరిమీద ఒకరు నీళ్లు జల్లుకుంటూ సల్లాపాలాడుకొనేవారు. దానికీ దీనికీ పెద్ద తేడా ఏముందీ?

కొద్దిసేపటికే ఆపిల్ల తండ్రి తాను కుందేళ్ల కోసం పన్నిన ఉచ్చులు నడలించి తెచ్చుకొనడం కోసం అన్నాను, దాని మామనూ అక్కడే వదిలి దూరంగా వెళ్లాడు.

రెండు మూడు మోపుల కట్టెలేరిన తరువాత ఆపిల్ల మామ ఒకచోట కూర్చున్నాడు. "నీకేం అలసట లేదా?" అంటూ అన్నాను అడిగాడు.

నిజానికి అన్నాకేమీ అలసటనిపించలేదు. పోనీ బట్టలెగరేసుకుపోయే ఈ హోరుగాలైనా తప్పుతుందని, తన మామ దగ్గరికి వచ్చి అతనితోపాటు ఒక లోతైన గుంటలో కూర్చుంది. ఆమె మామ తన దగ్గరున్న

బ్రాందీ ఫ్లాస్కును ఆ అమ్మాయికి అందించాడు. నిజంగా ఎంత బాగుందో, తన తండ్రి ఎప్పుడూ తను తాగడమేగాని ఒక్క బ్రాందీ చుక్కన్నా తనకిచ్చి ఎరగడు. ఆశగా బ్రాందీ అందుకుంది. బ్రాందీ గొంతులోకి దిగగానే ఆపిల్ల ముందుకూ, వెనుకకూ ఊగడం మొదలుపెట్టింది. ఏదో వగరుగా, చేదుగా గొంతులోకి దిగుతూ ఉంది. అయినా ఎంత బాగుందో. బ్రాందీ పూర్తిగా లోపలికి దిగిన తరువాత తాను నిజంగా నిప్పును మింగానని ఆ పిల్ల గ్రహించింది. తన నరనరానా జ్వాలలు వ్యాపించాయి. తల, కాళ్ళు, కడుపు సమస్త శరీరంలో ఏదో తెలియని గమ్మత్తయిన కలవరం ప్రారంభించింది.

ఆ పిల్ల మామ కూడా ఫ్లాస్కులోని బ్రాందీ గుటకేసి, మోచేత్తో మూతి తుడుచుకుని ఆ పిల్లకు గిలిగింతలు పెట్టసాగాడు. ఈ చిలిపిచేష్టలకు ఆ పిల్ల ముసిముసి నవ్వులు నవ్వసాగింది.
తర్వాత తాను అలసిపోయే పర్యంతం నవ్వుతూనే వుంది. నవ్వుల్తో అలసి సొలసిపోయిన ఆపిల్ల స్కర్ట్ ఎత్తాడు ఆమె మామ.

ఈసారి ఆపిల్ల సిగ్గుపడింది. వెంటనే స్కర్ట్ సరిచేసుకుంది.

"ఏయ్ చిలిపీ... ఇందాకేగదా నీవళ్ళంతా చూశాను. ఇంకా ఏముంది నీవు సిగ్గుపడటానికి" అంటూ తనపనితాను చేసుకుపోతున్నాడు మామ.

నిజమే... తన శరీరంలో తన మామ చూడనిచోటు ఇంకా ఏంమిగిలుంది? అయితే అది గాలి చేసిన తమాషా. అయినా ఆపిల్ల తన మామ చేస్తున్నపనికి అభ్యంతరపెట్టలేదు. అతనేం చేయదలచుకున్నాడో చేసుకోనీ అనుకుంది. అతను తనను అనుభవిస్తూ బాధించినా గూడా ఓర్చుకుంది. ఒకటికి రెండుసార్లు ఆ గుంటలో అతను ఆ పిల్లను అనుభవించాడు. ఆ పిల్ల తండ్రి వచ్చిన తరువాత ముగ్గురూ కలిసి ఇంటికి బయలుదేరారు.

మరునాడుకూడా మామ అదేపని చేశాడు. ఆపిల్ల ఇంట్లో ఒంటరిగా ఎప్పుడు చిక్కినా ఆపిల్ల మామకు అదేపని. ఇక ఆపిల్ల తల్లి చనిపోయిన తరువాత మామకు ఆ ఇంట్లో అడ్డేలేదు. రోజురోజంతా తనకు ఓపిక ఉన్నంతదాకా ఆ పిల్లతో కామకేళి సలిపేవాడు.

ఈ బాధ భరించలేక ఒకటి రెండుసార్లు ఈ విషయం తన తండ్రికి చెప్పాలనుకుందిగానీ చెప్పలేకపోయింది. తాను ఈ విషయం చెప్పలేనని తనకూ తెలును. ఆ తరువాత ఆ పనంటే తనకూ ఆనందం కలగసాగింది. తర్వాత మరేముంది? తన మామ ఎప్పుడెప్పుడు వస్తాడా! అని రోజూ ఎదురుచూడటం, మామ గడపలో అడుగుపెడుతూనే తలుపులు మూయడం ఆపిల్ల నిత్యకృత్యమైంది.

మామ యుద్ధానికి వెళ్ళినప్పుడు ఆపిల్ల వెక్కివెక్కి యేడ్చింది. తన ఆనందాన్నంతటినీ ఎవరో దొంగవెధవలు సంగ్రహించారన్నంత ఇదిగా ఏడ్చింది. ఆపిల్ల యేడ్పు చూసిన తండ్రి "రేపు నన్నుకూడా యుద్ధానికి రమ్మంటే అప్పుడేం చేస్తావే తల్లీ" అంటూ ఊరడించాడు.

గ్రామంలో తన తండ్రికంటే గూడా వయసు మళ్ళిన ముసలాళ్ళు, వికలాంగులు తప్ప మరెవరూ మగవురుగంటూలేరు. పాపిష్టి యుద్ధం వాళ్ళందర్నీ పట్టుకెళ్ళింది. రోజూ మామకు అలవాటుపడ్డప్రాణం. ఒక్క మాంచి మగాడుకూడా దొరక్కపోయేసరికి ఊళ్ళో మిగిలివున్న ముసలాళ్ళు, కుంటి, కునిష్టివాళ్ళను కూడా ప్రయత్నించి చూసింది అన్నా. ఎవడూ లేకుండా వుండటంకంటే కుతి తీరడానికి ఎవడో ఒకడు దొరకడం మంచిదిగదూ...

అన్నా దేనికోసమో ఎదురు చూసేస్థితిలో వుంది. దేనికోసం ఎదురు చూస్తూవుందో తనకే యిదమిద్ధంగా తెలియదు. బహుశా ఆమె 'ఈ యుద్ధం ఎప్పుడు ముగుస్తాందా? బలమైన మగాడు తిరిగి తనకెప్పుడు దొరుకుతాడా?' అని ఎదురు చూస్తూవుండివుంటుంది. తన అలవాటునుండి మనసును మరోవైపు తిప్పుకోనడానికే ఆ అమ్మాయి అహర్నిశలూ పాలంపనిలో నిమగ్నమైంది. పొలందున్నేది. గడ్డికోసేది. కుప్పలేసేది. ఒకటేమిటి... ఎంత కష్టమైనవనైనా ఎద్దులాగా చేసేది. ఎంత కాయకష్టం చేయవలసివచ్చినా తనబిడ్డ వెనుదీయదని ఆ తండ్రి చెప్పేవాడు. అన్నా ఈ పనిపాటలతో అలసిపోయి తన నరాల తీపును ఉపశమింపజేసుకునేది.

అన్నా మెల్లిగా లేచి కిటికీదగ్గరకెళ్ళి నిలుచుంది. తెల్లని కొండరావి చెట్లు వెన్నెల వెలుగులో వెండిలా ప్రకాశిస్తూ ఉన్నాయి. కాకులు రాత్రిని గుడ్లగూబలకు వదలివేశాయి. బవేరియాలో తనచేత ఏమి చేయిస్తారు? బహుశా వంటపని చేయిస్తారేమో లేదా తోటపని... మగాడిపక్కలో పడుకునేపనిగాక తనకు బాగా తెలిసిన పనులు ఈ రెండే.

తనను రిక్రూట్ చేసుకున్న అధికారులు ఏవేవో పెద్దవాగ్దానాలు చాలా చాలా చేశారు. అవన్నీ అమలు జరిగే పక్షంలో ఎంతకష్టపడి పనిచెయ్యాల్సి వచ్చినా తనకేం బాధలేదు.

ఈ ఆలోచనలతో ఆపిల్ల వళ్ళు విరుచుకుంది. ఆ విరుపుకు వక్షాలు ముందుకు పొడుచుకొచ్చాయి. ఇప్పుడాపిల్ల రూపం చూస్తే మగాడెవడైనా ఏమీ అడక్కముందే తననుతాను అర్పించేలావుంది. ఈ భావం మదిలో కలగగానే ఆపిల్ల శరీరం దూదిపింజలా తేలిపోయినట్లనిపించింది.

"నీవు చాలా అదృష్టవంతురాలివమ్మా! కొత్తదేశం చూడబోతూవున్నావు" అన్నాడు తండ్రి.

దీనికి అన్నా సమాధానమేమీ చెప్పలేదు. కొత్తదేశమైనా, పాతదేశమైనా తనకేం లెక్కలేదు. తనకు కావాల్సింది కొత్తదేశంగాదు. కొత్తమగాళ్ళు. అంతే. రోజూ మగాడు దొరికితేచాలు తనకేదేశమైనా ఒకటే.

★ ★ ★

సార్జెంట్ కారల్ క్రమ్మెలీన్ తన కందకం సమీపంలో ఇసుకతిన్నెమీద పడుకొని ఉన్నాడు. దారికడ్డంగా మంద్రమంద్రంగా లేచి మింటినంటుతున్న పొగను రెప్పవాల్చకుండా చూస్తూ ఉన్నాడు. లోయిరే ముఖద్వారంలోవున్న ప్రశాంతమైన ఈ వేసవి విడిది జర్మన్ ఆక్రమణ అనంతరం ప్రాముఖ్యం సంపాదించుకుంది.

శత్రువిమానాలు దిగకుండా ఈ ప్రాంత తీరాన్నంతటినీ చాలా నేర్పుగా కట్టుదిట్టంగా బందోబస్తు చేశారు. జర్మనీవాళ్ళు అక్కడ ఎలాంటి ఏర్పాట్లు చేసుకున్నదీ, సముద్రంలో నుండి చూస్తే ఏమాత్రం ఆజ దొరకదు. బీచి చుట్టూ పాతిన ముండ్లతీగెలు మాత్రమే ఎవరికైనా కనిపిస్తాయి. తీరంవెంట ఇసుకదిబ్బల్లో లోతుగా కందకాలు తవ్వారు. వీటిలోనుండి ఏ క్షణంలోనైనా అగ్నివర్షం కురిపించేందుకు వీలుగా ఫిరంగి స్థావరాలను ఏర్పాటు చేశారు. వీటిని శత్రువుల కంటబడకుండా కప్పివుంచారు. ఆ చుట్టుపట్ల మైళ్ళదూరంలో వున్న కొండగుట్టలన్నింటినీ సైనిక దుర్గాలుగా మార్చారు. వాటినిచూస్తే అవి భూమిమీద మొలుచుకొచ్చిన మృత్యుముఖాలా అనిపిస్తాయి. అవసరమొస్తే ఆ ప్రాంతం ప్రతి అంగుళమూ అగ్నిజ్వాల లెగజిమ్ముతుంది. అయితే సార్జెంట్ క్రమ్మెలీన్ వీటిని వేటిని గురించీ ఆలోచించడంలేదు.

కారల్ అనేక విజయాలు సాధించినవాడే. అతన్ని ఇప్పుడు సెయింట్ బ్రెవిన్‌కు కేవలం విశ్రాంతికోసం పంపారు. ఈ తీరం పొడవునా వృత్తిరీత్యా పోరాటదళాలు అవసరమని హైకమాండ్ భావించింది. అయితే క్రమ్మెలీన్ అక్కడికి వచ్చినప్పటినుండి అతనికి విశ్రాంతి తప్ప మరే డ్యూటీలేదు.

సైనిక కట్టడాల నిర్మాణం పూర్తి అయింది. దినసరి విందువినోదాలు, పడక సౌఖ్యం సైనికులందరికీ సజావుగా సాగిపోతున్నాయి.

వసంత రుతువులోని ఈ ఉదయం ఈ సార్జెంట్ పనీపాటు లేకుండా విశ్రాంతిలోని ఆనందం అనుభవిస్తూ ఉన్నాడు. అతడు అప్పుడే సముద్రంలో మునిగి బయటకు వచ్చాడు. సముద్రపు నీళ్ళు చల్లగా ఉన్నాయి. ఈ చలి అతణ్ణి ఏమీ చేయలేదు. అతడు బీచ్‌లో ఇసుకలో పడుకుని, కండ్లు అరమూసి, ఈ సమయంలో తన ఊళ్ళో ఇంటి దగ్గర ఏంజరుగుతూ ఉంటుందా? అని ఆలోచిస్తున్నాడు.

తాను ఒకప్పుడు బంగారంలాంటి రైతు. ఈ యుద్ధం మూలంగా తన ఇంటి పనులన్నీ పోగొట్టుకున్నాడు. అప్పట్లో పశువులకు దాణా పెట్టడం, అడవికి వెళ్ళిరావడం, పొలాల్లో పనిచేయడం తన నిత్యకృత్యాలు. అవన్నీపోయాయి. అన్నింటికంటె ముఖ్యం తాను తన మిన్నాను పోగొట్టుకున్నాడు.

మిన్నా! ఎంత సుందరమైన రూపమో గుర్తు చేసుకున్నాడు. ఆమె అంగాంగం ఎంత అందంగా ఉంటుందో తలపు తెచ్చుకున్నాడు.





ఆమె చేతులు కూడా తన చేతుల్లాగే బలిష్ఠమై నవి. అయితే అవి సునుమకోమలంగా ఉంటాయి. అబ్బ... ఆమె ఊరువులు! ఆమె ఉరువులను తొలిసారి చూసిన రోజును సార్జెంట్ గుర్తు తెచ్చుకున్నాడు. ఒక ఆదివారం వాళ్లిద్దరూ షికారుగా నడిచివెళుతూ మోస్ నదీ తీరాన విశ్రాంతికోసం ఆగారు.

అన్నివిధాలా తనకు యోగ్యత ఉంది. అందుకే మిన్నాను వివాహం చేసుకుంటానని వాగ్దానం చేశాడు. ఆ అమ్మాయి తండ్రి తనను మెడబట్టి బయటికి గెంటితే అది తన పొరపాటెలా అవుతుంది? ఆ గ్రామంలో కారల్ కంటే బాగా డబ్బూ దస్కం, భూమి పుట్రాగల ఓ వయసుమీరిన భూస్వామి మిన్నాను పెళ్లాడాలని ఎంతోకాలంగా తహతహలాడుతున్నాడు. మిన్నా అతన్ని తిరస్కరించింది. కారల్‌ను కోరుకొని, అతనికి మనసిచ్చింది. కారల్‌ను తప్ప మరెవరినీ చేసుకోనని మారాంచేసింది. తనకూ, కారల్‌కూ శారీరకసంబంధం కూడా ఉన్నదని సిగ్గువిడిచి తండ్రికి చెప్పింది. ఆ తండ్రి పరమకర్కోటకుడు. కూతుర్ని చావచితకబాదాడు. ఆ అమ్మాయి ఆ రాత్రి కారల్ దగ్గరకువచ్చి దెబ్బలతో కమిలిపోయిన శరీరాన్ని చూపింది. అదే ఇక ఆఖరుచూపు.

తమ చివరి కలయికను నిన్నమొన్న జరిగినట్లుగా కారల్ గుర్తు చేసుకున్నాడు. ఆరోజు ఆ అమ్మాయి తడినేలమీద పడుకుంది. తన లోబాడీ లాగేసింది. తన శరీరంలోని ఒంపుసొంపులన్నింటినీ తన ప్రియుడి కళ్లెదుట పరిచింది. దెబ్బలతో కదుములు గట్టిన ఆ అమ్మాయి చేతులనూ, శరీరంలోని సర్వాంగాలనూ అతను ముద్దులతో ముంచెత్తాడు...

మిన్నా తన స్వంతం కాలేకపోయింది. తండ్రి బలవంతం మీద మూడుకాళ్ళ ముసలి భూస్వామిని పెళ్లి చేసుకొంది. పాపం... ఆ ముసలాడికి తన భార్య ఎలాంటిదో కాబట్టదు. పెళ్లికి ముందే ఆ పిల్ల మరొకడితో తిరిగిందన్నా ఫర్వాలేదు. ఏమైతేనేం... అరవైయేళ్లు దాటినవాడికి రాత్రిళ్ళు పక్కలో మాంచి దుప్పటిలా వెచ్చగావుంటే అందమైన ఆడపిల్ల దొరకడం మాటలా? ఆ ముసలాడికి అదే చాలు...?

ఆ విధంగా కారల్ మిన్నాను పోగొట్టుకున్నాడు. ఈ విషయంలో అతను తన మనసును సరిపెట్టుకోలేకపోతున్నాడు. అసలు తాము జయించిన నగరాల్లో తమ వశమైన ఫ్రెంచి అమ్మాయిలను చాలామందిని అతను అనుభవించాడు. కానీ వాళ్ళంతా పట్టుకుంటే మంచు ముద్దల్లావుండి అతనిలో చలనం కలిగించలేకపోయారు. వాళ్ళు హృదయమేలేని వింత రకం జడ ప్రాణులనిపించింది. ఫ్రెంచి అమ్మాయిలకు జర్మనీవాళ్ళంటే విపరీతమైన ద్వేషం. కానీ జర్మనీవాళ్ళ డబ్బు మాత్రం కావాలి. అందుకే ఆ కాస్తసేపూ దులపరించుకొని, డబ్బులాక్కుని చక్కగాపోతారు. ఇక్కడ సెయింట్ బ్రెవిన్‌లో ఆడపిల్లలు తాను దారిన నడచి వెళుతూవుంటేనే సహించలేమన్నట్లు వ్యవహరిస్తారు. తనను చూడటమే పాపమని, తలలు మరో వక్కకు తిప్పుకొని వెళ్ళిపోతారు. ఇక్కడ అందమైన ఆడపిల్లలకేం కొదువలేదు. తాను మిన్నాతో తిరిగిన విధంగానే ఇక్కడి అందగత్తెలతో చేయీ చేయీ కలిపి, అందమైన ఫ్రెన్ చెట్ల వరుసల వెంట ఆనందంగా నడవాలని కారల్ అభీష్టం. కానీ అదేంఖర్మో, తనను చూస్తే ఆ అమ్మాయిలు అడవిపిట్టల్లా పారిపోతారు. తనను అన్నివిధాలుగా మెచ్చే నచ్చే ప్రియురాలికోసం వేచివుండకుండా తాను చేయగలిగిందేమీలేదు. ఎంతకాలమైనా ఆశుభగడియకోసం ఎదురు చూస్తూ వేచి ఉండవలసిందే...

కారల్ ఇలా తనలోకంలోతాను ఉండగానే "సార్జెంట్" అని అరచుకుంటూ ఒక సైనికుడు కందకంలోనుండి బయటపడి పరుగెత్తుకుంటూ కారల్ వద్దకు వచ్చాడు. "సార్జెంట్... మీరు తక్షణం మెడికల్ ఆఫీసరువద్దకువెళ్ళాలి" అని విన్నవించాడు.

తర్వాత జరగవలసిన తతంగమంతా ముగిసింది. ఆరోజు సార్జెంట్ కారల్ క్రమ్మెలీన్ అడవిగువ్వలా ఆనందంగా రెక్కలు కట్టుకొని రివ్వున ఎగిరి పోతున్నట్లుగా నాన్‌తెస్ రైల్వేస్టేషన్‌లో పారిస్ రైలును అందుకున్నాడు.

మరో నలభైఎనిమిది గంటల పిమ్మట అతను మ్యూనిచ్ నగరంలో వున్నాడు.





లెఫ్టినెంట్ వెర్నర్ అనేక అనుమానాలతో జర్మనీ వెళ్లడానికి రైలెక్కాడు. రైలు ఫ్రాన్సు సరిహద్దులు దాటి జర్మనీలోకి ప్రవేశించాక, తాను చేయవలసివున్న సిగ్గుమాలిన కార్యాన్ని తలచుకుని విచారించసాగాడు. హిట్లర్ తలపెట్టిన 'పుత్రకామేష్టి' పథకం గురించి ఇప్పటికే ఎన్నో పుకార్లు విని ఉన్నాడు. బెర్లిన్‌లో సెలవులు గడిపి తిరిగి డ్యూటీకి వస్తున్న సైనికుడొకడు, జర్మనీలో అందాలభామలను మందలుమందలుగా పోగేయడం గురించి చిలవలుపలవలతో కథలుకథలుగా చెప్పాడు. ఈ కథలు విన్నవాళ్లందరూ పొట్టచెక్కలయ్యేలా నవ్వి, హిట్లర్ పథకానికి తమ హర్షామోదాలను తెలిపారు. అప్పట్లో ఈ కాకమ్మ కథలకు వెర్నర్ హార్న్ ఎలాంటి విలువా ఇవ్వలేదు. ఇదంతా ఊసుపోకకు కల్పించి చెప్పే సొల్లు వాగుడనుకున్నాడు. కానీ ఇప్పుడు అదంతా నిజమై కూర్చుంది. హిట్లర్‌గారి ఆ ప్రత్యేక, పవిత్ర కార్యక్రమం కోసం ముక్కూముఖమూ తెలియని దేనితోనో పార్లి దానికి పిల్లలు పుట్టించడానికి తాను గినియా పందిగా వెళుతున్నాడు. ఇలాంటి అవకాశం తమకు లభించలేదే అని కల్నల్ లాంటి వాళ్లంతా తపనపడిపోతూ ఉంటే, లభించిన అవకాశాన్ని తలచుకొని తను మాత్రం బాధతో కుమిలిపోతూ ఉన్నాడు.

వైమానిక శిక్షణా కేంద్రంలో తన సహచరులకు హడావుడిగా వీడ్కోలు చెప్పిన ఉదంతం అతనికి గుర్తొచ్చింది.

"నేను ప్రత్యేక కార్యక్రమం మీద వెళుతున్నాను" అని మాత్రమే అతను తన సహచరులకు చెప్పాడు. వాళ్ళు కూడా తనను వివరాలు అడగలేదు. అతనిని వైమానికదళంలో ఇంకేదో అత్యున్నత కార్యక్రమ నిర్వహణకోసం పంపుతున్నట్లు వాళ్ళంతా అనుకున్నారు. ఇక అతను ఈ వైమానిక శిక్షణా కేంద్రానికి తిరిగిరాడని కూడా అనుకున్నారు. అతను తన కొత్త బాధ్యత గురించి వివరించకుండా ముక్తసరిగా వీడ్కోలు పుచ్చుకున్నందుకు వాళ్లంతా తెగ మెచ్చుకున్నారు. అతను పనిమంతుడు. బద్ధకమనేదే ఎరుగనివాడు. అలాంటి వ్యక్తికి ఎంత ఉన్నత పదవి అయినా తగిందేనని వాళ్ళంతా భావించారు. వాళ్ళకెవరికీ వెర్నర్ ఏ పనికోసం వెళ్ళుతున్నదీ తెలియనే తెలియదు.

కల్నల్ కూతురు ఎర్నాకు అతను వెళుతున్న పని గురించి తెలిస్తే! తాను వీడ్కోలు పుచ్చుకోనడం కోసం సెయింట్ జెర్మయిన్‌కు ఫోను చేసినప్పుడు ఆ అమ్మాయే ఫోను అందుకుని మాట్లాడింది. ఆదివారం అతని రాకకోసం ఆమె ఎదురుచూస్తూ ఉంది. తన ప్రయాణం గురించి విన్నప్పుడు ఆ అమ్మాయి ఎలా హతాశురాలైందీ తాను గ్రహించాడు. ఆ అమ్మాయి ఫోన్‌లోనే ఏడ్చేసింది.

"ఎన్నిరోజులు వెళుతున్నావ్?" ఆ అమ్మాయి ఫోన్‌లో డగ్గుత్తికతో అడిగింది.

"బహుశా పదిరోజులు"

"అయితే, నీ రాకకోసం ఎదురుచూస్తూ రోజులు లెక్కపెడుతూ ఉంటాను. నీవు తిరిగి నీ వైమానిక శిక్షణా కేంద్రం వెళ్ళడానికి ముందు మా ఊళ్లో దిగాలి ఒట్టు"




''తప్పకుండా దిగుతాను ఒట్టు''

''నన్ను మర్చిపోవుగా వెర్నర్'' అంటూ ఆ పిల్ల ఫోనులోనే ఘొల్లుమంది. అతను తనలో తాను నవ్వుకున్నాడు. ''ఈ పనికోసమే తాను బవేరియా వెళుతున్నానని, తెలిస్తేనా, ఈ పిల్ల తనంతటతానే ఆనందంగా బవేరియా వస్తుంది''

★ ★ ★

వెర్నర్ ప్రయాణించే రైలు సరిహద్దును దాటకముందే, దాని ఎదురుమార్గంలో మరో రైలు వెళ్లిపోయింది. బవేరియా మదనసదనానికి రిక్రూట్ అయిన లీసెల్ షాఫ్ తన నిశ్చితార్ధపు పెళ్లికొడుక్కు రాసిన ఉత్తరం ఆ రైలులో గమ్యానికి ప్రయాణిస్తూ ఉంది.

''ప్రియా!

''నేను రాస్తున్న ఈ ఉత్తరం నిన్ను అమితంగా బాధిస్తుందని నాకు తెలుసు. కానీ నేనేం చేయను? ఇది నా తప్పుకాదు. ఇలాంటి ఉత్తరం నీకు రాయవలసి వచ్చినందుకు నేనెంతో కుమిలిపోతున్నాను. ఈ ఉత్తరం చదివి నీ వెంతగా కలత చెందుతావో, అంతకు రెట్టింపు వ్యధను నేను అనుభవిస్తూ ఉన్నాను.

''జర్మనీలోని అందమైన యువతులందరికీ సైనికాధికార్లు ఒక ప్రత్యేకతరహా బాధ్యత అప్పగించారు. ఆ 'మహత్తర బాధ్యత' గురించి నీకు తెలపాలంటేనే ప్రాణం సిగ్గుతో చితికిపోతూవుంది. వాళ్లు మమ్మల్ని ఖార్ఖానాల్లో పనిచెయ్యమనడంలేదు... మమ్మల్ని వాళ్ళు... ఈమాట ఎలా రాయను?... పిల్లల్ని కనమంటున్నారు.

ఈ పిల్లలు మేము పెండ్లాడనిశ్చయించుకున్నవాళ్ళవల్లనో, ప్రేమించిన వాళ్లవల్లనోకాదట. ధైర్యసాహసాలుగల సైనికులకు మమ్మల్ని కనమంటున్నారు. వాళ్ళు సెలక్టు చేసిపంపిన ప్రతి సైనికుడు మా అంగీకారంతో నిమిత్తం లేకుండానే మాలో ఒకర్నెంచుకుంటాడట! అందువల్ల నేను బలవంతంగా బవేరియా వెళుతూవున్నాను. అక్కడ నాలాంటి యువతులకోసం, అంటే పుత్రకామేష్ఠికి పనికివస్తామని డాక్టర్లు పరీక్షించి నిర్ణయించిన పిల్లలకోసం, స్వర్గాన్ని మైమరపించే మదనసదనం కట్టారట!

ఆ డాక్టరు నన్ను హొటల్ బెల్లావూలో పనిచేస్తూ ఉండగా చూశాడు. వెంటనే ఎంపిక చేశాడు. నేను ఆ ఒక్కరోజూ హొటల్ పనికి వెళ్ళకుండా, ఇంట్లోనే పడివుంటే ఇంత అనర్ధం జరిగి ఉండేది గాదేమో! నాకు హొటల్‌లో ఇచ్చే జీతం, నేను పనిచేయకుండానే ప్రతినెలా మా అమ్మకు ముడుతుందట! ఈ పని నాకుగానీ, మా అమ్మకుగానీ సుతరామూ ఇష్టంలేదు.

''ఆ మదనసదనం అనేది స్వర్గంలా ఉంటుందంటున్నారనిగదూ రాశాను. నిజానికి స్వర్గం దానిముందు బలాదూరట. దానికి వెళుతున్న మేము అప్సరసలను మించిన ఆనందం అనుభవిస్తామట. అక్కడ జీవితమంతా విందులూ, వినోదాలేనట! అది నిజమే అయినా అలాంటిది నాకు అఖర్లేదు. వాళ్ళు మా కోసం సృష్టించిన ఆనరకంలో మగ్గడం కంటే, నా చేతికి ఆయుధాలిస్తే యుద్ధరంగంలో మగాళ్ళకంటే వెయ్యిరెట్లు ఎక్కువగా శత్రువుతో పోరాడగలను కానీ ఆ అవకాశం నాకు లేదు.

''ప్రియా! నీవు శలవులకు ఇంటికి వచ్చేసరికి నేను నీకు కనిపించను.

ఒకవేళ నీవు మన ఊరికి చేరకముందే వాళ్ళు నన్ను ఇంటికి తిప్పిపంపినా, నీముఖంలోకి నిబ్బరంగా చూసి మాట్లాడగల ధైర్యం నాకులేదు, ఉండదు.

''నాకు ఒకే ఒక ఆశ వుంది. ఈ యుద్ధం నాకు ఆ భయంకరమైన అవమానం జరక్కముందే అంతమవుతుందని...

''హేన్స్... నిన్ను నేను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తూ వున్నా... నీకు నా ముద్దులు.

ఇట్లు
నీ లీసెల్''

తాజాకలం: ''నిన్ను వాళ్ళు ఆ మదనసదనానికి పంపరా? నీవు చాలా ధైర్యసాహసాలుగల సైనికుడివిగదా! నీవంటే నీ సైనిక దళాధిపతులకు ఎంతో ఇష్టమని నీవు నాకు పదేపదే చెబుతూ వుండేవాడివి గుర్తుందా? వాళ్ళు మనల్ని పెళ్లిచేసుకోనివ్వకపోయినా కనీసం నాకు పుట్టబోయే బిడ్డ నీవల్లనే కలగాలని నేను కోరుకొంటున్నాను. భగవంతుడు మనమీద



దయతలచి, నా మొరాలకించి ఈ అవకాశం నాకు కలిగించాలని ప్రార్థిస్తున్నాను హేన్స్''

★ ★ ★

ఎక్స్‌ప్రెస్ రైలు గర్జిస్తూ జర్మనీకి అడ్డంగా పరుగెడుతూ వుంది. అర్ధరాత్రిదాటినా జర్మనీ నిద్రపోవడంలేదు. జర్మనీ కన్నుకునకడంలేదు. దేశం మొత్తం పనిలో నిమగ్నమై వుంది. ప్రతిస్టేషన్‌లో ఫిరంగులు, సైనికశకటాలు, మందుగుండు సామగ్రి వున్న ట్రక్కులు పశ్చిమానికి వెళ్ళే రైళ్ళలోకి ఎక్కుతూ వున్నాయి. స్టట్‌గార్ప్‌లో స్త్రీలూ పురుమలతో కూడిన కార్మికుల బృందాలు ఒక రాక్షస క్రేన్‌మీద అహర్నిశలూ పనిచేస్తూవున్నారు. పనివాళ్ళ శరీరంమీది బట్టలు చమటతో తడిసి ముద్దముద్దయి వాళ్ళ శరీరాలకే అతుక్కుపోయాయి.

రైలు త్వరితగతిన పట్టాలమీద పాములా పాకుతూ నగరానికి చేరుతూ వుంది. నగరంలోని కర్మాగారాల పొగగొట్టాలు చిమ్ముతూన్న నిప్పురవ్వలు ఆకాశంలో ప్రతిఫలిస్తూ వున్నాయి. పశ్చిమరంగానికి వెళ్ళే రైళ్ళు సైనికులతో కిటకిటలాడుతూ వున్నాయి. ఈ సైనికులందరూ యుద్ధరంగానికి వెళుతూ వున్నారు. విజయమో, వీరస్వర్గమో చవిచూస్తారు. వీళ్ళను చూస్తే వెర్నర్‌కు ఈర్ష్య కలిగింది.

మ్యూనిచ్ స్టేషన్‌లో లోకల్ ట్రయిన్ కోసం వెర్నర్ రెండుగంటలు వేచివుండవలసి వచ్చింది. స్టేషన్ ప్లాట్‌ఫారమ్, ఫలహారశాలలన్నీ శలవులు ముగించుకొని యుద్ధరంగానికి తిరిగి వెడుతూన్న సైనికులతోను, వారికి వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన బంధుమిత్రులతోనూ, పసిపిల్లలతోను కిటకిటలాడుతూ ఉన్నాయి. అంతా తొడతొక్కిడిగా, కోలాహలంగా వుంది. వీరితో వున్న వయసు మళ్ళిన పెద్దలు తాము సైనిక దుస్తుల్లో లేనందుకు కాస్త సిగ్గుపడుతూ వున్నారు. ప్రపంచమంటే ఏమిటో తెలియని పసిపిల్లలు నవ్వులతో కేరింతలాడుతున్నారు. బాధలూ, బరువులూ లేకుండా అందంగా, ఆనందంగా ఎలా నవ్వాలో తెలిసింది ఆ పిల్లలకు మాత్రమే.

వెర్నర్ ఎక్కిన లోకల్ ట్రయినులో కొద్దిమంది మాత్రమే ప్రయాణీకులు ఉన్నారు. వీరిలో అధికభాగం రైతులు. ఇద్దరు ఆడాళ్ళు చాలామంచి దుస్తులు ధరించి వున్నారు. ప్రయాణీకుల్లో మరో యిద్దరు సార్జెంట్లుకూడా వున్నారు. బహుశా వీరుకూడా తాను వెళ్ళేసదనానికే వెళుతున్నారేమో. వీళ్ళు కొంచెం చిన్నస్థాయి అధికారులు. బహుశా 'పుత్రకామేష్ఠి' కార్యక్రమానికి అధికార్లస్థాయిలోనే ఎంపిక జరుగుతూ వుందేమో!

బెర్లిన్ పీడకలను మరచిపోవడానికి వెర్నర్ కళ్ళు మూసుకున్నాడు. ఆ భయంకర స్వప్నం అతన్ని విడిచిపెట్టటంలేదు. అతన్ని వేధిస్తూ తిరిగి కళ్ళముందు కదలాడసాగింది. ఆడంబరంగా అలంకరించిన అదేగది. నీతి, నియమంలేని ఆ ఆడది నగ్నంగా, భయోద్విగ్నంగా తన వక్షాలను అతని గుండెలమీద ఊపిరాడకుండా అదుముతూ వుంది. దాని చల్లటి చేతులు తన ముఖంమీద ఆడుతూ వున్నాయి. చౌకబారు సెంటు వాసన మదించిన మనిషి చెమటతో కలిసి వచ్చే ఒకవిధమైన దుర్వాసన. ముందు జరగబోయే దాన్ని గురించిన ఊహ అతణ్ణి హతాశుణ్ణి చేసింది. లేదు... లేదు... దాన్ని తాను భరించలేడు. దాన్నుండి బయటపడటానికి ఏదో మార్గం ఆలోచించాలి... ఏదో ఒక మిష కనుక్కోవాలి...

రైలు ముందుకూ వెనుకకూ ఊగి, కూతవేసి స్టేషన్ వదలిపెట్టింది. వెర్నర్ తన సీటులో కూర్చుని, ముందేమి జరగబోతోందోనన్న ఆలోచనలను వదిలించుకోవడానికి, పుస్తకం చేతిలోకి తీసుకుని దానిలో కూరుకుపోయాడు.

వెర్నర్ ప్రయాణిస్తూన్న కంపార్ట్‌మెంట్ పక్కనున్న ఫస్ట్‌క్లాస్ పెట్టెలో ఎల్లెన్ ప్రయాణిస్తూవుంది. పందొమ్మిది సంవత్సరాల అందగత్తె. హంబర్గ్‌లోని గొప్ప షిప్పింగ్ కంపెనీ యజమాని ఏకైక కుమార్తె. ఈ ప్రయాణం ఎప్పుడు ముగుస్తుందా అని, పక్కపెట్టెలోని వెర్నర్‌లాగే చిరచిరలాడుతూ వుంది. ఆమె ఎందుకోసం వెళుతూ వుంది? వెళ్ళినచోట ఏం జరగబోతూ వుంది? డాక్టర్ నిజంగా తన పరిస్థితేమిటో కనిపెట్టగలుగుతాడా? ఇత్యాది ప్రశ్నలు ఆ పిల్లను చిరాకుపెట్టేస్తున్నాయి.

కుమారి ఎల్లెన్ అపూరూపమైన పిల్ల. ఆ పిల్లను ఆమె తల్లిదండ్రులే స్వచ్ఛందంగా





డాక్టర్ ఊర్జెర్ వద్దకు పంపుతూవున్నారు. ఆ అమ్మాయిది ఒక బాధాకరమైన అనుభవం. రైలు చక్రాలు సద్దుచేస్తూ కదిలే కొద్దీ, గత భయంకర అనుభవం ఆ అమ్మాయికి గుర్తురా సాగింది. ఆ రాత్రి తాను ''పిచ్చిపిల్ల'' వేషం వేసినందుకు ఇంత భారీమూల్యం చెల్లించవలసి వస్తోంది.

ఆ రాత్రి జరిగిన కార్నివాల్‌లో అందమైన కలగా ప్రారంభమైన ఆ అనుభవం ఆ రాత్రి భయంకరమైన దుస్స్వప్నంగా ముగిసింది.

హాంబర్గ్‌లోని అతివలకు వారిరూపలావణ్యాలను పెంపుచేసుకునేందుకు, అందాలు అలంకారాలు నేర్పే ఒక బ్యూటీసంస్థ నిర్వహించే తరగతులక్కు ఆమె హాజరయ్యేది.

ఆ సంస్థ హాంబర్గ్‌లో పేరుమోసిన పెద్ద సంస్థ. గొప్పింటి అమ్మాయిలకు తప్ప అందులో సాదా సీదావాళ్లకు ప్రవేశంలేదు. ఆ సంస్థలోని సువిశాలమైన, అందమైన గదుల్లో అరవైమందిదాకా గొప్పింటి అమ్మాయిలు తమ శారీరక సౌందర్య సంవర్ధనకోసం, అన్ని అర్హతలూగల అధ్యాపకుల పర్యవేక్షణలో శరీర వ్యాయామం చేస్తూవుంటారు.

వాళ్ళలో ఎల్లెన్ స్త్రీత్వం మూర్తీభవించిన అందాలభరిణె. ఒడ్డూపొడుగూగల పిల్ల. గోధుమరంగులో నిగనిగలాడే జుత్తు. నిండు యవ్వనగర్వంతో నిక్కిచూసే చనుదోయి, శారీరక వ్యాయామంతో సొంపుదీరిన కందిరీగ నడుము, బలంగా, పుష్టిగా ఏపుగా అరటిబోదెల్లావున్న కాళ్ళు ఒక్కసారిచూస్తే కంటికి నదురుగా మరచిపోలేని స్ఫురద్రూపి. తన సంస్థలోనే ఈ పిల్ల మణిపూసలాంటిదని, అందాలకు అందాలు దిద్దగల అతివ అని ఆ సంస్థ నిర్వాహకురాలు మురిసిపోతూవుండేది.

మోలిన్‌లోని తమ ఎస్టేట్‌లో, అందాలు విరబూచిన ఉద్యానవనంలో సూర్యరశ్మిలో చలికాగుతూ ఎల్లెన్ తొలిసారిగా తన అందాలను తాను చూసుకుంది. ఒక చివర మాత్రమే నడుమును ఆనించే ఏర్పాటున్న ఒక ప్రత్యేకమైన సోఫా ''చెయిర్‌లాంజ్''లో ఆమె చేరగిలబడివుంది. అప్పుడామె రెండు గుడ్డముక్కలతో రూపొందించిన బేతింగ్ సూట్‌లో వుంది. ఆ డ్రస్సు ఆమె వక్షాన్నీ పిరుదులను కప్పడానికి కూడా చాలీచాలకుండా వుంది. గూస్‌బెర్రీ చెట్లచాటున దాక్కుని తమయింటి ముసలితోటమాలి తన అందాలను దొంగచాటుగా, తదేకంగా చూస్తున్నట్లు ఎల్లెన్ గ్రహించింది.

''ఏయ్! సిర్క్... ఇటురా. గూస్‌బెర్రీపండ్లు పంటకొచ్చాయా?'' అంటూ వాడిని పిలిచి అడిగింది.

వాడు నక్కినచోటునుండి భయపడుతూ బయటికివచ్చి ''తొందర్లోనే పండుతాయమ్మగోరూ. ఎండ యిట్లా ఫెళఫెళాగాస్తాఉంటే ఇంక వారందినాల్లోనే పండిపోతాయండి'' అంటూ నంగినంగిగా సమాధానం చెప్పాడు.

నిజానికి వాతావరణం వేడిగానేవుంది. ఎల్లెన్ తన రెండుచేతులనూ తలపైకిఎత్తి వళ్ళు విరుచుకుంది. ఆమె బాహుమూలల్లో నుండి బంగారుకాంతులు వెదజల్లుతూ నిగారించే వక్షరేఖ వాడికంటపడటం వాడు గుడ్లప్పగించి ఆ అమ్మాయిని మింగేసేలా చూడటం కూడా ఆ పిల్ల గ్రహిస్తూనే వుంది.

అసలే వంటికి గిలిగింతలు పెట్టినట్లుండి శరీరంలో కోరికలు మొలకెత్తిస్తున్న సూర్యుని లేతకిరణాల తాపం. దానికితోడు అతగాడి వాడిచూపులు కూడా తన శరీరాన్ని గుచ్చుకుంటున్నట్లు అనిపించింది. ఆ అమ్మాయి రెండుకాళ్ళూ బార్లాజాపి కాలిబొటనవేళ్ళను అటూయిటూ ఊపసాగింది. అదిచూసిన ముసలాడి మోకాళ్ళుకూడా చురుగ్గా ఊగాయి.

''ఏయ్ సిర్క్... ఎండ కళ్లలో పడుతూ వుంది. ఆ గొడుగును దగ్గరగా జరుపు'' అంటూ కేకేసింది.

ఆ ముసలితోటమాలి దూరంగా పాతివున్న ఎండగొడుగు చువ్వను లాగుతూవుంటే, ఎల్లెన్ తాను ధరించివున్న బేతింగ్‌సూట్ బ్రాగుండీలు విప్పింది. ఆ పిల్ల కూర్చున్నచోట ఎంతతగలకుండా, దగ్గరగా ఆ గొడుగును పాతడానికి వాడు రావడంతో ఆ అమ్మాయి వక్షం పూర్తిగ్నంగా వాడిచేతికందే దూరంలో కనిపించింది. అంత నగ్నసౌందర్యాన్ని అంతదగ్గరగా చూసినవాడు ఉగ్గపట్టుకోలేకపోయాడు.

వాడి అవస్థచూసి ఆ పిల్ల ''పాపం ముసలాడు'' అని నవ్వుకుంది. వాడు ఎండగొడుగును పాతుతూవుంటే చిలిపిగా తనచేత్తో వాడితల నిమిరి ''కష్టమైనపని చేయిస్తున్నాగదూ''

అంటూ వరాచికమాడింది.

ఆమె శరీరం మీదనుండి వచ్చే సెంటు ఘుమఘుమలను వాడు గట్టిగా పీల్చుకున్నాడు. కంటికి ఎదురుగా, చేతికి అందేటంత దూరంలో నగ్నంగా కనిపిస్తోన్న ఆమె వక్షం వాణ్ని సవాలుచేస్తున్నట్లుగావుంది. వాడు ఇకనే మాత్రం నిగ్రహించుకోలేకపోయాడు. ఆమె స్తనాలను గట్టిగా పట్టుకొని మర్దించి పారిపోయాడు.

మునలాడు ఈ పనిచేస్తూవుంటే ఎల్లెన్‌కు కోపం రాలేదునరికదా, ఏదో తెలియని హాయిన నుభవించింది. ఈపని ఎవడైనా మాంచి కుర్రాడితో చేయించుకుంటే ఇంకెంత హాయిగా వుంటుందోనన్న తలంపు కలిగింది.

ఆమె ఆశ నెరవేరడం కష్టమేమీగాదు. హాంబర్గ్‌లోని ధనికవర్గాల యువకులకు ఆ పిల్ల సిద్ధాన్నంలాంటిది. ఆ అమ్మాయిని చేపట్టడమంటే కోట్లరూపాయల వ్యాపార ఒప్పందాన్ని కుదుర్చుకున్నట్లే. దానితోపాటు మన్మథసామ్రాజ్యం కొల్లగొట్టినట్లే. ఆ పిల్ల తన తల్లిద్వారా విలాసంగా బతకడంలోని ఆనందాన్ని వుణికి పుచ్చుకుంటే, తండ్రిద్వారా అపారసంపదకు వారసురాలైంది. అందుకే ఆచేయి అందుకొనడం ఎవరికైనా సుసాధ్యమైనపనేంగాదు. అయినా అనేకమంది ఆ పిల్ల పొందుకోసం తహతహలాడేవారు. అంతేగాదు ఆ ధనికసమాజంలోని చాలామంది కోడెగాండ్రు ఆమెను తామనుభవించినట్లే గప్పాలు కొడుతూవుంటారు.

అది నిజంగాదు. అప్పుడే వికసిస్తున్న అనాఘ్రాత పుష్పంలాంటి ఆ పిల్ల యవ్వనాన్ని అనుభవించిన తొలివ్యక్తి పదిహేడేళ్ల వయసుగల ముక్కుపచ్చలారని బాలుడు. అప్పుడు ఎల్లెన్‌కూడా ఆ కుర్రాడియీడుదే. ఒకసారి బాలబాలికలు కలిసి బాల్టిక్ సముద్రతీరానికి విహారయాత్రకు వెళ్ళారు. ఆ రాత్రి ఆ కుర్రాడు ఎల్లెన్ అందాన్ని దోచుకున్నాడు. అయితే ఆ పిల్ల తన తొలియవ్వనాన్ని కొల్లగొట్టిన ఆ కుర్రాడితోనూ, ఆ తర్వాత తన పరిధిలోకి వచ్చిన కోడెకారు కుర్రాళ్ళతోనూ చాలా తెలివిగా, జాగ్రత్తగా మెలిగేది. అందరికీ అందుబాటులో వున్నట్లేవుండి ఎవరికీ అందకుండా ప్రవర్తించేది. ఆమెది పొద్దుతిరుగుడు పువ్వులాంటి హృదయం. ఆ పువ్వును చూసిన ప్రతివాడికీ అది తనవైపే వాలినట్లు వుంటుంది. కానీ, ఆ పిల్లమాత్రం తన చుట్టూ ముళ్ళను కాపలాగా వుంచుకున్న రోజాపువ్వులాంటిది. తనను హడావిడిగా అందుకోవచ్చిన వాళ్ళను ముళ్ళతో కాటువేసి తననుతాను కాపాడుకోగలదు. వ్యక్తిత్వం విషయంలో కూడా ఆమె ఎవ్వరికీ తలవంచని వజ్రసన్నిభమైన ఎర్రచందనం చెట్టులాంటిది.

విచ్చి వికసించి పరిమళాలు వెదజల్లే పుష్పంచుట్టూ పరిభ్రమించే గండు తుమ్మెదల్లా ధనిక సమాజంలోని కుర్రకారంతా ఆపిల్ల చుట్టూచేరి ఆ అమ్మాయి యవ్వన మకరందాన్ని జుర్రుకుందామని ఎంత ఆశించినా ఆపిల్ల వారి నందరినీ తన కడకంటి చూపుతో, ప్రేమసరాగాలతో కట్టిపడేసి, తనచుట్టూ తిప్పుకునేదేతప్ప, వారికి పూర్తిగా వశమయ్యేదిగాదు. 1943లో ఒకనాడు జరిగిన కార్నివాల్‌లో ఆ దురదృష్టకర సంఘటనవరకూ యిదే పరిస్థితి.

కార్నివాల్‌లో పాల్గొన్న ఆడవాళ్ళందరూ పార్టీ చేసుకుంటున్నారు. ఒకవైపున యుద్ధంలో దేశం అల్లకల్లోలంగావున్నా ఈ పార్టీలో పాల్గొంటూవున్న ధనిక సమాజపు స్త్రీల ఉల్లాసానికీ, ఉత్సాహానికీ అంతేలేదు. సంగీతం, నాట్యం, మద్యం, ఫాషన్ పెరేడ్‌లతో హోరెత్తిన ఈ పార్టీ చివరకు రసికజన మనోహారంగా మారింది. సాయంత్రం అయ్యేసరికి చాలామంది అమ్మాయిలకు తమసాటి ఆడాళ్ళనే పట్టుకుని డాన్స్‌చెయ్యడం బోరుకొట్టింది. ఆడాళ్ళతో ఆడాళ్ళే చేయీచేయీ కలిపి కులకడం అందమా చందమా? థ్రిల్ కావాలంటే ఆడదీ మగాడూ కలిసి డాన్స్ చెయ్యాలి. అందుకే మరెక్కడికైనా వెళ్ళి మగవాళ్ళతో కలిసి కులకాలనుకున్నారు.

ఇలా నిర్ణయించుకున్న నలుగురు ఆడపిల్లల్లో ఎల్లెన్ ఒకటి. అనుకున్నదే తడవుగా వాళ్ళు నలుగురూ దాపులోవున్న నైట్‌క్లబ్ చేరారు. హఠాత్తుగా ఊడిపడ్డ ఈ అప్సరసలను చూస్తూనే నైట్‌క్లబ్‌లోని రసికులకు మతులుపోయాయి. ఈ నలుగురు ఆడపిల్లలను నలుగురు మగపురుషులు చుట్టుముట్టారు. వాళ్ళు పెద్ద ఆఫీసర్లు. కార్నివాల్ గౌరవార్థం తాము




కూడా ఫ్యాన్సీడ్రెస్‌లో వున్నవాళ్ళమేనని ఆ అధికారులు ఈ ఆడపిల్లలతో నమ్మబలికారు. ఈ ఆఫీసర్లు నలుగురూ యుద్ధరంగానికి తిరిగివెళ్ళేముందుగానే బస్తీలో దొరికే ప్రతి అందాన్నీ, ఆనందాన్ని రుచిచూసి అనుభవిద్దామనే తహతహలో వున్నవాళ్ళు. వాళ్ళు ఈ అందాల భామలను తమతో విందుకు ఆహ్వానించారు. అప్పటికే పార్టీలో షాంపేన్ తాగి సగం కైపులోవున్న ఈ పిల్లలు వాళ్ళు అడగడమే తరువాయి వాళ్ళతో విందుభోజనం చేయడానికి ఒప్పేసుకున్నారు.

ఆ విందులో మద్యంతోపాటు సరస సంభాషణలు కూడా శృతిమించి ప్రవహించాయి. ఈ యువతులు కార్నివాల్ పార్టీ నుండి బోరుకొట్టి మగతోడు కోసం ఇక్కడికి పరుగెత్తారని ఆ అధికారులు ఎన్నడో గ్రహించారు.

"ఆ పార్టీలో మీరు నగ్నంగా నృత్యం చేసిన మాట నిజమేనా?" ఓ అధికారి ప్రశ్నించాడు. అది నిజమే. ఆపార్టీలో ఆడవాళ్ళందరూ ఒకరితో ఒకరు కలిసి నగ్ననృత్యమే చేశారు. అలాంటప్పుడు దేశంకోసం ప్రాణాలనే బలిపెట్టే అధికారులముందు నగ్ననృత్యాలు చేసి వాళ్ళకు కనువిందుచేస్తే తప్పేముంది. ఇంత సుందర దృశ్యాన్ని వాళ్ళు తనివితీరా ఆనందిస్తారు గదా? ఇదే కోర్కెను వెలిబుచ్చారు అధికారులు.

ఈ విషయంలో ఆ యువతులను ఎక్కువగా బతిమాలవలసిన అవసరంలేకపోయింది. ఆ ఆడపిల్లలకు నగ్ననృత్యం అనేది భయంకరమైనదీగాదు, అసహ్యకరమైనదీగాదు. అది ప్రకృతిలో భాగం. వాళ్ళు బ్యూటీ సంస్థలో శారీరక వ్యాయామంలో భాగంగా నగ్ననృత్యానికి అలవాటుపడినవారే. అందువల్ల ఆ నైట్‌క్లబ్‌లో ప్రత్యేక్యంగా వున్న సోఫామీద వాళ్ళ వంటిమీది బట్టలన్నీ ఒక్కొక్కటీ ఎగిరి పోగుపడ్డాయి. సైనికాధికారులు ఆనందంగా కేరింతలు కొడుతూ, లొట్టలు వేస్తూవుంటే ఆ యువతుల నగ్ననృత్యం సాగుతూంది.

ఇంతలో ఎవరో హఠాత్తుగా లైట్లు ఆర్పేశారు. దీపాలు ఆరుతూనే ఆగదిలో ఆడపిల్లల ఆర్తనాదాలు, మగవాళ్ళ వెకిలి నవ్వులూ, ఆడపిల్లలకు గిలిగింతలు పెడుతూ వాళ్ళుచేసే చిలిపి చేష్టలకు నిరసనలూ ప్రతిధ్వనించాయి. అయితే, ఆ సైనికాధికారులు చీకటికిగానీ, ఆడపిల్లల ఆర్తనాదాలకుగానీ భయపడే రకంగాదు....

రాత్రంతా అలానే రమించింది. ఆరాక్షస రతిలోనే తెల్లవారింది. ఉదయమే అమ్మాయిలు లేచారు. రాత్రి త్రాగిన మద్యం మత్తునూ, జరిగిన కామక్రీడల గుర్తులనూ వదిలించుకుని ఇంటి ముఖం పట్టారు. అమ్మాయిలంతా గంభీర వదనాలతో వున్నారు. ఏదో పాపంచేశామన్న భయంతో కుంగిపోతూ వున్నారు. 'ఒక తప్పు తప్పుగాదు. ఒక రాత్రి అనుభవం కాపురమూ గాదు' అన్న పాత సామెతను ఎవరో గుర్తు చేసేదాకా తమలోతాము మాట్లాడుకోనే లేదు. ఒకరి ముఖం మరొకరు నిర్భయంగా చూసుకోలేదు. ఏంజరిగినా యిది గూడా ఈస్టర్ పండుగనాటి చివరి మంగళవారంలాగే, తమ కార్నివాల్ చివరి రోజున జరిగే వేడుకలాంటిదేనని ఎవరికివారు సరిపెట్టుకున్నారు.

ఈ పొరపాటుకు కారణమేమిటి? తన మద్యంమత్తా?, ఆ సైనికాధికారి ఉద్రేకమా? ఏదీ తెలుసుకునేస్థితిలో లేదు ఎల్లెన్. మామూలు పరిస్థితుల్లోనైతే ఆ పిల్ల ఈ వ్యవహారాన్ని అంతగా గుర్తుంచుకునేదిగాదు. అయితే కొద్ది రోజుల తరువాత ఈ సంగతంతా ఆ అమ్మాయి తన తల్లికి అయిష్టంగానే అయినా చెప్పకతప్పిందిగాదు. కారణం ఆ పిల్ల నెలతప్పడమే.

అది విన్న ఎల్లెన్‌తల్లి దిగులుతో కుంగిపోతే, తండ్రిమాత్రం ఆగ్రహంతో చిందులేశాడు. 'ఆవుచేలోమేస్తే దూడగట్టున మేస్తుందా? తల్లి ఎలాంటిదో పిల్లా అలాంటిదే'అంటూ భార్యమీద రంకెలేశాడు. హాంబర్గ్ నగరంలో తన సాటి యెవరూ లేరంటూ గర్వంగా తలెత్తి తిరిగిన ఆ నౌకాయజమాని యీ ఉదంతంతో కుప్పకూలిపోయాడు. ఇక ఈ నగరంలో తనకు మర్యాదన్నదే వుండదు. అందరూ తన ముఖాన్నే నవ్వుతారు. తనపరువు సాంతం పోయినట్లేనని వ్యధచెందాడు.

ఆ రాత్రి ఆ అమ్మాయిని అనుభవించినవాడెవడో, వాడిపేరేమిటో గూడా ఆ పిల్లకు తెలియదు. ఆ రాత్రి తనను పెనవేసుకున్నవాడు పొడుగ్గా, రాగిరంగు జుత్తుతో, మిసమిసలాడే

దేహచ్ఛాయతో చాలా అందంగా వుంటాడని మాత్రమే ఆ పిల్లకు తెలును.

ఆ పిల్ల తండ్రి కొండమీదికోతినైనా చిటికెలో దించుకురాగల సమర్థుడే. కానీ ఆ పిల్ల చెప్పిన అరకొరసమాచారంతో వాడిని యెలా వెతికిపట్టుకొనేటట్లు? ఆ తండ్రికేమీ దిక్కుతోచలేదు. ఈ అవమానం నుండి ఎలా బయటపడడమా! అని పిచ్చెత్తినట్లు ఆలోచిస్తూవున్నాడు. అతను యేంచేయాలో తోచక మానసికవ్యథతో కుమిలిపోతూవున్న సమయంలోనే డాక్టర్ ఊర్జెర్ హాంబర్గ్‌లో దిగాడు. హిట్లర్ తరపున ఈ డాక్టరుగారు నిర్వహిస్తున్న ఘనకార్యం తెలిసి పదిమందిలో తన పరువు కాపాడుకోవాలంటే తన కూతుర్ని గుట్టుచప్పుడుగాకుండా మదనసదనానికి పంపడమే మంచిదని భావించాడు. ఈ ఆలోచన రాగానే అతనికి మూషారొచ్చింది. ఒక్కదెబ్బకు రెండు పిట్టలు. తన పరువూపోదు, పైగా తాను దేశంకోసం స్వచ్ఛందంగా చేస్తూవున్న త్యాగం అధికారవర్గాలలో ప్రశంసాపాత్రమౌతుంది. తన కూతురి నీతిమాలిన వ్యవహారం బయటికి పొక్కి నలుగురినోళ్ళలో నానకముందే పాపపరిహారం జరిగిపోతుందనుకున్నాడు.

ఈ ఆలోచన రావడమే ఆలస్యం అతను డాక్టర్ ఊర్జెర్‌ను కలునుకొని మాట్లాడాడు. నగరంలోని యింత గొప్పవ్యక్తివచ్చి స్వయంగా తనకూతుర్ని పంపుతానంటే కాదనేదెవరు? అందుకే డా॥ ఊర్జెర్ ఈ పుత్రకామేష్టికి తొలుత తాను నిర్దేశించిన ప్రమాణాలను నడలించాడు. సమాజంలో ఈ పిల్ల హోదా, అంతస్తూ అలాంటివి. అందుకే యెలాంటి ఆరోగ్యపరీక్షా లేకుండానే ఈ అమ్మాయిని ఎంపికచేశాడు.

కల్నల్ ఓంకోల్జ్‌కు గూడా ఈ పిల్ల బాగా నచ్చింది. తన ఒంటికంటి కళ్ళజోడుతో ఆ అమ్మాయిని నఖశిఖపర్యంతం నిశితంగా పరిశీలించాడు. ఆ పిల్లతండ్రి వెళ్ళిపోయిన తరువాత, డాక్టరూ తానూ యిద్దరే ఉన్నప్పుడు "ఇంతకూ ఈ అందాల భరిణె కన్యేనా?" అని ప్రశ్నించాడు.

"కాదు" అని చెబుతూ డాక్టరు, "నిజానికి నాకే ఆశ్చర్యమనిపించింది..." అంటూ ఏదో చెప్పబోతూవుండగా కల్నల్ వచ్చేనవ్వును ఆపుకున్నాడు. అందులో కల్నల్‌కు ఆశ్చర్యమేమీ కనిపించలేదు. ఎందుకంటే, ఆ నౌకాయజమాని తమతో మాట్లాడుతూ, తన కుమార్తెను మదనసదనానికి పంపడానికిగల కారణాలనూ, తన దేశభక్తినీ గురించి రసవత్తరంగా వివరిస్తూవుంటే తనకు అనుమానం కలిగింది. ఇదే దో కథేనని అనుకున్నాడు. తనకూతురికి సంభవించిన విపత్తుకు తల్లడిల్లిన ఆ తండ్రి ఈ విధంగా తన కూతుర్ని రక్షించుకొనడానికీ, తన కుటుంబానికి వచ్చే కళంకాన్ని బాపుకొనడానికీ పథకంవేశాడు. ఈ 'దేశభక్తియుత త్యాగం' తన కూతురు చేసిన చీకటితప్పుకూ, దానివల్ల కలగబోయే అక్రమసంతానానికీ చట్టసమ్మతమైన పవిత్ర ముసుగును తొడుగుతుంది. దీనితో సర్వపాపపరిహారం జరిగిపోతుంది. ఇదే మరొకరెవరైనా వచ్చి తన బిడ్డను స్వీకరించమంటే, ఆ పిల్లను మనసదనానికి పంపేముందే ఆ పిల్లకు కన్యాత్వపరీక్ష జరిపి, పరిశీలనలోవుంచాలని తాను పట్టుబట్టివుండేవాడు. కల్నల్‌ను మాయమాటలతో ఎవరూ మోసగించలేరని నిరూపించివుండేవాడు. కానీ ఈ నౌకాయజమాని హిట్లర్ అధికారపార్టీ అయిన నేషనలిస్టుపార్టీకి పెద్దయెత్తున నిధులు సమర్పించే మహారాజపోషకులలో ఒకడు. రాజకీయంగా పలుకుబడికలిగిన పెద్దలపాపాలను బయటపెట్టి బజారుకెక్కించే సమయంగాదిది. ఇది యుద్ధకాలం. అయినా, ఆ పుట్టబోయేబిడ్డకు యేహీరో తండ్రయితే యెవరికి కావాల్సొచ్చింది అని మనసులో తలపోసి, "తన స్వంతమనిషిని ప్రభువే గుర్తిస్తాడు" అన్నాడు.

ఈ విధంగా డాక్టరూ కల్నల్ కూడబలుక్కొని ఎల్లెన్‌కు అన్నివిధాలా పనికొచ్చే పిల్లగా సర్టిఫికెట్ యిచ్చారు. ఆ సర్టిఫికెట్ పుచ్చుకున్న ఆ పిల్లను యిదేరైలు మదనసదనానికి మోసుకెళుతూవుంది.

★ ★ ★

ఇదే రైలులో ఆ అమ్మాయి కంపార్ట్‌మెంట్‌కు ముందున్న రెండవ తరగతిబోగీలో ఒట్టోహార్డూఫ్, కారల్ క్రమ్మెలీన్ ఉల్లాసంగా పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ వున్నారు. వీళ్ళిద్దరూ మ్యూనిచ్ రైల్వేస్టేషన్ ఫలహారశాలలో ఒకర్నొకరు కలునుకున్నారు.





''మీరు మదనసదనానికి వెళుతున్నారా?'' కారల్ ప్రశ్నించాడు.

''అవును... మీరుకూడానా?'' ఒట్టో సమాధానం, ప్రశ్న.

వాళ్ళ స్వభావాలు, వాళ్ళపూర్వపు అంతస్తులు, కుటుంబనేపథ్యాలు యెలాంటివైనా మదనసదనానికి వెళ్ళే ఒక్క అంశమే వారిద్దర్నీ మంచి స్నేహితుల్నిచేసింది. మిగతా ప్రయాణమంతా వాళ్ళిద్దరూకలిసే వున్నారు. తమ ఆశలు, ఆశయాలూ, ఈ యాత్రలక్ష్యాలూ మున్నగువాటిగురించి పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కాలక్షేపం చేస్తూవున్నారు.

తాము వెళుతున్న మదనసదనాన్ని గురించీ, అక్కడ తాము చేయబోయే ఘనకార్యం గురించీ తెలిసినవీ తెలియనివీ అన్నీ చెప్పుకుని ఆ యిద్దరు సార్జెంట్లూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకుంటూ వున్నారు.

''బవేరియాలో మనకు మంచిగాలీ, వెలుతురూ గల వాతావరణం దొరకదనుకుంటా, మనం అక్కడ సూర్యస్నానాలు చెయ్యడానికి వీలువడదనుకుంటా... అవునా?'', అంటూ అడిగాడు ఒట్టో.

'మనం అక్కడికి వెళ్ళేది సూర్యస్నానాలకు గాదు బ్రదర్ ,కోతిచేష్టలకు' అంటూ పగలబడి నవ్వాడు కారల్.

తాను ఎలాంటి ఆడదాన్ని ఎంచుకోవాలో ఒట్టోకు బాగా తెలును. అందుకే తాను ఎంచుకునే అమ్మాయి కండలూ కైవరాల వొంపులను తన కుడిచేత్తో గాలిలోగీస్తూ ''అలా... అలా... వుండాలి'' -అంటూ వివరిస్తూవున్నాడు.

''నిజమే... నీకు పుట్టబోయే బిడ్డను పెంచడానికి ఆ అమ్మాయికి మాంచి నర్సుకావాలి'' అన్నాడు కారల్.

''బిడ్డను గురించి ఎవడేడిచాడిపుడు?'' అంటూ ఒట్టో పకపకా నవ్వాడు. ''నేనిప్పుడు ఆలోచిస్తూవున్నది తల్లిని గురించే. ఆ పిల్ల మాంచి రంజైన రంగులో వుందా? చామనఛాయగా వుందా? రాగిరంగు జుత్తుదా? లేక గోధుమరంగు జుత్తుదా? యేదైనా నాకు ఫరవాలా. అనుభవించడానికి కావలసింది కండలూ కైవారమూ వున్న ఆడది. అలావుంటే చాలు''

''నీకు యెలాంటి రంగు కళ్ళంటే యిష్టం?'' కారల్ ప్రశ్న.

''రంగెందుకోయ్ రంగు.. ఏరంగైనా పెద్దపెద్ద కళ్ళున్నది కావాలి''

''నాకు మాత్రం నీలికళ్ళ పిల్ల కావాలి. ఆడదాని మనస్సూ, హృదయమూ కళ్ళలోనే ప్రతిబింబిస్తాయి తెలుసా'' అంటూ మనసులో మాట చెప్పాడు సార్జెంట్ కారల్.

వీళ్ళిద్దరూ యిలా కబుర్లలో వుండగానే రైలు గమ్యం చేరింది. రైలు స్టేషన్‌లోకి ప్రవేశించగానే వెర్నర్ కిటికీలోనుండి బయటకు చూశాడు. అంతకుముందు మ్యూనిచ్‌స్టేషన్‌లో తాను చూసిన యిద్దరు చిన్నహోదాలో వున్న సార్జెంట్లు రైలు దిగారు. వాళ్ళవెంట యిద్దర మ్మాయిలు కూడా దిగారు. వెర్నర్ తన లగేజీ చేతపుచ్చుకుని కంపార్ట్‌మెంట్ తలుపు తెరిచాడు.

రైల్వేస్టేషన్ బయట ఒకకారు నిలిచివుంది. ఆ కారు డ్రయివరు ఒక స్త్రీ. రైలుస్టేషన్‌లోకి రాగానే ఆ మహిళా డ్రయివరు ప్లాట్‌ఫామ్ మీదికి పరుగెత్తింది.

ఆమె కారల్ చేతిలోని లగేజీ అందుకుంటూ 'లగేజీ యిలా యివ్వండి. మీరు మదనసదనానికి వచ్చేవాళ్ళేగదూ?'' అని అడిగి, ఆ పక్కనే వున్నవాళ్ళవైపు తిరిగి ''బహుశా వీళ్ళుగూడా అక్కడికేననుకుంటా. మీరు ముందు కారులో ఎక్కండి'' అని చెప్పింది.

ఇంతలో ఒక మహిళా ప్రయాణీకురాలు కారల్ వద్దకు వచ్చింది. ఆమె పొడవుగా, నల్లగా, బక్కపలుచగా వుంది. ముఖం చూస్తే చాలా సాదాసీదాగా నిర్వికారంగా వుంది.

''లెఫ్టినెంట్ నేనూ మీ వెంటవచ్చేదా? నేనుగూడా డాక్టర్ ఊర్జెర్‌ను చూడాలి'' అని చెప్పింది.

''నేను కూడా'' మరో యువతి అందుకుంది.

''అలాగేరండి'' అంటూ కారల్ ముందు ఆ యిద్దరు యువతులు ఆ కారులో ఎక్కేదాకా ఆగాడు.

రెండు పర్వతాల మధ్య ప్రవహిస్తున్న నది పై గల చెక్క వంతెనపై కారు వెళుతూ వుంది.



తర్వాత శిఖరాలకు చేరే విశాలమైన బాట వుంది. లోయలను, పర్వతాలనూ కలుపుతూ మెలికలు మెలికలు తిరిగి పైకెక్కుతూ వున్న ఆ బాటలో కారు పాకుకుంటూ ప్రయాణిస్తూ వుంది.

కారులోని ఏ ఒక్కరూ పెదవి విప్పడం లేదు. రైలులో నోటికొచ్చిందల్లా పేలుతూ వచ్చిన ఆ యిద్దరు సార్జెంట్లూ యిప్పుడు ఒక పైఅధికారి ముందు పెదవి విప్పడానికి భయ పడుతున్నారు. వాళ్ళ కారులోని యిద్దరు యు వతులను చూస్తూ, తమలో తాము కళ్ళతోనే సైగలు చేసుకుంటున్నారు.

కారు చివరి శిఖరం చేరింది. అక్కడి నుంచి చూస్తే 'మదననదనం' వున్న లోయ అందాలు కారులోనివారందరికీ ఆనందం గొ లుపుతున్నాయి.

చుట్టూ దట్టమైన అడవి. మధ్య సరస్సు. దాని తీరంలో

మధ్యయుగాలనాడు క్రైస్తవ సన్యాసినుల కోసం కట్టిన మఠం.

పచ్చని ప్రకృతి మధ్య ఆ మఠాన్ని చూస్తూ వుంటే

పచ్చల మధ్య నీలమణిని పొదిగినట్లుగా వుంది.

"అబ్బ... స్వర్గంలోకి వచ్చాం" అంటూ ఒక సార్జెంట్ లొట్టలేశాడు.

నిర్మాణానికి పూనుకొన్నారు.

దక్షిణ బవేరియాలో చుట్టూ ఎత్తయిన పర్వ తాలు పరివేష్టించిన ఒక లోయలో. చూసేవారి కి గుండెఝల్లుమనిపించే కీకారణ్యం మధ్య, ఒక నదీతీరం వద్ద వాళ్ళు ఈ మఠం కట్టుకు న్నారు. వాళ్ళు ఆనాడు కట్టుకున్న ఈ మఠం శత్రు దుర్భేధ్యమైన పెద్ద కోటలా వుంది.

ఈ మఠంలో తొలుత కట్టిన ఎనభైగదుల్లో నూ సన్యాసులు వుండేవారు. వారు ప్రశాంత వాతావరణంలో దైవప్రార్థన చేసుకుంటూ కాలం గడిపేవారు. వారంతా ఆ ప్రాంతాన్ని చూడాలని వచ్చే ఏ వినోదపర్యాటకుని దృష్టీ తమమీద పడరాదనే ఉద్దేశంతో మఠానికి చు ట్టూ వున్న ముప్పయి ఎకరాల భూమిని ఆక్ర మించి, దాని చుట్టూ ఎత్తయిన కోటగోడ లాంటిది కట్టారు. ఈ మఠం బయటివారికి కనిపించకుండా దాని చుట్టూ ఉద్యానవనం పెంచారు. కొంతభూమిని సాగులోకి తెచ్చి కూర గాయలు పండించసాగారు. అడవినిండా జింకలు, దుప్పులు, చెవులపిల్లులు లాంటి వేట జంతువులు, సరస్సునిండా చేపలు సమృద్ధిగా వుండటంతో వారికి ఆహారం పుష్క లంగా లభించి ఆనందంగా కాలం గడపసాగా రు.

అయితే మిగతా ప్రపంచం వాళ్ళను ప్ర శాంతంగా బతకనివ్వలేదు. తొలుత ముప్పయి యేండ్ల యుద్ధం, తరువాత ప్రష్యా



పదిహేనవ శతాబ్ది ఆరంభంలో ఇటాలియన్ సన్యాసులు తమకోసం బవేరియాలో మఠం

ఆస్ట్రియా యుద్ధం, ఆటుపిమ్మట ఫ్రెంచి ప్ర ష్యన్ యుద్ధాలు సంభవించి శాంతిని భగ్నంచే శాయి. ప్రస్తుతం ద్వితీయ ప్రపంచ సంగ్రామం పేరుతో ప్రపంచాన్ని చుట్టుముట్టిన కల్లోలం ఈ మఠాన్ని మదననదనంగా మార్చింది. ఈ





మఠంలో ప్రశాంతంగా దైవప్రార్థన చేసుకునే వారిసంఖ్య కాలంగడిచే కొద్దీ క్రమంగా తగ్గిపోతూ వచ్చింది. 1943నాటికి ఈ మఠంలో కేవలం ఆరుగురు సన్యాసులు మాత్రమే మిగిలారు. వాళ్ళుగూడా పండుముదుసలులు. ఈ కన్నీటి కడలి తరించడానికి ప్రభువు పిలుపు కోసం ఎదురుచూస్తూ కాలం గడుపుతున్నారు.

ఇటీవల ఓంకోల్జ్, అతని భార్య యూరప్ లోని మారుమూల ప్రాంతాలన్నింటిలో విలాస యాత్ర జరపాలని బుద్ధిపుట్టి బయలుదేరినప్పుడు ఒక మజలీలో వారికి ఈ మఠం కంటబడి బాగా ఆకర్షించింది. ఆ తర్వాత హిట్లర్ స్వచ్ఛమైన ఆర్యజాతిని సృష్టించడానికి ఉద్దేశించిన తన సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడానికి ఒక ప్రత్యేక శిబిరాన్ని నెలకొల్పతలపెట్టి, ఈ మహత్కార్య నిర్వహణకై ఓంకోల్జ్‌ను నియమించాడు. హిట్లర్ ఆశయ సాఫల్యానికి పర్వత సరస్సు తీరాన వున్న ఈ మఠం అన్నివిధాలా బాగుంటుందని ఓంకోల్జ్ భావించాడు. దాదాపు అంతా ఖాళీగా పడివున్న ఈ మఠాన్ని చిన్నచిన్న మరమ్మతులు, మార్పులు చేస్తేసరి. బవేరియాలోని ఈ ప్రశాంత క్రైస్తవ మఠం ప్రేయసీప్రియులకు స్వర్గధామంగా మదనసదనంగా మారుతుందని తలపోశాడు.

బల్మితో పట్టదలచుకున్న వారికెపుడూ అందమైన, అపురూపమైన దానిమీదే కన్ను పడుతుందన్న చందంగా ఈ మఠం ఉదంతాన్ని కౌంట్ ఓంకోల్జ్ మహాశయుడు జగజ్జేత ఫ్యూరర్‌కు నివేదించాడు. "అక్కడైతే అమ్మాయిలకు రక్షణ వుంటుంది యూరప్‌లోని యితర ప్రాంతాలన్నింటికంటే గూడా గ్రామాలకూ, నగరాలకూ దూరంగా పర్వతాలతో, అడవులతో పరివేష్టించిన ఈ మఠంలోనే ఆడపిల్లలకు భద్రత వుంటుంది. అక్కడి ప్రకృతి దృశ్యాలు చూడటానికి రెండు కళ్ళూ చాలవు. క్రీడలకు గూడా అనువుగా వుంటుంది. వేసవిలో పర్వత సరస్సులో జలక్రీడలాడవచ్చు. గడ్డకట్టే శీతాకాలంలో మంచుమీద స్కేయింగ్ ఆడుకోవచ్చు. అక్కడున్నంత స్వచ్ఛమైనగాలి మరెక్కడా దొరకదు. ఆ మఠంలోని సన్యాసులందరూ నిండా వందేళ్ళూ జీవించారు" అని హిట్లర్‌కు వివరించాడు ఓంకోల్జ్.

హిట్లర్ ఈ ప్రాంతాన్ని స్వయంగా దర్శించి, తన సలహాదారు సూచనను అంగీకరించాడు. రాజుగారు తలచుకోవడమే ఆలస్యం. తాపీ పనివాళ్ళు, వడ్రంగులు, రంగులేసే వాళ్ళూ బిలబిలమంటూ మఠంలోకి వచ్చి వాలారు. కొన్ని నెలలలోనే వాళ్ళు ప్రాచీన కోటలాంటి ఆ మఠాన్ని అత్యాధునాతనమైన బోర్డింగ్ స్కూలుగా మార్చారు. శతాబ్దాల కాలాన్ని, దురాక్రమణదారుల్ని తట్టుకొని నిలిచిన అభేధ్యమైన గోడలను వారు ఏమాత్రం ముట్టుకోకుండానే, మఠంలోపల సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు జీవించడానికి అనువుగా వున్న నిరాడంబర ప్రకృతిని సమూలంగా మార్చి, ఆడంబరంగా జీవించడానికి అవసరమైన అన్నిహంగులూ ఏర్పాటు చేశారు. గదులన్నింటిలో నేలపై తివాచీలు పరిచారు. సన్యాసులు వాడుకునే చెక్కపెట్టెల స్థానంలో అందమైన బల్లలు అమర్చారు. మఠంలోని స్వచ్ఛమైన గోడలపై అసభ్యప్రేమగాథా దృశ్యాలతో కూడిన కుడ్యచిత్రాలు వెలిశాయి. మతసన్యాసులు గోష్ఠులు, సభలు జరుపుకునే ప్రాంగణం, వినోద విలాసాలకు నెలవైన రిక్రియేషన్ హాలుగా మారింది. ఆ మఠమంతా ప్రయోగశాలలు, సిబ్బందితో కూడిన పాఠశాలగా మారింది.

మఠంలోని ఎనభైగదుల్లో ఒక్కగదిని మాత్రమే పూర్వం మాదిరి ఎలాంటి మార్పులూ చేర్పులూ లేకుండా వుంచేశారు. సన్యాసులు బతికినప్పుడు ఎలావుండేదో అచ్చం అలాగే వుంచేశారా గదిని. సాదాగోడలు, చెక్కబల్ల, రాతినేల, మట్టికూజా అన్నీ అలాగే వున్నాయి. క్రమశిక్షణ లోపించి, చెప్పినమాట వినని అమ్మాయిలను దారికి తెచ్చేందుకు ఈ గదిని ఒంటరిఖైదు కొట్టుగా ఉపయోగిస్తారు.

ఈ ప్రాచీన మఠంలో కొత్తగా విడిదికి వచ్చిన వారు ప్రత్యేక లక్షణాలు గలవారు కావడంతో ప్రత్యేక సమస్య ఉత్పన్నమైంది. ఇక్కడకు చేర్చుతున్న యువతులందరూ పందొమ్మిదేళ్ళ వయసులోపు మిసిమి జవ్వనులు. వాళ్ళందరూ కోడెవయసు కుర్రవాళ్ళు వచ్చి తమ యవ్వనాన్ని అనుభవించి తమను తల్లులను చేసే శుభసమయంకోసం ఎదురుచూస్తున్నవా

రు. వీళ్ళందరినీ క్రమశిక్షణలో వుంచి, వాళ్ళ మంచీ చెడ్డా చూడటానికి సర్కస్‌లో మృగాల ను అదుపులో పెట్టగల రింగ్‌మాస్టర్‌లాంటి సర్వసమర్థురాలైన ఒక ఆడదికావాలి.

దీనికిగాను జర్మనీలోని బాలికా పాఠశాలల ప్రధానోపాధ్యాయులుగా పనిచేసే వారందరిలో అమితశక్తివంతురాలు, సమర్థురాలుగా పేరు గాంచిన ఫ్రాలాసర్ ఎన్నికైంది. అమ్మాయిలను అజమాయిషీచేసి, దారిలోపెట్టే యీ ఉద్యోగా నికి ఆమె ఒక్కతే అన్నివిధాలుగా తగినదని ఏలినవారు అభిప్రాయపడ్డారు. ఆమె వయ స్సు యాభైయేళ్ళు. ఆమె పైకి మెత్తగా సుకు మారంగా కనిపిస్తుందిగాని పరమకర్కోటకురా లు. ఆమె మాటలు తేనె వాకలుగా వుంటాయి గాని హృదయం కఠినపాషాణం. ఆమెకు బిడ్డ లు కలగలేదనేది అంత ముఖ్యవిషయం గాదు. ఎందుకంటే ఆమె బిడ్డలను కనబోయే అమ్మాయిల మీద పెత్తనంచేయడానికి వచ్చిందే తప్ప తానే స్వయంగా పిల్లల్ని కనడానికి రాలేదుగదా.

ఇతరులకు పెళ్ళిళ్ళు చేస్తూ, తానుమాత్రం పెళ్ళీపెటాకులూ లేకుండా మతపరమైన విశ్వాసాల కోసం జీవిస్తూవుండే వ్యక్తికి గల నిష్ఠతో, అభిలాషతో ప్రొఫెసర్ ఫ్రాలాసర్ ఈ కొత్త ఉద్యోగాన్ని చేపట్టింది. అయితే ఈమెకు హిట్లర్‌గారి కొత్త సిద్ధాంతాన్ని అమలుజరప డంలో తనలో పూర్వం జీర్ణించుకుపోయిన మత విశ్వాసాలు, నైతిక సూత్రాలు కొంతవరకు తల్లకిందయ్యాయి. అభమూ శుభమూ తెలి యని కన్నెపిల్లలను ముక్కు-ముఖమూ తెలి యని సైనికవీరుల పక్కల్లో పడుకోబెట్టి, వాళ్ళ కు గర్భదానాలు చేయించడమనే భావం ఆమెకు కంపరం కలిగించలేదుగానీ మతగు రువులు లేదా రిజిస్ట్రారు ఆఫీసుతో ఎంతమా త్రం నిమిత్తం లేకుండా పెళ్ళీపెటాకులూ లేకుండానే ఈ గర్భదానాలు జరిపే క్రియకు సర్దుకుపోవడం కొంతయిబ్బంది అని పించింది. ఏమైనా ఈ భావం సాక్షాత్తు హిట్లర్ మనస్సులో పుట్టిందిగాబట్టి దీనిలో కొంత పవి త్రతా సారం వుండే వుంటుంది. అందుకే హిట్లర్ పవిత్ర కాంక్షను నెరవేర్చి స్వచ్ఛమైన ఆర్యజాతిని పుట్టించే మహాయజ్ఞానికి తన వంతు కృషిచేయాలనుకుంది.

ఫ్లిట్టర్ అనే ఆవిడ ఈ పాఠశాల అసిస్టెంటు ప్రధానోపాధ్యాయురాలిగా, మానిటర్‌గా నియ మితురాలైంది. ఆమెకు ఇలాంటి నైతిక విష యాలంటే సుతరామూ కాబట్టవు. ఒక్కమా టలో చెప్పాలంటే ఆమెకు ధర్మభీతి అనేది ఏ కోశానా లేదు. ఆమె అవయవసౌష్టవం అంత సక్రమంగా లేకపోయినా అందగత్తెగా పరిగ ణించదగిందే. ఆమె శరీరాకృతి బ్ర హ్మాండంగా వుంటుంది. ఆమె అందమంతా ఆమె కళ్ళల్లోనే వుంది. ఆమె కళ్ళలో ఉత్సాహం, ఉద్వేగం అవసరమైన ప్రతి భావా న్నీ పలికించగల ప్రజ్ఞావున్నాయి.

ఆమె బెర్లిన్ హైస్కూల్‌లో శరీర సంస్కృతిని బోధించేది. ఆమెను గురించి డాక్టర్ ఊర్జెర్‌కు ఎంతో గొప్ప సిఫారసులు అందాయి. ఆమెను చూస్తూనే ఈ డాక్టరుగారు ఎలాంటి పరీక్షలూ జరపకుండానే వెంటనే ఈ పదవికి ఎంపిక చేశారు. ఆమె వయసు ము ప్ఫయి సంవత్సరాలు. మామూలుగా మదనస దనానికి ఇరవై అయిదేళ్ళలోపు అమ్మాయిలనే ఎంపికచేస్తారు. కానీ ఆమెను నియమించింది అమ్మాయిలను అజమాయిషీ చేయడానికే గాని శోభనపు పెళ్ళికూతురుగా కాదుగదా.

మదన సదనంలోని క్షణికమైన, తాత్కాలిక మైన ప్రేమ స్వరూపం ఆమెనేమాత్రం కలతప రచలేదు. ఆమె భర్త యుద్ధంలో మరణించిన సైనికుడు. భర్త చనిపోయినందుకు ఆమె ఎక్కువగా విచారించలేదనీ, అతను చనిపో యినట్లు తెలిసిన వెంటనే ఏమాత్రం జాగుచే యకుండా తన పెళ్ళి కాంట్రాక్టును రద్దుచేసు కొని, 'శ్రీమతి' పదాన్ని త్యజించి 'కుమారి' అయిపోయిందనీ పుకార్లు వున్నాయి. ఆమెకు యవ్వన మాధుర్యాన్నంతటినీ అనుభవించాల న్న ఆశ యెక్కువ. ఏడాదికేడాదికీ వయసు పైబడడం ఆమెకు విచారం కలిగించేది. తన కంటే ఐదే ఐదు సంవత్సరాలు చిన్నవారైన యువతులకు జర్మనీ మొత్తంలో అందగాళ్ళై యిన, బలాఢ్యులైన యువకుల పొందు లభించడం ఆమెకు ఈర్ష్య కలిగించేది.

తనకు లభించని సుఖమేదో ఆబగా అను భవిస్తూవున్నారని ఈ అమ్మాయిలపై ఆమెకు మనసులో కలిగిన ఈర్ష్య, కసి ఒకరకమైన అపవిత్ర సెక్సు జీవితంలో తాదాత్మ్యం




పొందాయి. ఆమెకు సెక్సు జీవితాన్ని నిషేధించడంవల్ల ఆమె ఈ సెక్సు జీవితాన్ని అనుభవించేవారికి ప్రోత్సాహం కలిగించే పరికరంగా మారింది. అక్కడి అమ్మాయిల సెక్సు జీవితాన్ని గురించిన రహస్యాలన్నీ వింటూ ఆ పిల్లల మానసిక, శారీరక ఉద్వేగాల్లో పాలు పంచుకుంటూ వుండేది. ఇతరుల సెక్సు అనుభవాలన్నింటినీ మానసికంగా తానే అనుభవిస్తున్నట్లు ఊహించుకుని తాదాత్మ్యం చెందేది.

ఎప్పుడూ, నవ్వుతూ, పేలుతూ, అందరితో హాస్యాలాడుతూ, సదా అందరికీ అందుబాటులో సహాయకారిగా వుండే ఫ్లిట్టర్‌ను అక్కడి అమ్మాయిలంతా ఆరాధించేవారు. అక్కడున్న ఆడపిల్లలకు మదనసదనం యాజమాన్యంతో ఎప్పుడైనా తగాదాలు వస్తే, ఆ పిల్లలను అమిత చాకచక్యంగా తన యెత్తులతో జిత్తులతో బయటపడవేసే పలుకుబడి కలిగిన స్నేహితురాలు ఆమెతప్ప మరొకరు లేరు.

ఈ అమ్మాయిలందరూ మఠంలో రాజభోగాలనుభవిస్తున్నారు. స్వేచ్ఛా ప్రణయానికి తాడుగట్టి వుంచబడిన ప్రేమ సన్యాసులు వాళ్ళు. తిన్నంత తిండి, తాగినంత మద్యం. ఇక నెలతప్పిన ఆడపిల్లలకైతే రాచమర్యాదలన్నీ జరుగుతాయి. అడవులు, సరస్సు వాళ్ల మనోల్లాసానికి అదనపు దోహదం చేస్తాయి.

ఉదయం ఏడుగంటలకే సైనిక క్రమశిక్షణతో టంచన్‌గా గంట మోగుతుంది. అమ్మాయిలందరికీ కావలసినంత పంచదార వేసిన కాఫీ ఇస్తారు. యుద్ధంరోజుల్లో పంచదార దొరకటం గగనం. సామాన్యులెవరూ పంచదార ముఖమే ఎరుగరు. కాఫీ సేవనం తరువాత ఫ్రాలాసర్ అమ్మాయిలందర్నీ తనిఖీ చేస్తుంది. మదనసదనంలోని అమ్మాయిల వ్యక్తిగత పరిశుభ్రత గురించి ఈమె జాగ్రత్త తీసుకున్నట్లుగా మరే యితర ప్రషియన్ స్త్రీ తీసుకోదు. ప్రతి అమ్మాయినీ ప్రత్యేక శ్రద్ధతో చూస్తుంది. ఏ అమ్మాయి అయినా పరిశుభ్రంగా లేకపోతే క్షమించే ప్రసక్తే లేదు. అక్కడ అమ్మాయిల శారీరక పరిశుభ్రతకూ, ఆరోగ్యానికీ అవసరమైన సమస్త ఏర్పాట్లూ వున్నాయి. రైతు కుటుంబాలనుండి వచ్చిన పిల్ల యెవరైనా సోమరితనంతో ఎడ్డిమడ్డిగా వుండి, నిత్యం తన శరీరంలోని ప్రతి అవయవాన్నీ కడిగి పరిశుభ్రంగా వుంచుకోకపోతే అలాంటి పిల్లకు నాలుగు కొరడా దెబ్బలు రుచిచూపించి పరిశుభ్రత నేర్పడం జరుగుతుంది.

ఈ తనిఖీ పిమ్మటనే అమ్మాయిల దినచర్య ప్రారంభమౌతుంది. వీరుల కామకేళికి నైవేద్యంగా అర్పించడానికి సిద్ధంచేసిన యువతులను యింకా యితర పరీక్షల కోసం ఫ్లిట్టర్ వద్దకు వంపుతారు. ఆమె వీళ్లకు కామసూత్రాలన్నింటినీ బోధించి, తమ అందాలను ప్రియులముందు ఎలా ప్రదర్శించాలో నేర్పి పంపుతుంది. ఇంకా గర్భదాన ఘడియ రాని అమ్మాయిలను సరస్సులో ఈత కొట్టిస్తారు. తరువాత వ్యాయామక్రీడ చేయిస్తారు. కొత్తగా మదనసదనంలోకి అడుగుపెట్టిన సైనిక హీరోలు తమ రతికేళికి తగిన అమ్మాయిలను ఎంచుకున్న తరువాతనే మొత్తం ఆడపటాలమంతా దైనందిన వ్యాయామక్రీడలకు సన్నద్ధమౌతుంది.

మధ్యాహ్నం భోజనానంతరం అమ్మాయిలందరూ కాస్త కునుకుతీస్తారు. తరువాత తిరిగి వ్యాయామక్రీడలుగానీ లేదా సర్జన్‌గారి ధర్మోపన్యాసాలుగానీ వుంటాయి.

ఇలాంటి ధర్మోపన్యాసాలివ్వడంలో సర్జన్ నిష్ణాతుడు. మత ప్రబోధం కోసం సాక్షాత్తూ ఏసుప్రభువు భూమికి పంపిన దేవదూత ఉత్సాహంతో, ఆయన సర్వోత్కృష్టమైన జాతి సృష్టికి మాతృమూర్తుల పాత్ర వహించడంలో గల ఔన్నత్యాన్ని గురించి ఆడపిల్లలకు చాలా గొప్పగా నూరిపోస్తాడు. హీరోల ప్రేమను పొందడం, వారికి బిడ్డలను కనడం యెంత అదృష్టమో, ఎంత సుకృతమో వారికి సుదీర్ఘంగా బోధపరుస్తాడు. అయితే ఈ అమ్మాయిలకు హీరోల పక్కల్లో పడుకుని పిల్లల్ని కనడంలో ఆసక్తి వుందా లేక హిట్లరు లక్ష్యంలో ఆసక్తివుందా? అని చెప్పటం కష్టం. ఎందుకంటే యివి రెండూ గూడా అవిభాజ్యమైనవే.

రాత్రి భోజనానంతరం రిక్రియేషన్ హాలులో సంగీత, నృత్యాలు వుంటాయి. రేడియో పాటలేగాక ఫ్రాలాజర్ జంత్రగాత్ర సమ్మేళనం నిర్వహిస్తుంది. ఆ నృత్య విన్యాసాలలో ఆమె స్వయంగా పాల్గొంటుంది గూడా. ప్రస్తుతం మదనసదనంలో యాభై ఇద్దరు అమ్మాయిలు వున్నారు. అంతమందికీ సరిపోయే మగవాళ్ళు

మాత్రం లేరు. అందువల్ల అమ్మాయిలందరూ తమను పక్కలోకి లాక్కునే వారం రోజుల మగడు వచ్చేవరకూ ఓపిగ్గా ఎదురుచూస్తూ తామే ఒకరితో మరొకరు డాన్సుచేస్తారు. ఇక మదనసదనానికి చేరిన హీరోలు, వారు ఎంచుకున్న వారం రోజుల పెళ్ళాలూ కలిసి మానసికానందం అనుభవించడానికి ప్రత్యేక బృందగానాలను సైతం అమ్మాయిలు నిర్వహిస్తారు.

ఆ పురాతన క్రైస్తవమఠంలో ప్రబలిన ఇంద్రియ భోగవాంఛావాతావరణం చివరకు దుఃఖంతో, బాధతో, తమ కుటుంబాలను బలవంతంగా విడిచి వచ్చిన అమ్మాయిల్లో సైతం కామజ్వాలలను రేపింది. అక్కడి "వారం పెళ్ళికూతుళ్ల" రహస్యానుభవాలు మిగిలిన అమ్మాయిల్లో ఆసక్తిని రేకెత్తించాయి. తాము కూడా "వారం పెళ్ళికూతుళ్ళు" అయ్యే శుభ ఘడియకోసం ఎదురుచూస్తూ అసహనంతో, కామజ్వరంతో కొందరు వేగిపోతూవున్నారు.

పూర్తిగా కామజ్వర పీడితులైన వారు ఎప్పుడో రాబోయే ప్రియులకోసం ఎదురుతెన్నులు చూస్తూ వేచివుండలేరు. వారిలో విచిత్రమైన మానసిక ప్రకోపాలు బయలుదేరాయి. స్వలింగసంపర్కంలాంటి విపరీతమైన అనుబంధాలు ఏర్పడ్డాయి. ఒకనాడు క్రైస్తవప్రార్థనా గీతాలతో ప్రతిధ్వనించిన ఆ పవిత్రమఠంలోని పూజనీయమైన గోడలు, నేడు కామదాహం తీర్చుకోడానికి ఉద్దేశించిన పాటలతో, ప్రార్థనలతో, ప్రియుని ముద్దులకోసం వేగిపోతూవున్న మదవతుల పెదవులు చేసే చప్పుళ్లతో దద్దరిల్లిపోతూవున్నాయి. అనేక విషయాల్లో తన విద్యార్థినులతో సన్నిహితసంబంధాలు పెంచుకున్న ఫ్లిట్టర్ ఈ ఒంటరి అమ్మాయిలను ఓదార్చడంలో ప్రత్యేక ప్రావీణ్యత గలదిగా గుర్తింపు పొందింది.

స్వలింగసంపర్కానికి పాల్పడే ఈ అమ్మాయిలు రేపు ప్రకృతి సహజమైన సంపర్కం అంటే వైముఖ్యం ప్రకటించే ప్రమాదం వుందని డాక్టర్ గ్రహించాడు. అందుకే ఆయన ఇలాంటి వ్యవహారాన్ని చాలా కఠినంగా నిషేధించాడు. ఫ్లిట్టర్ ఒకనాడు ఈ నిషేధాజ్ఞల గురించి ఆయనతో చర్చించడానికి ప్రయత్నించింది. కొంతమంది సుప్రీంహీరోలు యుద్ధరంగంలో వీరప్రతాపం చూపితే చూపివుండవచ్చుగానీ, అమ్మాయిల దగ్గరకు వచ్చేసరికి ఎందుకూ కొరగాని దద్దమ్మల్లా జావగారిపోతున్నారనీ, ఇక రతిక్రీడ దగ్గరకు వచ్చేసరికి సిగ్గుతో, పిరికితనంతో భయపడి చేష్టలు డిగిపోతున్నారనీ చెప్పింది. ఇక్కడున్న అమ్మాయిల్లో ఎక్కువమంది మదనకళ గురించి తెలియని కన్యలే గాబట్టి, ఈ పిల్లలను చూస్తూనే పురుషుడు నిగ్రహించుకోలేనివిధంగా వీళ్లకు కామశాస్త్రాన్ని బోధిస్తే బాగుంటుందని సూచించింది. అంతేగాక ఈ కామశాస్త్ర బోధన తానే జరపుతానని కూడా చెప్పింది.

దానికి డాక్టర్ పొట్టచెక్కలయ్యేలా నవ్వాడు. "మొగుడూ ముద్దులూ లేకుండా మొండిబతుకు బతుకుతూవున్న నీ వైధవ్యం తిమ్మిరెక్కిస్తూ వుందన్నమాట" అంటూ వేళాకోళం చేశాడు. "నీ బోధనేమీ అవసరంలేదు. ప్రకృతే అలాంటి పాఠాలు నేర్పుతుంది. కామశాస్త్రమంటే మన పిల్లలకు రోత కలగగూడదు. వాళ్ల అమాయకత్వం, ముగ్ధమనోహరత్వమే వాళ్లను ఆశించే ప్రియులకు అవసరమైన ప్రోత్సాహాన్నీ సాహసాన్నీ ఇస్తుంది" అని స్పష్టంచేశాడు.

అందువల్ల మదనసదనంలో కామశాస్త్రబోధన నిషేధించబడింది. నిషిద్ధఫలమెప్పుడూ మధురాతిమధురంగా వుంటుందిగదా!

ఈ తాత్కాలిక పెళ్ళికూతుళ్లను అతి జాగ్రత్తగా, అతి గారాబంగా చూస్తున్నారు. వాళ్ల హనీమూన్‌ను అత్యంత మనోరంజకం, ఫలప్రదం చేసేందుకు సమస్త ఏర్పాట్లూ జరిగాయి. పురాతన మఠాన్ని మరమ్మతులు చేసి ఆధునీకరించే సమయంలో పనివాళ్ళు మఠానికి దూరంగా అనేక కుటీరాలను నిర్మించారు. గర్భదాన మందిరాల్లా అలంకరించిన ఈ కుటీరాలను జంటలకు మాత్రమే కేటాయిస్తారు. హీరో ఎన్నుకొననిదే ఏ యువతీ ఆ కుటీరం గడప కూడా ఎక్కడానికి వీల్లేదు. అలాగే హీరోతో వారంరోజులు విలాసక్రీడలనుభవించిన యువతి కూడా, హీరో వీడ్కోలు పుచ్చుకున్న తర్వాత ఒక్కక్షణం ఆ కుటీరంలో వుండేందుకు వీల్లేదు. ఒకవారం ప్రణయసుఖాల్లో తేలియాడిన పిల్ల తిరిగి మఠానికి చేరు




# గుర్తుపెట్టుకోండి, పోషణనిచ్చే సమపాళ్లుగల ఆహారాన్నివకపోతే ఏమి జరుగుతుందో? చురుకుదనాన్నివ్వడానికి అవసరమయ్యే 'సరియైన' తీరులోని కేలరీలు మీ పాపకి అందవు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

అసలు 'సరియైన' కేలరీలు అంటే ఏమిటి?
డాక్టర్లు అనేదిది. ఆహారంలోని ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, ఖచ్చితమైన సమపాళ్లు యీ కేలరీలలో వుంటాయని. నిజానికి ఇవి పాప బాగా పెరగటానికి, చురుకుగా వుండటానికి, అవసరమైన కీలకమైన ఆహార పదార్థాలు.
మీ పాపకు 'సరియైన' కేలరీలు లభించేటట్లు ఖచ్చితంగా చూడాలి.
ఇవి ప్రతిసారి యిచ్చే ఆహారంలో వుండాలి. రోజూ మామూలుగా వారం పర్యంతంగా యిచ్చే ఆహారంతో అలా యివ్వగలగటం చాలా మంది తల్లులకి సాధ్యంకాదు
దానికి పరిష్కారం ?
సెరిలాక్ పోషణ నిచ్చే సమపాళ్లుగల సంపూర్ణ ఆహారం. పాపకు 4 నెలలు వచ్చినప్పటి నుండి అంటే, కేవలం పాలు యిస్తే చాలని వయస్సు నుంచి, యిచ్చే ఆహారం.
సెరిలాక్‌లో ప్రొటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ విటమిన్లూ, ఐరన్, కాల్షియం, వున్నాయి. దాంతో మీ పాప చురుకుగా వుండటానికి అవసరమైన 'సరియైన' కేలరీలు లభిస్తాయి. రుచికరంగానూ వుంటుంది
అందుకే యివ్వండి వెంటనే మీ పాపకు, పోషణనిచ్చే సమ పాళ్లుగల సెరిలాక్.
మీ పాపకు 6 నెలలు వచ్చినప్పటి నుంచి సీల్-ఆపిల్, సీల్-ఆరెంజ్, మరియు సీల్-వెజిటెబల్ అదనపు లాభం అందించండి.
దయచేసి ప్యాక్ పైన యివ్వబడిన సూచనలను పాటించండి

---

ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బాక్స్ నెం. 21,న్యూ ఢిల్లీ 110029

---




**మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.**

కుని, మధురానుభూతులను నెమరేసుకుంటూ, గర్భవతి కావడంకోసం ఎదురుచూస్తూ, ఒకవేళ గర్భవతి అయిన పక్షంలో దోస పండులాంటి దొరబిడ్డను కనేరోజుకోసం నెలలు లెక్కపెట్టుకుంటూ వేచివుండాలి. ఈలోగా తన వారం ప్రణయాన్ని గురించిన సమస్త వివరాలూ, ఆ మధురానుభూతికోసం వేచివున్న యితర అమ్మాయిలకు పూసగుచ్చినట్లు వివరించాలి.

మహోజ్వలమైన ఆ 1943 సంవత్సరంలో బవేరియాలో వెలసిన మదనసదనంలోని జీవితసరళి ఇది.

★ ★ ★

మదనసదనం చేరిన లీసెల్‌కు అక్కడ అన్నిసదుపాయాలూ అమరాయి. భోజనసౌకర్యమొక్కటే గాదు. తన జీవితంలో యింతవరకూ ఏనాడూ ఎరుగని సమస్త సౌఖ్యాలనూ మహారాణీలాగా అనుభవిస్తూవుంది. ఒకవైపు యింటిదగ్గర తన తల్లి గర్భదరిద్రాన్ని అనుభవిస్తూవుంటే, మరోవైపు తాను మనస్ఫూర్తిగా ప్రేమించిన ప్రియుడు విదేశీ భూభాగాల్లో యుద్ధంలో సతమతమవుతూ వుంటే, తానిక్కడ అన్నిభోగాలూ అనుభవించడాన్ని తలచుకొని అప్పుడప్పుడూ కాస్త సిగ్గుపడేది.

శరీరానికీ, మనస్సుకూ యిరవై యేళ్ళ ప్రాయం వచ్చిన తరువాత ప్రకృతిసిద్ధమైన వాంఛలను నిగ్రహించడం కష్టం. ఇంటి పనులుతప్ప యితర మెరుగక పుష్టిగా వున్న ఈ పిల్ల ఇలాంటి శారీరక వ్యాయామక్రీడలను ఎన్నడూ ఎరగదు. ఈ క్రీడా కార్యక్రమాలు ఆ పిల్లకు చాలా ఉత్సాహం గొలిపాయి. దృఢమైన, కోమలమైన అవయవ సౌష్టవాన్ని పెంపొందించే ఈ శారీరక వ్యాయామాలన్నింటిలో ఆ పిల్ల నిష్ణాతురాలైంది. ఈతంటే ఆ అమ్మాయికి ప్రాణం. చిన్నప్పుడు ఉధృతంగా పొంగి పరవళ్ళు తొక్కే నదిలో అలవోకగా ఈదులాడే పిల్లకు ఆ సరస్సులో ఈతకొట్టడం చిన్నపిల్లలాటగా వుంది. క్రీడలను నేర్పడంలో ఫ్లిట్టర్‌కు ఈ పిల్లపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించవలసిన అవసరమే లేకపోయింది.

అయితే ఆ పరిసరాలకు అనుగుణంగా మారడంలో లీసెల్‌కు పరిమితులున్నాయి. సైనికులముందు తన అందాలను ఒలకబోస్తూ నగ్న ప్రదర్శనలివ్వడం ఆ అమ్మాయికి పరమ జుగుప్సాకరంగా వుంది. ఈ వ్యవహారం ఆ పిల్లకు తీవ్రమైన వ్యధను కలిగించేది. సహజంగా పుష్టిగా, అందంగా వుండే ఆ పిల్లకు ఈ నగ్న సౌందర్య ప్రదర్శన ఏవగింపు కలిగించేది. ఈ దిగంబర ప్రదర్శనల్లో ఆ అమ్మాయి వికృతంగా కుంచించుకుపోవడంతో, అమ్మాయిలను ఎంచుకోవడానికి వచ్చిన తొలి జట్టు హీరోలకు ఆ అమ్మాయిని చూస్తూనే ఒకవిధమైన భయం కలిగిన విషయం బహుశా ఆ అమ్మాయికి తెలియకపోవచ్చు. అందుకే పూర్వం వంటపుట్టిగా బతికిన ఈ పిల్లను యింతవరకూ ఏ హీరో ఎంచుకోలేదు. దానికా పిల్ల విచారపడకపోగా సంతోషించేది. మనసులోనే దేవుళ్ళకు దండాలు పెట్టుకునేది. తన ప్రేమికుడు హేన్స్‌ను త్వరగా యిక్కడికి పంపమని ప్రభువును ప్రార్థించేది.

తన ప్రేమికుడే మదనసదనానికి వచ్చి తన ప్రియుడుకావాలనే కాంక్షతో, ఆ శుభదినం కోసం యెదురుచూస్తూవున్న లీసెల్, బెర్లిన్ నుండి కొత్తగా వచ్చిన మెటిల్డాతో స్నేహంచేసింది. మదనసదనంలోకి మెటిల్డా ప్రవేశమే ఒక గాలి దుమారమైతే, ప్రధానోపాధ్యాయిని ఫ్రాలాజర్ తనిఖీ సందర్భంగా దురుసుగా ప్రవర్తించి చరిత్ర సృష్టించింది. దానితో ఆమె ఆ పిల్లపై కోపంపట్టలేక డాక్టరుకు కబురంపింది.

"క్రమశిక్షణా రాహిత్యానికి పదిహేను కొరడా దెబ్బలు" ఆదేశించాడా డాక్టరు. ఈ శిక్ష అక్కడకు చేరిన సైనిక హీరోల సమక్షంలో వెంటనే అమలుజరిగింది. కొరడా కొనలు ఆ అమ్మాయి శరీరంపై నాట్యంచేశాయి. పెద్దలపై తిరగబడిన ఆ పిల్ల శరీరం తొలిదెబ్బకే వాడి వత్తలైన వగుడాకులా గజగజలాడింది. ఒక్కొక్క దెబ్బా వంటిమీద పడేకొద్దీ ఆ అమ్మాయి శరీరం మెలికలు తిరగసాగింది. బాధతో ఆ అమ్మాయి ముఖంమీది కండరాలు ముడుచుకుపోతూ, పిరుదులు మెలిదిరుగుతూ, పాదాలు లోపలికి ముడుచుకుంటూ వుంటే ఆ దృశ్యాన్ని డాక్టర్ అమితానక్తితో, ఉల్లాసంగా తిలకించాడు.





బాధలోనూ, కామవాంఛలోనూ గూడా ఆడదాని ప్రతిస్పందన ఒకేలా వుంటుందనేది అతని సిద్ధాంతం. కొరడా దెబ్బల బాధకు తట్టుకోలేక విలవిలలాడుతూవున్న ఆ పిల్ల ముందుముందు ఆమెను ఎంచుకొనబోయే ప్రేమికుని చేతుల్లో ఎలా మెలికలు తిరుగుతుందో ఊహించుకుంటూ, 'అబ్బ... ఎంత చక్కని ముద్దుగుమ్మ' అంటూ ఆనందించాడు.

అమ్మాయిలో కామోద్రేకాలను తీవ్రంగా ప్రకోపింపజేయడానికి కొరడా దెబ్బలకంటే మరో దివ్యౌషధమేదీ లేదని హిట్లర్‌గూడా నమ్ముతోంది. నిండా పద్దెనిమిదేళ్ళుగూడా లేని మెటిల్డా ఈ దెబ్బలతో హడలెత్తి తన హావభావాలతో, కడగంటి చూపులతో ఇక తానావనికి సిద్ధమేనని తెలియజెప్పడం ఆ వంతులమ్మ గ్రహించింది. ఆ అమ్మాయిని రిక్రూట్ చేయడంలో ఆశ్చర్యమేమీలేదు. ఈ శిక్షను అమలు జరిపేటప్పుడు అసిస్టెంటు వంతులమ్మ కళ్ళు మిలమిలా మెరిశాయి. ఇలాంటి పిల్లలను ఒకవైపు బుజ్జగిస్తూ మరోవైపు శిక్షిస్తూవుంటేనే ఇక్కడి పనికి బ్రహ్మాండంగా పనికివస్తారని ఆమె భావిస్తోంది.

తన స్నేహితురాల్ని కొరడాతో చావచితకకొడుతూవున్న దృశ్యంచూసి కొయ్యబారిపోయిన లీసెల్ ఆ పిల్లను ఓదార్చడానికి పరుగెత్తింది.

"ఇక్కడ రోజూ యిలానే జరుగుతూ వుంటుందా?" బెర్లిన్ పిల్ల ప్రశ్నించింది.

"అబ్బే... లేదు. నీవు అణకువగా నడుచుకుంటే యిలా జరిగేది కాదుగదా?" అంటూ మెల్లిగా బుజ్జగిస్తూ చెప్పింది లీసెల్.

"నన్ను హింసిస్తూవుంటే చూస్తూ ఆ డాక్టరు వెధవ ఎంత థ్రిల్ అనుభవించాడో. ఆ సమయంలో నీవు వాడిముఖం చూడలా! వాడు ఆనందంతో ఎలా మెలికలు తిరిగిపోతూవున్నాడో. థూ... ముసలినక్క" అంటూ ఈసడించింది మెటిల్డా.

"నిన్ను రిక్రూట్ చేసినవాళ్ళలో వీడూ వున్నాడా?" లీసెల్ ప్రశ్నించింది.

"వీడుకాదు... మరో ఆఫీసర్" అంటూ నర్మగర్భంగా నవ్వింది మెటిల్డా.

"అబ్బ... నీ చేతులు ఎంత అందంగా వున్నాయో" అంటూ మెటిల్డా చేతులు తాకుతూ ఆశ్చర్యపోయింది లీసెల్.

"నా ఉద్యోగానికి యిలాంటి చేతులు అవసరం. నేను చేతి తొడుగులు అమ్మే గుమాస్తాని" అని చెప్పింది మెటిల్డా.

అంతకుమించి చెప్పడానికి ఆ పిల్లకు గర్వించదగిన గత చరిత్రయేమీ లేదు. ఆపైన జరిగింది తన స్నేహితురాలికి చెప్పలేదు గూడా. గత సంవత్సరం ఒక మేజర్ జనరల్ ఆ పిల్ల పనిచేస్తున్న షాపుకు వచ్చాడు. కౌంటర్‌ముందు నుంచుని గ్లోవ్స్ అమ్ముతున్న ఆ పిల్లపై వాడి దృష్టిపడింది. వాడి కళ్ళు మిలమిలలాడాయి. అనేక జతల గ్లోవ్స్ కొన్నాడు. వాటిని ఈ పిల్ల స్వయంగా తన యింటికి తీసుకునివచ్చి యిస్తుందా? అని అడిగాడు. అన్ని జతల గ్లోవ్స్ ఒకేసారి కొన్న కస్టమర్, పైగా సైన్యంలో పెద్ద అధికారి. వాణ్ణి సంతృప్తిపరచడమే దుకాణం యజమాని పరమావధిగదా. అందుకే యజమాని వెంటనే అంగీకరించాడు. మెటిల్డాచేత గ్లోవ్స్ పాకెట్ వాడింటికి పంపాడు.

ఆ పిల్ల వాడి గుమ్మంలో అడుగుపెట్టగానే వాడు సాదరంగా ఆహ్వానించి గ్లోవ్స్ పార్సెల్ అందుకున్నాడు.

"నీవు రావటం నాకెంతో ఆనందంగా వుంది పాపా! లోనికి రా... నాతో కలిసి ఓ కప్పు టీ తాగి వెళ్ళు" అని కోరాడు.

వాళ్ళిద్దరూ కలిసి టీ తాగారు. కేకులు తిన్నారు. ఆపైన షాంపేన్ రుచి చూశారు. ఆపైన ఆ మేజర్ జనరల్ తన కొసరు కోర్కెను తీర్చుకున్నాడు.

చివరకు మెటిల్డా యింటికి చేరేసరికి ఈ పిల్లకు ఏదో జరిగిందని వాళ్ళమ్మ గ్రహించింది. అప్పటికీ ఆ అమ్మాయి మత్తులో జోగుతూనే వుంది. ఆ పిల్ల కన్యాత్వాన్ని ఎవడో దోచుకున్నాడని ఆ తల్లికి అర్థమైంది.

"తప్పుడు ముండా... నీకిదేం పొయ్యేకాలమే. నీకింకా పదిహేడేళ్ళేగదే"- అంటూ ఆ తల్లి ఘొల్లుమన్నది.

మెటిల్డా తండ్రి కథంతా విన్నాడు. ఆ పిల్లనేమీ మందలించలేదు సరిగదా, యిదీ ఒకందుకు లాభమేలెమ్మని మనసులో తీర్మా

నించుకున్నాడు. ఆ పిల్లతో ఆ జనరల్ ప్రణయం ముదురుపాకాన పడేవరకూ వాళ్లమానాన వాళ్లను వదిలివేశాడు. మెటిల్డా, మేజర్ జనరల్ ఒక రాత్రి మాంచి రసపట్టులో వుండగా వాళ్లముందు హఠాత్తుగా ప్రత్యక్షమయ్యాడు. కన్నకూతురికి తన కళ్ళెదుటనే అన్యాయం జరుగుతూ వుంటే చూసి సహించలేని తండ్రిగా ఆగ్రహంతో చిందులేస్తూ అతగాడు తన పాత్రను అమోఘంగా పోషించాడు.

"బాగుందయ్యా... చాలా బాగుంది. నా బిడ్డకు నిండా పదిహేడేళ్లయినాలేవు. యుద్ధాల్లో కాకలుతీరి దేశాన్నీ దేశప్రజలనూ రక్షించే హెర్‌హిట్లర్ సైన్యంలో పెద్ద అధికార్లుగదయ్యా మీరు! ముక్కుపచ్చలారని పసిబిడ్డల మానం దోస్తూవున్నారా? ఇప్పుడు నా బిడ్డను ఏం చేయదలచుకున్నారో చెప్పండయ్యా" అంటూ నిగ్గదీశాడు.

ఈ పరిణామానికి బెంబేలెత్తిన ఆ మేజర్ జనరల్ డబ్బుతో మెటిల్డా తండ్రి నోరు మూశాడు. ఆరు నెలలపాటు నెలసరి పెద్దమొత్తాలు చెల్లించడానికి అంగీకరించాడు. అయితే మెటిల్డా తండ్రి ఇంతటితో సరిపెట్టుకునేరకంగాదు. నెలలు గడిచేకొలదీ వాడు తన డిమాండ్లు పెంచసాగాడు. దాంతో దీని పీడ ఎలాగో ఒకలాగు వదిలించుకోవాలని ఆ జనరల్ భావించాడు.

సైనికాధికారుల సమావేశంలో హిట్లర్ కొత్తపథకం 'పుత్రకామేష్టి' గురించి చర్చకు వచ్చినప్పుడు, అది వింటూనే ఆనందంతో గంతులేశాడు.

"ప్రముఖ శరీరశాస్త్రవేత్త డాక్టర్ ఊర్జర్ తెలుసుగా, అతనే ఈ పథకాన్ని అమలు చేస్తూవున్నాడు" అని మరో అధికారి వివరించి చెప్పాడు.

ఈ వివరం తెలిసిన నలభైఎనిమిది గంటల్లోగా ఈ మేజర్ జనరల్ ఆ సర్జన్ మేజర్‌ను కలుసుకుని గ్లోవ్స్ దుకాణంలో పనిచేస్తున్న ఈ అందగత్తె గురించి తెలిపాడు.

"గ్లోవ్స్ అమ్మే కౌంటర్‌వద్ద ఓ పిల్లను చూశాను. చూడటానికి రెండుకళ్ళు చాలవనుకో. అంత అందంగా ఉంటుంది. మీరు చూస్తే నామాట నిజమని ఒప్పుకొని తీరుతారు. నా మాతృభూమికి సేవచేయడానికి మించిన ఆనందం నాకు మరొకటిలేదు. ఈ భాగ్యం కోసమే సదా నేను పరితపిస్తూవుంటాను. అయితే మీరు నాకోమాట ఇవ్వాలి. మీరు ఆ పిల్లను చూసేటప్పుడు నేను ఆ అమ్మాయిని గురించి మీకు తెలిపినట్లు ఆ పిల్లకు చెప్పకండేం. ఎందుకంటే ఇలా రిక్రూట్ కావడం ఎంత గౌరవమో ఈ పిల్లల్లో కొంతమందికి తెలిసిచావదు" అంటూ ఆ మేజర్ జనరల్ విన్నవించాడు.

డాక్టర్ ఊర్జెర్ ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగలడు. మేజర్ జనరల్ కథ చెప్పిన తీరులోనే అనేక విషయాలను గ్రహించాడు. అంతావిని "సరే అలాగే... ఆ పిల్ల అందంతోపాటు ఆరోగ్యంగా కూడా ఉంటే మరోవారంలోనే 'మదననదనం'లో ఉంటుంది" అని హామీ ఇచ్చాడు. ఆవిధంగా మెటిల్డా ఇక్కడికి చేరింది.



"ఈ పిల్లలను ఎలా రిక్రూట్ చేస్తారు... ఇది చాలా కష్టంగాదూ?" అని ఇతర సైనికాధికార్లను అడిగాడు.

వెర్నర్ బృందం ప్రయాణిస్తూన్న కారు మదననదనం దగ్గరకు వచ్చేసరికి, ప్రవేశ ద్వారంలోనే డాక్టర్ ఊర్జర్ వీళ్ళకోసం ఎదురుచూ

స్తూవున్నాడు. వెర్నర్ వెంట కారులో వచ్చిన ఇద్దరమ్మాయిల్లో ఒక పిల్లనుచూసి డాక్టర్ ఆశ్చర్యపోయాడు. అయినా ముందు వెర్నర్‌తోనే మాట్లాడాడు.

"నీ రాక మాకు బ్రహ్మాండమైన ఆనందం కలిగించింది" అంటూ నల్లగా, సంసారపక్షంగావున్న ఆ పిల్లవైపు తలవంకించి "ఈ అమ్మాయి కూడా మీ వెంట వచ్చిందా?" అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్న వినడంతోనే ఆ యువతి తనకుతానై ముందుకువచ్చి "మీ దయతో వారి కారులో నన్ను రానిచ్చారు సర్జన్" అని సమాధానం చెప్పింది.

"ఇంతకూ నీవెవరు? నిన్ను ఇక్కడకు రమ్మని ఎవరైనా పిలిచారా?" అంటూ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు డాక్టర్.

"నన్నెవరూ ఇక్కడికి పిలవలేదు డాక్టర్. అల్‌బర్గ్‌లోని హిట్లర్ యువజన సంఘానికి నేను కార్యదర్శిని. మీరు నాకో ఇంటర్వ్యూ ఇవ్వాలని నేను ప్రార్థిస్తూ వున్నాను" అని అడిగింది.

"సరే. నీవు నా ఆఫీసులోవుండు... ఓ క్షణంలో నేను కలుస్తా" అంటూ చిరచిరలాడుతూ చెప్పాడు. రెండవ అమ్మాయి వైపు తిరిగి "నీవు కూడాఆఫీసులో ఉండు" అని చెప్పాడు.

రాగిరంగుజుత్తుతో అందంగావున్న ఆ రెండవపిల్ల ముందుకువచ్చి "నేను కుమారి హాన్టర్‌బాక్‌ను డాక్టర్!" అంటూ చెప్పింది.

"నాకు తెలును... నేను నిన్ను గుర్తుపట్టాను" అంటూ డాక్టరు మరలా వెర్నర్ వైపు తిరిగి "మీ రైలు లేట్ అయిందా? నేను మీకోసం ఓ గంటబట్టీ ఎదురుచూస్తూవున్నా" అని అన్నాడు.

"ఈ రైలు ఎప్పుడూ లేటేనా డాక్టర్?"

"అవును... ఈ రైలే అంత. ప్రయాణీకులు ఎక్కువైతే స్పీడు తగ్గుతుంది. మీరు నాతో రండి, అమ్మాయిలు కాసేపు బయట వుంటారు" అని చెప్పి త్రోవతీశాడు.

ముగ్గురు యువకులనూ ఆస్పత్రిలోనికి తీసుకెళ్ళి ఒక్కొక్కరినే విడివిడిగా పరీక్షించాడు.

"ఇక్కడి నిబంధనలు అలాంటివి లెఫ్టినెంట్" రంగంలోవున్న నా సహచరులపై నాకు విశ్వాసంలేదని దీనర్థంకాదు. యుద్ధరంగం నుండి ఇక్కడికి వచ్చేసరికి మధ్యలో ప్రయాణం చాలారోజులు పడుతుంది. అందువల్ల వారి ప్రకృతిలో చాలా తేడావస్తుంది. ఈమధ్యకాలంలో తరచుగా కొన్ని దుర్ఘటనలు జరుగుతాయి. మీరు నమ్మకపోవచ్చు. కానీ కొంతమంది యువకులు ఈ మధ్యకాలంలో ప్రణయదేవతకు దాసులై తన నరాల సలుపు తీర్చుకుంటారు. ఇది నాకేమీ బోధపడదు. జర్మనీలోవుండే యువతులందరిలో కంటే మిన్నయైన సుందరాంగుల పొందుకోసమే తామిక్కడికి వస్తున్నామని వాళ్లకు తెలుసు. ఈలోగా వాళ్ళు అర్థమైన ఆడదానికోసం వెంపర్లాడటం ఎందుకు? ఒక ఆఫీసరు. అవును లెఫ్టినెంట్... అతగాడు పారిస్ మీదుగా వస్తూ బ్రహ్మాండమైన రోగం తగిలించుకొనివచ్చాడు. ఇదేందయ్యా మగడా? అంటే తనకీ బహుమతి అత్యంత గౌరవనీయమైన కుటుంబంలోని అమ్మాయినుండి లభించిందని చెప్పాడు. పైగా ఆ పిల్లను అతికష్టంమీద వదిలించుకుని రావలసి వచ్చిందన్నాడు. నీవు ఊహించగలవా లెఫ్టినెంట్? పోనీ అతను చెప్పింది నిజమేననుకుందాం. అతను మదనసదనం చేరేవరకూ ఎందుకు ఓపిక పట్టలేకపోయాడు? ఇక్కడ అప్సరసలను తలదన్నే అందాలభామలు ఒక్కమాటతో, ఒక సంజ్ఞతో వచ్చి అతని వళ్ళో వాలడానికి సిద్ధంగా వున్నారుగదా"

వెర్నర్ దీనికేమీ సమాధానం చెప్పలేదు. బహుశా మదనసదనంలో అందాలభామలు కుప్పతెప్పలుగావుండి, ఒక్క కనుసన్నతో అతని వళ్ళోవచ్చి వాలడమనేది అతనికి అసంగతంగా తోచివుండవచ్చు. అసహ్యం కూడా కలిగించి వుండవచ్చు. అడిగీ అడక్కముందే ఒళ్ళోవచ్చి వాలేదానికంటే అందీ అందకుండా దోబూచులాడేదాని హృదయసామ్రాజ్యాన్ని అతి కష్టంమీద మెల్లిగా కొల్లగొట్టడంలోనే థ్రిల్ వుంటుందనీ, అప్పుడే ప్రేమలోని మాధుర్యం పెరుగుతుందనీ ఆ ఆఫీసరు భావించి వుండవచ్చు. ఆ అధికారికి అలాంటి కాంక్షలేకపోయినా అతని మనస్తత్వమేమిటో

గ్రహించగలిగాడు.

"భేష్! యూ ఆర్ ఫిట్ ఫర్ డ్యూటీ" అంటూ నర్జన్ మెచ్చుకోలుగా వెర్నర్ భుజం తట్టాడు. "నా ప్రయోగశాల అంటే ఏమిటనుకున్నావ్? దురదృష్టవశాత్తు ఇది ఎక్కువగా ఉపయోగపడటంలేదనుకో. ఈ క్షణంలో మీరు బ్రహ్మాండమైన ఆరోగ్యంతోవున్నారు" అంటూ డాక్టరు మిగిలిన ఇద్దరు చిన్న అధికార్లకు కూడా తలుపు తెరిచాడు, ఇక ఈ సామ్రాజ్యంలోని ఎల్లలను మీకు పరిచయం చేస్తానంటూ.

డాక్టరు సన్నని ఇరుకుదారిగుండా మఠంలోకి త్రోవతీశాడు. ఆ పురాతన మఠంలో సూర్యకాంతి ఉండీలేనట్లుగా మసకమసకగా ప్రసరిస్తూవుంది.

"పాపం.. సన్యాసులకు శాశ్వతమైన చిరువెలుగుకావాలి. కానీ మన అమ్మాయిలకు మాత్రం ప్రచండమైన సూర్యకాంతి కావాలి. వాళ్ళను మీరే చూస్తారుగా అంటూ డాక్టరు నవ్వసాగాడు.

మఠానికి చుట్టూవున్న అగడ్తపై ఎత్తిదించడానికి వీలుగావున్న కదిలే వంతెనను దాటారు. మఠం గోడలు మసకమసగ్గా కనిపిస్తూవున్నాయి.

"ఇదంతా చూస్తే మీ అమ్మాయిల్ని బయటపడటానికి వీలులేకుండా పంజరంలో బంధించినట్లుందే" అని వ్యాఖ్యానించాడు సార్జెంట్ కారల్.

"మా అమ్మాయిలకు ఇక్కడనుండి బయటపడాలనిగానీ, పారిపోవాలనిగానీ ఆలోచనేరాదని నేననుకుంటూవున్నాను. ఇంత కట్టుదిట్టం ఎందుకంటే బయటివారు లోపలికి చొరబడకుండా వుండాలనే" అని సమర్థించుకున్నాడు నర్జన్.

"నిజమే... ఇక్కడ జరిగే మదనకేళి బయటివాళ్ళను ప్రేరేపిస్తుంది" అన్నాడు సార్జెంట్ ఒట్టో.

"బయటినుండి లోపలకు జొరబడాలని చూసే కామపిశాచాల కాళ్ళు విరగ్గొట్టడానికి రాత్రిళ్ళు కాపలావాళ్ళు వేయి కళ్ళతో కాపలాకాస్తూ వుంటారు" డాక్టరు వివరించాడు.

వాళ్ళు రంగురంగుల పువ్వులు నిండుగా విరబూసివున్న ఉద్యానవనాన్నీ పచ్చని పచ్చికబయళ్ళను దాటుతూవున్నారు. మఠానికి కొన్ని వందల గజాల దూరంలోవున్న చిట్టడవి దగ్గర ఆగారు. యవ్వనమంతా రాసిపోసినట్లున్న పన్నెండుమంది కన్యలు తమ తనువూ, మనసూ ప్రణయదేవతకే అర్పించినట్లుగా నగ్నసౌందర్యాన్ని విరజిమ్ముతూ బయటికి వచ్చారు. ఆ జట్టు నాయకురాలు జడఅల్లి రిబ్బనుతో అలంకరించుకుని వుంది. మిగతాకన్యలు భుజాలు దిగేలా కురులు విరబోసుకుని వున్నారు.

"అరుగో... మీకాబోయే భార్యలు వచ్చేశారు. మొదటి ఆవిడ దళనాయకురాలు. ఆవిడను మినహాయించి మిగిలిన పదకొండుమందిలో మీకు ఇష్టమైన అమ్మాయిని ఎంచుకోవచ్చు" అంటూ డాక్టరు వివరించాడు.

ఆ అమ్మాయిలందరూ ఒకే వరుసక్రమంలో డాక్టరూ ఆ ముగ్గురు హీరోల ముందునుండి వెళ్ళారు. వారిలో ఒక అమ్మాయికి తప్ప మిగతా వారెవరికీ పురుషులు అక్కడ నిలిచివున్నట్లు ముందుగా తెలిసినట్లులేదు. కందగడ్డలాంటి ఎర్రటి తలతో, పుష్టిగా, బలిసిన పిక్కలతో ప్రపంచాన్నే జయించగలమన్న ధీమాతో నిక్కబొడిచిన వక్షంతో వున్న ఆ పిల్ల ఏమాత్రం సిగ్గూ లేకుండా ఆ ముగ్గుర్నీ 'మీ సంగతి నాకు తెలుసులే' అన్నట్టు తదేకదీక్షతో చూస్తూవుంది.

"హాయ్... అదే- ఆ పిల్ల నాకు కావాలి" అంటూ కళ్ళింతలు చేసుకొని అరిచాడు ఒట్టో.

"ష్.. ఇతరుల ఎదుట నీవు అలాచెప్పకూడదు. ఈ అమ్మాయిలు శరీర వ్యాయామం చేయడానికి వచ్చారు. కావాలనుకుంటే నీవు చాలాదగ్గరగా నిలబడి, వాళ్ళను నిశితంగా పరిశీలించి, వాళ్ళగుణగణాలను క్షుణ్ణంగా తెలుసుకోవచ్చు. మరోగంటలో వాళ్ళు వరుసగా ఇదేదారిలో తిరిగివస్తారు. ఆ వరుసలో నీకు నచ్చిన పిల్లసంఖ్య ఎంతో నీవు గుర్తుంచుకో. ఆ తర్వాత నా ఆఫీసుకువచ్చి, నీవు ఎంచుకున్న పిల్లసంఖ్య ఏమిటో నాకు చెప్పు. తర్వాత ఏంచేయాలో నేను చెబుతాను" అంటూ వివరించి, డాక్టరు వారిని అక్కడేవదలి "తరువాత కలుద్దాం" అని వెళ్ళిపోయాడు.

తరువాత ఒట్టో, కారల్ యిద్దరూ పట్టలేని తమకంతో ఆ అమ్మాయిలననుసరించి వెళ్ళా





రు. వెర్నర్ మాత్రం ఆ అడవిలో కాసేపు అటూఇటూ వచారుచేస్తూవున్నాడు. అతని మనస్సంతా అల్లకల్లోలంగా వుంది.

ఆడపిల్లలందరూ పచ్చికమైదానంలో చేరి, చెత్తనింపిన తోలుబంతిని చేతులతో ఒకరికి అందేలా మరొకరు విసరుతూ వ్యాయామంచేస్తూ వున్నారు. వాళ్ళవి నిశితమైన చూపులు. కండలుతేరిన చేతులు. కానీ ఒకోసారి బంతి వాళ్ళచేతులకు అందడంలేదు. అలాంటప్పుడు నవ్వులు చప్పట్లతో ఆ మైదానమంతా మారుమ్రోగుతూవుంది. తొలుత ఆ అమ్మాయిలు, వాళ్ళనంటిపెట్టుకునివచ్చి, కొద్దిదూరంలో నిలబడి తమనే గమనిస్తూవున్న ఆ యిద్దరు సైనికుల ఉనికినే తాము గమనించడంలేదన్నట్లు నటించారు. తరువాత వాళ్ళవైపు దొంగ చూపులు చూడసాగారు. చివరకు అందరిచూపులు కలిశాయి. పెద్దఎర్రటి తలకాయ పిల్ల మాత్రం తనకు అవకాశం వచ్చినప్పుడల్లా బంతిని ఆ ఇద్దరు మగాళ్ళున్నవైపు దొర్లించేది.

"అదే.. ఆపిల్లే నాకు కావాలి" అన్నాడు ఒట్టో.

ఫ్లిట్టర్ బంతి ఆటను ఆపించి హార్డిల్ రేస్ ప్రారంభించింది. అందమైన ఈ ఆడపిల్లలంతా పచ్చికమైదానంపై చిన్నచిన్న హార్డిల్స్‌ను ఎగిరిదాటుతూ, పరుగులుపెట్టే దృశ్యంచూస్తూ ఒట్టో సంబరపడిపోతున్నాడు.

"వాళ్ళనుచూడు... వాళ్ళలో నీవు ఎవర్ని ఎంచుకుంటావ్?" ఒట్టో ఉల్లాసంగా కారల్‌ను అడిగాడు.

"అందరూ అప్సరసలే" కారల్ సమాధానం.

"అంటే నువ్వింకా దేన్నో ఒకదాన్ని నిర్ణయించుకోలేదన్నమాట! నేను మాత్రం ఎంచుకున్నాను. పుష్టిగా, దిమ్మెలాగా వున్న ఆ పిల్లను చూడు. అంతచక్రం నేనింతకుముందెప్పుడూ చూడలా! అబ్బ... ఆ నడకచూడు! పరుగులోనూ, ఊపులోనూ ఏమందం ఏమందం ఆ అందమంతా నాదే... నాదే" అని లొట్టలేస్తూ... ఇకపద అమ్మాయిలు ఈతగొట్టేటప్పుడు చూద్దాం" అంటూ కారల్‌ను లాక్కెళ్ళాడు.

వెర్నర్ నదీతీరం దగ్గర కూర్చోడానికి వెళ్ళాడు. అమ్మాయిల వ్యాయామక్రీడలు ఈతతో ముగుస్తాయని అతనికి తెలియదు. అమ్మాయిలందరూ బిలబిలమని అతనిదాపులోకి వచ్చారు.. దళనాయకురాలు ఫ్లిట్టర్ సూచనతో తల క్రిందుగా నీళ్ళలో దూకారు. వాళ్ళలో యిద్దరికి ఈతబొత్తిగా రానట్లుంది. వాళ్ళుమాత్రం తీరందగ్గరే ఆగిపోయారు. వాళ్ళకు ఫ్లిట్టర్ ఈతలోని మెళకువలు నేర్పుతూవుంది. మిగిలినవారు ఈతలో ఒకర్నొకరుమించిపోవాలని పోటీపడుతున్నారు. ఒకమ్మాయి మాత్రం అందరికంటె వెనుకగా, నెమ్మదిగా శక్తివంతంగా చేతులతో నీళ్ళు మోదుతూ ఈదుతూనే వుంది. ఫ్లిట్టర్ ఆ అమ్మాయిని తీరానికి రమ్మని ఆదేశించేవరకూ ఆ పిల్ల నీళ్ళలోనే వుంది. మిగతావాళ్ళందరికంటె సన్నగా, నాజూకుగా, దివ్యసుందర విగ్రహంలాగుంది. ఆపాదమస్తకం తడిసిన ఆ పిల్ల తలమీద నీళ్ళతుంపురులు మంచుముత్యాల్లా మెరుస్తూ వింతఅందాలు చిలకరిస్తూవున్నాయి. ఆ అమ్మాయి కురులు పిరుదులవరకూ జీరాడుతున్నాయి. అమ్మాయిలవరుసలో చివరన నిలుచుందాపిల్ల.

మరో పావుగంట తర్వాత ఆ ముగ్గురు పురుషులూ డాక్టర్ ఆఫీసు బయటప్రాంగణంలో కూర్చున్నారు.

"లెఫ్టినెంట్... నీ పిల్లను యెంచుకొన్నావా" అడిగాడు ఒట్టో. కాంక్షతో అతని కళ్ళు మిలమిలలాడుతూ వున్నాయి.

"ఊఁ" వెర్నర్ సమాధానం.

"నీవిషయమేమిటి కారల్?" ఒట్టో ప్రశ్న.

"నేను... నేనూ ఎంచుకున్నాననే అనుకుంటున్నాను"

"అయితే మనం ముగ్గురం డాక్టరుగారి రాకకోసం ఎదురుచూడాలి. అదిగో... మాటల్లోనే వచ్చేశాడు" అన్నాడు ఒట్టో.

తలుపు తెరుచుకుంది.

"లెఫ్టినెంట్ వెర్నర్ కమ్ఇన్" అంటూ డాక్టర్ ఆహ్వానించాడు.

దీనితో మిగతా యిద్దరు సైనికులూ గుర్రుమన్నారు. "హూదా!" అంటూ గొణుక్కున్నారు.

"ఇక్కడికొచ్చినా, అక్కడిలాగే హూదానే. ఏదైనాగానీ, సిగరెట్‌గానీ, మద్యంగానీ, చివ

రకు మగువగానీ ముందుగా ఆఫీసర్లు అనుభవించవలసిందే. ఛీ.. ఛీ.. ఎక్కడకుపోయినా యిదేఖర్మ.. బహుశా నేను ఎన్నుకున్నదాన్ని వాడు లాక్కోడనే అనుకుంటా'' అంటూ ఒట్టో ఉడికిపోతూవున్నాడు.

గదిలోపల వెర్నర్‌కు కుర్చీచూపించాడు డాక్టర్. బల్లవెనుక తన కుర్చీలో కూర్చుని చేతులు రుద్దుకుంటున్నాడు.

''వెల్... నాచిన్నిపటాలాన్ని గురించి నీ వేమనుకుంటున్నావు? శారీరక పుష్టి. అందం విషయంచూస్తే మొత్తం దేశంలోని అప్సరసలంతా యిక్కడే వున్నారనుకుంటా''

''నిజమే'' అన్నాడు వెర్నర్ యాధాలాపంగా.

వెర్నర్‌లో అంత ఉత్సాహం, ఉల్లాసం కనిపించకపోవడంతో డాక్టరు కొన్త కలత చెందాడు. కనుబొమలు చిట్లిస్తూ తిరిగి చెప్పసాగాడు. ''సరిగా చెప్పండి. ఈ పన్నెండుమందిలో నీమనసుకు నచ్చిన అందగత్తె ఎవరూలేరంటే, మరో డజన్‌మందిని నీయెదుట పెరేడ్‌చేయిస్తా. ఇప్పుడిక్కడ యాభయిద్దరు అమ్మాయిలున్నారు''.

''మీరేం కష్టపడకండి. పన్నెండోనెంబరు పిల్లను ఎంచుకున్నాను'' వెర్నర్ చెప్పాడు.

''భేష్... లెఫ్టినెంట్ భేష్! అసాధారణమైన యువతిని యెంచుకున్నావు. ఆమె జర్మనీ మొత్తంలో పేరుప్రతిష్టగల కుటుంబాల్లోని ఒక కుటుంబానికి చెందిన పిల్ల.. నీలాగే పేరూప్రఖ్యాతీగల వంశం... మీ అంతగా కాకపోయినా ఉత్తమోత్తమమైన కుటుంబంలోని పిల్ల. నేనా పిల్లపేరు చెప్పడానికి వీల్లేదు. ఇష్టమైతే ఆ పిల్లే నీకు చెబుతుంది''.

''ఓ.. ఇదంతా ఊరూపేరూ తెలియనివ్వని అజ్ఞాత వ్యవహారమన్నమాట?''.

''అక్షరాలా అంతే''

''మరి పిల్లో, పిల్లాడో పుట్టాడనుకో! అప్పుడు?''

''అప్పుడు..'' అంటూ డాక్టరు తన రెండు చేతులు ఇంటికప్పువైపు ఎత్తాడు, ఆకాశంకేసి చూపిస్తున్నట్లు. ''అవును... బిడ్డలు పుడితేనేం- ఇక్కడేవుంటారు. పిల్లల్ని కనడానికేగా ఈ అమ్మాయిల్ని యిక్కడ వుంచింది. వాళ్ళందర్నీ నేను జాగ్రత్తగా పరీక్షించాను. వాళ్ళలో ఎక్కువభాగం యింతకుముందు ఎలాంటి ప్రణయానుభవంలేని కన్యలే. అందరూ సృష్టికార్యక్రమానికి బ్రహ్మాండంగా తగినవారే. పిల్లలు పుడితే ఆ పిల్లలంతా జర్మనీకి చెందుతారు. మన ఫ్యూరర్ హెర్ హిట్లర్‌కు చెందుతారు''

''హెర్‌హిట్లర్?'' అంటూ పునరుచ్చరించాడు.

''అవును... నేను లోగడ చెప్పినట్లు నీవు ఎన్నుకున్నపిల్ల ఉన్నతవర్గంలోని ఉత్తమ కుటుంబపు పిల్ల. అంత గొప్ప అంతస్తుగల కుటుంబాలనుండి వచ్చిన అమ్మాయిలు మధనసదనంలో చాలాతక్కువమంది వున్నారు'' అని చెబుతున్నాడు డాక్టర్.

''అంటే దానర్థం- రైతుల, కార్మికుల కూతుళ్ళే మన మధ్యతరగతి, ఉన్నతవర్గంవారి అమ్మాయిలకంటే పుష్టిగా, అందంగా వుంటారనా?'' నవ్వుతూ ప్రశ్నించాడు వెర్నర్.

''నేను చెప్పింది అలా అనికాదు. కొన్ని పైఅంతస్తులోవున్న కుటుంబాల్లోని తల్లిదండ్రులు తమ కూతుళ్ళు యిక్కడికి రాకుండా నిరోధించేందుకు మన్నూ మిన్నూ ఏకంచేస్తారు. కొన్నిసందర్భాలలో వాళ్ళు తమ పంతం నెగ్గించుకుంటారు'' డాక్టరు వివరించాడు.

''నిస్సందేహంగా అలాగే జరుగుతుంది. అయితే ఈ పన్నెండవ నెంబరుపిల్ల తల్లిదండ్రులు మీ మహత్కార్యానికి సహకరించినట్లేగా?'' తిరిగి ప్రశ్నించాడు వెర్నర్.

''అనే చెప్పాలి'' అన్నాడు డాక్టరు కొన్త సందేహించిన తరువాత. ఏమైనా ఈ అమ్మాయి నీచేతుల్లో పడటం నాకు సంతోషంగా వుంది. ఇక్కడికి వచ్చిన సైనికాధికారులందరూ ధైర్యసాహసాలుగలవారూ, అందమైనవారూ అయినప్పటికీ నీ అంత మేధాసంపత్తిగలవారు మాత్రంకారు. నీ రికార్డంతా నేను చూశాను. అది నేనూహించినట్లే బ్రహ్మాండంగా వుంది. ఇక యుద్ధంలో నీవు సాధించిన అద్భుతవిజయాల గురించి నేను ప్రస్తావించడంలేదు. ఎందుకంటే అదంతా మొత్తం జర్మనీకే తెలును''

ఈ ప్రశంసలకు డాక్టరుకు ధన్యవాదాలు




చెప్పాడు వెర్నర్.

"మనం ఉత్కృష్టమైన సంగమాన్ని కల్పిస్తున్నాం. మనం ఉత్తమోత్తమమైన అశ్వజాతిని సృష్టించినవారికృషిలో సగం చేయగలిగినా... క్షమించాలి. కేవలం భౌతిక విషయంగా చూస్తే..."

"మనం జంతువులం" అంటూ డాక్టరు వాక్యాన్ని పూరించాడు లెఫ్టినెంట్. మీరు చెప్పినదానితో నేనూ ఏకీభవిస్తాను డాక్టర్. కానీ ఈ భూప్రపంచంలో ఉత్తమోత్తమమైన జంతువులు వున్నాయా అనేదే నా సందేహం"

ఈ మాటలు వింటున్న డాక్టర్ ఆ వైమానిక దళాధిపతి వైపు ఆశ్చర్యంగా, తీక్షణంగా చూశాడు. "మీరేమంటున్నారు లెఫ్టినెంట్?"

"ఏమీ అనడంలేదు డాక్టర్! ఈ విషయంలో మనం అంత లోతుకు వెళ్ళడం అనవసరం. తత్వశాస్త్రాన్ని గురించి చర్చించడానికి యిది సమయంగాదు".

"నిజమే" అంటూ నవ్వాడు డాక్టర్. "ఇది ప్రేమించుకొనడానికి తగిన సమయం. ఈ విషయం మీరూ కాదనరనుకుంటా. ఇదిగో మీ కార్యక్రమం. మీరిక్కడవున్న వారంరోజులూ మీకు సమస్త సౌకర్యాలతో కూడిన కుటీరం లభిస్తుంది. మీ ప్రేయసితోపాటు అందులో జంటగా నివశిస్తారు. భోజనంగూడా అక్కడికేవస్తుంది. ఇక ఈ మఠంచుట్టూ వున్న విశాలమైన ప్రాంతంలో మీరు విహరించవచ్చు. మీకిష్టమైతే యితర జంటల కుటీరాలకు వెళ్ళి వాళ్ళను పరామర్శించవచ్చు. కానీ, అది అంత మంచిదిగాదని నా ఉద్దేశం. ఎందుకంటే మన కుర్రాళ్ళున్నారే, వాళ్ళు మొదట తాము ఎంచుకున్న పిల్లను అనుభవించిన తరువాత దానిలో ఆకర్షణా, ఆసక్తీతగ్గుతుంది. మరోపిల్లను అనుభవిద్దామనే కాంక్ష పెరిగి దానికోసం వెంపర్లాడుతూ వుంటారు. అలాంటివాళ్ళని వెంటనే యుద్ధరంగానికి తిప్పిపంపుతామనుకో"- అంటూ అక్కడి స్థితిగతులన్నింటినీ వివరించాడు డాక్టర్.

"మీ గౌరవప్రతిష్టలను కాపాడుకోడంలో మీరెంత జాగ్రత్తగా వున్నారో దీనినిబట్టి నాకు బోధపడుతూవుంది"- అన్నాడు వెర్నర్ నవ్వుతూ.

ఈ మాటలకు సర్జన్ మాత్రం నవ్వలేదు. గంభీరంగా చెబుతున్నాడు.

"మనబిడ్డల జనకత్వం విషయంలో మనం హామీ ఇవ్వగలిగేవిధంగా ప్రత్యేకించి జాగ్రత్తలు తీసుకోవాలి. బిడ్డకూ, తల్లిదండ్రుల గుణగణాలకూ మధ్యగల పోలికలను ప్రత్యేకవిశిష్టతలనూ జాగ్రత్తగా, సక్రమంగా నమోదుచేయాలి.

"దానితోపాటు ఒకరత్నంలోని అంటే ఆడదానిలోని అన్నికోణాలనూ సంపూర్ణంగా పరిశీలించి, ఆనందించడానికి ఒక పురుషునికి ఒకవారం సమయం ఎందుకూచాలదు. నేను ఆడదాన్ని రత్నంతో పోలుస్తున్నానంటే, మీరు ఎంచుకున్న పిల్ల విషయంలో ఏ మాత్రం అతిశయోక్తిగాదు. ఇక ఈ ఉపన్యాసం యిలాగే సాగితే, మీ హనీమూన్ సమయం చాలా తరిగిపోతుందేమోనని భావిస్తున్నా. గుడ్‌బై లెఫ్టినెంట్... మీరు విడిది చేసే కుటీరం చూశారుగదా. మహా అయితే మరో అరగంటలో మీరు ఎంచుకున్న అందాలరాణి మీ వద్దకు చేరుతుంది" అంటూ చెప్పాడు డాక్టర్ చిరునవ్వు నవ్వుతూ.

ఆ కుటీరాలన్నింటికీ పేర్లున్నాయి. వెర్నర్‌ది నాజూకైన చిన్న కుటీరం. దానిని అందంగా తీర్చిదిద్దినట్లు కట్టారు. లోపలంతా అందమైన ఫర్నీచర్‌తో అలంకరించిన పెద్ద గది. విశాలమైన పడకగది. దానిని ఆనుకుని బాల్కనీ, స్నానాల గదీ ఉన్నాయి. ఒక్క గోడ మినహా మిగతా గోడలన్నింటిమీదా కామశాస్త్ర పాఠాలను తెలియజెప్పే కేళీవిలాస, వినోద దృశ్యాలతో కూడిన భిత్తికా చిత్రాలున్నాయి. చిత్రాలులేని గోడమీద పుస్తకాల బీరువాలు అమర్చివున్నాయి. యుద్ధానికి సంబంధించిన పత్రికలు, కొద్దిగా నవలలు వానిలో వున్నాయి.

లెఫ్టినెంట్ హార్న్ ఆ కుటీరంలోకి అడుగుపెడుతూనే స్నానాల గదిలోకి దూరాడు. నలభై ఎనిమిది గంటల రైలు ప్రయాణపు బడలికనూ, శరీరంనిండా పేరుకుపోయిన దుమ్మునూ సాంతం దులిపేయడానికా అన్నట్లు స్నానం చేయడంలో మునిగిపోయాడు. బయటనుండి తలుపుతట్టిన శబ్దం వినిపించేవరకూ కూడా స్నానం చేస్తూనేవున్నాడు.



"కమీన్... అక్కడ కూర్చోండి. క్షమించండి. కొన్ని నిమిషాలలోనే వస్తా" అంటూ బాత్ రూంలోనుండే చెప్పాడు.

బాత్‌రూంలోనుండి లెఫ్టినెంట్ బయటికి వచ్చేసరికి అతని వారంరోజుల భార్య కుర్చీలో కూర్చునివుంది. వక్షోజాలు సగభాగం కని పించేలా మెడకు చాలా దిగువగా కత్తిరించిన అంగీ తొడుక్కుని వుంది. అదికూడా ఏమంత పొడవుగా లేదు. కుర్చీలో కూర్చుని కాలుమీదకా లు వేసుకుంటే, మోకాలిపై గల తొడల భాగ మంతా కనిపిస్తూ చూసేవాళ్లకు మత్తుగొలి పేలా వుంది. లెఫ్టినెంట్ బాత్‌రూం నుండి బయటకు రాగానే "బాగున్నావా వెర్నర్?" అంటూ ప్రశ్నించింది.

ఆ అమ్మాయి మరెవరో కాదు. సంగీత సామ్రాట్ కూతురు హెడ్విగ్ స్విట్జ్‌ముల్లర్.

"సిగరెట్టు వుందా. మేము పొగ తాగకూడ దు. పొగాకు లేదు. మద్యంలేదు. చివరకు నాటుసారా కూడా లేదు. దాంతోపాటే ఉల్లాస మూ లేదు. ఉత్సాహమూ లేదు. మన హనీ మూన్‌లోనయితే ఇవన్నీ దొరుకుతాయి" అంటూ ఆ అమ్మాయి పగలబడి నవ్వుతూ అంది.

వెర్నర్ మారుమాట్లాడకుండా తన సిగరెట్ కేసు అందించాడు. అతను అతికష్టంమీద హెడ్విగ్‌ను గుర్తించాడు. సిగ్గెగ్గుల సిగదరిగిన ట్లున్న ఈ పిల్లకూ, ఒక నెల క్రితం సెయింట్ జర్మయిన్‌లో తాను కలిసినప్పుడు మొగ్గలా ముడుచుకుపోతూ, అమిత మితభాషిగా వున్న అమ్మాయికి ఎక్కడా పోలికే లేదు. ఎర్నా అన్నట్లు నిజంగా విచిత్రమైన వ్యక్తి అనుకున్నా డు.

సిగరెట్ అందుకున్న హెడ్విగ్ వెర్నర్‌కు థాంక్స్ చెప్పింది. చేతిలోని సిగరెట్‌ను సరస్సు వైపు ఊపుతూ "నీవు నది దగ్గర కూర్చుని వుండగా నేను గుర్తుపట్టాను. నీవు నన్నే ఎంచు కుంటావని అప్పుడే అనుకున్నా" అంది.

వెర్నర్ తన పెదవులమీద మెరిసిన వ్యంగ్యార్థకమైన నవ్వును దాచుకోలేక పైకి నవ్వేశాడు.

"ఇక్కడున్న అమ్మాయిలందర్లోకీ నేనే అందంగా, ఆకర్షణీయంగా వున్నానని కాదులే" అంటూ తన కురులు విడివడి భుజాల మీద పడేలా హెడ్విగ్ తల విదిలించింది. "ఈ మదనసదనంలో నన్నుమించిన అందగత్తెలు ఎందరో ఉన్నారని నాకు తెలుసు. కానీ నీలాంటి సిగ్గరి అయిన యువకుడు అంతకు ముందు బాగా తెలిసిన పిల్లనే ఎంచుకుంటా డని నేను అనుకున్నా. అవునూ... సంగీతం అంటే నీకెంతో యిష్టంగదూ! నీ యిష్టం తీరుద్దామన్నా యిక్కడ పియానో గూడా లేదే" అంటూ ఆ అమ్మాయి తిరిగి బిగ్గరగా నవ్వింది. ఆ నవ్వులో కంగారు, భయం, ఉద్రేకం కలగలసి వున్నాయి. ఆ నవ్వు వెర్నర్‌కు కర్ణకఠోరమనిపించింది. తన నవ్వు తానేవిని హెడ్విగ్ కూడా కలవరపడింది.

"ఇదిగో అమ్మాయ్... నా దగ్గర నటించకు. నీ మనసులోనిమాట నిర్మొహమాటంగా చెప్పు. నీవు యిక్కడ వున్నందుకు బాధతో కుమిలిపో తున్నావ్ అవునా?" అంటూ లెఫ్టినెంట్ నిలదీ శాడు.

అంతవరకూ తుళ్ళుతూ, పేలుతూవున్న ఆ అమ్మాయి ఈ మాటలు వింటూనే ముఖం చేతుల్లో దాచుకుని వెక్కివెక్కి ఏడ్వసాగింది. వెర్నర్ ఆ అమ్మాయి కుర్చీ పక్కన కిందకూ ర్చుని ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకు న్నాడు. జ్వరం తగిలినట్లుగా వెచ్చగా కాలిపో తూవున్నాయి.

"భయపడకు... నాకిచ్చిన ఆదేశాలను మరో ఆడదానితో అమలు జరపగలనో లేదో నాకు తెలియదు. కానీ, కేవలం పైవారి ఉత్తర్వులకు భయపడి యాంత్రికంగా లొంగిపోయే అమ్మా యిని అనుభవించే అవకాశాన్ని నేను ఉపయో గించుకోవాలనుకోను" అన్నాడు లెఫ్టినెంట్.

హెడ్విగ్ తల పైకెత్తింది. జ్వరంతో కాగిపో తూ ఎర్రగా వున్న ఆమె బుగ్గల మీదనుండి కన్నీరు ధారాపాతంగా ప్రవహిస్తూవుంది. ఏదో మాట్లాడాలని సగం తెరచిన ఆమె పెదాలు వణికాయి. ఆమె నిరాశా చిత్రంలా కని పించింది. అయినా ఇంత దుఃఖంలో కుంగు తున్నా ఆమెలో ఇంత అందం యింతకు ముందెన్నడూ కనిపించలేదు.

ఆమె వెక్కిళ్లమధ్య చెప్పసాగింది. "వె ర్నర్... ఇక్కడ నేను రెండు వారాలు, అంటే పదిహేను పగళ్ళు, పదిహేను రాత్రులూ ఎవ





డైనా నన్ను ఎంచుకుంటాడేమోనన్న భయంతో, దుఃఖంతో కుమిలిపోతూవున్నాను. అయితే, అదృష్టవశాత్తు నేను వచ్చిన తరువాత, ఎక్కువమంది మగాళ్ళు రాలేదు. వాళ్లంతా ఇతర అమ్మాయిల్ని ఎంచుకున్నారు. నిన్ను చూస్తూనే నా హృదయం ఉద్వేగంతో కొట్టుకుంది. దానిని ఫ్లిట్టర్ గమనించింది. "నీకు ఊపిరందినట్లు లేదు. ఓ క్షణం విశ్రాంతి తీసుకో" అని చెప్పింది. అయినా నీదృష్టినాకర్షించడానికి నేనే ప్రయత్నమూ చెయ్యలేదు. ఆ సాహసమే నాకు లేదు. కానీ నీవు నన్ను ఎంచుకోవాలని హృదయపూర్తిగా కాంక్షించాను. నేను ఏమనుకున్నానో సరిగ్గా అదే జరిగింది"

"నిన్ను నేను గౌరవిస్తానని నీవు అనుకున్నావు అందుకే కోరుకున్నావు. ఔనా?"

"ఔను"

"సరే... అంతా మన మంచికే జరిగింది" అన్నాడు లెఫ్టినెంట్ ఆమెను ఓదార్చుతూ.

'సీజ్‌ఫ్రైడ్ కుటీరం'లో ఈ యిద్దరిమధ్య ఏకాంత సంభాషణ జరుగుతూ ఉన్న సమయంలో డాక్టర్ ఊర్జెర్ తన ఆఫీసులో మిగిలిన యిద్దరు సైనికుల వ్యవహారం పూర్తిచేస్తూ వున్నాడు. డాక్టరు బల్లమీదున్న కార్డులో 'వార్ ఊఫ్ ఒట్టో, సార్జెంట్, మెషీన్ గన్నర్, పూర్వ హోదా. మెటల్ వర్కర్, క్రుప్ వర్క్స్, ఊరు: ఎస్సెన్. వయసు: ఇరవై అయిదు; 12 బహుమతులు పొందాడు, అని వున్న వివరాలను బిగ్గరగా చదివాడు.

ఒట్టో లోనికి వస్తూనే డాక్టరు నవ్వుతూ "మూడో నెంబరు పిల్లే కావాలని ఇంకా కోరుకుంటున్నావా?" అని ప్రశ్నించాడు.

"ఆ పిల్ల ఇంకా ఖాళీగా వుందా డాక్టర్?" ఒట్టో ఎదురుప్రశ్న వేశాడు.

"ఆఁ... నిక్షేపంలా వుంది. మనోహరమైన పిల్ల. అవునా? నిజానికి అందరూ అందమైన పిల్లలే. వాళ్లందర్నీ నేనే ఎంపిక చేశా"

"మీ దృష్టి చాలా గొప్పది డాక్టర్" ప్రశంసనగా గలగలమని నవ్వాడు ఒట్టో.

"నీవుకూడా మంచి కుర్రాడిలాగే వున్నావు" అని నవ్వుతూ "మాకు చక్కని బిడ్డని అందిస్తావని ఆశ" అని అన్నాడు డాక్టరు.

ఈ మాటతో ఒట్టో బేర విరిచుకున్నాడు. "బిడ్డలను పుట్టించడం ఇదేం మొదటిసారి గాదు-"

"నీకు భార్యవుందా?"

"లేదు సార్... అయినా బిడ్డల్ని పుట్టించడానికి భార్య అవసరమా?"

డాక్టరు నవ్వసాగాడు. "నిజానికి కొన్నిసార్లు భార్య లేకుండా వుండటమే ఉత్తమం. సరే... యిప్పుడు నీ ప్రియురాలి వద్దకు నిన్ను తీసుకెళతారు. ఈ కార్డును ఆర్డర్లీకి యివ్వు"

"ఆర్డర్లీనా... ఇక్కడెవరూ ఆర్డర్లీ కనబడ్డంలేదు సార్. మీ ఆఫీసు బయట ఓ అమ్మాయి మాత్రం వుంది"

"ఆమే ఆర్డర్లీ... లేడీ ఆర్డర్లీ, బోధపడిందా. ఇక్కడ మగపురుగును అనుమతించం. నేను ఒక్కణ్ణీ తప్పనిస్తే. గొర్రెల మందలోకి తోడేళ్లను రానిస్తామా !గుడ్‌లక్. వద" అని పంపించివేశాడు.

ఒట్టో బయటకు వచ్చేరాకముందే కారల్ ఆ గదిలోకి దూరాడు.

"నీ నంబరెంత?" డాక్టరు ప్రశ్నించాడు.

"నంబరా?" ఆ సార్జెంట్ గతుక్కుమన్నాడు.

"అవును... నంబరు. ఈతకొట్టిన తరువాత వరుసక్రమంలో వచ్చే అమ్మాయిలను జాగ్రత్తగా చూసి మీకు నచ్చిన అమ్మాయి ఆ వరుసలో ఎన్నో నంబరో గుర్తుపెట్టుకోమని చెప్పాగా... నీకు బోధపడలేదా?"

"బోధపడింది సర్జన్, ఆ పిల్ల ఆరోనంబరనుకుంటా"

"అనుకుంటానంటే ఎలా! ఖచ్చితంగా చెప్పు. ఆ అమ్మాయి ఎలా వుంటుంది"

"అందంగా వుంటుంది"

"ఇక్కడున్న అందరూ అందగత్తెలేనయ్యా పొడుగ్గా వుంటుందా?"

"అవును సార్... పొడుగ్గానే వుంటుంది. ఆ పిల్లకంటే పొడుగైనవాళ్ళు కూడా వున్నారు"

""సరే... ఆ పిల్ల జుత్తు ఏ రంగులో వుంది?"

"రాగి రంగు. లేతరాగిరంగులో వుంటుంది సార్"

''అమ్మాయి సన్నంగా వుందా, లావుగానా?''

''మరీ అంత లావుగాదండి. కాస్త నిగ్గరిగానే వుంటుంది''

''అయితే ఆ పిల్ల నెంబరు ఆరే అయి వుంటుంది. నేను చెప్పేది సరిగా విను. ఆరవ నెంబరు పిల్లను పంపుతా. ఆ పిల్ల నీవు అనుకున్న పిల్లగాకపోతే లేడీ ఆర్డర్లీకి చెప్పు. తిరిగి ఐదో నెంబరు, ఏడో నెంబరు పిల్లల్ని పంపుతాం. వాళ్లలో ఎవరో ఒకరై వుంటారు''

''థాంక్యూ సర్జన్-మేజర్'' అంటూ కారల్ వెళ్ళిపోయాడు.

కారల్ బయటికి వెళ్ళిపోతూనే డాక్టరు గొణుక్కున్నాడు: ''ఇక చూడాలి ఆ చెత్త పీనుగను. ఆ దెయ్యం యిక్కడికి ఎలా, ఎందుకు వచ్చిందో, ఏం కావాలనుకుంటూవుందో''- అనుకున్నాడు.

ఆ ''అనాకారి చెత్త పీనుగ'' బయట వెయిటింగ్‌రూంలో కూర్చుని ఒక కరపత్రాన్ని చదువుతూ వుంది. 'ఉత్తమ సంతానప్రాప్తికి ఉపయోగమైన' విషయాలపై తాను రచించిన తాజా పత్రమే అదని డాక్టరు గమనించాడు.

''సారీ... నిన్ను చాలాసేపు వెయిట్ చేయించాను'' అన్నాడు డాక్టరు.

''మొదట సైనికుల వ్యవహారం చూడాలి గదా. వాళ్ళుండేది ఓ వారమేగదా. త్వరపడుతున్నారు... ఏం చేయను?'' అని సంజాయిషీ ఇచ్చుకున్నట్లు చెప్పాడు డాక్టర్.

''నేను మీనుండి ఓ సాయంకోరి వచ్చాను. నేను ఏ దాపరికం లేకుండా పచ్చిగా అడుగుతున్నానా?'' అంది ఆ అమ్మాయి.

సర్జన్ సమాధానం కోసం ఎదురుచూడకుండానే ఆ అమ్మాయి నిర్మొహమాటంగా మాట్లాడసాగింది. సారాంశం ఏమంటే ఆ పిల్ల వయసు ఇరవైరెండు సంవత్సరాలు. తాను అందగత్తె కాదని తనకీ తెలుసు. కానీ నిండు జవ్వని. మాంచి ఆరోగ్యంతో వుంది. ఆమెకు చాలా మంచి పిల్లలు పుడతారని గూడా ఆమె ఫామిలీ డాక్టరు చెప్పింది. ఆ పిల్ల నాజీ ఆశయాలను ప్రచారంచేసే నిర్విరామ కార్యకర్త. నైపుణ్యం గల గట్టి ప్రచారకురాలు. హిట్లర్ యువజన సంఘం ఆల్బర్గ్ శాఖను స్థాపించింది గూడా ఆమే. హిట్లర్ కొత్తజాతి సృష్టి పథకానికి డాక్టర్ ఊర్జెర్ బాధ్యుడుగా వున్నాడని తెలిసి వెంటనే అతన్ని కలుసుకోవడం కోసం, ఆమె హుటాహుటిన బెర్లిన్ వెళ్ళింది. ఆమె ఈ 'నూతనజాతి సృష్టి' సిద్ధాంతం మీద డాక్టర్ ఊర్జెర్ రాసిన ప్రతి విషయాన్నీ క్షుణ్ణంగా చదివింది. కానీ అతను అప్పటికే బెర్లిన్‌నుండి బవేరియా వెళ్ళాడని తెలుసుకుంది. అందువల్ల ఆమె ఈ 'నూతన జాతి సృష్టి' కోసం జరిగే పుత్రకామేష్టికి తనను తాను స్వచ్ఛందంగా అర్పించుకోవడం కోసం ఇక్కడికి వచ్చింది.

ఆ అమ్మాయి చెప్పిందంతా విని, ఏం సమాధానం చెప్పాలో తెలియక డాక్టర్ ఊర్జెర్ యిరుకున పడ్డాడు. ఆ పిల్ల చాలా సంసారవక్షంగా వుందిగాబట్టి, ప్రేమికులను ఆకర్షించే అవకాశమే లేదని నిర్మొహమాటంగా చెప్పడం కష్టం. మరోవైపు ఆ అమ్మాయి ఓ నాజీ కార్యకర్త. ప్రత్యేకించి ఆమెకు పార్టీ ప్రచార యంత్రాంగంలో ప్రత్యేక హోదా వుంది. అందువల్ల ఆమెతో చాలా సున్నితంగా వ్యవహరించవలసివుంది.

''నీ దేశభక్తికి నా ధన్యవాదాలు. కానీ ఒక విషయం నీకు చెప్పాలి. ఇక్కడ మా అభ్యర్థుల శారీరక అవసరాలను నిర్ణయించేది నేనొక్కడినే గాదు. ఈ విషయంలో కల్నల్ ఓంకోల్ట్జ్‌దే ప్రధానమైన పాత్ర. మా రిక్రూటింగ్ యంత్రాంగం గురించి నీకు బాగా తెలిసినట్టుంది. అమ్మాయిలను ఎంపిక చేయడంలో కల్నల్‌కు ప్రత్యక్ష ప్రమేయం వుందనే విషయం నీవు తెలుసుకోవాలి'' అంటూ వివరించాడు డాక్టర్.

''నాకు తెలుసు'' అంటుంటే ఆ చామనఛాయ అమ్మాయి సన్నని పెదవులు బాధాకరమైన నవ్వుతో వంపు తిరిగాయి. ''అందుకే నిన్ను స్వయంగా చూడాలని వచ్చాను. ఆడదాని అందాన్ని అంచనా వేయడంలో తనకు మించిన సకల కళా పారంగతుడు లేడని కౌంట్ ఓంకోల్ట్జ్ ఫోజు వేయడం నాకు బాగా తెలుసు.'' అంది ఆ అమ్మాయి.

''అంటే అతనికి తెలియదనా?'' అన్నాడు సర్జన్. ఆ అమ్మాయిని ప్రోత్సహించడం అతని ఉద్దేశంగాదు.

"అందమే సమస్తమూనని మీరు భావిస్తున్నారా?" అంటూ ఆ అమ్మాయి డాక్టరును నిగ్గదీసింది. "నాకు సమస్త విషయాలూ బాగా తెలుసునని మీరిప్పుడే అన్నారు... బాగుంది. మీరు ఇక్కడికి ఎంపిక చేసి తీసుకొచ్చిన యాభైమందికి పైగా అమ్మాయిల్లో యూనివర్సిటీ డిగ్రీలు ఎందరికున్నాయి? నేను అల్బర్గ్ హైస్కూలులో అసోసియేట్ ప్రొఫెసర్ని. అవును డాక్టర్... మీకు డాక్టర్ వెక్సూర్ సిద్ధాంతాలలోనూ, చివరకు మీ స్వంత సిద్ధాంతాలలోనూ నమ్మకముంటే జర్మనీకి మేధావులైన తల్లిదండ్రులకు కలిగే సంతానం కూడా అవసరమని మీరు భావిస్తారు" అంటూ నిగ్గదీసింది.

దీనికి సమాధానం చెప్పడం తెలియని సర్జన్ మేజర్ తన గడ్డాన్ని గట్టిగా రుద్దుకుని "తమ ప్రియురాండ్రను ఎన్నుకొనడంలో సైనికులకు పూర్తి స్వేచ్ఛ వున్న విషయం నీకు తెలుసుగదా" అని సర్దిచెప్పబోయాడు.

"నన్ను మీరు మీ మదనసదనంలో ప్రవేశపెట్టండి, అంతేచాలు. మీ కల్నల్ ఓంకోల్జ్‌కు మేధా విలువల గురించి యేం తెలుసు? మేధస్సుకు విలువ నిచ్చేవాళ్లు మీరు ఎంపిక చేసి తీసుకొచ్చిన సైనిక వీరుల్లో కనీసం ఒక్కడైనా ఉంటాడు. ఇది శాస్త్రవేత్తలైన మీకు ఆసక్తి రేకెత్తించే ప్రయోగం. ఒక మహా శాస్త్రవేత్త నిర్వహించే శాస్త్రీయ ప్రయోగాన్ని చివరకు కల్నల్ ఓంకోల్జ్ గూడా వ్యతిరేకించజాలడు" అని వాదించింది.

'మహాశాస్త్రవేత్త' అన్న మాట వింటూనే డాక్టర్ ఉబ్బిపోయాడు. ఓంకోల్జ్ పేరును ఆపిల్ల పదేపదే ఉచ్చరించడం డాక్టరును కార్యాచరణకు పురికొల్పింది. తాను ఆ కల్నల్ కింద అణిగిమణిగి పనిచేసే తొత్తునని ఈ పిల్ల అనుకుంటూ వుందా? ఈ భావం కలగడంలోనే అతను కుర్చీలో నుండి చివాల్న లేచి నిలబడ్డాడు.

"సరే... ముందు నీ బట్టలు విప్పెయ్" అంటూ ఆజ్ఞాపించాడు.

ఆ నల్లపిల్ల ఈ ఆజ్ఞ కోసమే ఎదురుచూస్తూ ఉంది. వెంటనే డాక్టరు ఆదేశాన్ని శిరసావహించింది. ఆ అమ్మాయి బట్టలు విప్పేయడంలో ఎలాంటి సిగ్గూ బిడియమూ ప్రదర్శించలేదు. ఆమె తన ఒంటిమీది బట్టలు ఒక్కొక్కటిగా వలిచి ప్రతి ఉడుపునూ జాగ్రత్తగా మడిచి కుర్చీమీద పెట్టింది. తరువాత డాక్టరు బల్ల ముందుకు నడిచి నిటారుగా నిలబడింది. చేతులు చాచి, రెండు మడమలనూ దగ్గరగా జేర్చి, పాదాలను వెలుపలికి సాచి నిలుచుంది.

డాక్టర్ ఊర్జెర్ ఆపిల్ల శరీరాకృతిని సాలోచనగా పరిశీలించాడు. ఆ అమ్మాయి దుస్తులు ధరించడంలో ఏమాత్రం శ్రద్ధ వహించనందున ఆకారం బక్కపలుచగా కనిపిస్తూ ఉందేమోనని అతను తొలుత భ్రమపడ్డాడు. ఇప్పుడు తన ముందు నగ్నంగా నిలబడిన ఆ అమ్మాయిని చూస్తే నిజంగానే బక్క మనిషి. ఎముక పుష్టిగల శరీరం. మెలికలు తిరిగిన దొడ్డి కాళ్లు. కిందికీ మీదికీ నరంబీలాగున్న ఆకారం. అయితే ఆ అమ్మాయి పిరుదులు మాత్రం విశాలంగా ఉన్నాయి. పొత్తి కడుపు చుట్టూ ఉన్న అస్థిపంజరం గూడా ఆ అమ్మాయి సంతానవతి కాగల అర్హతలను సూచిస్తూ ఉంది.

ఆ అమ్మాయిని ఆపాదమస్తకం స్టెతస్కోపుతో పరీక్షించాడు. ఆ పిల్ల యింకా కన్యగానే ఉందనడంలో ఎలాంటి సందేహం లేదు. తాను ఈ అమ్మాయిని ఎంపిక చేస్తే, కల్నల్ ఓంకోల్జ్ చూసిన వెంటనే అసహ్యంతో ఛీత్కరిస్తాడు. ఈ పిల్ల మదపిచ్చిదనీ, దీనిని కాదంటే మనందరికీ తిప్పలు తెస్తుందని తాను భయపడ్డాననీ ఓంకోల్జ్‌కు చెబితే సరిపోతుందనుకున్నాడు.

ఈ విధంగా కార్నేలియా మగాడిలో మదనతాపాన్ని రేకెత్తించే ఏ ప్రత్యేకతలూ లేకపోయినా మదనసదనంలో చేరిపోయింది.

ఇక మిగిలిన అమ్మాయి ఎల్లెన్. ఆ అమ్మాయిని పరీక్షించడానికి అట్టే సమయం పట్టలేదు. "ఇదుగో అమ్మాయ్... నీవు మాంచి సమయంలోనే వచ్చావు. నీకు తగిన జోడును త్వరలోనే జతకూర్చుతాం" అంటూ డాక్టరు మామూలుగా పరీక్షించి ఆ అమ్మాయి పట్ల సంతృప్తి ప్రకటించాడు.

"బ్రహ్మాండమైన శరీర సౌష్టవం. నిన్ను హిట్లర్ చూస్తే అన్ని విధాలా తనకు తగిన విద్యార్థిని అని మెచ్చుకుంటుంది" అంటూ



కాస్త ఆగి "నీ తల్లిదండ్రులకు నీ విషయం పూర్తిగా తెలియదనే అనుకుంటాను. అయినా జీవితసత్యం నీకు తెలియనిది కాదుగా. దిగులువడకు. నీ రహస్యం ఇక్కడ ఏమాత్రమూ బయటికి పొక్కదు. ఈ మదనసదనం ఒక విచిత్రసదనం గూడా. ఈ విచిత్రంలో అహ్లాదకరమైన ఆకస్మిక సన్నివేశాలు చాలా ఉంటాయి. నీకిష్టం లేకపోతే నీ సహచరులకు నీపేరు చెప్పనవసరం లేదు. ఏదో ఒక మారు పేరు చెప్తే చాలు. మన అతిథుల పూర్తి వివరాలు తెలిసింది నాకూ, మీ ప్రధానోపాధ్యాయిని ఫ్రాలాజర్‌కు మాత్రమే... ఇక నువ్వెళ్లొచ్చు" అని పంపాడు.

ఎల్లెన్ తేలికైన హృదయంతో డాక్టరు ఆఫీసునుండి బయటపడింది. మరికొద్ది రోజుల్లోనే ఆమె ఒక సైనికునికి వారం రోజుల భార్య అవుతుంది. తన గర్భం అందరికీ తెలిసేసరికి, అది సహజంగా మదనసదనంలో సైనికుడి వలన వచ్చిందేనని అందరూ నమ్ముతారు. నెలలు నిండక ముందే బిడ్డ పుట్టడం కొంత విస్మయం కలిగించినా, ఇలా ఎంతమంది నెల తక్కువ బిడ్డలను కనడం లేదు గనుక. ఇదీ అలాంటిదేననుకుంటారు. ఇందులో పెద్ద తేడా ఏముంది? హిట్లర్ తనను బిడ్డను కనమన్నాడు. తాను కంటుంది. అంతా తనకు మంచే జరుగుతుంది. ఇలా ఆలోచిస్తూ ఉందా పిల్ల.

★ ★ ★

ఒట్టో అపోలో కుటీరంలో పడక్కుర్చీలో పడుకుని అమ్మాయి కోసం ఎదురుచూస్తూ, అసహనంగా సిగరెట్ దమ్ము గుప్పు గుప్పున లాగుతూవున్నాడు.

ఆ అమ్మాయి నిశ్శబ్దంగా కుటీరంలోకి వచ్చింది.

"మనది ఏఊరు భామా?" అంటూ ప్రశ్నించాడతను.

"పొమరేనియా మగడా!" అంటూ సమాధానం చెప్పిందామె.

"నాకు తగిన గడుసుపిండంలాగే వున్నావుగానీ నీపేరు?"

"అన్నా... మరి నీపేరు?"

"పేరు ఒట్టో. ఊరు ఎస్సెన్. ఈ యుద్ధం మహిమవల్ల ఇలా కలుసుకున్నాంగానీ లేకుంటే మనిద్దరం కలుసుకునే అవకాశమేలేదు"

ఈ మాటలు వింటూనే అన్నా కళ్ళు గుండ్రంగా విప్పారాయి. "అవునవును... నీవు గూడా యింతపెద్ద వీరుడివై వుండేవాడివిగాదు. ఇంతకూ ఎన్ని మెడల్స్ సంపాదించావు హీరో"

"ఒక డజను సంపాదించాలే. మెడల్స్ సంగతికేంగానీ. నిన్ను నా దగ్గరకెందుకు పంపారో తెలుసా? నీవు చెయ్యవలసిన ఉద్యోగమేమిటో తెలుసా భామా?"

"ఏం ఉద్యోగం?"

"బిడ్డని కనడం"

"నేనెప్పుడూ కనలేదు"

"బిడ్డని కనడానికి ఏంచేయాలో నీకు తెలుసు. ఇంతకు ముందెప్పుడూ నీవావని చేయలేదా?"

"అంత ఎక్కువగా చెయ్యలేదు లేవయ్యా"

"అదే... ఎందుకనీ అంట. ఇంత అందాల భామవు. నీకు నచ్చిన మగాడే దొరకలేదా?"

"మా ఊళ్ళో ముసలాళ్ళు, కుంటి కునిష్టాళ్ళు తప్ప మాంచి మొగాడే లేడయ్యా"

ఈ మాటతో ఒట్టో బోరవిరుచుకుని, తన ఛాతీని ఆ పిల్లకు ప్రదర్శిస్తూ "నీకు బలిష్టమైన కుర్రాడంటే యిష్టమా?" అంటూ ప్రశ్నించాడు.

అన్నా ఎగ్గు సిగ్గూ లేకుండా కండలు తిరిగివున్న అతని శరీరాన్ని తదేకంగా చూస్తూ "మగాడంటే యిట్లా ఉండాలి. నీలాంటివాడైతే ఇష్టమెందుకువుండదూ" అని దీర్ఘాలు తీసింది.

సార్జెంట్ ఆ పిల్ల దగ్గరగా వచ్చాడు. అతని చేయి ఆ పిల్ల వక్షంమీద ఆడుకుంటూవుంది. మరోచేతి వేళ్ళు ఆ అమ్మాయి అంగీగుండీ విప్పాయి. ఆ అమ్మాయి అసలు లోబాడీ వేసుకోనేలేదు.

"బావున్నాయే భామా... ఇప్పుడు మనం ఒకర్నొకరం బాగా అర్థంచేసుకుందాం. ఇప్పుడే మొదలుపెడదాం" అన్నాడు ఒట్టో ఆత్రుతగా.

ఇద్దరి పెదవులూ కలుసుకున్నాయి. పెద

వులూ పెదవులూ కలిపి, తనువూ, తనువూ పెనవేసి నృత్యం చేస్తున్న భంగిమలో అతను ఆ అమ్మాయిని పడక లోపలికి తీసుకెళ్ళాడు. యిద్దరూ గదిలోపలికి అంతర్ధానమయ్యారు. ఓట్టో చివరకు కాళ్ళకున్న బూట్లు గూడా విప్పకుండానే ఆత్రంగా ఆ అమ్మాయితో పడక మీదికి దొర్లాడు.

★ ★ ★

'డరోతియా కుటీరం'లో కారల్ సిగ్గుతో కుంచించుకపోతూవున్న లీసెల్‌తో మాట్లాడుతూ వున్నాడు.

"చాలారోజుల నుండీ ఇక్కడున్నావా?" కారల్ ప్రశ్న.

"మూడు వారాలనుండి" ఆ అమ్మాయి సమాధానం.

"అంటే ఇంతవరకూ ఎవరూ నిన్ను ఎంచుకోలేదా?"

"లేదు" అంటూంటే ఆ అమ్మాయి ముఖం కొంత వివర్ణమైంది.

"నువ్వు చాలా అందంగా వుంటావు" అతని ప్రశంస.

ఆ ప్రశంస వినడం ఆ అమ్మాయికి చాలా యిబ్బందిగా వుంది. మెల్లిగా చెప్పింది "నేనెవర్నీ ఆకర్షించడానికి ప్రయత్నించలేదు" అంటూ.

"ఆ విషయం నేను గ్రహించాను. నీ స్నేహితురాండ్రంతా మాముందుగా వెళ్ళేటప్పుడు మమ్మల్ని దొంగచూపులు చూశారు. నీవు మాత్రం ఎవర్నీ కన్నెత్తి చూడలేదు. అందుకే నీ మీద నాకు యిష్టం కలిగింది"

వాళ్ళిద్దరూ పక్కపక్కనే కూర్చుని వున్నారు. వాళ్ళిద్దరి మధ్య లాలింపులు, బుజ్జగింపులు లాంటి ప్రణయ ప్రకోపాలేమీ లేవు.

ఇంతలో సర్వెంట్ మెయిడ్ భోజనం తెచ్చింది. భోజనంతోపాటు వైను, బ్రాందీ, కాఫీలాంటి డ్రింక్స్, చాలా చాలారకాల ఫలహారాలూ వున్నాయి.

"ఇలాంటి భోజనం మా సైనికమెస్సులో చూద్దామన్నా దొరకదు. ఇక్కడ మిమ్మల్ని చాలా అపురూపంగా చూస్తున్నారల్లేవుంది"

"అవును... బాగా మేపుతున్నారు" అంటూ లీసెల్ చిన్నగా నవ్వి, "కానీ మేము బ్రాందీ, వైనూ తాగడానికి వీల్లేదు" అని చెప్పింది.

"ఇది మన ప్రణయం తొలిరోజు సెలిబ్రేట్ చేసుకునేందుకు" అంటూ కారల్ నవ్వుతూ ఆమెచేయి అందుకున్నాడు. ఆమె చేతివేళ్ళను గోముగా నిమురుతున్నాడు.

ఆ స్పర్శకు ఆ అమ్మాయి బుగ్గలు ఎరుపెక్కాయి.

"మదనసదనంలోనేగాదు అసలు అంతకు ముందు ఎన్నడూ గూడా నేను పురుష..." అంటూ ఆ అమ్మాయి అర్థోక్తిలో ఆగింది.

"అంటే నీవు కన్యవన్నమాట" ఆశ్చర్యంగా అడుగుతూ వున్న కారల్ కళ్ళలో మెరుపు మెరిసింది. "ఇక్కడున్న అమ్మాయిలందరూ నీలాంటి వాళ్ళేనా?" అంటూ ప్రశ్నించాడు.

"అని అనుకోను"

"అయితే... నా అంత అదృష్టవంతుడు ఎవడూ వుండడు" అంటూ ఆనందంతో ఆ అమ్మాయి కళ్ళలోకి చూడసాగాడు.

ఆ అమ్మాయి అతని చూపులను తప్పించుకుని చాలా ఇబ్బందిగా ముఖం పెట్టింది. దానితో అతని పెదవుల మీద మెరుస్తూన్న చిరునవ్వు మాయమైంది.

"నీవు అదృష్టవంతురాలినని అనుకోవడంలేదా? నేనంటే నీకు యిష్టం లేదా?" అంటూ ప్రశ్నించాడు.

"నాకు ఎప్పుడో నిశ్చితార్థం జరిగిపోయింది" అని చెప్పింది లీసెల్ మృదువుగా.

ఆ మాట వింటూనే అతని ముఖం వివర్ణమైంది. "ఎవరితో... సైనికునితోనా?" అంటూ ప్రశ్నించాడు.

"అవును"

"అతనెక్కడున్నాడు?"

"ఫ్రాన్సులో- సముద్రం దగ్గరగా"

"నాలాగానే. నేను బ్రిటానీలో వుండేవాడిని. చాలా మంచిదేశం. అక్కడి ప్రజలు భోజనప్రియులు. పీకలదాకా మెక్కుతారు" అని చెబుతూ వున్నాడు. యిద్దరిమధ్యా కొద్దిక్షణాలు మౌనం రాజ్యమేలింది. తిరిగి మొదలెట్టాడు. "నాసాటి సైనికుడికి నిశ్చితార్థం జరిగిన

పిల్లకు నేనెప్పుడూ ప్రియుణ్ణి కాలేను...''

లీసెల్ కళ్ళలో దుఃఖాన్ని దిగమింగు కుంటున్న ఛాయలు గోచరిస్తూ వున్నాయి-'' నీవుగాకపోతే మరొకడు. మమ్మల్ని యిక్కడికి పట్టుకొచ్చి వుంచింది దానికోసమేగా'' అంది.

ఆమాటలు విన్న సార్జెంట్ చాలాసేపు విస్మయంతో ఆ అమ్మాయినే చూస్తూ వున్నాడు.

''ఎవడో ఒకడికంటే నన్నే యిష్టపడవచ్చుగా లీసెల్'' అని ప్రాధేయపడినట్లుగా అడిగాడు.

ఆ అమ్మాయి కళ్ళు వాల్చేసుకుంది. కానీ సమాధానం మాత్రం చెప్పలేదు. కారల్ ఆ పిల్ల చెయ్యి వదిలిపెట్టాడు.

సాయంత్రం లీసెల్ మదనసదనం వైపు సార్జెంట్‌ను షికారుకు తీసుకెళ్ళింది. తన పడకగదినీ, రిక్రియేషన్‌హాలునూ కారల్‌కు చూపెట్టింది.

''మీరిక్కడికి వస్తారు. మా పాటలు వింటారు. మనం డాన్స్ చేద్దాం''

''నాకు పట్నవాసపు డాన్సులు రావు'' కారల్ చెప్పాడు.

''నాకు మాత్రం వచ్చా యేమిటి''

ఆ మాటలకు యిద్దరూ చిన్నపిల్లల్లా కిల కిలా నవ్వుకున్నారు. అలా కేరింతలతో నవ్వుతున్న ఆ జంటను అసిస్టెంట్ హెడ్‌మిస్ట్రెస్ ఫ్లిట్టర్ చూసింది.

''భలే- భలే... లీసెల్... ఇంతకుముందు నీనవ్వు ఎప్పుడూ మేం వినలేదే. నీ కొత్త స్నేహితుడు మంచివాడేనా?'' అంటూ ప్రశ్నించింది.

''చాలా మంచివాడు''. లీసెల్ సమాధానం చెప్పింది.

''మీ భయానికి అర్థంలేదని యిప్పుడు తెలిసిందిగా'' అంటూ ఫ్లిట్టర్ సార్జెంట్‌వైపు తిరిగి ''లీసెల్ చాలా ముచ్చటయిన అమ్మాయి. చాలా మంచిపిల్ల'' అంటూ ప్రశంసించింది.

''నిజమేనండీ'' అని సమాధానం చెబుతూన్న కారల్ ముఖంగూడా లీసెల్ బుగ్గల్లాగే సంతోషంతో ఎరుపెక్కింది.





'డరోతియా కుటీరం'లో రాత్రి భోజనం ముగిసే సమయానికి ఆయిద్దరి హృదయాలూ తేలికపడ్డాయి. ఇద్దరూ ఉల్లాసంగా వున్నారు. అయితే భోజనానంతరం యిద్దరూ పరస్పరం మాటా మంతీలేకుండా నిశ్శబ్దంగా తమ తమ కుర్చీలకు అతుక్కుపోయారు. కుర్చీలో నుండి కదలడానికిగూడా యిద్దరూ సాహసించడంలేదు. లేస్తే బట్టలు విప్పి పడకమీదికి చేరాలి. అప్పుడేమౌతుందోనని యిద్దరికీ అనుమానం... సంకోచం.

ఈ నిశ్శబ్దాన్ని చీల్చుతూ సార్జెంట్ మాట్లాడసాగాడు ''లీసెల్... ఈ ఉదయమే నిన్నడిగాను గుర్తుందా? వాళ్ళు మనలను నియోగించిన పని నీవు చేయవలసివస్తే ఎవడో ఒకడి బదులు నన్నే అంగీకరించే విషయం... నిన్ను తప్ప మరేయితర పిల్లనూ నేను కోరుకోబోనని నీకు స్పష్టంగా చెప్పదలచుకున్నాను''

''నేను కూడా అంతే ! నీదాన్ని అయినందుకు నాకు సంతోషంగా వుంది''. అంటూ ఆ పిల్ల సిగ్గుతో ముడుచుకు పోయింది.

ఈ మాటతో సార్జెంట్ సంకోచం వదలిపోయింది. అతను కుర్చీలో నుండి లేచి ఆ అమ్మాయిని సందిటచేర్చి పొదివిపట్టుకుని పదేపదే ముద్దులు కురిపించాడు. ఆ ముద్దుల తీవ్రతకు భావావేశంలో ఆ పిల్ల కరిగిపోయింది. అతని ప్రణయచేష్టలకు ఆమె ప్రతిస్పందించింది. అతను ఆమెను రెండు చేతుల్లోకి ఎత్తుకున్నప్పుడు ఆమె ఈషణ్మాత్రం ప్రతిఘటించలేదు. ప్రేమగా అతన్ని పెనవేసుకుంది.

సయ్యాటలో తృప్తిగా, ఆనందంగా అలసిసొలసి సొమ్మసిల్లిన లీసెల్ పక్కలో పడుకుని కారల్ చాలాసేపు ఆమె చెవిలో ప్రణయోద్వేగంతో గుసగుసలు పోయాడు. ఒంటినిండా ముద్దులతో నింపుతున్నాడు.

ప్రణయోద్వేగంనుండి మామూలుస్థితికి వచ్చిన తరువాత కారల్ చెప్పసాగాడు. ''మనం యిక్కడ యిలా కలవడానికి బదులు మనదేశంలో ఎక్కడో ఒకచోట శిష్టాచార ప్రకారం కలుసుకునివుంటే ఎంత బాగుండేదో. అప్పుడు నిన్ను చేసుకునేవాణ్ణి. నీలా నమ్మకం, నమ్రత, అందం కలబోసిన అమ్మాయి నాకెక్కడా కనిపించేదిగాదు'' అంటూ తిరిగి ముద్దుపెట్టుకున్నాడు. ''అబ్బ... ముద్దిస్తూ

వుంటే ఎంత బాగున్నావో! ఏమైనాగానీ లీసెల్... నిన్ను నాజీవితంలో మరువలేను'' అంటూ గొణుక్కున్నాడు.

''నిన్ను కూడా నేను మరిచిపోను కారల్'' అంటూ లీసెల్ గాఢమైన విశ్వాసంతో బదులు చెప్పింది. ''దేవుడు మనకు ఓ బిడ్డను ప్రసాదించాలి. అప్పుడు వీళ్ళే నన్ను నాయింటికి వంపేస్తారు. యుద్ధంనుండి నీవు తిరిగి వచ్చే దాకా నేను నీకోసమే ఎదురుచూస్తూ వుంటాను.''

కొద్ది గంటల క్రితంవరకూ ఎవరికెవరో తెలియని యిద్దరు వ్యక్తులు ఆ విధంగా జీవితంలో ఏకమయ్యారు. తాము ఒకరితో ఒకరు లీనమైపోయామనుకున్నారు. అజేయమైన ఇంద్రియశక్తి ప్రభావం అలాంటిది.

వరకూ వెర్నర్ ఫిడేలు రాగాలు వింటూనే ఉంటాడు. బయట భయంకరమైన కుక్కల అరుపులు ఫిడేలు సుమధుర ధ్వనులను భగ్నం చేస్తున్నాగూడా అతను సంగీత రసాస్వాదనలో మునిగుంటాడు.

కుక్కల అరుపులను భరించలేని లెఫ్టినెంట్ ''ఛీ ... పాడు కుక్కలు, వాళ్ళు వేట కుక్కల పటాలాన్ని ఇక్కడ ,అట్టిపెట్టారా?'' అని ప్రశ్నించాడు.

''అవును ... రాత్రిళ్ళు ఆ కుక్కలను యధేచ్ఛగా వదలివేస్తారు. మమ్ములను ఇక్కడ గట్టి రక్షణలో ఉంచారు'' అంటూ హెడ్విగ్ లేచి వెళ్ళి కిటికీ మూసి తెరలు దగ్గరకు లాగి తిరిగి ఫిడేలు అందుకుంది. ఛోపిన్ సంగీతమంటే ఆమెకు చాలా ఇష్టం. అయినా ఆమె అంతిమ



వెర్నర్‌కు కుటీరంలో సాయంకాలాలు సుదీర్ఘంగా, భారంగా గడుస్తూవున్నాయి. పగలు అడవుల్లో చాలాదూరం తిరగడానికి సరిపోతూ వుంది. రాత్రిమాత్రం వెర్నర్, హెడ్విగ్ జంటకు ఇతర జంటల్లా ప్రణయ సౌఖ్యంలో మునిగే అదృష్టంలేదు. ఈ ప్రేమ లంపటంలో తగుల్కోరాదని వారు నిశ్చయించుకున్నారు.

''ఫిడేలు వాయించమంటారా?'' ఒక రాత్రి హెడ్విగ్ అడిగింది. ''పియానో అయితే నాకు చాలా బాగుంటుంది. కానీ ఆ హెడ్‌మిస్ట్రెస్ చచ్చినా పియానో బయటికివ్వదు'' అంది.

హెడ్విగ్‌కు పియానోను పలికించడంలో ఉన్న నేర్పు ఫిడేలు వాయించడంలో లేదు. అయినా ఆమె సంగీత ప్రావీణ్యత ఏ వాయిద్యం మోగించినా అందంగా, హృదయానందకరంగా పలికిస్తుంది. రాత్రి చాలా పొద్దుపోయే

యాత్రా గీతాన్ని మాత్రం ఆలాపించలేదు. ఆమె కమాను సవరించి కాకలీ స్వరంలో విషాదాన్ని పలికిస్తూ ఉంటే, చివరకు ఆ కుటీరానికి అమర్చిన కొయ్య దుంగలు కూడా విషాదంతో ప్రతిధ్వనిస్తాయి.

వెర్నర్ తన రెండు కళ్ళూ మూసుకుని తన్మయత్వంతో నిశ్చల నిశ్శబ్దంగా ఆ గానామృతాన్ని గ్రోలుతున్నాడు. అతని జీవితంలో ఇంతకంటే ఆనందంగా మున్నెన్నడూ లేదు.

ఒకరోజు ఉదయం అతను డాక్టర్ వద్దకు వెళ్ళినప్పుడు ''మదనసదనంలోని ఆనందాన్ని అనుభవిస్తున్నావా?'' అని అడిగాడు. ''ఓ ... బ్రహ్మాండంగా'' అంటూ సమాధానం చెప్పా

డు వెర్నర్.

ఆ సమాధానంతో డాక్టరు తృప్తిచెందాడు.

"మాకు నీవు ఎవర్ని కనియిస్తావ్? వైమాని కుణ్ణా ... సంగీత విద్వాంసుడినా?"

"అదంతా భగవంతుడి దయమీద ఆధార పడి ఉంటుంది" అని నవ్వుతూ సమాధానమి చ్చాడు వెర్నర్.

అబద్ధం ఆడటం ఎంత తేలికోననిపించిన ప్పుడు అతనికి ఒకింత ఆశ్చర్యం, మరింత సిగ్గూ కలిగాయి.

"సరే ... నీవు త్వరగా వెళ్ళి నీ జంటను కలుసుకో. ఆమె అసహనంగా మనల్నే చూస్తూ ఉంది. ముచ్చటయిన మీ జంటను చూస్తే నాకు బ్రహ్మానందంగా ఉంది. ఇంతకూ ఆ పిల్ల నీకు తన పేరేమిటో చెప్పిందా?" డాక్టరు ప్రశ్నించాడు.

"చెప్పింది" అన్నాడు వెర్నర్ ఒక్కక్షణం ఆలోచించి.

"భలే భలే అంటే ఆ పిల్ల నిన్ను ప్రేమిస్తు న్నదన్నమాట. ఇక్కడ తనతోవున్న అమ్మాయి లెవరికీ ఆ పిల్ల తన పేరు చెప్పి ఎరగదు. ఆ అమ్మాయితో వేగడం నీకు చాలా కష్టమౌతుందే మోనని అనుకున్నా. ఆ అమ్మాయి ఎంత కొరకరానికొయ్యంటే, సాక్షాత్తు హెర్‌హిట్లర్ ఆ అమ్మాయికి అప్పగించిన పుత్రకామేష్ఠి పథకా న్నే ఎద్దేవాచేసి వ్యతిరేకించింది. ఏమైనా నీవు వచ్చావు, ఆ పిల్లను మంత్రం వేసినట్లుగా లొంగదీసుకున్నావు. అందుకు నీకు నా ధన్య వాదాలు" అంటూ అభినందించాడు డాక్టర్.

హెడ్విగ్ నిజంగానే అసహనంగా ఎదురు చూస్తూ వుంది. లెఫ్టినెంట్ ఆమె దగ్గరకు రాగానే మెల్లిగా అడిగింది. "డాక్టర్ ఏదైనా అనుమానిస్తున్నాడా?" అని.

"అలాంటిదేమీలేదు. పైగా అతను మనల ను అభినందించాలనుకున్నాడు"

"ఇది చాలా తమాషాగా వుందిగదూ!"

హెడ్విగ్ తన ప్రియునిగా అక్కడివాళ్ళు భావిస్తూన్న వెర్నర్ మెడ చుట్టూ చేతులువేసి, డాక్టర్ వైపు తిరిగి ఒక అందమైన చిరునవ్వు నవ్వి, సరస్సుకు తోవతీసింది. మరో ఐదునిమి షాల్లోనే వాళ్ళు దాదాపు నగ్నంగా సరస్సులో దిగి ఆవలితీరం వైపు ఈదసాగారు.

నగం దూరం ఈదుతూనే హెడ్విగ్ నీళ్ళపై వెల్లికిలా తిరిగి, వీపు నీళ్ళమీద వేసి ఆకు లాగా తేలుతూ ఈదసాగింది. ఆమె ఈదుతూ శరీరాన్ని నిటారుగా చూపినపుడు ఆమె స్తన ద్వయం నీటిలోనుండి పైకి ఉబికి పాలిపో యిన రెండు తామరపువ్వుల్లా కనిపిస్తూవు న్నాయి.

హెడ్విగ్ విల్లులా వంగి నీటిలో మునిగింది. కొద్దిగజాల అవతల పైకి తేలి ఒడ్డువైపు త్వరితంగా ఈదసాగింది. వెర్నర్‌గూడా ఆమె ను అనుసరించాడు.

వాళ్ళు సరస్సులోనుండి వడ్డుకెక్కి కుటీరా నికి చేరేవరకూ హెడ్విగ్ మరో మాట కూడా మాట్లాడలేదు.

చీకటి పడిన తరువాతకూడా వాళ్ళిద్దరూ ఉలుకూ పలుకూ లేకుండా చీకట్లో కూర్చుని వున్నారు. దూరంగా ఎక్కడో గంట మోగింది. దూరంగా చెట్లమధ్యనుండి ఒక దీపం మిణు కుమిణుకుమని వెలుగుతూ వుండటం కిటికీ లోనుండి వెర్నర్ చూశాడు. అతను లేచి ఎలక్ట్రిక్ స్విచ్ వేశాడు. దీపాలు వెలిగాయి. బట్టలు మార్చుకున్నాడు.

"రాత్రి భోజనం తెస్తున్నారు"

ఆమె తల ఎత్తింది. ఆమె ముఖమంతా కన్నీళ్ళతో తడిసి చారికలు కట్టి వుంది.

"వెర్నర్ ... నీవు నిజంగా వీరుడివి" అంటూ మెల్లిగా అంది.

★ ★ ★

కారల్, లీసెల్ కాపురం బ్రహ్మాండంగా సాగు తూ వుంది. మానసిక భావోద్రేకంతో బతికే ఆ అమాయకులు తాము ఒకరికోసమే మరొకరు పుట్టామనుకున్నారు. వారి అవగాహన ప్రేమగా మారింది. రోజుగడిచేకొద్దీ ఆ ప్రేమ ప్రగాఢ మైంది.

వాళ్ళిద్దరూ ప్రతినిత్యం చేయిచేయీ కలిపి చాలాదూరం అడవుల్లో విహారానికి వెళ తారు. కౌగిలించుకొనేటప్పుడు మాత్రమే ఆగు తారు. ఆ పరిష్వంగసుఖాన్ని కారల్ వదులుకో డు. లీసెల్ సౌజన్యం మూర్తీభవించిన చక్కని చుక్క. నిజంగా హిట్లర్‌కు అద్భుతమైన ఐడి యా తట్టింది. దీనిని ఆయన మధ్యలోనే





ముక్కలు చేయకుండా, ఇంకొక అడుగు ముందుకు తీసుకెళితే బాగుండును. ఆరంభంనుండీ పిల్లలను తామరతంపరగా కనేవారిని ఇలాగే ప్రోత్సహిస్తే అద్భుతంగా వుంటుంది. అలా పుట్టిన పిల్లలందరినీ హిట్లర్ తనకిష్టమైన రీతిలో సైనికులుగా మలుచుకోవచ్చు.

"ఇలా జరిగితే తాను ఇప్పుడు ఎంచుకున్న అమ్మాయిని మరొకడు ఎంచుకునే అవకాశం వుంటుంది. అలా మరొకడికి అప్పగించడం ఏంబావుంటుంది?" అంటూ గొణుక్కున్నాడు.

"ఏమంటున్నావ్?" అని అడిగింది లీసెల్ కుతూహలంగా.

"ఏంలేదు రాణీ ... నాకేదో మెరుపు మెరిసినట్లు ఓ ఐడియా తట్టింది"

ఈత వాళ్ళిద్దరికీ మహాయిష్టమైన క్రీడ అయింది. అటవీప్రాంతం నుండి వచ్చిన ఈ మాజీ రైతుకు ఈతలో అంత ప్రావీణ్యం లేదు. లీసెల్ అతనికి ఈతలో మెళకువలు నేర్పేది. సాయంత్రమంతా వాళ్లు నరదాగా నరస్సులోనే ఆడుకొనేవాళ్ళు." నేనిలా దిగంబరంగా నరస్సులో దిగినప్పుడల్లా నేను సామాన్య పౌరుడినే అనే భావం కలుగుతూ వుంది" అనేవాడు కారల్.

రాత్రి భోజనానికి ముందు వాళ్ళిద్దరూ ఒట్టో, అన్నా జంటను కలిసేవారు. రైల్లో మొదలైన ఈ యిద్దరు సార్జంట్ల స్నేహం దినదిన ప్రవర్ధమానమై, మదనసదనంలో యింకా బలపడింది. వాళ్ళకు దొరికిన ఇద్దరమ్మాయిలు కూడా వాళ్ళ చర్చలకు కొత్త విషయమయ్యేవారు. ఈ రెండు జంటలూ మదనసదనంలో మంచి ఇరుగు పొరుగుగా పేరుతెచ్చుకున్నారు.

ఒట్టో పార్టీలో వుంటేనేచాలు, నవ్వులపువ్వులతో పార్టీ కళకళలాడుతుంది. అతను యుద్ధంలో అంతకుముందు తాను పనిచేసిన 'క్రుప్' కంపెనీలో అనుభవాలను కథలుకథలుగా చెప్పి అన్నా లీసెల్ యిద్దర్నీ ఎప్పుడూ నవ్విస్తూ వుండేవాడు. కారల్ మామూలుగా మితభాషి. అయినప్పటికీ యుద్ధానికి దూరంగా వున్న ఈ స్వర్గవాతావరణంలో తుళ్ళుతూ, పేలుతూ ఆనందంగా వుండేవాడు.

ఈ యిద్దరు సార్జెంట్లూ తమ ప్రియురాండ్రను అలరించడంలో పోటీపడేవారు. నవ్వులు వెదజల్లే వాళ్ళ అనుభవాల కథలు అయిపోయినప్పుడు ఒట్టో తన శరీరంమీది గాయాల చరిత్ర కవిలకట్టను విప్పేవాడు.

"ఇదుగో ఈ గాయముంది చూశారూ ఇది సెడాన్ దగ్గర జరిగిన యుద్ధంలో తగిలింది" ... అంటూ తన ఎడమభుజంమీది పొడవాటి మచ్చను అందరికీ ప్రదర్శించేవాడు. ఇలా తన శరీరం మీది గాయాలను చూపిస్తూ, తన అంగాంగం ప్రదర్శించి అందరినీ నవ్వించేవాడు.

లీసెల్ తన ప్రియుడి చేతిని అందుకుని, "కారల్ కూడా గాయపడ్డాడు" అని చెప్పింది.

"అవును. నాకు గుర్తుందల్లా నన్ను ఆస్పత్రికి తీసుకెళ్ళేటప్పుడు అంబులెన్స్‌లో ప్రయాణించడమే. ఆ అంబులెన్స్‌లో నేను చాలా భయపడిపోయాను" అన్నాడు కారల్.

"చస్తానని భయమా?" అడిగింది అన్నా.

"అబ్బే ... చావును గురించి అసలు నేను ఆలోచించనే లేదు. అంబులెన్స్‌లో నన్ను తీసుకొనివెళ్ళడానికి వచ్చిన కుర్రాళ్ళ తెల్లటిముఖాలు, లక్కలాంటి ఎర్రని చేతులూ, ఆ అంబులెన్స్‌లోని గబ్బూ, మందులు, ఇంకా ఏవేవో చూసీ నేను జడుసుకున్నాను"

లీసెల్ అసహ్యంతో కంపిస్తూ నెత్తికొట్టుకుంది.

"మీరు ఎక్కడ గాయపడ్డారు?" అన్నా ప్రశ్నించింది.

"బెల్జియంలో"

"నేనడిగింది ఊరిపేరుగాదు. శరీరంలోని ఏ భాగంలోనని?" అన్నా వివరించింది.

"లో తొడమీద. పై భాగంలో".

"ఏదీ చూపించు".

"ఇప్పుడా గాయాలు గీయాల నంగతి మానేద్దాం. అదంతా ఓ వారంరోజులైనా మరచిపోవడానికేగా ఇక్కడికి వచ్చాం. అమ్మాయిల నంగతి మాట్లాడుకుందాం" అని "అమ్మాయిలూ... ఇక్కడికి రాకముందు మీరేం చేస్తూ ఉండేవాళ్ళు"? అంటూ ప్రశ్నించాడు ఒట్టో.

లీసెల్‌కు చెప్పేదేమీలేదు. ఆమె తన పూర్వపు ఆత్మికప్రేమ గురించీ, నిశ్చితార్థం

గురించీ చెప్పడం మానుకుంది. కారల్ అదంతా మరపించాడు. ఆమె మదనసదనంలో కారల్‌తో అనుభవించిన ప్రణయసౌఖ్యం పాతకథనంతా పాతరలోకి నెట్టింది. ఇక మిగిలిన అద్భుతమైన సంఘటనల్లా తాను పని చేసే హోటల్‌కు ఇద్దరు సైనికాధికారులు రావడం, తనను ఎంపిక చేయడం.

"అది తలచుకుంటే నాకేమిటోగా ఉంటుంది. అదే మొదటిసారి నేను పురుషుని ముందు బట్టలిప్పడం" అంది లీసెల్.

"మగాడిముందు బట్టలు విప్పడం అదొక్కసారేనని ఇప్పుడు చెప్పలేవుగా" అంది అన్నా నవ్వుతూ.

ఆమాటతో లీసెల్ కళ్ళు దించుకుంది. మిగతా ముగ్గురూ పగలబడినవ్వారు.

అన్నాకు లీసెల్‌కున్నంత సిగ్గులేదు. ఆమె చెప్పాల్సింది ఎంతోవుంది. ఆ కథంతా ఆమె చాలా వివరంగా చెప్పింది. పోమరేనియన్ అడవుల్లోకి తనను తీసుకెళ్ళడం తన తొలి యవ్వనాన్ని కొల్లగొట్టడం అంతా వర్ణనాత్మకంగా చెప్పింది" అంటూ ఓట్టో అనగానే అందరూ నవ్వారు. ఆ నవ్వుతో లీసెల్ బుగ్గలు ఎరుపెక్కాయి.

"అమ్మాయిలు యుద్ధంలో గొప్పస్థానాన్ని ఇష్టపడతారు. మీరు మాత్రం దాన్ని ఆక్రమించకోరబోకండి. ఆ స్థానాన్ని పొందిన మగాళ్ళను ఆక్రమించుకోండి" అని ఓట్టో అనగానే అన్నా గలగలా నవ్వింది. లీసెల్ ముఖంమాత్రం సిగ్గుతో ఇంకా ఎరుపెక్కింది.

"మీ ఇద్దరూ ఇక్కడ చాలాకాలంగా ఉన్నారా?" ఓట్టో ప్రశ్నించాడు.

"రెండువారాలుగా ఉన్నాం" అంటూ అన్నా చెప్పసాగింది. "మొదట లీసెల్ ఇక్కడికి చేరింది. నేను చాలా ఆలశ్యంగా ఇక్కడికి వచ్చాననుకున్నాను. ఎందుకంటే అప్పటికి నాకెవడూ మిగల్లేదు. తర్వాత నీవు వచ్చావు నా మగడా" అంది ఎకసక్కెంగా.

అన్నా తన ప్రియుడితో ఏకాంతంగా గడిపేటప్పుడు తన గతజీవితంలోని ప్రేమగాథల గురించి చాలా వివరంగా చెబుతుంది. తన పూర్వపు ప్రణయగాథలు తన ప్రియుణ్ణి బాగా





రెచ్చగొట్టాయని భావించినపుడు మదనసదనంలోని రహస్య పాపాలచిట్టా విప్పుతుంది.

ఒకరాత్రి అన్నా అడవిలో తన మామ తన మానన్ని తొలిసారిగా దోచుకున్న పాతకథ తిరిగి చెప్పసాగింది. మొదటిసారి ఈ కథ చెప్పినప్పుడు తాను మరచిపోయిన వివరాలన్నింటినీ పూసగుచ్చినట్లు చెబుతూ "నీకు తెలుసో లేదో ఇక్కడున్న అమ్మాయిలందరూ నాలాంటోళ్ళే. వాళ్ళంతా ప్రేమకోసం పడిచస్తూవున్నారు. ప్రణయకలాపాలకోసం తపించిపోతున్నారు. కొంతమంది అమ్మాయిలయితే ఈ అనుభవంకోసం ఎంత తపించిపోతారంటే మగాడు దొరికేదాకానైనా నిలవలేరు. నిజం... ఇక్కడ ఫ్లిట్టర్ అనే ఆవిడవుంది చాశావూ"

"అసిస్టెంట్ హెడ్‌మిస్ట్రెస్?"

"అవును... ఆవిడగారే. ఏమగాడూ ఆమెను ఎంచుకోడు. ఆమె ఇక్కడవుంది. మాకు వ్యాయామపాఠాలు చెప్పడానికేగానీ, బిడ్డల్ని కనడానికిగాదు. ఆవిడ నాతో చాలా బాగాఒద్దికగా ఉండనారంభించింది.

"నీవిక్కడికి రావడానికి మూడురోజుల ముందు ఒకనాటిరాత్రి ఆమె రహస్యంగా పిల్లిలా నిశ్శబ్దంగా నా గదిలోకి వచ్చింది. ఆమె నామంచంప్రక్కనే నిలుచుని ఉండటం చూసే వరకూ ఆమె నా గదిలోకి వచ్చిన సంగతే నాకు తెలియదు"

"తర్వాతేం జరిగింది?"- ఉత్సాంగా ప్రశ్నించాడు ఓట్టో.

అన్నా ఈ ప్రశ్నకేమీ సమాధానం చెప్పలేదు.

"నిన్ను ముద్దుపెట్టుకుందా?" తిరిగి రెట్టించాడు ఓట్టో.

అన్నా అతని భుజంలో తలదాచుకుంది. అతని చెవిని పెదాలతో రుద్దుతూ రహస్యం చెప్పినట్లుగా చెవిలో గొణిగింది. "నీలాగేంకాదులే ఓట్టో" అంటూ.

"మరేం చేసిందో చెప్పు. ఆడాళ్ళంటే నాకేం ఈర్ష్యలేదులే. వాళ్ళేం చేసినా మేము చేసినట్లు ఉండదుగా! కావాలంటే నీవు నీ ఆడస్నేహితురాల్ని ఈ రాత్రే గదికి తెచ్చుకో- ఆ వినోదమేదో చూపించు"

ఆ మాటలకు అన్నా చిరచిరలాడుతూ ముఖం పైకెత్తింది.

"అంటే నీవీరాత్రికి ఆమెను కూడానా..." అంది.

ఒట్టో వగలబడినవ్వాడు.

"నీ మగబుద్ధి పోనిచ్చుకున్నావుగాదు" అంటూ ఆమె రుసరుసలాడుతూ ఉంటే బలంగా ఆమె పెదాలను ముద్దులతో మూసేశాడు.

★ ★ ★

సీజ్ ఫ్రైడ్ కుటీరంలో జరిగే నాటకం డాక్టరుకు తెలిసివుంటే అతను ఆశ్చర్యంతో, ఆగ్రహంతో ఊగిపోయేవాడు. వెర్నర్ హెడ్విగ్ మనసూ మనసూ కలిసిన నిజమైన ప్రేమికుల్లా కనిపిస్తున్నారు. ఒకర్ని విడిచి మరొకరు ఉండలేరన్నంతయిదిగా, సదా జంటగా అడవిలో షికార్లు కొడుతుంటారు. లేదా సరస్సులో ఈదులాడుతుంటారు.

వెర్నర్‌లాంటి వ్యక్తిని ఎంచుకొనడం హెడ్విగ్ అదృష్టమని డాక్టరు భావిస్తున్నాడు. వాళ్ళిద్దరూ ప్రేమసాగరంలో మునిగి ప్రపంచాన్నే విస్మరించిన ప్రేయసీ ప్రియులుగా గోచరిస్తున్నారు. సంగమసమయంలో ఆడ మగ ఇద్దరి మానసికోద్రేకాలు ఎంత ఉత్తమంగా వుంటే అంత మంచి ప్రభావం గర్భస్థ పిండంపై పడుతుందిట! ఎవరికి తెలుసు? ఈ విషయంపై మన విజ్ఞానం ఇంకా పరిమితమైందే.

దురదృష్టవశాత్తు మహామేధావి అయిన ఈ డాక్టరు ఊహించిన 'గర్భస్థపిండం' హెడ్విగ్ గర్భంలో ఏర్పడే అవకాశమేలేదు. హెడ్విగ్ వెర్నర్‌లు తాము పవిత్రంగా జీవించాలని ఒప్పందం చేసుకున్నారు. అలాగే జీవిస్తూవున్నారు.

"మనిద్దరమూ భార్యాభర్తల్లాగే ప్రవర్తిస్తున్నామని డాక్టర్ నమ్మేలా మనం నాటకం కొనసాగించాలి. దానివల్ల నీకు మరో కొన్నివారాలు విశ్రాంతికి వ్యవధి దొరుకుతుంది" అని చెప్పాడు వెర్నర్.

"అవును... కొన్నివారాలు మాత్రమే" అంటూ నిట్టూర్చింది హెడ్విగ్.

ఆ ఇద్దరిమధ్య ఎలాంటి శారీరకసంబంధం లేకపోయినా ఆత్మికపరమైన స్నేహం దినదిన ప్రవర్ధమానమై, సాన్నిహిత్యం పెరిగింది.

"ఎర్నా నిన్ను ప్రేమిస్తూవుంది. పెళ్లిచేసుకోవాలనుకుంటూవుంది" అని ఒకరాత్రి వెర్నర్‌కు చెప్పింది హెడ్విగ్.

"నాకు తెలుసు" అంటూ నవ్వాడు లెఫ్టనెంట్. "సెయింట్ జర్మయిన్‌లోనే ఆమె ఆ విషయం నాతో స్పష్టంగా చెప్పింది"

"ఆ అమ్మాయి తీవ్రమైన కామవాంఛగల పిల్లలా కనిపిస్తూవుంది. ఈ మదనసదనానికి రావలసింది ఆమెలాంటిదేగాని, నాలాంటిది గాదు" అంది హెడ్విగ్.

"మేజర్ క్లుగే తాను సైనిక క్రమశిక్షణకు కట్టుబడివుండేవాడినని పెద్దపెద్ద కబుర్లు చెప్పినప్పటికీ ఈ 'పుత్రకామేష్ఠి' పథకాన్ని మాత్రం కామెర్ల కళ్లతో చూసినట్లుంది. ఇక మీనాన్నగారు ఈ భయంకర నరకంలోకి రాకుండా నిన్ను ఎలా రక్షించుకోలేకపోయారో అని ఆలోచిస్తే నాకు ఆశ్చర్యంగావుంది. పెద్ద పెద్ద పలుకుబడికలిగినవాళ్లంతా మీనాన్నగారంటే వడిచస్తారుగదా! ఆయనకున్న అపారమైన గౌరవప్రతిష్ఠలన్నింటినీ ఫణంగాపెట్టి అయినా నిన్నీప్రమాదంనుండి రక్షించుకొనివుండవచ్చు. కానీ ఆయన ఏమీచేయలేకపోవడం నాకు చిత్రంగా ఉంది. ఈ మదనసదనం అంటేనే నీకు వరమఅనవ్యామని ఆయనకు తెలుసా? లేదా?" వెర్నర్ అడిగాడు.

"ఆయనకు తెలుసు" అంటూ హెడ్విగ్ ఆ విషయం దాటేసింది.

రోజులు గడుస్తున్నాయి. ఒకనాడు సాయంకాలం వెర్నర్, హెడ్విగ్ కలిసి పర్వత సరస్సు తీరంవెంట నడుస్తూవున్నారు. వాళ్ళిద్దరూ ఒక చిన్న ఎత్తైన దిబ్బమీద ఆగారు. అక్కడనుండి చూస్తే మదనసదనం వున్న లోయమొత్తం కనిపిస్తూవుంది. ఇంకా ఏమగాడూ ఎంచుకొనని అమ్మాయిలంతా వ్యాయామ క్రీడలను పూర్తిచేసి మఠానికి తిరిగివెళ్లారు. జంటలన్నీ అప్పటికే తమతమ కుటీరాలకు చేరి సుఖాలు జుర్రుకుంటూవున్నాయి. ఆ ప్రశాంత సాయంత్రం, సూర్యాస్తమయమైన తరువాత అమిత ప్రశాంతంగా, నిశ్శబ్దంగా ఉన్న సరస్సు, ఆ పరిసర ప్రకృతి ఇవన్నీ వెర్నర్‌ను మరోప్రపంచానికి తీసుకెళ్లాయి. గత కొన్ని సంవత్సరాల రొదకూ, ఉద్రేకాలకూ సుదూరంగా వెళ్లిపోయాడు. విమాన విధ్వంసక




శతఘ్నుల మోతలు, మరఫిరంగుల గర్జనలు, విమానాల రొదలు, యుద్ధంలో ఏమేమి చేయాలో సంక్షిప్తంగా సూచనలు ఇచ్చే గదుల్లో తన సహ వైమానికుల నవ్వులు కూడా ఇప్పుడతని స్మృతిపథంలో లేవు. అతని కట్టెదుట ఉన్న వాస్తవమల్లా ఒక్కటే. తన పక్కన చలన రహితమైన చెట్లకింద, స్వచ్ఛమైన అద్దంలాంటి సరస్సును విస్మయంతో, విభ్రాంతితో చూస్తూ ఉన్న ఆ ముద్దరాలు, సంస్కారానికీ, పవిత్రతకూ ప్రతిమూర్తిగా ఉన్న హెడ్విగ్ అతని మనస్సునంతా ఆక్రమించి వుంది.

"ఈ సరస్సుపై సూర్యాస్తమయం జరిగే నేత్రపర్వమైన మహాద్భుత దృశ్యం మరికొన్నిరోజుల్లోనే మనదికాకుండా పోతుందంటే నమ్మశక్యం కావడంలేదు. అయినా నేను బతికి ఉన్నంతకాలం ఈ దివ్యదృశ్యాన్ని గుర్తుంచుకుంటాను" అన్నాడు వెర్నర్.

"అవును" అంది హెడ్విగ్ క్రూరంగా నవ్వుతూ.... "హిట్లర్ మహా తెలివిగా కొట్టిన మరో దెబ్బయిది. మన సహజమైన నమ్రతనూ, శీలాన్నీ ధ్వంసంచేయడానికీ, ప్రకృతిసిద్ధమైన మానసిక అనురాగ భావాలన్నింటినీ హత్యచేయడానికీ, ప్రేమలో పరమపవిత్రమైన ప్రతి అంశాన్నీ కాలరాయడానికీ కలలాంటి అందాల ప్రకృతిమధ్య మనలను బలవంతంగా చెరబట్టి సమాధిచేయడానికి హిట్లర్ ఆదేశించాడు" అంటూ తీవ్రస్వరంతో ఆవేశంగా అంది హెడ్విగ్.

అంతలోనే ఆమె తన స్వరాన్ని తగ్గించి "మరో నలభై ఎనిమిది గంటల్లోనే నా కష్టాలు తిరిగి ఆరంభం కాబోతున్నాయి" అన్నది గాద్గదికంగా.

"హెడ్విగ్!" అంటూ ఆవేశంగా అరిచాడు వెర్నర్. అతను ఆమె అసలు పేరుతో పిలవడానికి సాహసించడం ఇదే తొలిసారి. "నిన్నిలా ఒంటరిగా వదలి వెళ్లను" నిశ్చయంగా చెప్పాడు.

"నీవేం చేయగలవు వెర్నర్?" నిర్లిప్తంగా ప్రశ్నించింది హెడ్విగ్.

"నిన్నీనరకం నుండి రక్షించడానికి నేను నిన్ను పెళ్లిచేసుకుంటాను. చట్టబద్ధంగా పురపాలక సంఘాధ్యక్షుడి ఎదుటగానీ, క్రైస్తవ ఫాదరీ ఎదుటగానీ ఈ డాక్టర్‌గాడి ముందుగా కుండా, మరెవరి సమక్షంలోనైనా సరే నిన్ను వివాహం చేసుకుంటాను. ఈ మదనసదనం వెలుపల సమస్త జర్మనీలోనూ ఉన్న శిష్టాచారం ఇదే. ఇది ఒక హీరోకు తగినపనిగాదని ఉన్నత స్థానాల్లో ఉన్న నా మిత్రులందరూ చెప్పినాసరే నేను వినను. ఈ పెళ్లిచేసుకుని కనీసం వారందరికీ ప్రత్యేకంగా గుర్తుండిపోతాను" ఆవేశంగా తన కృతనిశ్చయం వెల్లడించాడు వెర్నర్.

దీనికి హెడ్విగ్ తల అడ్డంగా తిప్పడం చూసిన వెర్నర్, "నీవేమీ భయపడకు, ఇది పేరుకు మాత్రమే పెళ్లి. యుద్ధానంతరం కూడా ఇంకా నేను బతికి ఉంటే మనిద్దరం విడాకులు తీసుకోవచ్చు. నీవీ మదనసదనంనుండి కనీసం బయటపడటానికి ఈ పెళ్లి వల్ల ఆస్కారం కలుగుతుంది. పెళ్లయిన స్త్రీలను వాళ్లు ఇక్కడ ఉంచలేరు" అని వివరించాడు.

"అలా వీల్లేదు వెర్నర్... నీ త్యాగాన్ని నేను అంగీకరించలేను. అదీగాక వాళ్లు నిన్ను నాతో వివాహానికి ఎన్నడూ అనుమతించరు"

"ఎందుకని? నాకుగూడా పలుకుబడి కలిగిన స్నేహితులున్నారు"

"ఓహెూ... వెర్నర్... వెర్నర్- నేనిక్కడ ఎందుకున్నానో నీకు తెలియదు. తెలుసా?"

ఆ రాత్రి హెడ్విగ్ వెర్నర్‌కు తెలియని భయంకరమైన సత్యాలను బయటపెట్టింది.

ఆ కథ యుద్ధానికి చాలా పూర్వంనుండే ప్రారంభమైంది. హెడ్విగ్ తండ్రి స్పిట్జ్‌ముల్లర్ సంగీత విద్వాంసుడుగా అప్పటికే పేరు ప్రతిష్ఠలార్జించాడు. కౌంట్‌ఓంకోల్జ్ భార్యకు సంగీతమంటే ప్రాణం. స్పిట్జ్ ముల్లర్ సంగీత కచ్చేరీలకు ఒక్కదానికి గూడా బీరుపోనీయకుండా హాజరయ్యేది. ఆమెకు సంగీతమంటే ఎంత ఉత్సాహమంటే ఒక సంగీత కచ్చేరీకి తన భర్తను గూడా లాక్కొచ్చింది. అప్పటికి కౌంట్ ఓంకోల్జ్ యుద్ధమంత్రిత్వశాఖలో పనిచేస్తూ వుండేవాడు.

"బెర్లిన్ సంగీత నృత్యోత్సవం జరిగినరోజు నాకు బాగా గుర్తుంది. అది నాలుగేళ్ళక్రితం ఒక దురదృష్టకరమైన సాయంత్రం. సంగీత

కచ్చేరీ ముగుస్తూనే కౌంట్ ఓంకోల్జ్ భార్యాభర్త లిద్దరూ నా తండ్రిని అభినందించడానికి వచ్చారు. ఆవిడ చాలా నన్నగా చూడ్డానికి జబ్బు మనిషిలా పొట్టిగా వుండేది. వాడు మాత్రం దుక్కలా ప్రతి అంగుళం కల్నల్‌లాగే వుండేవాడు. వాడికళ్ళు నామీద పడ్డాయి. వాడిబాకుల్లా నన్ను చీల్చినట్లు చూస్తూవు న్నాయి.

ఆ భార్యాభర్తలు మా తండ్రీకూతుళ్లను వాళ్ల ఎస్టేట్‌కు ఆహ్వానించారు. ఓంకోల్జ్ భార్య గూడా మా తండ్రితోపాటు పియానోవద్ద కూర్చుని కృతులను వాయిస్తూవుంది. తన ఎస్టేట్‌నంతా దగ్గరుండి చూపుతానని చెప్పి వాడు నన్ను తనవెంట తీసుకెళ్ళాడు. తరువాత నన్ను బోటులో షికారు చేయించాడు. బోటును నదికి అడ్డంగా తిప్పి, అవతలితీరంలో వున్న చిన్న రెస్టారెంట్‌కు తీసుకెళ్ళాడు. అక్కడ మేమిద్దరం షాంపేన్ తాగాం. డాన్సు చేశాము. అలాంటి స్థలం అంతకు ముందెప్పుడూ నేను చూసి ఎరగను. అందుకే నాకు ఆనందంగా వుంది. మా నాన్న పక్కన కూర్చుని పియానో వాయిస్తూవుంటే ఆ కేంటెస్‌కు ఎంత ఆనందంగా వుందో, ఈ స్థలాలన్నీ చూస్తూ వుంటే నాకూ అంతే ఆనందంగా వుంది. అప్పటికి నా వయస్సు పధ్నాలుగేళ్ళు.

"మేము డాన్సు చేసేటప్పుడు కల్నల్ నన్ను గట్టిగా పొదివి పట్టుకున్నాడు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వేడిగా నా మెడను తాకుతూవున్నాయి. అప్పుడు నాకేదో హాయిగా వుందనిపించిందన్న నిజం చెప్పాలంటే నాకే సిగ్గుగా వుంది వెర్నర్. పెద్దవాళ్ళు రకరకాల ప్రలోభాలతో శ్రద్ధ నటిస్తే యవ్వనారంభంలో వున్న టీనేజ్ అమ్మాయిలు వాళ్లకు లొంగిపోతారనుకుంటాను" అంటూంటే గతం కళ్లకు కట్టినట్లు కనిపిస్తూవుంది.

"రెస్టారెంట్ నుండి ఎస్టేట్‌కు తిరిగి వచ్చేటప్పుడు మేమున్న బోటును సరస్సులో ఏపుగా పెరిగివున్న రెల్లుపొదలలోకి మళ్ళించాడు. ఆ రెల్లు పొదలను ఆశ్రయించుకునివున్న నీటిపక్షుల గుంపు ఈ సద్దుకు కకావికలై రెక్కలు తపతపా కొట్టుకుంటూ పైకెగశాయి. తమ స్థావరాన్ని ఎవరో ఆక్రమించుకుని ఏదో ఘోరం చేస్తున్నారన్న బాధతో 'గీ-బా' అంటూ ఏడుస్తూ పెడబొబ్బలు పెడుతున్నాయి. 'భయపడకు' అంటూ కల్నల్ తన చేతుల్లో వున్న పడవ తెడ్లను పడవలో పడేసి దగ్గరగా జరిగాడు.

ఆ రోజు హెడ్విగ్ ధరించిన స్కర్ట్ చాలా పొట్టిగా వుంది.

"అబ్బ... నీ కాళ్ళు ఎంత అందంగా వున్నాయి. వీటిని చూస్తూవుంటే నాకే ముద్దుపెట్టుకోవాలన్నంత పరవశం కలుగుతూవుంది" అంటూ కౌంట్ ఆ పిల్ల మోకాలిచిప్పలను అటూ ఇటూ కదుపుతూ గోముగా చేతుల్తో రాస్తున్నాడు.

కామకళలో బాగా ఆరితేరిన ఆ కౌంట్ చేతులు ఆ పిల్ల మోకాళ్లమీదినుండి మృదువుగా గిలిగింతలు పెడుతూ పైకి ప్రాకాయి. చివరకు ఆ పిల్ల సిగ్గుతో, ఉద్రేకంతో మూర్ఛపోయేవరకూ ఆ చేతులు ఆ అమ్మాయి మృదువైన భాగాలపై ఆడుకుంటూనే వున్నాయి.

ఆ సిగ్గే ఇప్పటికీ మిగిలివుంది. హెడ్విగ్ తన అవినీతికథ చెబుతూవుంటే, ఆమె చెక్కిళ్ళు రక్తం పొంగి జ్వలిస్తున్నాయా అనిపిస్తూ వుంది.

తన కథ చెబుతూ ఉద్రేకంలో ఊగిపోతూ, ఏదో తెలియని అయోమయంలో మునిగి ఆ పిల్ల చెప్పడం ఆగింది.

"పాపం... ఆ అమ్మాయిని తప్ప తాగించి వుంటాడా వెధవ" అన్నాడు వెర్నర్ సానునయంగా.

"అవును... అప్పుడు నాకేదో మత్తు ఆవహించింది. బోటునుండి కిందకు దిగేటప్పుడు తూలి పడబోయాను. నడుస్తూవుంటే కాళ్ళు నా స్వాధీనంలో లేనట్లు తప్పటడుగులు పడుతున్నాయి. ఆ కౌంట్ నా పరిస్థితిని అవకాశంగా తీసుకొని, మరునాడు నేను చదువుకునే స్కూలుకు దగ్గరలో వున్న రెస్టారెంట్‌లో వాణ్ణి కలిసేందుకు ప్రమాణం చేయించుకున్నాడు. మరునాడు నేను వాగ్దానం మేరకు అతన్ని కలుసుకున్నాను. అప్పుడు నాకే మత్తూ లేదు, మామూలుగా వున్నాను. అతనేమీ నవయవ్వనంలో వున్న అందగాడు కాదు. అన్నిరకాల మానసిక దౌర్బల్యాలకూ దాసుడైన మధ్యవయస్కుడు. నామీద అనందర్భమైన ప్రశంసలు గుప్పిస్తున్నాడు. నన్ను పొగుడుతూ, ఉబ్బేస్తూ,





బుజ్జగిస్తూ తన బ్రహ్మచారిగదికి తీసుకెళ్లడానికి ప్రయత్నించాడు. అతను బ్రహ్మచారి కాదని నాకు తెలుసన్న విషయం అతనికీ తెలుసు. కానీ అతగాడు తన గదిని బ్రహ్మచారి గది అని చెప్పుకుంటాడు. వాడి గదికి వెళ్లడానికి తిరస్కరించాను. కానీ వాడు అంతటితో వదిలిపెట్టే రకం కాదుగదా...''

హెడ్విగ్ తిరిగి తన కథ ఆపింది. ఆ సిగ్గుమాలిన వ్యవహారంలో తాను పాత్ర వహించినందుకు పదేపదే తనను తాను తిట్టుకుంది.

''కౌంట్ ఓంకోల్జ్ నా వెంటపడి బతిమాలుతూ బామాలుతూ, ప్రలోభపెడుతూ వుంటే నా మనసులో ఏదో తెలియని ఆందోళన రేగింది. ఇంద్రియసుఖాలు అనుభవించాలన్న తహతహ కలిగింది. నేను దాదాపు వాడికి లొంగిపోయే స్థితికి వచ్చాను. అదేదో రుచి చూడాలని మనసు లాగుతున్నా అప్పటికి నిగ్రహించుకున్నాను. వశీకరణ విద్యలో ఆరితేరిన ఓంకోల్జ్‌కు ఆడవాళ్ల మనస్తత్వం బాగా తెలుసు. బాహ్య పరిస్థితులమూలంగానే నన్ను లొంగదీయడం సాధ్యంకాదనుకున్నాడు. ప్రత్యేకించి ఆరంభ యవ్వనంలోని అమ్మాయిలను అనుభవించాలంటే నరస్సులో తేలియాడే బోటు అనువైన ప్రదేశమనుకున్నాడు. నరస్సు తీరంలోనే అయితే నేను వాడి స్వంతమైవుండేదాన్ననుకున్నాడు...''

హెడ్విగ్ నిశ్శబ్దంగా నిస్పృహతో తన పాత జ్ఞాపకాల్లోకి మునిగిపోతే జీవితాన్ని గురించి కానీ, ఆడవాళ్లను గురించిగానీ అంతగా తెలియని వెర్నర్ గూడా ఆ పరిస్థితిని వివేచన చేస్తూవున్నాడు. హెడ్విగ్ అతని ఆలోచనలను చదివినదానిలా తిరిగి తన విషాదగాథను మొదలుపెట్టింది.

''మానాన్నగారంటే ఓంకోల్జ్ భార్య ప్రాణం పెట్టేదని చెప్పాగదా! దీనివల్ల ఆవిడగారి మొగుడికికూడా నన్ను కలుసుకునే అవకాశం అప్పనంగా దొరికింది. వాడి భార్య ప్రపంచఖ్యాతి గన్న సంగీత విద్వాంసుడైన మానాన్నగారితో పరిచయం పెంచుకొనడం తన సుకృతంగా భావించేది. ఈ పరిచయం ఆత్మీయతగా మారి ఆమె నా తండ్రిని నాన్నగారూ అంటూ పిలిచేది. ఇప్పుడామె మమ్మల్ని తన ఎస్టేట్‌కే గాక, బెర్లిన్‌లోని తమ ఇంటికి కూడా ఆహ్వానిస్తూ వుంది. మేము వాళ్ళింటికి వెళ్ళిన ప్రతిసారీ వాడు నన్ను ఆత్రంగా తినేసేటట్లుగా చూసేవాడు. వాడంటే నాకు అసహ్యమేగాదు, ద్వేషంకూడా పుట్టింది. వాడు నన్ను వదలకుండా 'ఫలానారోజు, ఫలానాచోటుకు' రమ్మని పిలుస్తూండేవాడు. కానీ నేను ఖాతరుచేసేదాన్నిగాదు. ఇంతలో యుద్ధం ప్రారంభమైంది. నాకు వాడి పీడా విరగడైంది. నా సంతోషానికి అవధులు లేవు.

''అయితే దురదృష్టమేమిటంటే, వాడు నన్ను మరచిపోనూలేదు, ఏదోపసిపిల్ల లెమ్మని క్షమించనూలేదు''

''మేము సెయింట్ జర్మయిన్‌కు తిరిగి వచ్చిన తరువాత, నన్ను హిట్లర్ యువజన సంఘం మహిళా విభాగం ముందు హాజరుకావాల్సిందిగా ఆదేశించే నోటీసు అందుకున్నాను. ఆ సంఘంతో నాకెలాంటి సంబంధంలేదు. ఈ నోటీసు చూసి మా నాన్న విస్మయం చెందారు. దీనిని గురించి దర్యాప్తు చేయసాగారు. ఆ నోటీసు ఎవరిమూలంగా వచ్చిందీ, దానికి సంబంధించిన వాస్తవాలన్నీ తెలుసుకున్న ఆయన పిడుగుపాటుగా నిశ్చేష్టుడయ్యారు. అప్పటివరకూ ఆ యుద్ధం ఆయన జీవితంలో ఎలాంటి మార్పూ తేలేదు. ఆయన శాంతికాలంలోకంటే, యుద్ధకాలంలోనే సంగీతంలో తన కీర్తిపతాకను ఎగురవేశారు. ఆయన పేరు ప్రతిష్ఠలు వియన్నా, పారిస్‌వరకూ వ్యాపించాయి. సంగీత ప్రేమికులు స్విట్జ్ ముల్లర్‌ను మహాసంగీత విద్వాంసుడైన బిథోవెన్‌తో సమానంగా కీర్తించసాగారు.

''నాన్నగారికి జీవితంలో ఒకే ఆశయం, ఒకే లక్ష్యం, ఒకే కర్తవ్యం; అది సంగీతం తప్ప అన్యంగాదు. ఆయన నా తల్లిని కూడా వార్సాలో జరిగిన ఒక సంగీత కచ్చేరీలోనే కలుసుకున్నారు. పోలిష్ ప్రజలందరిలాగే మా అమ్మ కూడా జర్మనీ వాళ్ళను ద్వేషించేది. మా తల్లి కూడా సంగీత విద్వాంసురాలే. సంగీతమంటే వారిద్దరికీ ఉన్న అనురక్తే వారిద్దరినీ ఒకటి చేసింది. మా అమ్మ నన్ను పోలెండ్ మీద, పోలిష్ ప్రజలమీద మమకారాన్ని ఉగ్గుపాలతో రంగరించి పెంచింది. దానికి మా

నాన్న ఎలాంటి అభ్యంతరమూ చెప్పలేదు.

"మానాన్నగారుమాత్రం తనదేశం సాధిస్తున్న మహత్తరసైనిక విజయాలకు మురిసి, ముగ్ధుడవుతూ వుండేవారు. అయితే వాటిలో వ్యక్తిగతంగా పాల్గొనడానికి మాత్రం ఇష్టపడేవాడుకాదు. అదృష్టవశాత్తు జర్మనీ పాలకులు కూడా మా తండ్రి సంగీతరంగంలో జర్మనీకి అంతర్జాతీయంగా మహావిజయాలు సంతరించి పెడుతున్నారు గాబట్టి, ఆయనను యుద్ధరంగంలోకి లాగకూడదనుకున్నారు. ఆ విధంగా ఆయన సైన్యంలో చేరలేదు.

"నాకు నోటీసు రావడం మానాన్నకు ఆగ్రహం కలిగించింది. స్పిట్జ్‌ముల్లర్ కుటుంబంలోని ఎవరికైనా సైన్యంలోకి రిక్రూట్ చేసే ఏ సంస్థముందైనా చేతులుకట్టుకొని నిలబడవలసి వస్తుందనిగానీ, సైనికాధికారుల ముందు బలవంతంగా బట్టలు విప్పవలసి వస్తుందనిగానీ ఆయన ఎన్నడూ అనుకోలేదు. అనలది ఊహించలేని విషయం. మా నాన్న తనకు బాగా తెలిసిన కమాండింగ్ జనరల్ వద్దకు వెళ్ళారు. ఆయన కూడా ఇది విని విస్తుపోయాడు. ఎక్కడో ఏదో పొరపాటు జరిగిందనీ, తాను కల్నల్ ఓంకోల్జ్ తో మాట్లాడుతాననీ చెప్పాడు.

"ఈ వ్యవహారానికీ ఓంకోల్జ్‌కూ సంబంధమేమిటని" మానాన్న ఆయన్ను అడిగారు.

"ఈ రిక్రూటింగ్‌కు బాధ్యుడు కోల్జ్ అని ఆ అధికారి చెప్పాడు. దీనితో మానాన్న బరువు దింపుకున్నట్లు భావించారు. 'ఆ అసోసియేషన్ ఏదో పొరపాటు చేసింది. ఇది మనలాంటి పేరే వున్న మరొకరిదై వుంటుంది. మన పేరు అందరికీ తెలుసుగాబట్టి పొరపాటున మన అడ్రసుకు పంపారు' అని మానాన్నగారు చెప్పారు.

"దీనికి నీవేం దిగులు పడకు తల్లీ! ప్రత్యేకించి కౌంట్ ఓంకోల్జ్ ఈ శాఖ అధిపతిగా వుండగా మనకొచ్చిన భయమేమీ లేదు. అతను తప్పకుండా ఈ పొరపాటు నవరిస్తాడు" అంటూ నన్ను ఓదార్చారు.

"పాపం మానాన్నగారికి అంతకన్నా ఏం తెలుసు? కానీ నాకు తెలుసు. వాడు నామీద ప్రతీకారం తీర్చుకుంటున్నాడని. నువ్వే చూశావుగా జరిగిందేమిటో! కొన్నిరోజుల తరువాత కమాండింగ్ జనరల్ మానాన్నను కలుసుకొని ఆ కల్నల్ గాడిచ్చిన సమాధానం గురించి చెప్పాడు. వాడిచ్చిన సమాధానమేమిటో తెలుసా?

"అంతస్తు లేదా సాంఘిక హోదాలో నిమిత్తం లేకుండా జర్మనీదేశం మొత్తంలోని అందమైన, ఆరోగ్యవంతమైన యువతులందరినీ ఎంపిక చేయడానికి నేనే ఉత్తర్వు చేశాను. ఈ యువతులకు కావలసిన అర్హతల్లా వాళ్ళు యవ్వనంలో వుండటం, పిల్లలనుకనే స్థితిలో వుండటం మాత్రమే. ఎంపికచేసిన యువతుల్లో బౌద్ధిక, నైతికవిలువలు ఎంత ఎక్కువగా గలవారుంటే, భవిష్యత్తులో మనం తలపెట్టిన 'మహాజాతి' సృష్టికి అంతమంచిది. పైపెచ్చు మన ఫ్యూరర్ అకుంఠిత ప్రజాస్వామ్యవాది. మనమేదో దిక్కూ మొక్కూలేని సన్నజనాల యిళ్ళలో దూరి, ఆ కుటుంబం పరువుదీసి, వాళ్ళ పిల్లలను లాక్కొస్తున్నామని ఆయన అనుకోకూడదు"

"నీకు బిడ్డలు లేరా కల్నల్?" అని ఆ జనరల్ వాడిని అడిగాడు.

"నాకే గనుక ఒక కూతురుంటే ఆమెను వెంటనే రిక్రూట్‌చేయడం చాలా ప్రతిష్ఠగా భావించేవాణ్ణి. అప్పగించిన విధిని నిర్వహించకపోవడమంటే దేశద్రోహం చేయడమే'నని వాడు అన్నాడట.

"జనరల్ చెప్పిన మాటలు విన్న మా నాన్నగారు సర్వనాశనం జరిగిపోయిందని విలపిస్తూ కుప్పకూలిపోయారు. నేనూ అంతే! కుమిలిపోయాను. నీవు నదిలో ఈదేటప్పుడు నీముందు సుడిగుండం వుండటం యెప్పుడైనా చూశావా? ఆ సుడిగుండాన్ని సమీపించే ముందు కలిగే భయంకరమైన భావాలేమిటో అప్పుడే నీకు తెలుస్తాయి. ఆ సుడిగుండం బలంగా నిన్ను తనలోనికి లాక్కుంటుంది. మెల్లిగా అది నిన్ను తనలోకి యిముడ్చుకుంటుంది. నీ ప్రతిఘటన దానిముందు పని చేయదు. చివరకు సుడి నిన్ను ముంచేస్తుంది. నేనప్పుడు అదేవిధంగా భావించాను.

"వాళ్లు నిర్ణయించిన గడువునాడు నేను వైద్యపరీక్షకు వెళ్లాను"





"డాక్టరు ఊర్జర్ పరీక్షించాడా?" ప్రశ్నించాడు వెర్నర్.

"అవును... అతను సంస్కారి, మర్యాదస్తుడు. అయితే దేనికీ రాజీపడడు. ఎవరికీ లొంగడు. ఆయన తన సెక్రెటరీకి నా గురించి రిపోర్టు డిక్టేట్ చేస్తూవుంటే నేను విన్నాను. 'కన్య పునఃసృష్టికి అనువైనది" అని.

"వీళ్ల రిక్రూట్‌మెంటుకు తప్పనిసరిగా కావలసిన అర్హతల్లో కన్యాత్వం ఒకటేమోనని అనుకున్నాను. ఈ కన్యాత్వమే నాపాలిట శావమైందని భావించాను. వాళ్లు నన్ను ఎంపికచేయకుండా తప్పించుకొనడానికి ఏమైనా చేయాలనుకున్నాను. మా దూరపు బంధువు ఓ అబ్బాయి తల్లీ తండ్రీ, దిక్కూ దివాణం లేని అనాథ మా కుటుంబాన్ని ఆశ్రయించుకుని మాతోపాటే మా ఇంట్లో వుంటున్నాడు. పేదరికానికి తోడు అతనికి గూని కూడా ఉంది. మా నాన్నగారు ఆ కుర్రాడిమీద జాలితో తనవద్ద సెక్రెటరీగా ఉంచుకున్నారు. నేనంటే అతను పడిచస్తాడనీ, నామీద అతనికి అంతులేని ఆపేక్ష, ఆరాధనా ఉందని నాకు తెలును. అయితే ఆ మాట నాతో చెప్పే సాహసం అతనికి లేదు. నేను బవేరియాకు బయలుదేరే ముందురోజు రాత్రి అతని గదిలోకి వెళ్లాను. అతను నిద్రపోతున్నాడు. అతన్ని తట్టిలేపాను. అతని మంచంపక్కన నిలుచుని ఉన్న నన్ను చూసి అతను దిమ్మెరపోయాడు. కానీ అతని కళ్లుమాత్రం ఆనందంతో విప్పారాయి.

"'మైకేల్... నా చివరిరాత్రి నీతో గడపాలని వచ్చాను" అని అన్నాను.

"నాతోనా?" అంటూ అతను గాభరాపడ్డాడు. 'నాతో ఎందుకు గడపడం?' అంటూ నంగినంగిగా, భయం భయంగా అన్నాడు.

"ఎందుకంటే నిన్ను నేను ప్రేమించాను మైకేల్. నా తొలిముద్దు నీకు తప్ప మరెవరికీ ఇవ్వగూడదనుకున్నాను" అని చెప్పాను.

"పాపం ఆ కుర్రాడు ఆనందంతో, ప్రేమపారవశ్యంతో వణికిపోయాడు. నాతో ఏదో మాట్లాడాలని, ఏదో చెప్పాలని తికమకపడ్డాడు. చాలాసేపటికి గొంతు పెగల్చుకొని తన స్వప్నసుందరిని నేనేనన్నాడు. అతను నా పొందు కలలో గూడా ఊహించుకొని వుండడు. అలాంటిది నేనే అతని గదికివెళ్లి, అతనికి నా సర్వస్వం అర్పించుకుంటాననడంతో అతను తబ్బిబ్బై ఉద్రేకంతో ఊగిపోతున్నాడు. అతని భావోద్రేకం చూస్తే అతను నీరుకారిపోయి నా పథకాన్ని భగ్నం చేస్తాడేమోననిపించింది. ఏమైతేనేం చివరకు ప్రకృతే విజయం సాధించింది. నేను నా కన్యాత్వాన్ని అతనికి అర్పించి అతని గదినుంచి బయటపడ్డాను.

"మరునాడు ఉదయం నేను మదననదనానికి ప్రయాణమయ్యాను. నన్ను శారీరకంగా పరీక్షించి కన్యగాదని తెల్సుకుని తిరిగి ఇంటికి వంపేస్తారన్న నమ్మకంతో ఉన్నాను.

"అయితే నర్జన్ మేజర్ కొత్తగా ఇక్కడికి చేరిన అమ్మాయిలను రొటీన్‌గా పరీక్షించే సమయంలో నావైపు చూసీచూడనట్లుగా ఒక్క చూపు విసిరాడు. ప్రేమతో నా గడ్డం పుణికి, నన్ను పొగడసాగాడు.

"'భేష్... భేష్... అమ్మాయ్- నీ జీవితం ఇక్కడ ఆనందంగా, ఆహ్లాదకరంగా గడవడానికి మేము అని ఏర్పాట్లూ చేస్తాం" అని చెప్పాడు.

"నన్ను కూలంకషంగా పరీక్షించాలని నేను డిమాండ్ చేయడంతో అతను ఆశ్చర్యపోయాడు. పరీక్షానంతరం, అతని ఆశ్చర్యం నివ్వెరపాటుగా మారింది. అతను నన్ను అతని ప్రయివేటు రూంలోకి తీసుకెళ్ళి "చాలా చెడ్డపని చేశావ్ పాపా... నీవు ఆ పనిచేయకుండా వేచి వుండవలసింది" అని అన్నాడు.

"ఎందుకు వేచి ఉండాలి?"— అని నిలదీశాను.

"నీకు అత్యంత అపురూపమైన కానుక ఇచ్చేందుకు తగిన గౌరవ ప్రతిష్ఠలుగల వ్యక్తి కోసం వేచి ఉండవలసిందమ్మా! మేమీ మదననదనానికి పిలవనంపుతూ ఉన్న సైనికులందరూ వీరులే. నీ ప్రేమికుణ్ణి గురించి నాకింకా తెలియదు కానీ అతనింకా బెర్లిన్‌లోనే ఉన్నాడనుకుంటాను. దీనినిబట్టే చెప్పవచ్చు, అతనెంత పనికిమాలినవాడో" అంటూ డాక్టర్ ఆగ్రహంతో చిందులేశాడు. 'ఇంతకాలం నిన్నమొన్నటిదాకా అపురూపమైన కన్యగా ఉన్న నీవు ఇంతలోనే ఈ నీచపు పని ఎలా చేయగలిగావు... సిగ్గులేదూ?' అంటూ నన్ను చీవాట్లుపె



ట్టాడు.

"నన్నేం చేయమంటారు డాక్టర్? నేను అత న్ని ప్రేమించాను. ఇక మీ డ్యూటీకి పనికిరా నుగా" అని అమాయకంగా అడిగాను.

"నా అమాయకత్వం చూసి డాక్టరు ఆనందంగా నవ్వాడు.

"'ఒక్క రాత్రి వాడెవడితోనో గడిపినంతమా త్రాన నీ శారీరక విలువలేమీ తగ్గవు. నీ శరీర పరిస్థితి పరిశీలిస్తూ ఉంటాం. నీవు గర్భవతి కాగలవని అనుకుంటున్నావేమో. అలాంటిదే మీ ఉండదనే నేను భావిస్తున్నాను. ఒకవేళ నీవు నిజంగా గర్భం ధరిస్తే నీవు బిడ్డను కనేవరకూ వేచి చూస్తాం. అలాంటిదేమీ లేక పోతే అంతా మామూలుగానే ఉంటుంది" అని చెప్పాడు.

డాక్టరు చెప్పిన మాటలు విని నేను హతాశు రాలినయ్యాను. "అంటే నేనేమైనప్పటికీ నన్నీ మదననదనంలోనే వుంచుతారా?"— అంటూ గొణిగాను.

'ఆ... తప్పకుండా' అని డాక్టరు జవాబు.

"నా త్యాగం వృథా ప్రయాస అని తెలియ డంతో నేను కుప్పకూలిపోయాను. నేను చెడిపో యిన చెత్తనని డాక్టర్ అతని ఆఫీసునుండే ప్రకటించాడు" అని చెప్పి హెడ్విగ్ మౌనం వహించింది. ఆమె కనులనుండి కన్నీళ్లు ధారాపాతంగా చెక్కిళ్లమీదకి ప్రవహిస్తూ ఉన్నాయి. ఆమె వెక్కివెక్కి ఏడుస్తూవుంటే, వెర్నర్ ఆమెభుజాలమీద చేయివేసి, ఆమె ను ఓదార్చాడు. "పిచ్చిపిల్లా ఇక ఊరుకో" అంటూ.

"అంటే వాళ్ళు నిన్ను నాకు అప్పగించేనాటికి నీవు గర్భవతివి కావనే అనుకుంటాను" అన్నాడు సాలోచనగా లెఫ్టినెంట్.

కాదని తల అడ్డంగా తిప్పుతూ, "అదే చిత్రం! అలా జరక్కపోవడమే మంచిదిలే" అంది కసిగా.

ఫ్యూరర్ పథకం ఇంత అమానుషమైందా అనిపించింది వెర్నర్‌కు. ఆ పథకం ఒకవేళ

విజ్ఞానశాస్త్రరీత్యా సమర్థనీయమైనదైతే, దానిని స్వచ్ఛందప్రాతిపదికపై ఎందుకు నిర్వహించగూడదు? వేలాదిమంది స్వచ్ఛందంగా యుద్ధరంగంలోకి వచ్చి ఎంతో కష్టనిష్ఠూరమైన బాధ్యతలను నిర్వహిస్తున్నారు గదా! అలాగే దీనికి గూడా ఇష్టపడినవాళ్ళే వచ్చేవారు. ఇంత బలవంతం ఎందుకు? అని వెర్నర్ ఆలోచిస్తూ ఉన్నాడు.

''ఇప్పుడు నీకొక బిడ్డ కలిగితే అప్పుడేం జరుగుతుంది?'' అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకామె వికృతంగా నవ్వింది. ''ఈ వ్యవహారమంతా అందుకేగదయ్యా! ఒకవేళ బిడ్డే ఉంటే ఆ బిడ్డను నానుండి లాగేసుకుంటారు'' అని అంది.

వెర్నర్ విభ్రమంతో తలపంకించాడు. గర్భవతులైన అమ్మాయిలను ప్రసూతి ఆస్పత్రి లాంటి మరో భవనానికి పంపి, కాన్పు అయ్యేవరకూ అక్కడే ఉంచుతారని హెడ్విగ్ వివరించింది. పసిబిడ్డలను పాలు మానేసేవరకూ తల్లుల దగ్గర ఉంచి, ఆ తరువాత ప్రభుత్వ నర్సరీకి పిల్లలనూ, మదనసదనానికి తల్లులనూ పంపుతారు.

''అవును... 'ఈ పిల్ల బాగా పిల్లల్ని పెట్టగల'దనే ముద్రను నా ఎడమతొడమీద పచ్చబొట్టు పొడిపించుకుని నేను తిరిగి పిల్లల్నిపెట్టే పనికోసం ఇక్కడికి వచ్చి ఉండేదాన్ని. నా అంతట నేను ఆత్మహత్య చేసుకోగలిగేటంత ధైర్యం కూడగట్టుకొనేవరకూ ఇక్కడికి వచ్చిన అడ్డమైన సైనికుడి పక్కలో పడుకుని పిల్లల్ని పెడుతూ ఉండేదాన్ని'' అంటూ ఆ అమ్మాయి వెక్కివెక్కి ఏడుస్తూ ఉంది.

లెఫ్టినెంట్ వెర్నర్ ఆమె భుజాలమీదే ఉన్న తన చేతిని తీసివేసి తన ముఖాన్ని ఆమె చూడకుండా పక్కకు తిప్పుకున్నాడు. ఉబికివస్తున్న కన్నీటిని ఆపుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. తన తండ్రి వార్సాలో చనిపోయాడని తెలిసిన రోజున తొలిసారిగా వెర్నర్ ఏడ్చాడు. ఆ తరువాత అతని కళ్ళలో నీరు నిండడం ఇదే మలిసారి.



ఫ్రంజేబకే అనే టాంకు డ్రయివరు గుప్పుగుప్పున దమ్ములాగుతున్నాడు. బోర్టాక్స్‌లో చెయ్యడానికి చిన్న మెత్తుపని కూడా లేదు. ఇక్కడే గాదు, మరెక్కడా చేసే పనీ, వంగూ ఏమిలేదు. అతనికి సంబంధించినంతవరకూ యుద్ధం ముగిసిపోయినట్లే. ప్రతిపనినీ శాంతికాలంలో లాగా ఏవిభాగానికావిభాగం వేర్వేరుగా విభజించి నిర్వహించడం జరుగుతూ వుంది. ఫ్రెంచివాళ్ళను జయించిన తరువాత జర్మన్లు యిప్పుడు వాళ్ళను రక్షిస్తూ వున్నారు. ఇప్పుడు విమాన దాడులు లేవు. శత్రువులు హఠాత్తుగా దండెత్తి కొల్లగొట్టడం లేదు. భయంతో ప్రాణాలు అరచేత పట్టుకొని బతికే గ్రామాలపై టాంకులు నిప్పులు చిమ్మడం లేదు. ఆరోజుల్లోనైతేనా? జేబునిండా కోసుగడ్డలున్న మగాడిచుట్టూ ఆడాళ్ళు ఈగల్లా మూగేవారు. ఒక కోసుగడ్డ ఇస్తేచాలు , వాడిపక్కలో పడుకోమన్నా పడుకునేవారు. ఫ్రెంచి వాళ్ళు నోరుమెదపడానికి లేదు. ఎవడన్నా నోరువిప్పి మాట్లాడితే నోరుమూసేదాకా తన్నులు తగిలేవి.

ఆ తరువాత యుద్ధ విరమణ సంధి జరిగింది. సంధి తర్వాత సైనికులు కొల్లగొట్టడం పోయింది. ఇప్పుడు కొల్ల గొడుతున్నదల్లా పాలకులే. వాళ్ళు చట్టబద్ధంగా కొల్లగొడుతున్నారు. అయితే, ఉత్తర్వులు మాత్రం మర్యాదగా ఉంటున్నాయి. చర్చలు గూడా సరళంగా వున్నాయి. అనేక ఆందోళనలు, అల్లర్ల తరువాత, వాళ్ళను అణిచి అణిచి సాధ్య పడక ఫ్రెంచి ప్రజల పట్ల కాస్త మర్యాదగా వ్యవహరించడం జరుగుతూవుంది. ఇది చాలు మనిషి చేత మంటల్లోనుండి పిక్కలేరించడానికి.

ఆ టాంకు డ్రయివరు కొన్నిసార్లు జూదం ఆడి పట్టుబడ్డాడు. అతను సైన్యంలో ఎంత గొప్ప సేవ చేసినా అదెందుకూ పనికిరాలేదు. మందలింపులూ మరోసారి ఇలాంటి పని చేయొద్దని వార్నింగులూ లభించాయి. కెప్టెన్ అసాధ్యుడు. తమాషాకు కూడా పెదవి విప్పి నవ్వడు. ఆ వార్నింగ్ తరువాత ఫ్రంజే మరెప్పుడూ జూదం జోలికి పోలేదు. కాకుంటే దమ్ము గొడుతున్నాడు.

బోర్టాక్స్‌లో ఆడాళ్ళు కొల్లలుగా వున్నారు, చాలా అందగత్తెలు. వాళ్ళ వక్షసంపద వాళ్ళేసుకున్న బ్లౌజుల నిండా వుంటుంది. వాళ్ళ కళ్ళు మదనాగ్ని జ్వాలలు చిమ్ముతూ వుంటాయి. వాళ్ళని అనుభవించవచ్చు. కానీ అంతంత మాత్రం డబ్బుకు అందరు. వాళ్ళ పొందు అనుభవించాలంటే సైనికునికి వచ్చే జీతం చాలదు. ఇలాంటి నిస్సారమైన జీవితం ఇంకా ఎంతకాలం? పోరాటం ముగిస్తే తనను జర్మనీకి ఎందుకు పంపరు? బెర్లిన్‌లోనైతే జల్సాగా కాలం గడపవచ్చు.

బెర్లిన్‌కు పోతే తిరిగి తన పాత టాక్సీ తనకు దొరుకుతుంది. బాడుగలకు తోలడం, రసిక ప్రపంచంతో లావాదేవీలు జరపడంతో బాగా బతకొచ్చు. ఇంకా కొంత డబ్బవసరం ఎక్కువగా వుంటుందా, తప్పతాగి దొర్లే వాళ్ళను పట్టుకుంటే సరి!

ఫ్రంజే ఒకనాటి ఉదయం తనకు అలవాటైన 'పిల్ల' గాలి పీల్చుకుందామనీ, చవగ్గా





దొరికే జారిణుల పొందు అనుభవిద్దామనీ అనుకొని రేవు దగ్గరకు బయలుదేరుతూ వుండగా, మెడికల్ ఆఫీసరు ముందు హాజరు కమ్మని పిలుపొచ్చింది. తను ఊహించని రీతిలో అతగాడు వైద్య పరీక్షలో నెగ్గడంతో ఉన్మాదిలా నవ్వసాగాడు. ఆ ఆనందంలో సాటి సైనికులందరికి డ్రింక్స్ తెచ్చాడు.

"ఓయ్ ... పిల్లకాయలూ నేను లేపలేన్నే ఉండా. అంతా రాండెహే". అంటూ గప్పాలు కొట్టసాగాడు. "వాళ్ళు నన్ను మళ్ళా గుర్రమెక్కే డ్యూటీకి బవేరియా అంపుతుండరు. డూటీ అంటే డూటీ అంతే! ఒక వారం శెలవు. ఖర్చులన్నీ కూడా వాళ్ళయేలె. నాగూట్లో పెతిరేత్రీ ఓ కొత్తపిట్ట! ఎట్టాంటి పిట్టలనుకున్నారు? బలే పసందుగా, రోగం గీగం లేకుండా మాంచి మజాగా వుండారని డాకటేరు సర్టిఫికటు యిచ్చిన పిట్టలు. దేశం అంతా గాలించి కొట్టుకొచ్చిన పిట్టలు. అహ హ" అంటూ అదరగొట్టేస్తున్నాడు.

"నిన్ను వాళ్ళెందుకంపుతున్నారు?" ఇంటిమీద గాలి మళ్ళిన ఓ రాగిజుత్తు యువ సైనికుడు ప్రశ్నించాడు.

ఫ్రంజేబకే రొమ్ము విరుచుకుని, తాను అలంకరించుకొన్న మెడల్స్‌ను అందరికీ చూపుతూ "ఇందుకు" అని చెప్పాడు.

ఈ వార్త ఆ సైనికశిబిరమంతా దావానలంలా వ్యాపించింది. ఆరోజు వాళ్ళ హీరో ఫ్రంజే. ప్రతి వాళ్ళు అతనితో కరచాలనం చేసి, అభినందనలు తెలిపి, డ్రింక్స్ తెచ్చి ఇచ్చారు.

"నువ్వు యిక్కడికి తిరిగొచ్చినాక అక్కడేం జరిగిందో అదంతా మాకు పూసగుచ్చినట్టు చెప్పాలి" అని అడిగారు.

"కలవరపడమాకండి పిల్లకాయలూ ... మీ అందరికి కూడ నామోస్తరే ఛాన్సువస్తదిలే" అంటూ వాళ్ళకు ఆశ పెట్టాడు.

ఆ రాత్రంతా ఫ్రంజే పీకమొయ్యా తాగి పడిపోయాడు.

మరునాటి ఉదయానికి అమత్తంతా దిగిపోయి ఉల్లాసంగా, పూర్తి కొత్త మనిషిలా లేచాడు. నున్నగా గడ్డం గీసుకున్నాడు. డ్రెస్సు బటన్లకుమెరుగుపెట్టాడు. బూట్లకు పాలిష్ కొట్టాడు. వంటి మీద ఉడుకులాన్ చల్లుకున్నాడు. నిగనిగలాడుతూ, ధగధగలాడుతూ కొత్త పెళ్ళికొడుకులా ముస్తాబై లియోన్స్‌కు వెళ్ళే ఎక్స్‌ప్రెస్ అందుకున్నాడు.

అతనికి ప్రయాణం చాలా ఉల్లాసంగా ఉంది. సైనికపటాలంతో కలిసి గాక ఒక్కడుగా రైలు ప్రయాణం చేయడం ఇదే ప్రథమం. అతను మామూలు పౌరులతో కలసి ప్రయాణిస్తూ వున్నాడు. వాళ్ళంతా బహుశా అతని సైనిక దుస్తులు చూసి ఏవగింపుతోనో, భయంతోనో గౌరవం చూపుతున్నారు. పక్కకు తొలగి దోవయిస్తున్నారు.

టాంకు డ్రైవరు మాంచి హుషారుగా, ఉల్లాసంగా వున్నాడు. పక్కనున్న ప్రయాణీకులందరీ గిల్లిగిల్లీ చెప్పుతున్నాడు తనకు పట్టిన మహర్దశ గురించి. అతని శ్రోతల్లో ఒక ఆడమనిషి కూడా వుంది. ఆమె వయస్సెంతో ఇదమిత్తంగా చెప్పలేం. అతను ఊరించి చెప్పే కథంతా చెవులప్పగించి ఆలకిస్తూన్న ఆమె తాను ఏంచేసినా కాదనదనుకున్నాడు. ఆమెకు తన మోకాళ్ళు తాటించి సరసమాడుతున్నాడు. లియోన్స్ స్టేషన్‌లో దిగిన వెంటనే కలిసి హొటల్‌కు పోదామన్నాడు. ఆమె వెంటనే ఒప్పుకుంది.

రైల్లో మొదలుపెట్టి, లియోన్స్ స్టేషన్‌లో దిగి, హొటల్ గదిలోకి వచ్చి తలుపులు మూసుకునే వరకూ గూడా ఫ్రంజే తన బవేరియా యాత్ర గురించీ, అక్కడ తన కోసం ఎదురుచూస్తున్న స్వర్గసుఖాల గురించీ, తనకు రైల్లో తోడైన తాత్కాలిక ప్రేయసికి సుత్తి కొడుతూనే వున్నాడు.

ఫ్రంజే చెప్పేదంతా విని ఆవిడ "అదంతా జరిగేదిగాదులే" అని కుండబద్దలు గొట్టినట్లు చెప్పింది. "అక్కడున్న ఆడపిల్లకాయలు ఈ దున్నపోతోడి మొకమే మేం జూడంపొమ్మంటే ఏంజేస్తవేం?" అంటూ ప్రశ్నించింది.

ఆ మాటలకు ఫ్రంజే ఆ గది దద్దరిల్లేటట్లు నవ్వాడు.

"ఇదిగో నేనంటే నీకేదో శానా పరాశకంగా వున్నట్లుండదే. నేనంటే ఏమనుకున్నావో అక్కడికి బోయినాక 'నేను మీకు నచ్చిన్నా' అని

వాళ్ళని అడుగుతాననుకుంటుండవా యేంది? అడగూడా ఇక్కడిలాగానే 'పదశ మంచమెక్కు' అనే అంటా. నరేసరేలే... ముందునువ్ మంచమెక్కు'' అంటూ తొందరచేశాడు.

ఆ తరువాత ఇద్దరూ మంచమెక్కారు. ఆ రాత్రంతా శివరాత్రి చేశారు.

"అబ్బ... నువ్ కళపెళ్ళాడే నెయ్యిలో ముంచిన బూరెముక్క మోస్తరుగా బలే ఉబ్బిపోయుండవే'' అంటూ తన తాత్కాలిక ప్రేయసిని మెచ్చుకున్నాడు. 'నేగూడా మంచి మదించిన దున్నపోతులా వుండాననుకుంటున్నావ్ గదూ'' అడిగాడు.

"ఊఁ''- అంటూ ఆమె మూలిగింది.

"ఇదో నీ మూలుగు, నీలుగు నాకు కాబట్టదుగానీ, బొడ్లో లెక్క ఎంతుందో బయటికి దియ్''- అంటూనే తన డ్రస్ తగిలించుకోసాగాడు.

"నాదగ్గరేముంటది?''

"ఇదో నాతో ఏళాకోళమొద్దు. నేనసలే ముక్కునూటి మడిసిని. పైగా శానా గొప్పోణ్ణి. మందంతా ఐసాపైసా యవ్వారం. నీకు తెలవదేమో... యుద్దెంలోకి రాకమునుపు నేను శానా పెద్ద సోగ్గాడిని. రంబలవంటి పడుసుపిల్లలంతా నాకు ఎంతడిగితే అంత ఎదురిచ్చేటోళ్ళు''

"తెల్లారులూ వొళ్ళు హూనం జేసుకున్నా రైకగుడ్డకు గూడా దిక్కులేదు గానీ యీడు నాదగ్గరే డబ్బులడుగుతుండడేందబ్బా ఖర్మ'' అనుకుంటూ ఆమె తన దగ్గరున్న డబ్బు కనిపించనీయకుండా దాచుకుంది. ఇంక వీణ్ణి వదిలించుకుంటే మంచిదని, "ఇదో నూడయ్యా... నీ అక్కరమువ్వ నా అక్కరనేనూ తీర్చుకున్నాం. నరికి నరి సెల్లిపోయింది. ఇంక ఎవురిదార్న వాళ్ళం పోదాం'' అంది.

"నీదారి నాకు తెలవదు. నాదార్న నేపోతున్నా'' నంటూ ఆమె గౌనులో దాచుకున్న నోట్లకట్టలాక్కుని, వడివడిగా లెక్కపెట్టి అందులో ఒకనోటు లాగి ఆమెకు తిరిగిచ్చి "నీకిది నరిపోతదిలే'' అన్నాడు. "ఇదో... ఈ గదిలో రేపు పొద్దుమాపటాలదాకా ఉండొచ్చు. ఈడ్నే వుండు. నేనింకా శానాదూరం పోవాల. ఈ లెక్కసాల్లే. మద్దెనదార్లో ఇంక సిలకొట్టుళ్ళకు పోనే, వస్తా'' అంటూ వెళ్ళిపోయాడు. ఆమె వాణ్ణి గుడ్లప్పగించి చూస్తూ వుంది.

మరో రెండురోజుల తర్వాత ఫ్రంజేబకే మదనసదనం చేరుకున్నాడు. అక్కడికి చేరీచేరడంతోనే ఆతగాడు తాను యుద్ధానికి పూర్వం టాక్సీ డ్రయివర్‌గా ఉన్నరోజుల్లో రసిక ప్రపంచంలో లావాదేవీలు జరిపేటప్పుడు ఏ పద్ధతులను అనుసరించేవాడో ఆ పద్ధతులకే పూనుకున్నాడు. సాయంత్రం ఈతకొట్టడం అయిపోయాక ప్రొప్రైటర్‌ను పిలిచి: "ఇదిగో అమ్మాయో... నాకు పెద్ద అదురుట్టం లేదు గానీ, ఈడ నా కంట్లోబడ్డది నువ్వేగానీ, ఈ రేత్రికి మనిద్దరం కలిసుంటే పోలా. ఈడ నిన్నెవురూ వాడుకోరని యిన్నలే... నిజమేనంటవా?''- అని అడిగాడు.

"నిజమే... కానీ ఇక్కడ అందమైన అమ్మాయిలకు కొరతలేదు''- అని చెప్పిందామె- తన అతిథితో అతి మర్యాదగా.

"అట్టయితే అదేందో నే నూత్తగానీ వాటిమంచీ సెబ్బరా నాకేం తెలవదుగానీ, నువ్వే మాంచి రంజైన ముండనొకదాన్ని నూచి నాకాడికంపు. అంపుతవా లేదా?''

వీడు మాట్లాడుతున్న మాటలతీరు వింటుంటే ఆమెకు అరికాలిమంట నెత్తికెక్కింది. 'ఇక్కడ తాను ఉపాధ్యాయురాలిగా వుంది ఇట్లాంటి అల్లాటప్పా మాటలు వినడానికా?' అని మధనపడుతూ "ఇక్కడున్నవాళ్ళల్లో నీవంటున్నట్లు ముండలెవరూ లేరు'' అని అంది కటువుగా. "వాళ్ళంతా దేశభక్తి మూర్తీభవించిన యువతులు. తమ దేశంకోసం త్యాగంచేయడానికి స్వచ్ఛందంగా సిద్ధపడినవాళ్ళు'' అని చెప్పింది.

"నిజమేలే... పెద్ద త్యాగం... ఎట్లా? మొగోనికి వొళ్ళప్పగించటం?''- అంటూ పగలబడి నవ్వసాగాడు.

"సర్జన్, మేజర్ ముందు ఇలా మర్యాదలేకుండా మాట్లాడకు ఆయన సహించరు'' అంటూ మందలించినట్లుగా చెప్పింది.

"అబ్బో... పెద్ద సర్జనూ, మెజెరూ... ఏంజేస్తడేం? తలగిల్లిమొలేస్తడా, జైలుకంపిస్తడా? శానా మంచిదే. రెండ్రోజులు పనీ వంగూళ్ళేకుండా దాన్లోనే బడుంటా. లేకుంటే మళ్ళ యిద్దానికంపిస్తడంటవా? అణ్ణుండేగా ఈడకొ





చ్చింది. ఇదిగో పిల్లా... నీకు తెలవదో యేమో యిటుజూడు" అంటూ తన ఎదుర్రొమ్మును గుద్దుకుంటూ మెడల్స్‌ను చూపిస్తూ ఇయ్యన్నీ నాకెందుకిచ్చిన్రంటవ్. అసలెందుకిచ్చిన్రో నీకు తెలుసునాంట !ఉర్లగడ్డల తొక్కలు వొలిసినందుకులే" అంటూ కాస్త సర్దుకొని "ఇదో పిల్లా... ఇదంతా ఎందుకొచ్చిన తంటాగానీ, ఈడున్న పిల్లల్లో మా ఊరు ఏ ఊరనుకున్నావ్? అదే బెర్లిను. ఆ వూరి పిల్లముండుంటే సెప్పు- మరీ పల్లెటూరి గబ్బుముండుంటే నాకు కాబట్టవు"అని అన్నాడు.

ఆ క్షణాన టాంకు డ్రయివరు వైపు బిత్తరి చూపులు చూస్తున్న ఓ పిల్లను చూపింది ఫాఫ్లిట్టర్.

"ఈడికి రాకముందాపిల్ల ఏంజేసేదేం?"- ఫ్రంజే ప్రశ్నించాడు.

"ఆ అమ్మాయి గ్లోవ్‌క్లర్క్‌గా పనిచేసేది"

"గ్లోవా... సేతులకు తొడుక్కునే తొడుగేనా! అయితే దాన్నేబంపు. అది నాకు బాగా గ్లోవాల్నే అమురుద్దిలే" అన్నాడు.

ఆవిధంగా మెటిల్డా జుల్లెర్ టాంకు డ్రయివరు ఫ్రంజేబకే జీవితంలోకి ప్రవేశించింది.

"ఇదుగోపిల్లా... నేను పెద్దసదువులు సదవకపోయినా సెప్తావుండా యినుకో- మనమేదో ఈడ అనుకోకుండా సిలక్కొట్టుడు కొట్టుకొని దులపరించుకొని పోతమనుకోవాకు. ఏణ్ణాళ్ళ మొగుడూ పెల్లాలాట ఆడబోతన్నం. ఏడడుగులు నడిస్తేనే ఆరు ఈరవుతారంటారు మన పెద్దోళ్ళు. అట్టాంటిది ఏడు రేత్రిళ్ళూ, ఏడువగుళ్ళూ కలిసివుంటమంటే ఏమనుకోవాల. జల్మజల్మబందం అనుకో. అనుకునేదేంది, నిజెంగా అదే. మనం ఈడవుంటావుండ దాని పేరేందీ? మదన... సదనమా.. పేరేదైతేనేంలే. ఇదో పిచ్చోడు కనిపెట్టిన సొరగం. ఇది ఎంతో కాలం నిలవదులే. ఈ యుద్దెంతోపాటే ఇదీ గోయిందగొడ్తది. మళ్ళీ మనూళ్ళో నువ్వూ నేనూ కలుద్దారి... ఏమంటవ్? నీయసుమంటి సక్కనిసుక్క పక్కనుంటే మనిద్దరం రాజా రాణి మోస్తరు రంజుగా బతికేస్తం" అంటూ మెటిల్డాకు హితోపదేశం చేశాడు ఫ్రంజే.

మాటతీరు మోటుగావున్నా మనిషి హృదయం మంచిదనుకుంది మెటిల్డా ఇట్లా నిర్మొహమాటంగా. మనసులోమాట తెగేసి చెప్పేవాళ్ళెంతమంది? అందుకే అతనికి మేజర్-జనరల్ తననువాడుకున్న కథంతా చెప్పింది.

"నువ్వో పిచ్చిముండవు. అప్పుడే వాణ్ణి బొద్దో చెయ్యేసి నడిబజార్లో నిలబెడితే నచ్చినట్లు యింట్లో బెట్టుకొనివుండేటోడు"- అన్నాడు ఫ్రంజే మెట్టిల్డా కథంతావిని.

అయితే ఆ మేజర్-జనరల్ తనను వదిలించుకుని మదనసదనం పంపడానికి ముందు అనేకమాసాలపాటు తననూ, తన కుటుంబాన్నీ పోషించాడనీ, చాలా ఉదారంగా వున్నాడనీ ఆ పిల్లచెప్పింది.

"వందినాకొడుకు... వాడెక్కడికి బోతడులే. ఈ యిద్దెం అయిపోనీ ఆ నాకొడుకుపనిజెప్తా. యుద్దెంలో పోట్లాడే మేమంతా యిండ్లకురానీ! పెద్దపెద్ద ఆఫీసర్లమంటూ యింట్లోనేకూకుని కులికేనాయాళ్ళూ, జనాల్ని నిలువునా దోసే దొంగయాపార్లూ దిక్కూ మొక్కూ లేకుండా పారిపోవాల. మేమంతా యిద్దెంలో ఏపాపం యెరక్కుండా గుండ్లదెబ్బలకు సస్తావుంటే ఈ నాకొడుకులంతా నీడపట్టున కూకొని కులుకుతావుండరు"! అంటూ నిప్పులు కక్కుతున్నాడు ఫ్రంజే.

ఈ మాటలు వింటూంటే మెటిల్డాకు అమృతం తాగినట్లుగావుంది. తానుపనిచేసే షాపుకువచ్చే ధనికులంటే ఆమెకు ఎప్పుడూ ఏవగింపే. ఖరీదైనదుస్తుల్లో విలాసంగావచ్చి, తన్నుచూసి వంకరనవ్వులు నవ్వుతూ, తమ గబ్బుచేతులు తన ముఖం మీదికి చాపి గ్లోవ్ తొడిగిచూడమంటారు. వాళ్ళనూ, వాళ్ళవెకిలి వేషాలనూ చూస్తూంటే చెప్పుతో సాచి మొహంమీద కొట్టాలనిపిస్తుంది.

తనకూ ఒకమగాడు, ఈ డబ్బున్నవాళ్ళలో సరిసమానంగా పోటీపడే మగాడు దొరికితే తానుగూడా యిప్పుడు తనముందు నిలుచుని చేతులుచాచి గ్లోవ్స్ తొడిగిచూడమనేవారిలాగే చేతులుచాపి యిదేకౌంటర్ ఎదురుగా నిలబడతాననీ, అలా నిలబడాలనీ అనుకుంది. ఏమైతేనేం గతం అనవసరం. ఈ మదనసదనం నుండి బయటపడ్డాక అలాగే బతకాలని అనుకుంటూ. కాలంగడిపేస్తూవుంది.

మదనసదనంలో వున్న మిగతావారితో మెటి

ష్; ఫ్రంజే జంటకు అంత సంబంధంలేదు. ఒకనాడు ఫ్రంజే వెర్నర్-హెడ్విగ్‌జంటను చూశాడు. వాళ్ళనుగురించి మెటిల్డాను అడిగాడు.

"ఆ పిల్ల మహా అహంకారి. దాని దర్పం అదీ ఎవరినీ లెక్కచెయ్యదు. ధనికకుటుంబానికి చెందినదానిలావుంది. ఇక్కడికెలావచ్చిందో ఆశ్చర్యంగావుంది" అని చెప్పింది మెటిల్డా.

"ఎట్టావచ్చేదేంది... ఆ యింటి ముసిలోడెవుడో దీన్ని వదిలించుకోవాలని అనుకునుంటడు. ఇక్కడికి నేరుగా బండెక్కించుంటడు" అన్నాడు ఫ్రంజే.

ఆరాత్రి మెటిల్డా నిద్రపోతూవుంది. మాజీ టాక్సీ డ్రయివరు మేల్కొని, ధనికకుటుంబం నుంచి దారితప్పి మదనసదనానికి వచ్చిన పిల్లను గురించి ఆలోచిస్తూవున్నాడు. "ఈ తప్పుడు ముండ ఆ యింటికి శానాసెడ్డపేరు తెచ్చేవుంటది. ఏదో పెద్దకతలేందే ఇట్టాంటిసోటికి ఎందుకు బంపుతరు? పైకి నంగనాసి తుంగబుర్రమోస్తరు కనబడతావున్నా కనబడ్డ మొగోనితోనల్లా సెడదిరిగివుంటది. ఇట్టాంటి దానికి నేనేగనక బిడ్డనుపుట్టిస్తే ఎట్టావుంటది? బలేబాగుంటది. అదే జరిగితేనా! నాయాల్ది, యిప్పుడు గాదనుకో! ఈ యిద్దెం అయిపోయినాక చానాలాభం. ఆ పిల్ల అమ్మా-అబ్బకు ఆ సెడదిరిగినముండమీన కోపం ఉండొచ్చుగానీ, అది కనేబిడ్డమీద వుండదులే. అసలుకన్న వడ్డీముద్దని మనవణ్ణి ముద్దుబెడ్తరు. పెద్దోళ్ళు లాస్కోపులో మోస్తరు కట్టవడైనా మనవణ్ణి కనుక్కుంటరు. అప్పుడు అబ్బెవురని అడుగుతరు. తాను నేరుగ్గా వాళ్ళకాడికిపోయి వాడబ్బను తానేనంటడు. అబ్బ... దాన్తో తన రొట్టెరిగి నేతిలోపడ్డట్టే"- అని స్వగతం చెప్పుకుంటూ కలలుగంటున్నడు. అదే జరిగితే తాను కోటీశ్వరుడైనట్లేనని భావించాడు. ఆ పిల్లను కలుసుకొనితీరాలని నిశ్చయించుకున్నాడు.

మరునాడు ఉదయం మెటిల్డా యింకా నిద్రలేవలేదు. ఆ పిల్ల ఆలస్యంగా నిద్రలేస్తుంది. ఫ్రంజే త్వరగాలేచి మఠం పరిసరాల్లో తిరుగుతూ వున్నాడు. మదనసదనంలోని అమ్మాయిలంతా అప్పటికే మైదానంచేరి ఆటలాడుతున్నారు. ఫ్లిట్టర్ వాళ్ళకు ఆటలు నేర్పుతూవుంది. కానీ తనకు కావలసినపిల్ల అక్కడ లేదు. "అది తన కొత్తమొగుడితో యింకా పక్కమీదనే పొర్లతావుండదేమో" అనుకున్నాడు.

వెనక్కుతిరిగి హెడ్విగ్‌వుండే కుటీరం దగ్గర కొచ్చాడు. అక్కడెవరూ లేరు. బహుశా వాళ్ళిద్దరూ కలిసి షికారెళ్ళివుండవచ్చుననుకుని వాళ్ళను వెదుకుతూ బయలుదేరాడు 'దానితో ఆ మొగోడుంటడు. వాడుంటే సిక్కే' అనుకున్నాడు. కానీ తనకింకా ఆరురోజులుంది. 'ఈ ఆర్రోజుల్లో దాన్ని సెడగొట్టలేనా? దాన్నింకా కలుసుకోనేలేదు. మాటైనా కలపలేదు. ఈ ఆర్రోజుల్లో అది దొరికేదెప్పుడు? దాన్ని పక్కలోకి దెచ్చుకొనేదెప్పుడు?" అని ఆలోచిస్తూ నడుస్తున్నాడు.

రెండుచేతులూ ఫాంటుజేబుల్లో దూర్చి, ఒక చెవిమీదికొచ్చేలా టోపీని ఒరగబెట్టి, 'సిలకకొట్టుడుకొడితే' అని ఈలవేసుకుంటూ హుషారుగా అడవిలోకెళ్ళాడు. ధైర్యవంతుల్నే అదృష్టం వరిస్తుందంటారు. ఫ్రంజే అడవిలో షికారుకొచ్చేసమయానికి హెడ్విగ్ అడవిలో మనుమలెవరూ కంటబడని ప్రశాంతమైన ప్రదేశంలో సూర్యస్నానంచేస్తూవుంది. మదనసదనంలో ఆమెకు నచ్చిందిదొకటే. రోజూ ఉదయమే లేచి అడవిలోకివెళ్ళి, ఆరుబయట నగ్నంగా పడుకొని లేయెండలో సూర్యస్నానంచేయడం. ఉదయపు పిల్లగాలులు ఆమె నగ్నశరీరంమీద పారాడుతూ గిలిగింతలు పెడుతూవున్నాయి.

ఒక పొదమాటున బయటనుండి చూసేవారికి ఎవరికీ కనిపించని ప్రదేశంలో హెడ్విగ్ నగ్నంగా పడుకొనివుండటం ఫ్రంజే కళ్లపడింది. హెడ్విగ్ కళ్ళు మూసుకుని వుంది. ఫ్రంజే పిల్లిలా ఆమెను సమీపించటం ఆమె యెరుగదు. ఒంటరిగా, నగ్నంగా అతనికి దొరికింది.

"ఎంత అదురుట్టం... భలే మంచిరోజే పిల్లా. నాకొక్కడికేగాదు, నీకు కూడా మంచి రోజేలే" అంటూ ఫ్రంజే ఆమె దగ్గరికి చేరాడు.

ఆమె నోరు తెరచి సమాధానం చెప్పేలోగానే ఆమె పక్కన పడుకున్నాడు. ఆమె ఎటూ కదలకుండా ఆమెను రెండుచేతుల్లో బంధించి తన దగ్గరకు లాక్కుంటున్నాడు.





వాడి భల్లూకపు పట్టు నుంచి తప్పించుకొనడం ఆమెకు సాధ్యంకావడంలేదు.

''ఛీ ఛీ... నన్నొదులు'' అని బ్రతిమాలుతూ వుంది. ఆమె గట్టిగా అరవలేకపోయింది. అరచి అల్లరిచేస్తే తానే నిందపడవచ్చు.

ఆమె, ''వొదులు...వొదులు'' అని మామూలుగా అడగడం ఫ్రంజేకు అలుసుగా కనిపించింది. లోపల యిష్టముండి కూడా పైకి అట్లానే అంటారులే అనుకున్నాడు. ''పెద్దింటి పిల్ల గదూ. అంతా ఇంతే. అలగా జనం మోస్తరు అడిగినెంటనే మంచమెక్కుతారా? కాసింత బెట్టుజేసి, యిట్టంలేనట్టు పోజు గొట్టి నాక, మూడో మడిసికి ఎవురికీ తెలవదను కుంటేనేగానీ ఒప్పుకోరు. వాళ్లకు పేమా, గీమా శానాగావాల. 'నువ్వంత దానివి, ఇంతదానివి' అని ఉబ్బేయాల. నీయసువంటి అందగత్తె ఈ లోకంలోనే లేదని డోలు గొట్టాల. అప్పుడుగానీ కాళ్లకాడికి రానియ్యరు'' అనుకున్నాడు. ''ఇయన్నీ జెయ్యాలంటే పున్నెకాలంకాస్తా గడిసిపోద్ది. దీన్ని తగులుకున్నోడు కూడా ఈ నుట్టుపక్కల ఏడా అగవడ్డంలా... ఇదే మంచి అదును. మళ్ళా సిక్కదు. ఇప్పుడు 'కయ్...కయ్'మన్నా పని పూర్తి అయినాక 'కుయ్...కుయ్'లాడతా నా కాళ్ళే నాకుద్దిలే'' అనుకుంటూ హెడ్విగ్‌మీద పడ్డాడు.

అప్పటికే ఆమె పెదాలమీద గట్టిగా కొరికినట్లు ముద్దుపెట్టాడు. ముద్దుకోసం వాడి ముఖాన్ని ఆమె ముఖం మీదకు తెస్తూనే, ఆమె చేతి రెండు వేళ్లతో వాడి కళ్లలో పొడిచింది. ఆమె వాడిగోళ్ళు వాడి కళ్లలో కస్సున దిగాయి. వాడు కుయ్యోమొర్రోమంటూ ఆమెను వదిలిపెట్టాడు. ఆమె వాడిపట్టునుంచి తప్పించుకుని, ఒక్క ఉదుటున లేచి ''వెర్నర్! వెర్నర్'' అంటూ బిగ్గరగా అరిచింది.

ఆ అరుపులు విన్న వెర్నర్ అడవిలోకి పరుగుపరుగున వచ్చాడు. హెడ్విగ్ పిలుపు వినిపించేసరికి వెర్నర్ స్నానంచేస్తూ వున్నాడు. ఒంటిమీద సరిగా బట్టలు లేవు. సబ్బు నురగ ముఖంనిండా వుంది.

వెర్నర్‌ను చూస్తూనే హెడ్విగ్ బావురుమంది. ''వీడు...వీడు...నన్ను...నన్ను...'' అంటూ గజగజ వణికిపోతూవుంది. వాణ్ణి చూస్తూనే వెర్నర్‌కు జరిగిన సంగతంతా అర్థమైపోయింది.

''ఎవరు నువ్వు?'' వెర్నర్ గర్జించాడు.

గోళ్లు గుచ్చుకుని మంటలెత్తుతున్న కళ్లను చేత్తో రుద్దుకుంటూ ఫ్రంజే భుజాలెగురవేశాడు. ''నేనేవుర్నా? నేనూమొగోన్నే! నువ్వీడికెందుకొచ్చినవో నేనూ అందుకే వొచ్చినా. ఇది నీ ముండేనా? భలే పసందుగా వుందిలే. కళ్లబడ్డది. కమరబడ్నా. దానికిది ఏంజేసిందో జూసినవా? నా కళ్ళలో బొడిసింది. దీనితల్లి...'' అంటూ బూతులు లంకించుకున్నాడు.

''నోర్మూయ్... నువ్వు ఎక్కణ్ణించి వచ్చావో చెప్పు. నేను లెఫ్టినెంట్ వెర్నర్ హార్న్‌ని అడుగుతున్నా'' అంటూ తిరిగి వెర్నర్ గద్దించాడు.

లెఫ్టినెంట్ అనే మాట వినడంతోనే ఫ్రంజేకు ముచ్చెమటలు పోశాయి. వెంటనే సైనిక పద్ధతిలో శాల్యూట్ కొట్టాడు. ''త....త...తప్పయింది సారూ. నువ్వు... నువ్వు ఇమానం నడిపేటోడివి గదూ...'' అంటూ నత్తి నత్తిగా మాట్లాడసాగాడు.

''ముందు నీ పేరు, రాంక్, రెజిమెంటు వివరాలన్నీ చెప్పు''

ఫ్రంజే అటెన్షన్‌లో నిలబడి శాల్యూట్ కొడుతూ వెర్నర్ అడిగిన వివరాలన్నీ చిలకపలుకుల్లా వల్లించాడు.

''నావెంట రా'' వెర్నర్ ఆదేశించాడు.

మరో పది నిమిషాల్లోనే లెఫ్టినెంట్ వెర్నర్, డాక్టర్ ముందున్నాడు. అప్పటికి ఆయన మదనసదనం పరిస్థితి గురించి ఫ్రాలాజర్‌తో చర్చిస్తూవున్నాడు. లెఫ్టినెంట్ కబురంపుతూనే బయటికి వచ్చాడు.

''ఇలా నేను ఒక సైనికుడిమీద ఫిర్యాదు చేయడానికి మీవద్దకు రావలసి వస్తుందనుకోలేదు సర్జన్! ఇతనికి మదనసదనం నిబంధనలేమీ తెలియవు''

''తెలియకపోవడమనే ప్రశ్నే లేదు... ఇక్కడికి చేరిన వెంటనే ప్రతి వ్యక్తికీ ముందుగా తెలియజెప్పేవి నిబంధనలే'' అంటూ, ''ఇంతకూ ఏం జరిగింది?'' అని ప్రశ్నించాడు డాక్టర్.

''ఇతను నా జంటగా వున్న హెడ్విగ్‌పై అత్యాచారం చేయబోయాడు''



ఈ మాటలు వింటూనే డాక్టరు భగ్గున మండిపోయాడు. కొంతమంది ఎందుకిలా రాక్ష సుల్లా ప్రవర్తిస్తారు? అన్నీ అమర్చి, అందమైన ఆడాళ్లనిచ్చి అనుభవించండ్రా అంటే, ఎందు కిలా తప్పుడు పనులు చేస్తారు, ఇడియట్స్'' అంటూ ఆగ్రహంతో చిందులేశాడు.

''ఇదంతా నిజమేనా?'' ఫ్రంజేను కోపంతో ప్రశ్నించాడు. లెఫ్టినెంట్ వైపు తిరిగి క్షమాపణ పూర్వకంగా మాట్లాడాడు ''ఇలాంటి సందర్భా లలో సమాధానం చెప్పుకునేందుకు ముద్దాయి కి కూడా అవకాశం యివ్వాలిగదా'' అంటూ.

''తప్పకుండా యివ్వాలి'' అన్నాడు వెర్నర్.

సర్జన్ అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్ప కుండా, తప్పుచేసినవాడిలా తల దించుకుని మౌనంగా నిలబడ్డాడు ఫ్రంజే.

డాక్టర్ వెంటనే అతనికి మెమో అందించా డు. ''నీవీ రాత్రికే ఇక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి. నీవు చేసిన పనికి నీవే సిగ్గుతో తలవంచుకో వాలి. నిన్ను నేనేం శిక్షించను, ఆ శిక్షించే పని మీకమాండరే చేస్తాడు. నిన్ను ఇక్కడినుండి పంపుతున్న తేదీ, టైం, నిన్నెందుకు పంపుతు న్నామో కారణం మాత్రమే నేనతనికి తెలియ జేస్తాను. నీవు అక్కడికి వెళ్ళిన తరువాత నీకు విధించబోయే శిక్షేమిటో తెలుసా? బహుశా నిన్ను డిస్మిస్ చేయవచ్చు'' అంటూ వివ రించాడు డాక్టర్.

టాంకు డ్రయివరు తలదించుకుని అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

''సారీ లెఫ్టినెంట్... నీ ప్రియురాలు ఎంత భయస్తురాలో అంత ధైర్యవంతురాలు. వాణ్ణి అదరగొట్టింది...'' అంటూ మెచ్చుకోలుగా అన బోయాడు డాక్టర్.

''అది వేరే విషయం. కానీ ఇక్కడ... మీ బోర్డింగ్ స్కూలులో మీ మామూలు క్రమశిక్షణ ను కొనసాగించడంలో మీకు ఆసక్తి వుందనుకు న్నాను'' అన్నాడు లెఫ్టినెంట్.

''ఈ టాంకు డ్రయివరులాంటి దొంగ గొర్రె లను వదిలించుకొనడంలో మాకు సాయపడి నందుకు చాలా థాంక్స్ లెఫ్టినెంట్! దురదృష్ట వశాత్తు ప్రతి మందలోనూ ఒక దొంగ గొర్రె వుంటూనే వుంటుంది. హెడ్విగ్ ఎంత అంద మైనదో అంత విశ్వాసపాత్రురాలు. ఆమెకు నా అభినందనలు చెప్పు''

''అవును... చాలా విశ్వాసంగల పిల్ల'' అంటూ వెర్నర్ డాక్టర్‌కు శాల్యూట్‌చేసి వెళ్ళి పోయాడు.

ఒక్కమాట కూడా మాట్లాడకుండా ఈ వ్యవ హారాన్నంతటినీ వింటున్న హెడ్‌మిస్ట్రెస్ ఫ్రా లాజర్, వెర్నర్ అక్కడినుండి వెళ్ళిపోయిన తరువాత పెదవి విప్పింది.

''మీరు చెప్పింది నిజమేనా డాక్టర్! ఆ పిల్ల ఇప్పుడు మీరు వెళ్లగొట్టిన సైనికుడి విష యంలోకంటే కూడా లెఫ్టినెంట్ దగ్గరే మొండిగా వుందనుకుంటా'' అని చెప్పింది.

ఈ మాటలకు డాక్టర్ పెద్దపెట్టున నవ్వాసా గాడు: ''మైడియర్ ఫ్రాలాజర్! వాళ్ళిద్దరూ ఒకరి కళ్లల్లోకి ఒకరు ఎంత ప్రేమగా చూసు కుంటారో నేను చూసినట్లుగా, నీవు గనుక చూసివుంటే ఈ మాట అనవు. వాళ్లు ఒకరి బాహువుల్లో మరొకరు యిమిడిపోయి తన్మయ త్వంతో, తమకంతో ముద్దులు కురిపించుకునే దృశ్యం నీవు చూసివుంటేనా...''

ఫ్రాలాజర్ ఇంకేమీ మాట్లాడలేదు. వాళ్ళిద్ద రిమధ్య డాక్టరు చెప్పే ప్రేమ వ్యవహారమంతా తాను చూసిందే. అయితే ఆ ప్రేమ డాక్టర్ అనుకునేంతగా సహజమైందని తాను భావించడంలేదు. వీళ్లిద్దరూ ఇతరులకు అను మానం కలగకుండా ప్రేమనాటకం ఆడుతు న్నారని ఆమె నమ్మకం. ఎవరికీ అంకెకురాని ఆ పిల్ల ముక్కూ ముఖమూ తెలియనివాడి వళ్ళో వాలి, వాడికి పూర్తిగా అంకితమై, సర్వ స్వమూ అర్పిస్తుందంటే నమ్మడానికి ఫ్రాలాజర్ సిద్ధంగాలేదు.

''సరే... మరో మాసంలో ఫలితం చూడు'' అన్నాడు డాక్టర్ నిశ్చయంగా.

''నా అనుమానం నిరాధారమైంది కావాలనే నేను అనుకుంటున్నాను'' అంది ఫ్రాలాజర్.

''నీ అనుమానం నిరాధారమే అవుతుంది. దానికి నేనేం విచారించను. లీసెల్, అన్నా మెటిల్డా కూడా తప్పకుండా బిడ్డల్ని కంటారు. డిస్మిస్ అయిపోయిన ఆ గాడిదకొడుకు మెటి ల్డా దగ్గర రెండు రాత్రులు పడుకున్నాడా? మూడు రాత్రులా?'' ప్రశ్నించాడు డాక్టరు.





ఫ్రాలాజర్ రిజిస్టరు చూసి "రెండు రాత్రులు" అని చెప్పింది.

"అదే రంభిగా వుండే ఫ్రంజేలాంటి మగాడికి రెండు రాత్రులు చాలు" అంటూ డాక్టరు రెండు చేతులూ కలిపి రుద్దుకోసాగాడు.

★ ★ ★

వెర్నర్ కుటీరానికి వచ్చేసరికి హెడ్విగ్ అతని కోసం ఎదురుచూస్తూ వుంది. ఆమె పూర్వం కంటే ఎక్కువ గంభీరంగా వుంది.

"నీవు ప్రశాంతంగా వుండు. ఆ వెధవ పీడా వదిలింది. వాడిహ నీకు కనిపించనే కనిపించడు"

" థాంక్స్ " అన్నది మెల్లిగా పెదాల చివరనుండి మాట్లాడుతూ, "డాక్టర్ వాణ్ణి యిక్కడ నుండి వెళ్ళగొట్టాడా?" - అని ప్రశ్నించింది.

" వెంటనే వెళ్ళగొట్టాడు. వాడికది కావాల్సిందే"

ఆ మాటలకు హెడ్విగ్ భుజాలెగురవేస్తూ అనమ్మతిగా అంది " ఏం... అతణ్ణి ఎందుకు పంపించి వేయాలి? పశు సంతానాభివృద్ధికి సంబంధించిన పశు సంవర్థనశాలకు మంచి అవటెద్దును పట్టుకొచ్చినట్టే వాణ్ణి యిక్కడకు పట్టుకొచ్చారు. ' నువ్వు మేం అప్పగించిన పశువును తప్పితే ఇతర పశువులను దాటగూడదు' అంటే ఆ అంబోతు ఊరుకుంటుందా? పశువులశాలలో వున్న ఆవులన్నిటినీ దాటడం తన హక్కనుకుంటుంది. అట్లాగే ఈ మకురుగొడ్డు గూడా మదన నదనంలోని ఆడపిల్లలందర్నీ అనుభవించడం తన హక్కనినుకుని వుంటాడు. ఒక వేళ నన్ను నీవుగాకుండా అతనే ఎంచుకుని వుండివుంటే అతనీరోజు చేసిన పనికి డాక్టర్ వాణ్ణి అభినందించి వుండేవాడు". అంది రోషంగా.

ఆ అమ్మాయి ఇలా మాట్లాడటంతో వెర్నర్‌కు చిర్రెత్తుకొచ్చింది "మరి, అట్లాంటప్పుడు రక్షించమని ఎందుకరిచావు?" అనహనంగా ప్రశ్నించాడు.

" అది నాకే చిత్రంగావుంది" అంది హెడ్విగ్.

ఆ సాయంత్రం ఫ్రంజ్‌బకేను వాళ్ళిద్దరూ మరలా చూశారు. అతను కారు ఎక్కుతున్నాడు. డాక్టరు అతన్ని స్వయంగా స్టేషన్‌కు తీసుకెళుతున్నాడు.

వెర్నర్, హెడ్విగ్‌లను చూసిన ట్యాంకుడ్రయివరు లెఫ్‌నెంట్‌కు శాల్యూట్ కొట్టాడు. హెడ్విగ్‌ను చూసి వంకరనవ్వు నవ్వాడు.

"అతను నిజంగా చాలా బావున్నాడు గదూ" వెర్నర్ అన్నాడు.

"ఉంటే వున్నాడులే వదపోదాం. మనకెందుకు?" హెడ్విగ్ అనహనంగా అంది.

"కొంతమంది ఆడాళ్ళకు ఎవడైనా ఒకటే, మగాడైతే చాలు " అని కటువుగా వ్యాఖ్యానించాడు వెర్నర్. హెడ్విగ్ అతని వైపు చురచురా చూసింది.

ఆ తర్వాత వెర్నర్ - హెడ్విగ్ ఆరోజంతా మరో మాట గూడా మాట్లాడుకోలేదు.

★ ★ ★

మదననదనంలోని ప్రణయ వాతావరణంలో ఒక్క కార్నేలియా తప్ప మిగతా అమ్మాయిలందరూ ఆనందం అనుభవిస్తూవున్నారు. హిట్లర్ యువజన సంఘనాయకురాలైనప్పటికీ ఆకర్షణ లేని ఈ అమ్మాయిని ఎవరూ ప్రేయసిగా ఎంచుకొనడంలేదు. ఆ అమ్మాయి బాల్యంనుండి అతికఠోరమైన, అతి పేదవాతావరణంలో పెరిగింది. స్కాలర్ షిప్పు మీదనే విశ్వవిద్యాలయంలో చదువుకుంది. ఆమెకు చదువు తప్ప మరో విషయం పట్టదు. అందరూ ఆ అమ్మాయిని 'పుస్తకాల పురుగు' అని అంటుండేవాళ్ళు. విద్యార్థి జీవితంలో చదువు తప్ప, విలాస జీవితం ఎన్నడూ ఎరగదు. ఆ అమ్మాయి డిగ్రీ తీసుకునేనాటికి యుద్ధం ఆరంభమైంది. శరీరసౌష్టవంగల మగాళ్ళందర్నీ యుద్ధం ఎగరేసుకుపోయింది. అందువల్ల ఆ పిల్ల జీవితంలో ప్రేమ, ప్రణయంలాంటి మాటలు చోటుచేసుకోలేదు. ఆ పిల్లగూడా తన యువశక్తినంతటినీ హిట్లర్ యుద్ధ ప్రచారానికే వెచ్చించింది.

జంతువుల్లోగానీ, మనుషుల్లోగానీ తమజాతిని పెంపు చేసుకుని శాశ్వతం చేసుకోవాలనే సహజ ప్రవృత్తి వుంటుంది. ప్రేమ అనేది కేవలం దాని వ్యక్తీకరణేనన్న డాక్టర్ ఊర్జర్ సిద్ధాంతంలో ఆ పిల్లకు గట్టి విశ్వాసం వుంది. మానవుల్లో ప్రేమ అంకురించడానికి సున్నిత

మైన, మానసికవరమైన రసభావదృష్టీ, భావ తీవ్రతా కారణమనే రెండో ఆలోచనే ఆ అమ్మాయికి లేదు. అంటే మనిషికి ఆహారం, నిద్ర ఎంత అవసరమో మైథునంగూడా అంతే సహజమైన ప్రవృత్తి అని ఆ పిల్ల గట్టిగా నమ్మింది. ఈ సహజ ప్రవృత్తి గనుక ఆ అమ్మాయి అనుభవంలోకి వచ్చి వుంటే నైతిక విలువలకు ఎలాంటి తావూ యిచ్చి వుండేదిగాదు. అయితే శారీరక వాంఛలను తీర్చుకోవాలనే మనోవికారం ఆ అమ్మాయికి ఎప్పుడూ కలగలేదు.

మదన సదనం ఏర్పాటు గురించి హిట్లర్ యువజనసంఘం మహిళాశాఖకు సర్క్యులర్ రావడంతో, అది చదివిన కార్నేలియా భావోద్రేకంతో చలించిపోయింది. అయితే, ఆ భావోద్రేకం ఇంద్రియ చాపల్యాన్ని తీర్చుకోవాలనేది గాదు. అమ్మాయిలను అర్జంటుగా అనుభవించి తల్లుల్ని చేయడం కోసం అందమైన, బలమైన యువకులందర్నీ బవేరియాలో మందకడుతున్నారన్న వార్త ఆమెలో ఎలాంటి లైంగికవాంఛనూ ప్రేరేపించలేదు. స్వచ్ఛమైన జాతిసృష్టిలో దేశసేవకు అంకితం కావాలని ఫ్యూరర్ యిచ్చిన పిలుపు ఉత్తేజంగా, కేవలం దేశభక్తి ప్రేరణతోనే ఆ అమ్మాయి స్వచ్ఛందంగా మదనసదనం చేరింది.

కొన్ని రోగాల్లాగే ఇంద్రియసుఖం గూడా పెద్ద అంటురోగం. కార్నేలియా కాలేజీలో ప్రాచీన సాహిత్యం బాగా చదువుకున్నది. ప్రేయసీప్రియుల విరహబాధ, ప్రణయసౌఖ్యం గురించేకాక పురుషులు దొరకని సమయాల్లో స్త్రీలే స్త్రీలను రమించే ప్రాచీనమైన అలవాట్లు గురించి కూడా ఆమెకు బాగా తెలుసు. మదన సదనం చేరిన తరువాత యువకులెవరూ ఎంచుకోని కన్యలు తమ జతగాళ్ళ రాకకోసం వేచిచూస్తూ కాలాన్ని ఎలా వ్యర్థం చేసుకుంటారో కార్నేలియా కళ్లారా చూసింది. జంటల ప్రణయ సల్లాపాలు, తోటల్లో తమకంతో ముద్దులు, రాత్రిళ్ళు రహస్య సమాగమాలు, దాని ఫలితంగా వాళ్ళ కళ్ళచుట్టూ ఏర్పడే నల్లని వలయాలూ చూసి భావోద్రేకానికి లోనయ్యేది. స్వలింగ సంపర్కంలో సిద్ధహస్తురాలైన ఫ్లిట్టర్, ఏ మగాడూ ఎంచుకోని కార్నేలియా తనకు బాగా పనికొస్తుందని ఆశించింది. అయితే ఈ అనాకారి పిల్ల ఆమె ఛాయలకు గూడా పొయ్యేదిగాదు.

గర్భాదాన కుటీరాలనుండి తిరిగి వచ్చిన అమ్మాయిలు వెల్లడించే రహస్యాలు విన్నప్పుడు కార్నేలియాఒంటరిగా కనేకలలు చెదరిపోయేవి. ఆపిల్ల తీవ్రమైన భావోద్రేకంతో చలించిపొయ్యేది. ఈ అమ్మాయిలందరూ మాతృదేశానికి సేవచేయడమేగాక అంతులేని ప్రణయ పారవశ్యాన్ని అనుభవిస్తూ వున్నారు. ఈ స్వర్గసుఖాలన్నీ అనుభవించాలనే ప్రగాఢ కాంక్షకు కార్నేలియా బానిస అయింది.

కార్నేలియా అంతటి మదన తాపానికి గురి అవుతున్నా ఎవరి ప్రేమదృష్టీ ఆ పిల్లపై పడలేదు. మదనుడు తన పూవింటితో ఏ ఒక్కరి ఎదలోనూ కార్నేలియా పట్ల ప్రేమను అంకురింపజేయలేదు. మదన సదనానికి కొత్తగా వచ్చే హీరోల ముందు పాపం, ఆ అమ్మాయి మూడుసార్లు నగ్నప్రదర్శనలిచ్చింది. కానీ ఏ ఒక్కరూ ఆ అమ్మాయిని ఎంచుకోలేదు. ఆమె విద్య, విజ్ఞానం, వినయ సంపద, అకుంఠిత దేశభక్తి ఇవన్నీ ఆ సైనికుల ముందు ఎందుకూ కొరగాలేదు. వాళ్ళంతా హృదయ సౌందర్యానికన్నా బాహ్య సౌందర్యానికే విలువ యిచ్చేవాళ్ళు. కండల్లూ, కైవారాలు కలిసి ఎర్రగా బుర్రగా వున్న కుర్రపిల్లలనే ఎంచుకొనేవాళ్ళు. తనను గొంగళిపురుగుకన్నా హీనంగా చూసేవాళ్ళు.

మదన సదనంలో తన విలువేమిటో కార్నేలియా గ్రహించింది. కాలేజీ డిగ్రీవున్న ఆ అమ్మాయి బాధతో కుమిలిపోయింది. తన మాతృదేశానికి అవసరమైన బిడ్డలను తానికనలేనని వాపోయింది. అయితే ఇంత బాధలోనూ ఆమెకు ఒకే ఒక ఓదార్పు ఏమిటంటే, డాక్టర్‌తో అడపాదడపా మాట్లాడడం. ఆయన అప్పుడప్పుడూ ఆ అమ్మాయితో విజ్ఞాన విషయాలమీద చర్చలు జరిపి ఆమె ఆనందంలో పాలుపంచుకునేవాడు. ఇంతమంచి శ్రోతను, అదీ విజ్ఞాన విషయాలను లోతుగా అర్థంచేసుకుని చర్చించగలిగిన శ్రోతను డాక్టరు యింతకు ముందెన్నడూ చూడలేదు. ఆ అమ్మాయికి గూడా విజ్ఞానఖని అయిన డాక్టరు అంటే ఆరాధన. తనపట్ల ఆ పిల్ల నీలికన్నుల్లో ప్రతిఫలించే అంతులేని ఆరాధనాభావం డాక్ట





రుకు ఏనుగెక్కినంత సంతోషం కలిగించేది. అపారమైన విజ్ఞాన శాస్త్ర పాండిత్యంగలవాడైనా డాక్టరుగూడా మనిషే.

రిక్రియేషన్ సమయంలో నిత్యం డాక్టరు, అసిస్టెంట్ హెడ్‌మిస్ట్రెస్ ఫ్లిట్టర్‌తో కలిసి అమ్మాయిల వ్యాయామ క్రీడలను చూడటానికి వెళ్ళేవాడు. ఆ సమయంలో ఆమె ఎప్పుడూ అమ్మాయిలతో పాటు నగ్నంగా వచ్చికమైదానంలో కనిపించేది. తుళ్ళుతూ, పేలుతూ హాస్యాలూ, అపహాస్యాలతో మైదానంలో విహరించే నగ్నసుందరీమణులంతా డాక్టరు రాకతో మూగనోముపట్టేవారు. దాంతో డాక్టరు గూడా అక్కడికెళ్ళడం తగ్గించుకొనేవాడు. చదువుల సరస్వతి అయిన, కార్నేలియా మదనసదనానికి రావడంతో, ఈ విరామ సమయంలో డాక్టరు ఎక్కువగా ఆమెతో విజ్ఞానశాస్త్ర చర్చలతోనే కాలం గడిపేవాడు. డాక్టరు ఆ అమ్మాయిని సరదాగా తనవెంట సరస్సు ఒడ్డుకు షికారుకు తీసుకెళ్ళినప్పుడు ఆ పిల్ల ఆనందపారవశ్యంతో పొంగిపొయ్యేది.

డాక్టర్ ఆరోజు సాయంత్రం ఆనంద సముద్రంలో ఓలలాడుతున్నాడు. తాను ప్రారంభించిన 'పుత్రకామేష్ఠి పథకం' సాధించిన ప్రగతిని ప్రశంసిస్తూ తనను అభినందిస్తూ, ప్రశంసలు కురిపిస్తూ బెర్లిన్ నుండి ఆయనకు ఉత్తరం అందింది. ఈ విషయం కార్నేలియాతో చెప్పి ఆనందించాలని ఎదురుచూస్తూ వున్నాడు.

కార్నేలియా కనిపించగానే డాక్టరు ముఖం ఆనందంతో వికసించింది. "మనం జయిస్తాం" ఆ అమ్మాయి రెండుభుజాలూ పట్టుకొని కుదిపివేయసాగాడు. డాక్టర్ చేయి తన భుజాలమీద పడగానే అంతకుముందెన్నడూ పురుషస్పర్శ ఎరుగని కార్నేలియా శరీరం జలదరించింది. తనువెల్లా పులకరించింది.

"నిజంగానే మనం జయిస్తాం." అని ఆ పిల్ల గర్వంగా చెప్పింది.

వాళ్ళిద్దరూ సంభాషణాస్రవంతిలో కొట్టుకొని పోతూ వున్నారు. డాక్టర్ తన భవిష్యత్ పథకాల గురించీ, కార్నేలియా తన భావిఆశల గురించీ తమతమ ఆలోచనల్లో మునిగిపోయి, సరస్సు తీరాన్ని వదలి అడవిలోపలికి చాలాదూరం వెళ్ళారు. ఆరోజు చాలా ఆహ్లాదకరంగా వుంది. ఉత్సాహాన్నీ ఉద్వేగాన్నీ కల్పిస్తూ వుంది. భూమి అంతస్సారాన్ని పీల్చుకొని పెరిగిన చెట్లు ప్రకృతి ప్రసాదించిన స్వతస్సిద్ధమైన సువాసనలను వెదజల్లుతూ సమస్త ప్రకృతినీ పులకరింపజేస్తూ జీవిత సంగీతాన్ని వినిపిస్తూ వున్నాయి.

ఒక ముళ్ళపొద వెనుక నేత్రానందంగా విరియబూసి పరిమళాలను వెదజల్లుతూ వున్నపూగుత్తులు మనసుకు మత్తెక్కిస్తూ వున్నాయి.

"ఆ పూలు ఎంత అందంగా వున్నాయో" పారవశ్యంతో అన్నాడు డాక్టర్.

"అవును... సర్జన్-మేజర్! ఆ పూల గుత్తులు మీ బల్లమీద అమర్చితే ఎంతో అందంగా వుంటుందిగదూ" అంది కార్నేలియా.

డాక్టరు సమాధానం చెప్పేలోగానే ఆ అమ్మాయి ముళ్ళపొదమీదుగా అవతలికి దూకింది. రెండుచేతులనిండా పూగుత్తులు తీసుకుని ఇవతలికి వచ్చింది. ముళ్ళపొదలు ఆమె శరీరాన్నంతటినీ చీరివేసాయి.

"ఇంతమితిమీరిన ఉత్సాహం పనికిరాదు కార్నేలియా! చూడు నీ శరీరం ఎలా చీరుకుపోయిందో" అంటూ అనునయించాడు డాక్టర్.

ఆ మాటలకు కార్నేలియా డాక్టరు కళ్ళలోకి సూటిగా చూసింది.

"ఇప్పుడు నేనెంత ఆనందంగా వున్నానో మీకు తెలియదు డాక్టర్! మీకోసం ఎన్ని బాధలనుభవించడానికైనా నేను సిద్ధం" అంది కార్నేలియా స్థిరసంకల్పంతో.

ముళ్ళు గీరుకొనడంతో ఎర్రగా కమిలిన ఆమె తెల్లని శరీరంపై ఆ ఎర్రని పూలకాంతి రెట్టింపయింది. పైపెచ్చు ఆ పూగుత్తులు ఆమె వక్షాన్నీ అనాకర్షణీయమైన శరీరపు ఒంపులనూ కప్పివేశాయి. ఆ పూగుత్తుల చాటునుండి ఆమె విశాల, విషణ్ణ నేత్రాలు రెప్పవాల్చకుండా డాక్టరునే చూస్తున్నాయి. ఆమె కన్నుల్లో ఏదో అభ్యర్థనా, ఆరాధనా గోచరిస్తున్నాయి. అందరూ అనుకున్నట్లుగా ఆమె అంత అనాకారి కాదని డాక్టర్ తలపోశాడు.

"పిచ్చిపిల్లా" అంటూ డాక్టరు కార్నేలియాను హృదయానికి హత్తుకున్నాడు. ఆ పిల్ల

డాక్టరు హృదయంమీద వాలిపోయింది. ఆమె హృదయంలోని ప్రేమ పెల్లుబికింది. మదనన దనానికి వచ్చే యువసైనికుల్లో పొరపాటున ఒక్కడు కూడా తనను ఎంచుకోరని ఆమెకు బాగా తెలును. వాళ్ళు తమ ప్రేయసిని ఎంచు కొనడానికి ఉండే సమయం కొద్దినిమిషాలు మాత్రమే. కొద్ది నిమిషాల్లో వాళ్ళు తమకోసం, తమ ఎదుట నగ్నంగా నిలిచిన స్త్రీ హృదయా న్నీ, మనోభావాలనూ, గుణగణాలనూ ఎలా అర్థంచేసుకోగలుగుతారు? అంతేగాదు. ఆ సై నికుల్లో ఏ ఒక్కడు కూడా తనకు అవసరంలే దు. తనను, తన మేథాసంపత్తినీ అర్థంచేసుకో గల వ్యక్తి తనే బిడ్డకు ఫలానా మనిషి తండ్రి అని సగర్వంగా చెప్పుకొనడానికి అర్హతగల వ్యక్తి తనకు కావాలి.

"మదననదనంలో సృష్టికార్యం కోసం జతక ట్టే స్త్రీ పురుమలిద్దరూ మంచి వయసులోనే వుండాలని మీరు నిజంగా భావిస్తున్నారా డాక్టర్? అది అత్యవసరమనుకుంటున్నారా? పశుసంవర్ధనశాలలో, ఉత్తమజాతి పశువుల సృష్టికోసం మంచి గిత్తను తెచ్చి కట్టేస్తాము. ఆ గిత్త ఏళ్ల తరబడి ఆ శాలలోనే వుండి, అక్కడికొ చ్చే పశువులన్నింటినీ దాటడంలేదా? దానివల్ల ఆ గిత్త పునరుత్పత్తిశక్తిగానీ, దానివల్ల పుట్టిన లేగదూడల వంశలక్షణంగానీ తగ్గు తుందంటారా?" అని ప్రశ్నించింది.

కార్నేలియా తన సుకుమారమైన అనురాగ భావాలను, ప్రేమపలుకులనూ శరీరధర్మ విజ్ఞానశాస్త్రంకింద సమాధి చేసింది. ప్రేమవా క్యాలను పలికే సాహసం ఆమెకు లేదు. అయినా ఆమె ప్రగాఢకాంక్ష పెదవులనుండి పెల్లుబికింది.

"ఏదో ఒకరోజు మీరు నన్ను మీదాన్ని చేసుకుంటారనీ, మీ బిడ్డకు తల్లినయ్యే అర్హత నాకుందని భావిస్తారనీ నేను ఎంతగా కాంక్షించానో తెలుసా డాక్టర్" అంటూ అతనిపై ఒరిగిపోయింది.

తన ఈ సాహసానికి భయపడిన ఆ అమ్మాయి తన చేతుల్లో వున్న పూలను వదిలి వేసింది. పూగుత్తులన్నీ నేలమీద పరచుకు న్నాయి. ఆ ఉద్వేగంలో ఆమె తలకట్టు జారి ముఖంపై పరదాలా పరచుకుంది.

డాక్టర్ ఆమె కటిభాగాన్నీ జఘనపు ఒంపు నూ మాత్రమే చూడగలిగాడు. అతనిలో కాంక్ష దావానలంలా రేగింది.

గాద్గికస్వరంతో 'కార్నేలియా' అంటూ అత ను ఆమెను అక్కున చేర్చుకున్నాడు. ఏళ్ల తరబడి పురుషస్పర్శ కోసం తపిస్తూ, ఎదురు చూసిన కన్యకు లభించిన ఈ అదృష్టాన్ని ఆమె జారవిడుచుకోలేదు. తొలి కౌగిలిలోని ఆనంద పారవశ్యం ఆమెకు బాగా తెలును.

"దేవుడు మనతో ఉన్నాడు" అంటూ కార్నే లియా డాక్టరు కౌగిలిలో కరిగిపోయింది. మైమ రచిపోయింది.

మదననదనంలోనివారంతా తమను తాము మరచిపోతున్నారు. తప్పతాగి మత్తుగా నిద్రపో తూ ఏపనీ చేయలేని సోమరిపోతులయ్యారు.

సార్జెంట్ ఒట్టో, సార్జెంట్ క్రమ్మీలీన్‌లకు ఈ మత్తు చాలా గమ్మత్తుగా వుంది. చేతనాచేతన స్థితి వారికి మహదానందదాయకంగా వుంది. తాము సైనికులమనిగానీ, దేశంకోసం యుద్ధం చేసేందుకు నియుక్తులైనామన్న విషయాన్ని గానీ వారు గుర్తుంచుకొనడంలేదు. యుద్ధాన్ని గుర్తుచేసే అంశమేదీ మదననదనంలో మచ్చు కైనా కనిపించదు. రోడ్డు పొడవునా దుమ్మురేపు తూ వెళ్ళే సైనిక శకటాలు కనిపించవు. ఆకా శంలో ఎగిరే విమానాల రొద వినిపించదు. కనీసం తాము సైనికులనడానికి గుర్తుగా ఒక్క సైనికదిరుసు గూడా పొడగట్టదు. సర్జన్-మే జర్ డాక్టర్లు ధరించే తెల్లబట్టలు ధరిస్తారు. సార్జెంట్లు మహా అయితే స్నానపు దుస్తులు వేసుకుంటారు. లేకుంటే మదననదనంలోని అమ్మాయిలలాగే వంటిమీద నూలుపోగైనా లేకుండా వుంటారు. ఇంతకుమించిన బూ తుల స్వర్గం యిక్కడ తప్ప భూతలంపై మరెక్కడా లేదు.

వెర్నర్ హెడ్విగ్ ఒకే గదిలో కలిసి కాపుర ముంటున్నా శారీరకంగా మాత్రం ఏకంకాలే దు. ఎవరి భావనా ప్రపంచంలో వారు వేర్వే రుగా వుంటున్నారు. తమ ప్రణయ రహస్యా లేవీ ఇతరులకు తెలియకుండా ఏకాంతంగా వుంటున్న ఈ జంట అంటే అక్కడున్న అంద రికీ గౌరవం. ఫ్రౌలాజర్‌కు మాత్రం వీళ్ల వ్యవ హారం బొత్తిగా నచ్చేదిగాదు. పైపెచ్చు వీళ్ళిద్ద రూ ఏదో ... ఆడుతున్నారని ఆమెకు





అనిపించేది. వాళ్ల రహస్యాన్ని భేదించడానికి ఆమె అనేకసార్లు వాళ్ల కుటీరం వెలుపల తచ్చాడి, వీలు దొరికినప్పుడల్లా లోపలవాళ్ళు ఏం చేసుకుంటున్నారో కనిపెట్టడానికి ప్రయత్నించేది. ఫ్రాలాజర్ గూఢచారి చర్యలు జరుపుతూ వున్న విషయాన్ని హెడ్విగ్ పసికట్టింది. చివరకు సర్జన్-మేజరు కూడా అనుమానించక తమను ఒంటరిగా వదిలేశాడు. ఫ్రాలాజర్ మాత్రం తమ గుట్టు రట్టుచేయాలని మాటు వేసి వుంది. తనపై టాంకు సైనికుడు అఘాయిత్యం జరపబోయిననాటినుండీ హెడ్విగ్ సూర్యస్నానాలు మానివేసింది. వెర్నర్‌తో గూడా చిరచిరలాడటం మానివేసింది. ఇప్పుడు వాళ్ళిద్దరూ మంచి మిత్రులైనారు కానీ ప్రేమికులుగా మాత్రం మారలేదు.

* * *

సైనికుల సెలవు ముగియవచ్చింది. ఇద్దరు సార్జెంట్లకూ, లెఫ్టినెంట్‌కూ మదనసదనంలో అదే ఆఖరు రాత్రి. ఒట్టో, అన్నా యిద్దరూ కలిసి బాగా తాగారు. తర్వాత పడకగదికి చేరుకున్నారు. అమ్మాయిలను మార్చే ప్రసక్తే లేదుగాబట్టి ఒట్టో తన ప్రేయసి మీద ఫిర్యాదు చేసే అవకాశమే లేదు. దొరకని దానికోసం వెంపర్లాడటంకంటే దొరికినదాన్ని సంతృప్తిగా అనుభవించడం మేలని భావించాడు.

కారల్, లీసెల్ జంటకు తమ ఆఖరు రాత్రి గడిపేందుకు మద్యంతో అవసరమే లేదు. ఈ మధుర ప్రణయానికి యిదే ఆఖరు రాత్రి. తిరిగి ఈ అనుభవం దొరుకుతుందో లేదో? వారిద్దరూ ఆనందపు లోతులు చూశారు. ఒకరి బాహువుల్లో ఒకరు సొక్కి సొమ్మసిల్లిపోయారు. కారల్ బాహువుల్లో లీసెల్ నిద్రలోకి జోగిపోయింది. తనను బల్లిలా కరుచుకుని నిద్రిస్తూన్న లీసెల్‌నే చూస్తూవున్నాడు కారల్. అతనికి నిద్రపట్టడంలా. తనకు యుద్ధమంటే అసహ్యం. అలాంటిది పాలకులు తనను బలవంతంగా యుద్ధజ్వాలల్లోకి ఈడ్చారు. ఈ వారంరోజులూ దానిని మరచిపోయి, ఇక్కడ ప్రణయ సుఖాలనుభవించాడు. తిరిగి ఆ యుద్ధజ్వాల తన మనసును మండిస్తూవుంది. వెన్నంటి కాల్చడానికి తరుముకొస్తూవుంది. పూర్వాశ్రమంలో తాను పొలం నమ్ముకుని బతికినవాడు పంటపొలమే సమస్త జీవులకూ తిండిపెట్టేదని భావించేవాడు. అలాంటి పంటపొలాలన్నీ దానిని నమ్ముకొని బతికే సమస్త జీవరాశినీ భస్మీపటలం చేసే యుద్ధాగ్ని తనను దాని దగ్గరకు లాక్కుంది. తాను ఎప్పుడూ ఎలాంటి సంకోచం లేకుండా, ఒక్కొక్కప్పుడైతే అసలు ఆలోచనే లేకుండా పైవారి ఉత్తర్వులను శిరసావహించేవాడు. తన భవిష్యత్తు అంధకారబంధురంగా కనిపించిన సమయాల్లో గూడా తాను ముందూ వెనుకా ఆలోచించకుండా తెగించి పోరాడేవాడు. ఆ తెగువే అతణ్ణి వీరుణ్ణి చేసింది. ఈ రాత్రి తన ముందున్న యుద్ధ కర్తవ్యాల గురించి తలచుకుంటే, ఆ భయంకరకృత్యాలు తననేమీ ఉద్రేకపరచకపోగా ఏవగింపు కలిగిస్తూవున్నాయి.

ఈ యుద్ధం ఎందుకు? జర్మనీకి అది సాధించిన అపార విజయాలు ఇంకా చాలవా? దాదాపు యూరప్ మొత్తాన్నీ జయించిందే! కోట్లాదిమంది యువకులు తనలాగే బలిష్ఠంగా, ఆరోగ్యంగా వున్నవాళ్లంతా ఈ యుద్ధాగ్నికుండంలో సమిధలుగా ఆహుతయ్యారే? ఈ బలిదానాలు ఇలా సాగవలసిందేనా? ఎందుకని? తన ఎదురుగా బట్టల బీరువాలో తగిలించిన తన డ్రెస్సుమీద మెరుస్తూవున్న సైనిక పతకాలను చూస్తూవుంటే తనకు అసహ్యమేసింది. ఆ పతకాలకు ఉన్న రిబ్బన్లు బెడ్‌లైటు వెలుగులో ఎర్రగా నెత్తుటి చారికల్లా మెరుస్తున్నాయి. తన వీరత్వానికి చిహ్నంగా బహూకరించిన ఈ పతకాలన్నీ 'నీవొక హంతకుడివిసుమా' అని గుర్తుచేస్తున్నట్లుగా వున్నాయి.

మానవ మారణహోమానికి చిహ్నమైన ఈ సైనిక దుస్తులను శాశ్వతంగా అవతల పారేసి, తన స్వగ్రామంలో తన బంగారుభూమిలో పంటలు పండించుకుంటూ, శాంతితో బతికే కాలం ఎన్నడు వస్తుంది? తన సర్వస్వాన్నీ సమర్పించి తనకౌగిలిలో హాయిగా ఆదమరిచి నిద్రపోతూవున్న ఈ అమాయక బాలికను తాను శాశ్వతంగా స్వంతం చేసుకొని, ఆమెతోనే తన శేషజీవితాన్ని గడపగలుగుతాడా? తాను పైవాళ్ల ఆదేశాలను తు.చ. తప్పకుండా పాటించి ఈ ముగ్ధబాలికకు గర్భాదానం చేశాడు. తన ప్రతిరూపం యిప్పుడీ అమ్మాయి

గర్భంలో రూపుదిద్దుకుంటూ వుండి వుంటుంది. తమకు పుట్టబోయే కొడుక్కు కారల్ అని పేరుపెడతానని లీసెల్ వాగ్దానం చేసింది. లీసెల్ ప్రసవించేనాటికి తాను ఎక్కడ వుంటాడో? అప్పటికింకా ఫ్రాన్సులోనే వుంటాడా లేక రష్యన్ రంగంలోకి వెళతాడా? అప్పటికీ తాను ఈ సార్జెంట్ పదవిలోనే వుంటాడా లేక ఆఫీసరు రాంకు సంపాదించు కుంటాడో? లేక ఏ విదేశీ భూభాగంలోనో సమాధి అవుతాడో... ఎవరికి తెలుసు? తన తలిదండ్రులూ, లీసెల్ వచ్చి చూడటానికి తన సమాధి అనేది అసలు వుంటుందా? దిక్కూమొక్కూ లేని ఎన్ని శవాలు పొలాలలో పడి కుళ్ళిపోతూవుంటే, వాటిమీదపడి కాకులూ గద్దలూ, అడవి జంతువులూ పీక్కు తింటూవుండటం తానెన్నిమార్లు చూడలేదు.

"పైశాచిక యుద్ధం" అంటూ కారల్ బిగ్గరగా అరిచాడు. ఈ అరుపుతో లీసెల్ భయంతో ఉలికిపడి లేచి పడకమీద కూర్చుంది. ఆమె నైట్ గౌను పట్టీ భుజం మీదినుండి జారిపోయింది. ఆమె బిగువైన, నున్నని స్తనం ఒకటి బయటపడింది. రేపు తన బిడ్డ చిన్నారి కారల్‌కు స్తన్యం ఇచ్చి పోషించే స్తనం అది.

"ఏమిటి? ఏమైంది కారల్?" అంటూ ఆమె తన రెండు బాహువులనూ అతని మెడకు పెనవేసింది.

"ఏం లేదు లీసెల్... మరేంలేదు- రేపు నిన్ను విడచి వెళ్లవలసివస్తుందిగదా అని ఆలోచిస్తున్నాను. నాకు బాధనిపించింది. నేనెంత బాధపడుతున్నానో నీకు తెలియదు లీసెల్" అన్నాడు కారల్ గాద్గదికంగా.

"నాకు తెలుసు కారల్, నాకు తెలుసు. నీకంటేగూడా నేను ఎక్కువ కుమిలిపోతున్నాను కారల్. నీవు తిరిగి యుద్ధరంగానికి వెళ్ళిపోతున్నావు. నిజమే కానీ, కనీసం నీవు నన్ను గురించి ఆలోచించనైనా ఆలోచిస్తావు. మరో ఆడదాన్ని ప్రేమించమని నిన్నెవరూ బలవంతం చేయలేరు. కానీ నా పరిస్థితి అదిగాదు కారల్. నేను మన బిడ్డ చిన్నారి కారల్‌ను ప్రసవించిన పిమ్మట ఈ మదననదనానికే తిరిగిరావాలి. వీళ్ళ దిక్కుమాలిన ఆదేశాలకు లొంగి మరొకడి పక్కలో పడుకోవాలి. అయినా, ఇంకొకర్ని నేను ప్రేమించను కారల్. నన్ను నమ్ము. నా బొందిలో ఊపిరున్నంత వరకూ నిన్నే... నిన్నే ప్రేమిస్తూవుంటాను కారల్. అయితే డాక్టర్ మాకు పదేపదే హితబోధ చేశాడు. ఏమనో తెలుసా?

"మీ శరీరంమీది కాదు. సైనికుల శరీరంలాగే మీ శరీరంగూడా మాతృదేశానికి చెందుతుంది. అని" అని చెబుతూ ఆ అమ్మాయి వెక్కివెక్కి ఏడ్వసాగింది. "ఇదంతా తలచుకుంటే నాకు బాధగావుంది కారల్. నేను నిన్ను కలవకముందు కంటే ఇప్పుడు ఇంకా ఎక్కువ కుమిలిపోతున్నాను. దేవుడు మనమీద దయతలచి ఈ యుద్ధాన్ని ఆపేస్తే బాగుంటుందిగదూ" అంటూ అమాయకంగా అడిగింది.

"అదే నేనూ అనుకుంటున్నాను" అంటూ కారల్ ఆమె కళ్ళను ముద్దుపెట్టుకున్నాడు.

ప్రేమోద్దీపనకు కన్నీళ్ళకంటె శక్తివంతమైన ఔషధం మరొకటి లేదు. మరోసారి వాళ్ళు గట్టిగా ఆలింగనం చేసుకున్నారు. వారి బిగికౌగిలిలో వారి తొలిప్రేమ బంధం వారికి తెలియకుండానే మరింతగా బిగుసుకుంది.

★ ★ ★

సీజ్‌ఫ్రైడ్ కుటీరంలో ఆ సాయంత్రం మామూలుగానే ఆరంభమైంది. తొలుత డిన్నర్, తర్వాత సంగీతం. హెడ్విగ్ తనకు బాగా నచ్చిన బాగా వచ్చిన బాణీకంటే ఈరోజు కొత్త బాణీ వాయిస్తూంది. ఈ సంగీతం ఆమెకు అంతబాగా రాదు. అందుకే పాటను గుర్తుచేసుకుంటూ కొంతసేపు ఆగుతూ వుంది. తరువాత తిరిగి ఫిడేలు వాయించ నారంభించి అంతలోనే ఆగిపోతోంది. ఆమె పరిస్థితి చూస్తే దారుణంగా కలత చెందినట్లు వుంది. అందుకే సరిగా వాయించలేకపోతున్నది.

"ఈరాత్రి నాకేమైందో నాకే తెలియడంలేదు. నా వేళ్ళు నా స్వాధీనంలో లేవు. ఫిడేలు సరిగా వాయించలేకపోతున్నాను... క్షమించు" అంది కావర స్వరంతో.

"బాగానే వాయిస్తున్నావుగా. నీచేతిలో ఫిడేలు అందమైన రాగాలు పలుకుతూవుంది. నేను మదననదనం వదలి వెళ్ళిన తరువాత గూడా ఈ రాగాలు నాకు వినిపిస్తూనే వుంటా





యి!" అంటూ హెడ్విగ్‌ను మాటలతోనే అనునయించాడు వెర్నర్.

"థాంక్‌యూ" అంటూ ఆ అమ్మాయి ఫిడేలు కిందపెట్టి లేచింది. బాల్కనీలోకి వెళ్ళి నిలుచుంది.

లెఫ్టినెంట్ ఆమెను అనుసరించాడు. వాళ్ళిద్దరూ కొద్దిదూరంలో పక్కపక్కనే పిట్టగోడలనానుకుని చీకటిలోకి చూస్తూ చాలాసేపు నిలుచుండిపోయారు. బయటనుండి విషాదకరంగా, లయబద్ధంగా వినిపిస్తున్న కప్పల బెకబెకలు మాత్రమే ఆ నీరవ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ వున్నాయి. ఆ నిశ్శబ్దం హెడ్విగ్‌కు భరించరానిదిగా వుంది. చివరకు ఆమే ఆ నిశ్శబ్దాన్ని భేదించింది.

"ఆకాశంలోవున్న చుక్కల పేర్లన్నీ నీకు తెలుసా?" అంటూ తలపైకెత్తి ఆకాశంలోకి చూస్తూ ఉండిపోయింది.

"ఎక్కువ భాగం తెలును. చుక్కలు రాత్రి పూట మా మార్గంకూడలి తెలియజెప్పే సంకేత చిహ్నాలని నీకు తెలుసా? నా సహ పైలట్లు ఎక్కువభాగం పగలే ఆకాశ యుద్ధంలో పాల్గొంటారు. నేనలాకాదు. మేము చేసేది హంతకవ్యాపారంగదూ! హత్యలకు రాత్రి పూటే అనువైంది. అందుకే రాత్రినే ఎంచుకుంటాను" అంటూ వివరించాడు వెర్నర్.

"నీవు చేసేవి హత్యలేనని నీవు అనుకుంటూ వుంటే, నీవెందుకు ఆపని చేస్తున్నట్లు?" ప్రశ్నించింది హెడ్విగ్.

ఈ ప్రశ్నకు వెర్నర్ వెంటనే సమాధానమివ్వలేదు. చివరకు ఇలా చెప్పాడు. "ఏపక్షాన పోరాడేవారైనా ఆత్మరక్షణ కోసం పోరాడేవారే. చంపడమో లేదా చావడమో ఒక్కటే వాళ్ళపని. నేనెందుకు ఆపని చేస్తున్నానంటే అది నాడ్యూటీ!" అతను డగ్గుత్తికతో తిరిగి ఆరంభించాడు: " నాజీవితం నాకేమీ మిగల్చలేదు. అది నిష్ప్రయోజనం. ఈ జీవితంనుండి విముక్తి పొందడానికి ఇంతకంటే సదవకాశం నాకెక్కడ లభిస్తుంది?"

హెడ్విగ్ మారుమాట్లాడలేదు. మౌనంగా అతని వైపు చూసింది. అతను ఆకాశంలో చుక్కలు లెక్కపెడుతూ వున్నాడు. ఆ నక్షత్ర కాంతిలో అతని ముఖం పాలిపోయినట్లు అందంగా, విషణ్ణంగా కనిపిస్తూవుంది. ఏదో ప్రమాదకరమైన విషాదశకునం ఆమెకు గోచరించింది. అతని ముఖంలోని ఏదో తెలియని భయం ఆమెను ఆవరించింది.

"లోపలికెళదాం, నాకు చలిగా వుంది." అంటూ తొవతీసింది. లోపలికెళుతూనే రెండుగ్లాసుల్లో మద్యం నింపింది. "ఉత్సాహ ఔషధం" అంటూ చిన్నగా నవ్వి ఓ గ్లాసు వెర్నర్‌కు అందించింది.

లెఫ్టినెంట్ గ్లాసు పూర్తి చేసి, దీర్ఘకాలం ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయాన్ని ప్రకటించే రీతిలో మెల్లిగా చెప్పసాగాడు- "నేను ఆలోచిస్తూ వున్నాను. నిన్ను నేను పెళ్ళి చేసుకోకుండా కోల్జ్ అడ్డుపడతాడని నీవు చెప్పింది బహుశా నిజమే. అత్యున్నత స్థానాల్లోవున్న మీ కుటుంబ మిత్రులను కూడా లక్ష్యపెట్టకుండా నిన్నిక్కడ పడేశాడంటే నిజంగా వాడు శక్తివంతుడే. నీ సమస్యకు ఒకే ఒక పరిష్కారముంది. ముందు నీవిక్కడ నుండి బయటపడాలి"

"నీవు ఆ కుక్కల సంగతి మరచినట్లున్నావు" హెడ్విగ్ గుర్తు చేసింది.

వెర్నర్ ఏ లంచాలకూ, ప్రలోభాలకూ లొంగకుండా ఆమలాన్ని రక్షించే కాపలా కుక్కలను గురించి మరిచిపోయాడు. పగలు బోనుల్లో వుండగా మాత్రమే ఆ రాక్షస జంతువులను చూశాడు. విశాలమైన, బలమైన భుజాలతో, దేనినైనా క్షణంలో చీల్చివేసే కోరపళ్లతో, మఠం దగ్గరకు వచ్చే సందర్శకుణ్ణెవణ్ణయినా భయంకరంగా అరచి అడ్డుకునే బలమైన ఆ పోలీసు కుక్కలకు క్రౌర్యమే తిండిగా పెట్టి పెంచివుంటారు.

" ఆ కుక్కలు ఫ్లిట్టర్‌నూ, డాక్టర్‌నూ మాత్రమే గుర్తిస్తాయి" అంటూ హెడ్విగ్ చెప్పసాగింది. "నేనిక్కడి దుస్సహమైన వాతావరణాన్ని భరించలేక ఒక సాయంకాలం పారిపోవడానికి ప్రయత్నించాను. ఇక్కడి పరిస్థితి నీకు బాగా తెలియదు. ఇక్కడ కొంతమంది అమ్మాయిలు చిత్తకార్తె కుక్కల్లా ప్రవర్తిస్తారు. ఈ వాతావరణం చూస్తే ఎవరికైనా పిచ్చెత్తుతుంది. నేను వీళ్ళతో కలవకుండా ఒంటరిగానే పార్కులో తిరిగేదాన్ని. పారిపోదామని పది అడుగులు ముందుకు వేశానో లేదో ఈ వేటకు

క్కలు నామీద విరుచుకుపడ్డాయి. వాటి బారి నుండి తప్పించుకొనడానికి నా తాతలు దిగొచ్చారు. ఒకే పరుగుతో ఇవతలకు పరుగెత్తి గేటు మూశాను''

''నేను కత్తుల్లో, తుపాకుల్లో తెస్తాను. నేను మంచి గురికాణ్ణి. వేటు వేస్తే ఆకాశంలో పక్షులైనా తప్పించుకోలేవు. ఈకుక్కలదేమిలెక్క. నా సత్తా ఏమిటో నీవే చూస్తావుగా పదపోదాం'' అన్నాడు వెర్నర్.

''మన మెక్కడకుపోతాం. నాకు కొరడా దెబ్బలు. నీకు కోర్టు మార్షల్ తప్పవు''

''కోర్టు-మార్షల్‌కు భయపడి నిన్ను రక్షించలేనంటావా?''

''వెర్నర్... నీకెలా చెప్పడమో నాకుఅర్థంగా వడంలేదు. నన్ను యిక్కడి నుండి తప్పించడం నీ తరంగాదు గద, దేవుడి తరంగూడాగాదు'' అంటూ విచారంగా తల వంకించి, తిరిగి చెప్పసాగింది. ''నీవు కాల్చే తుపాకీ మోతలూ, కుక్కల అరుపులూ వాళ్ళను లేపుతాయి. వాళ్ళు పరుగెత్తివచ్చి నన్ను పట్టుకుంటారు. నిన్ను అరెస్టు చేస్తారు. నన్ను యింకా యిప్పటి కంటే గట్టి కాపలాతో, నిఘాలో వుంచుతారు. నీకు తెలియదు వెర్నర్... నేను ఇక్కడికి చేరినప్పటినుండి, ఈ నరక కూపంలో నుండి తప్పించుకొనడానికి ఎన్ని మార్గాలోఆలోచించాను. ఏ ఒక్కటి పనికిరాలేదు. తప్పించుకొనే ప్రయత్నం వృథా'' అంటూ భావావేశంతో హెడ్విగ్ తాను కూర్చున్న కుర్చీ చేతులను సుతారమైన తన చేతి వేళ్ళతో గట్టిగా అదిమి పట్టుకుంది. ఆమెకు సమాధానం చెప్పడానికి మాటలు రాక వెర్నర్, కుర్చీకి బిగిసి పోయివున్న ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకున్నాడు. క్రమక్రమంగా వారిలో ఉద్వేగం తగ్గింది. కానీ ఏదో తెలియని ఉద్రేకం అతన్ని ఆవహిస్తూ ఉంది.

''చాలా పొద్దు పోతూవుంది. రేపు ఉదయమే ఇక్కడనుండి వెళ్ళిపోతున్నావ్ గదూ?'' అంటూ హెడ్విగ్ కొంత సందేహించి, అంతలోనే ఉద్రేకంతో అడిగింది. ''వెర్నర్ ఈ రాత్రి నాతో గడపడం నీ కిష్టమేనా?''

మదన సదనంలో వున్న ఈ వారంరోజులూ వెర్నర్ తమ జంటకు కేటాయించిన పడక మీద పడుకొని ఎరగడు. యుద్ధ రంగంలో సైనికుడిలాగే తన దుప్పటిని చాప చుట్టలాగా చుట్టుకుని కటిక నేల మీద పడుకునే వాడు. హెడ్విగ్ మాత్రం ఒంటరిగా పడకమీద పడుకునేది.

''నేనిక్కడ ఒంటరి దాన్నైనాను. ప్రేమ కోసం తపించిపోయాను. ఇక్కడ నా గోడు వినడానికి నమ్మకమైన మనుషులే లేరు. తరువాత నీవు వచ్చావు. నేను మనసుతీరా ఏడ్చేటప్పుడు తల ఆన్చడానికి కనీసం నీభుజమైనా దొరికింది'' అంటూ బాధపడింది హెడ్విగ్.

హెడ్విగ్ పరిస్థితిని వెర్నర్ అర్థం చేసుకున్నాడు. ఆమె ఒక్కతేగాదు. తానూ ఒంటరితనాన్ని అనుభవించినవాడే. ఒంటరితనంలో ఉండే వ్యథ తనకు తెలుసు. తన తల్లి చనిపోయినప్పుడు ఆనుకుని ఏడ్వడానికి ఒక్క భుజమన్నా ఊతం దొరక్క తాను పరితపించిపోయాడు.

వేదనతో దుఃఖిస్తున్న ఆమె ముఖాన్ని చిందరవందరగా కప్పివేసిన తలనీలాలను అతను సవరించాడు. ప్రేమగా ఆమె తలనిమిరాడు. అది సుహృద్భావ సంకేతమే అయినా, వాత్సల్యమంతా ఆమెపై కురిపించినట్లయింది. ఆమె తన చెక్కిళ్ళను అతని రొమ్ములో దాచుకుంది.

వెర్నర్ వెనక్కు తగ్గాడు. ''చలి చాలా బాగుంది. నీకు సంతోషం కలిగే పక్షంలో ఈ రాత్రంతా ఇద్దరమూ కలిసే ఏడుద్దాం'' అంటూ నవ్వడానికి ప్రయత్నించాడు.

''థాంక్ యూ'' అంటూ ఆమె ధారాపాతంగా స్రవిస్తున్న కన్నీళ్ళలో నుండే నవ్వింది.

ఆమె తాను బెర్లిన్‌నుండి తెచ్చుకున్న పలుచని సిల్కు బట్టను మాత్రమే వంటిమీద వుంచుకొని, మిగతా దుస్తులన్నింటినీ విప్పేసింది. అద్దంముందు కూర్చుని కురులు సవరించుకుంటూ వుంది. అప్పుడామెను పరకాయించి చూశాడు వెర్నర్. ఉల్లిపొరలాంటి సిల్కు గౌనులో నుండి ఆమె చిన్ని పొన్ని చన్నుదోయి సగం కనబడుతూ వుంది. తీర్చినట్లున్న ఆమె అవయవసౌష్టవం వెర్నర్‌ను తన్మయుణ్ణి చేసింది.

క్రీడల సమయంలో ఆమె నగ్నశరీరాన్ని వెర్నర్ పలుమార్లు చూసి వున్నాడు. నగ్నత్వం




అనేది మదననదనంలో ఆరుబయటి కార్యక్రమాల్లో విడదీయరాని ఓభాగం. అలాంటప్పుడు తమ కుటీరాల్లో ప్రేయసీ, ప్రియుల ఏకాంతంలో, ప్రియుని నన్నిధిలోఆమె నగ్నంగావుండదని ఎవరూ ఊహించి వుండరు. కానీ ఆమె ప్రతిరాత్రీ నైట్‌డ్రస్‌లోనే నిద్రపోయేది. చివరిరోజున తన అందాన్ని క్షణంమాత్రం ప్రదర్శించి తనకు కనువిందు చేయాలని ఆమె భావించిందని వెర్నర్ అనుకున్నాడు.

"అయితే ఇవిగో తీసుకో" అంటూ హెడ్విగ్ తన జడరిబ్బును విప్పి కొన్ని కురులను లాగి తలగడకింద వుంచింది.

ఒక గంటనుండీ తనకు పులకలెత్తిస్తూ కలవరం కలిగిస్తున్న ఆ సువాసన ఇప్పుడు హెడ్విగ్ వలపువలుకులతో కలసి సూటిగా హృదయాన్ని తాకుతూ వుంది. మైమరపించి, మత్తెక్కిస్తూ వుంది. వెర్నర్ ఇలాంటి తీయని మత్తు ముందెన్నడూ ఎరగడు. అందమైన ఆమె శరీరాన్ని తన చేతుల్లో పొదువుకుని గట్టిగా గుండెకు హత్తుకోవాలనే కాంక్ష అతనికి అనుకోకుండానే కలిగింది. తరువాత అతను మనసును స్వాధీనంలోకి తెచ్చుకుని, ఆమెకు దూరంగా జరిగాడు.

అతను దూరంగా జరిగేకొద్ది హెడ్విగ్ అతన్ని అనుకునే అతనివైపు దొర్లుతోంది. "వెర్నర్" అంటూ అతను ఊహించలేనంత తమకంలో, ప్రేమతో వినిపించీ వినిపించకుండా, "వెర్నర్ నన్ను నీస్వంతం చేసుకో" అంటూ అతనిమీద ఒరిగిపోయింది.

"హెడ్విగ్ నీకేమైనా పిచ్చిపట్టిందా?"

"అవును... పిచ్చేపట్టింది. మనల్ని బలవంతంగా ఇక్కడ వుంచిన ఆ దుర్మార్గులు వాళ్ళు ఆశించినట్లుగా మనం ప్రవర్తిస్తున్నామనే అనుకుంటారు. ఒకేగదిలో ఒకే పడక మీద యిద్దరు యువతీయువకులను కట్టిపడేస్తే, వారిలో అనుభవించాలనేకాంక్ష రేగుతుందని వాళ్ళకు బాగా తెలుసు"

వెర్నర్ ఆమె రెండు ముంజేతులూ పట్టుకుని తనకు దూరంగా జరిపాడు. "హెడ్విగ్... మనం మానసిక బలహీనతలకు తావివ్వగూడదు. మన సంకల్పం చెదరకూడదు. స్థిరచిత్తంతో వుండాలి. మనం ఇంతకుముందు అనుకున్న ప్రతిమాటనూ, ఒకరికొకరం చేసుకున్న ప్రమాణాలనూ గుర్తుతెచ్చుకో" అంటూ హితబోధ చేశాడు. "నేను ప్రతివిషయాన్నీ కూలంకషంగా ఆలోచించాను. నేను చెప్పేది ఒకటే మాట. 'నేను నీదాన్నే' అని. నేను గర్భం ధరిస్తే వాళ్ళు నన్ను కనీసం ఒక ఏడాదిపాటు ప్రశాంతంగా వుండనిస్తారు. బహుశా అప్పటికి ఈ యుద్ధం అంతంగావచ్చు. ఆ తర్వాత వీళ్ల పీడ వదిలించుకోడానికి ఏదో ఒకమార్గం దొరక్కపోదు. ఫ్యూరర్ నానుంచి ఏమికావాలన్నాడో అది నేను చేసినట్లు అవుతుంది గదా! ఆయన నిబంధనలను కూడా మనం పాటించినవాళ్లమవుతాం. అప్పుడు వాళ్ళకు విధేయతతో ప్రవర్తించామనే రుజువులు మనవద్ద వుంటాయిగా. ఒక జాతీయవీరుడు తన బిడ్డ తనకు కావాలంటే హిట్లర్ కూడా నిరాకరించలేడు" అంటూ హెడ్విగ్ తన నిశ్చయాన్ని వివరించింది.

హెడ్విగ్ తర్కమైతేనేం, మదనుడికి కూడా మరులుకొల్పగల ఓ సుందరి తనకుతాను అర్పించుకొనడానికి సంసిద్ధం కావడమైతేనేం, తాను ఆ అమ్మాయిని ముట్టుకోరాదన్న వెర్నర్ పూర్వనిర్ణయాన్ని మార్చుకొనేలా చేసింది. అయినా అతను ఇంకా నిగ్రహించుకొనడానికే ప్రయత్నిస్తున్నాడు. కానీ ఆ అమ్మాయి తన బాహుబంధాలతో సుడిగాలిలా అతన్ని చుట్టివేసి తన స్పర్శతో అతనిలో సెగలు రేపుతూంది.

హెడ్విగ్ ఆవేశంగా, బలంగా తన పెదవులను వెర్నర్ పెదవులతో చేర్చింది. కమ్మని మత్తేదో అతన్ని ఆవహించింది. అతను కూడా ఆ అమ్మాయిని గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు. పెదవిని పెదవితో కలిపి, చేతిని చేతితో కలిపి, కౌగిలిలో సొక్కిపోయి మధుర, మంజుల, ప్రణయసాగరంలో వారు తన్మయత్వంతో కరిగిపోయారు.

"హెడ్విగ్" అని సుతారంగా పిలిచాడు వెర్నర్. ఆ అమ్మాయి వక్షంలో తన ముఖం దాచుకుంటూ... "క్షమించు- నాకు నీవే మొదటి స్త్రీవి. ఇదే తొలి అనుభవం" అన్నాడు.

దానికి సమాధానంగా ఆ అమ్మాయి నుండి ఒక్క వేడి నిట్టూర్పు వినిపించింది. "నేను

చెడిపోయినదాన్ని వెర్నర్. నీవే నాకు మొదటి వాడివనీ, నాకిదే తొలి అనుభవం అనీ నేను చెప్పలేనని నీకు తెలుసు! కానీ నీవే ఆఖరు వాడివౌతావు వెర్నర్! నేను ఆఖరిశ్వాస విడిచే పర్యంతం నీవే నా చివరి ప్రియుడిగా వుంటావు. నేను ప్రమాణం చేసి చెబుతున్నాను. నీవు తప్ప మరొకరెవ్వరికీ నా జీవితంలో చోటువుండదు... ఉండబోదు. బలవంతంగా కూడా ఎవరికీ లొంగను, లొంగబోను. ప్రమాణపూర్తిగా ఇది నా నిశ్చయం" అంటూ తన స్థిరసంకల్పాన్ని వినిపించింది.

జీవితంలో ఎన్ని కష్టాలు,నష్టాలు సంభవించినా ప్రేమికుల ప్రమాణం సదా చిత్తశుద్ధితో, చిరస్థాయిగా వుంటుంది. అపురూపమైన వ్యక్తుల విషయంలో ఈ ప్రమాణం కేవలం నోటిమాటగానే మిగిలిపోదు. వారు దానిని త్రికరణ శుద్ధిగా పాటిస్తారు.

మరునాడు ఉదయమే వెర్నర్ తన స్థావరానికి తిరిగి వెళ్ళాలి. వెర్నర్,హెడ్విగ్‌లు యిద్దరూ భవిష్యత్తులో తాము కలుసుకోగలమనే ఆశతోనూ, కలవలేమేమోననే ఆందోళనతోనూ, ఆర్ధ్రత, ఆత్మీయత, అనురాగం ముప్పిరి గొనగా వీడ్కోలు పుచ్చుకుంటూ వుంటే, వెర్నర్‌ను అభినందించి వీడ్కోలు చెప్పిన డాక్టర్‌కు ఈ యిద్దరి విషయంలో ఎలాంటి అనుమానమూ కలగలేదు.

★ ★ ★

"మదనసదనం"లో జీవితం యథాపూర్వంలాగే సాగిపోతూ వుంది. పగలంతా క్రీడలు, రాత్రంతా ప్రణయం. కొత్తగా మరికొంత మంది సైనికులు వచ్చారు. గర్భదాన కుటీరాల్లో చాలా జంటలు జతకట్టాయి. హెడ్విగ్, లీసెల్, అన్నా, మెటిల్డాలను మాత్రం ఇతర సైనికుల పక్కల్లోకి పంపలేదు. గర్భం ధరించారో లేదోనని వీళ్ళ నలుగురినీ వైద్యపరిశీలనలో వుంచారు.

కార్నీలియా మాత్రం ప్రతిరోజూ ఎంపిక కోసం క్యూలో నిలబడుతూనే వుంది. కానీ ఏ సైనికుడూ ఆ పిల్లవైపు కన్నెత్తి చూడటంలేదు. ఆ పిల్లకూడా ఏ సైనికుడినీ ఆకర్షించడానికి ప్రయత్నించడమూ లేదు.

ఈ విషయం గురించే డాక్టర్ బెంగపెట్టుకున్నాడు. ఆ రోజు సాయంత్రం అడవిలో తన కోసం పూలగుత్తులు కోసుకుతెచ్చిన కార్నీలియా అన్నమాటలు అతని చెవిలో ఇంకా గింగురుమంటూనే వున్నాయి. "మీ బిడ్డను నాగర్భంలో నవమాసాలు మోసి కనడానికి నేనే అర్హురాలినని ఏదో ఒకరోజు మీరు భావిస్తారనే నా ఆశ" అని ఆమె ఆరోజు అన్నది. ఆ మాటలు పొరపాటున గూడా నిజం కాకూడదు. ఆ ఆకలి చూపుల పిల్ల మాటలే ఒకవేళ నిజమైతే ఏం జరుగుతుంది? కార్నీలియాను ఏ సైనికుడూ ఎంచుకోవడం లేదన్నసత్యం ఈ మఠంలోని నర్సులకూ తెలుసు. ఇకముందు గూడా ఆ పిల్లను ఎవడూ ఎంచుకోడనిగూడా వాళ్ళకు బాగా తెలుసు తాను ఎరక్కపోయి, బుద్ధిగడ్డితిని ఈ జంఝాటంలో యిరుక్కున్నాడు.

కార్నీలియాను చూస్తేనే డాక్టర్ ఏదో పెనుభూతాన్ని చూసినట్లు తప్పించుకుని తిరుగుతూ వున్నాడు. పూర్వం రిక్రియేషన్ సమయంలో ప్రతినిత్యమూ అతను షికారుకెళ్ళేవాడు. ఇప్పుడా షికార్లు పూర్తిగా మానివేశాడు. పొరపాటున షికారెళితే ఆ పిల్లతో ఎక్కడ మాట్లాడవలసి వస్తుందోనన్న భయం. అడవిలో ఒంటరిగాగూడా షికారెళ్లడం మానుకున్నాడు. అలా వెళ్ళినప్పుడల్లా కార్నీలియాలో తాను జరిపిన ప్రణయదృశ్యమే గుర్తుకువస్తూ వుంది. సర్జన్ - మేజర్ ఇదంతా తలపోసితలపోసి తనలో తానే మథనపడుతూ వున్నాడు.

హెడ్విగ్,వెర్నర్ కాపురం ఆశించిన ఫలితాన్ని యివ్వలేదని ఫ్రాలాజర్ తన దైనందిన పరిశీలనలో కనిపెట్టింది. ఈ విషయం వినడంతోనే డాక్టర్ వ్యక్తిగత ఆవేదనకు కొంత ఊరట కలిగింది. ఒకసారి హెడ్విగ్, వెర్నర్‌ల మధ్య సరసంగాక విరసమే గోచరిస్తూ వుందని తాను చెబితే డాక్టరు కొట్టిపారేశాడు. 'ఇప్పుడేమైందో చూశావా... నేను చెప్పిందే రైటు' అన్నట్లుగా ఫ్రాలాజర్ ఓ వంకర నవ్వు నవ్వింది.

"ఈ విషయంలో డాక్టర్‌తో నేను స్వయంగా మాట్లాడాలి" అన్నది హెడ్విగ్.

"ఇద్దరం కలిసేవెళదాం"- అంటూ ఫ్రాలాజర్ ధుమధుమలాడింది.

డాక్టరు గదిలోకి అడుగుపెడుతూనే జరిగిందేమిటో చెప్పడానికి హెడ్విగ్ తొందరప





డింది. "వెర్నర్, నేనూ మీ వద్ద అబద్ధం చెప్పాం డాక్టర్" అంది.

"అబద్ధమా, నాతోనా? దేన్ని గురించి?" -అంటూ ఆశ్చర్యంతో అన్ని ప్రశ్నలూ ఒకేసారి వేశాడు డాక్టర్.

"ఈ అమ్మాయి గర్భవతి కాలేదు" ఫ్రాలా జర్ ప్రకటించింది.

"ఓహో! ఇది చాలా బాధాకరమైన విషయం. చాలా బాధాకరం" అన్నాడు డాక్టర్.

"బాధాకరమైనా నిజమే డాక్టర్! వెర్నర్ నా ప్రియుడు కాదు... కాలేదు" హెడ్విగ్ చె ప్పింది.

డాక్టర్ ఫ్రాలాజర్‌కేసి చూశాడు. ఆమె కళ్లలో ఒకరకమైన పైశాచిక ఆనందం తాండవిస్తూ వుంది. 'నేనప్పుడే చెప్పాను. నీవు వినలేదు. అప్పుడే వినివుంటే ఈ ప్రమాదం తప్పేదిగదా. ఇప్పుడనుభవించు నీ ఖర్మ' అన్నట్లుందా చూపు.

"మాతో ఇంతనాటకం ఎందుకాడావు?" డాక్టర్ హెడ్విగ్‌ను గద్దించాడు.

"ఈ తప్పంతా నాదేనండీ. అసలు మీ పథకం అంటేనే నాకు ఏవగింపని మీకు తెలును. ఈ విషయంలో నా అభిప్రాయాన్ని నేనెన్నడూ దాచుకోలేదు. లెఫ్టినెంట్ హార్న్‌కు నిర్మొహమాటంగా చెప్పాను. అతడు ధీరోదాత్తు డు గనుక నా విశ్వాసాలను మన్నించాడు" అంటూ హెడ్విగ్ వివరించింది.

"కానీ అతను నీతో ప్రణయం నెరపుతున్న ట్లే నాకు నమ్మకం కలిగించాడు. జర్మన్ వైమా నికదళంలోని ఒక ఉన్నతాధికారి నాకు అబ ద్ధం చెప్పడం ఆశ్చర్యంగా వుంది" -అంటూ కోపంతో బుసకొట్టాడు డాక్టర్.

"అబద్ధం చెప్పమని నేనే అతన్ని బతిమా లాను డాక్టర్! అలాగైతే కొన్నివారాలపాటైనా నేను నామానాన విశ్రాంతిగా బతుకుతానని ఆశించాను" హెడ్విగ్ వివరించింది.

"సరే... నీవు చేయదలచుకున్నదంతా చేశా వుగా... నేను తలచుకుంటే నిన్నీ క్షణంలోనే శిక్షించగలను. కానీ మీ నాన్నగారి మీదున్న గౌరవంతో ఆ పనిచేయడం లేదు. నీవు చేసిన తప్పుకు శిక్షను నీవే స్వయంగా అనుభవించే టట్లు చేస్తాను. ఇప్పుడే మరొకడు నిన్ను ఎంచు కుంటాడు. వాడు వెర్నర్‌లాగా మానవత్వం, కరుణ, జాలి అంటూ ఆలోచించడు. ఆ పదాలకు అర్థాలేగాదు అసలా పదాలంటేనా ఏమిటో తెలియని మాంచి బలసిన మృగంలాంటి మనిషికి నిన్ను ఎరగా వేసి, నీ తిక్కతిన్నగా కుదిరిస్తాను. నీచేత ఆ పని చేయించితీర్తాను" అంటూ డాక్టర్ అగ్గిరాము డై భగ్గుభగ్గున మండిపోయాడు.

డాక్టర్ మాటలకు హెడ్విగ్ దిగులుపడింది గానీ ఆశ్చర్యపడలేదు. ఇది ఇలాగే జరుగు తుందని ఆమెకు తెలును. కానీ ఆమె తన చేతిలోని చివరి తురుపును గూడా ప్రయో గించాలనుకుంది.

"మరో విషయం మీకు చెప్పాలి సర్జన్-మే జర్! నేను ముక్కూ-ముఖం తెలియని ఎవడి తోనో పడుకోవడానికి ఎలా నిరాకరిస్తానో, అలాగే వెర్నర్‌నూ నిరాకరించిన మాటనిజం. అయితే అతను నాపట్ల చూపించిన గౌరవం, శ్రద్ధ, ప్రేమాభిమానాలు చివరకు నా హృదయాన్ని దోచుకున్నాయి. ఒక వారంరోజులపాటు ఒకే గదిలో అతని ఆత్మీక సహచరిగా జీవించిన తరువాత ఇప్పుడతన్ని నిజంగా ప్రేమిస్తూ వున్నాను" అని చెప్పింది.

ఇంతవరకూ ఫ్రాలాజర్ పెదాలపై కని పిస్తూన్న వంకరనవ్వు ఇపుడు డాక్టర్ పెదాలమీ దికి మారింది.

"నిజం ప్రమాణపూర్తిగా చెబుతూవున్నా ను" అంటూ హెడ్విగ్ ఉద్వేగ్నతతో అరిచింది. ఆ మాటలలోని చిత్తశుద్ధికీ, భావతీవ్రతకూ చివరకు డాక్టర్ గూడా చలించిపోయాడు.

"అలాంటప్పుడు నీవు మారావనీ, వెర్నర్ అంటే నీలో ప్రేమ జనించిందనీ అతని కెందుకు చెప్పలేదు. నీవు యిప్పుడు మాకు చెప్పడంలో అర్థం అతను నీకు కావాలనేనా?"

"అవును డాక్టర్... ఆయన నాకు తిరిగి లభిస్తే అంతకన్నా నాకు ఆనందం మరేమీ వుండదు డాక్టర్! నేను లెఫ్టినెంట్ వెర్నర్‌కు చెందాలనుకుంటున్నాను. త్రికరణశుద్ధిగా అతనినే వాంఛిస్తూ వున్నాను. ఆయనను పిచ్చిగా ప్రేమిస్తూ వున్నాను. నా ముఖంచూసి చెప్పండి... నా ముఖంలో మీకు కపటం కని పిస్తూవుందా? నేనింకా మీతో అబద్ధం చెబుతు

న్నానని మీరు భావిస్తున్నారా?'' అంటూ ఉద్వేగంతో ప్రశ్నించింది హెడ్విగ్.

ఈ మాటలువింటూనే డాక్టర్ కుర్చీలోనుండి చివ్వునలేచి అటూ ఇటూ పచార్లుచేయసాగాడు.అతనికి ఏంచేయాలో పాలుపోవడంలేదు. కల్నల్ ఓంకోల్ట్‌గాడిపీడ లేకపోతే ఈ పిల్లను వదిలించుకొనడం క్షణంపట్టదు. ఈ పిల్ల మూలంగా తనకు ఇబ్బంది పెరగడంతప్ప మరే లాభం వుండదు. ఈ పిల్లను యిక్కడినుండి పంపివేస్తే కల్నల్‌గాడు కొంపలంటుకుపోయినట్లు అంగలార్చుతాడు, నానాయాగీ చేస్తాడు.

"ఇది చాలా దురదృష్టకరం అమ్మాయ్! నీ పిచిపిచ్చి ఆశయాలతో ఈ గత్తరంతా నీవేకొని తెచ్చుకున్నావ్. ఇప్పుడు వెర్నర్‌ను పోగొట్టుకున్నందుకు భగ్నహృదయంతో బావురుమంటున్నావ్. ఇదంతా చాలా అసహ్యంగావుంది''

"డాక్టర్... మీరు హిట్లర్ ఆశయానికి న్యాయం చేయాలంటే ఒకే ఒక దారివుంది. వెర్నర్‌ను తిరిగి వెనుకకు పిలిపించండి. ఏ కారణంతోనైనాసరే లేదా జరిగిన నిజం చెప్పి అయినాసరే ఆయన్ను ఇక్కడికి రప్పించండి. ఈలోగా మీరు నన్నే ఇతర మగాడికి అప్పగించకుండా మరేశిక్షయినా విధించండి. మీరు విధించేశిక్షను వెర్నర్ ఇక్కడికి వచ్చేవర్యంతం నేను ఆనందంగా అనుభవిస్తాను'' హెడ్విగ్ ప్రాధేయపడింది.

ఈ జటిలసమస్యను పరిష్కరించడం ఎలాగో తెలియక డాక్టరు తికమకపడుతున్నాడు. దిక్కుతోచక గడ్డం రుద్దుకుంటున్నాడు.

"నేను మీతో ఒంటరిగా మాట్లాడాలనుకుంటున్నాను డాక్టర్'' అంది ఫ్రాలాజర్.

"అలాగే'' అంటూ ఓ క్షణం బయట వుండమని హెడ్విగ్‌ను కోరాడు.

ఫ్రాలాజర్ ఆవులిస్తే ప్రేవులు లెక్కించగల మనిషి. ఆమె అనుమానమే నిజమైంది. అందువల్ల ఆపిల్ల చెప్పినమాటలేం పట్టించుకోవద్దని డాక్టరుకు నూరిపోసింది. తాము ఇంతకుముందెన్నడూ ఫలానా సైనికుణ్ణి మదనసదనానికి పంపించవలసిందిగా కోరి పిలిపించిందిలేదని, అది తమ పనికాదనీ చెప్పింది. ఇంతవరకూ తాము అనుసరిస్తూవున్న నిబంధనలను ఉల్లంఘించడం పై అధికార్లకు విస్మయం కలిగిస్తుందనీ, ఇక్కడ నుండి తిరిగి వెళ్ళి ఇప్పుడే తన స్క్వాడ్రన్‌లో చేరిన లెఫ్టినెంట్ వెర్నర్‌ను తిరిగి ఇక్కడికి పంపవలసిందిగా అడగడం సైనిక నాయకత్వంలో ఇంకా గందరగోళం కలిగిస్తుందనీ, తాము అతనికి రెండోసారి అమ్మాయిని తార్చడానికి నాటకం ఆడుతున్నామని పై అధికారులు తమను తప్పుపట్టి దండించవచ్చుననీ చెప్పి డాక్టరును భయపెట్టింది.

డాక్టర్ ఊర్జర్‌కు తన సిద్ధాంతాలమీద అచంచల విశ్వాసం. అందుకే అతను చాలా మొండిగా వుంటాడు. అయితే జర్మన్ సైనిక బలగమన్నాగూడా అతనికి అంతులేని ఆరాధన.

లెఫ్టినెంట్ వెర్నర్‌ను తిరిగి పిలిపించే విషయంలో ఫ్రాలాజర్ వెలిబుచ్చిన అనుమానాలను వింటే అతనికి చిర్రెత్తుకొచ్చింది. "వెర్నరంటే ఏమనుకుంటున్నావ్? ఎంత గొప్ప వీరుడనుకున్నావ్? అతని విషయంలో అనుమానించేవారెవరూ ఉండరు. నీ భయసందేహాలు అర్థంలేనివి'' అని ఆగ్రహంతో అన్నాడు.

ఫ్రాలాజర్ నెరజాణ. ఎదుటివారి మనసు కనిపెట్టి, తియ్యగా మాట్లాడి, వాళ్ళను తన మాటమీదకి మరలించుకొనడంలో దిట్ట. సర్జన్-మేజర్ ఆవిడ చెప్పిన విషయాన్ని సరిగా అర్థం చేసుకోలేదనీ, తాననలు వెర్నర్ గురించే ఆలోచించలేదనీ, తాను చెప్పిందల్లా హెడ్విగ్ గురించేననీ సంజాయిషీ ఇచ్చుకుంది. ఈ అమ్మాయిని మదనసదనానికి పంపడంలో కల్నల్ ఉద్దేశమేమిటో, ఈ విషయంలో జరిగిన రగడంతా తనకు సవిస్తరంగా తెలుసుననీ, దాన్ని గురించే తాను ఆలోచిస్తున్నాననీ చెప్పింది. "ఇప్పుడీ పిల్లను ఎవరిపక్కలోకీ పంపకుండావుంటే కల్నల్ ఏమనుకుంటాడు? నేడో రేపో ఆయన ఇక్కడికే వస్తున్నాడుగదా! ఆయన అడిగితే ఏం చెబుదాం?'' అంటూ ఎదురుప్రశ్న వేసింది.

"అదంతా నాకు తెలుసు. ఈలోగా నీవు హెడ్విగ్‌ను వేరుగా ఉంచి పరీక్షిస్తూవుండు'' అంటూ ఆదేశించాడు డాక్టరు.

హెడ్విగ్ విషయంలోనే డాక్టరు బుర్ర వేడెక్కింది. ఇక ఇతర అమ్మాయిల ఆరోగ్య పరిస్థితి గురించీ, ప్రత్యేకించి కార్నీలియా గురించే





ఫ్రాలాజర్‌ను విచారించే సాహసం చేయలేకపో యాడు డాక్టర్.

★ ★ ★

డాక్టర్ భయపడ్డట్టే జరిగింది. మరి పదిహే నురోజుల పిమ్మట ఫ్రాలాజర్ అతనిగదికి వచ్చి లీసెల్, అన్నా కార్నీలియాగూడా గర్భవ తులయ్యారని చెప్పింది. "కార్నీలియా విష యమే నాకు చిత్రంగావుంది. ఆ పిల్లను కన్నెత్తి చూసినవాడేలేడు. కానీ ఆపిల్ల కడుపు తోవుంది. కడుపు ఎలా అయ్యిందో, ఎవడు చేశాడో చెప్పమని ఆ పిల్లను నయానాభయానా అడిగిచూశాను. ఆ పిల్ల ససేమిరా పెదవి విప్పడంలేదు. కానీ ఈ విషయంలో నాకు ఒకే ఒక అనుమానంవుంది. ఆరోజు మీరు బల వంతంగా బయటకు గెట్టిన సైనికుడే ఈ పిల్లకు కడుపుచేసి వుండవచ్చునని అను కుంటున్నాను"

"ఎవరు... ఒకే యేనా?" అంటూ ప్రశ్నించా డు డాక్టరు. ఈ పేరు ప్రస్తావనకు రావడంతోనే డాక్టరు ముఖం విప్పారింది. ఈ గండం తప్పించుకునే మార్గం దొరికినందుకు అతని ముఖాన ఒక హాసరేఖ మెరిసింది.

"అవునుసార్... అప్పుడు హెడ్విగ్ వెంటప డ్డాడే, వాడే. అప్పుడు వాణ్ణి హెడ్విగ్ ఛీకొ ట్టింది. ఎవడూ ఎంచుకోని ఈ పిల్ల బహుశా వాడికి లొంగివుంటుంది"

"బహుశా కావచ్చు" అంటూ తల ఊపాడు డాక్టర్. "ఈ విషయంలో కార్నీలియాను బాధ పెట్టి ప్రయోజనం లేదు. ఆ పిల్లను నా దగ్గరికి పంపు. ఏంచేయాలో నేను ఆలోచిస్తాను" - అని చెప్పాడు.

మరికొన్ని క్షణాల తరువాత కార్నీలియా తనకు గర్భదానం చేసిన డాక్టర్ ఊర్జర్ ఎదుట నిలిచింది. అడవిలో ఆ పూలగుత్తులు కోసిన సాయంత్రం, డాక్టరు పొందు అనుభ వించిన తరువాత ఆ పిల్ల డాక్టర్ ముందు ఏకాంతంగా నిలవడం యిదే మొదలు. ఆమె ప్రేమగా చూస్తూ డాక్టర్ వద్దకు రాబోయింది. డాక్టర్ ఒక్క నంజ్ఞతో ఆమెను దూరంగా ఆపా డు.

"నన్నుచూసి వళ్ళు మరిచిపోకు. సక్ర మంగా ప్రవర్తించు. ఇక్కడ నేనొక అధికారిని. ఈ మఠంలోకి వచ్చే సైనికుల ప్రణయకాంక్ష తీర్చడానికి వచ్చిన కన్నెపిల్లవు నీవు. మన యిద్దరిమధ్య జరిగిన ప్రణయ కలాపాన్ని మన యిద్దరికే తప్ప మరెవ్వరికీ తెలియని వ్వకు. ఏమైనా నీ కోరిక నెరవేరిందిగదా! ఆ రహస్యాన్ని కాపాడే బాధ్యతగూడా నీదే... ఏమంటావు?" డాక్టరు అడిగాడు.

"ప్రమాణ పూర్తిగా ఆ రహస్యాన్ని మూడో మనిషికి తెలియనివ్వను" అంటూ ఆ అమ్మాయి తిరిగి ప్రమాణం చేసింది.

"గుడ్ నీ గర్భానికి కారణం యిక్కడ ఒక అమ్మాయితో అసభ్యంగా ప్రవర్తించి వెళ్ళగొ ట్టించుకున్న సైనికుడేనని ఫ్రాలాజర్ నమ్ము తూవుంది. ఆమె అనుమానం నిజమేనని నిన్ను చెప్పమని నేను అనడం లేదు. ఎందు కంటే నేను అబద్ధాన్ని క్షమించలేను. ఆమె అనుమానం ఆమెకే వుండనీ. దాన్ని తీర్చవల సిన అవసరం మనకు లేదు. ఆమె అజ్ఞానాన్ని అలాగే కొనసాగనిద్దాం. అసలు నిజాన్ని మన యిద్దరిలోనే దాచుకుందాం. ఇక నీవు వెళ్ళవ చ్చు" అన్నాడు డాక్టర్.

"అలాగే డాక్టర్" అంటూ నమ్రతతో చె ప్పింది కార్నీలియా. ఆమెకు కన్నీళ్ళు ఆపు కుందామన్నా ఆగడం లేదు.

కార్నీలియా మీద డాక్టరుకు జాలికలిగింది. ఓదార్పుగా ఒక్కమాటైనా చెప్పకుండా పంపివే యడం దారుణమనుకున్నాడు. కుర్చీలో నుండి లేచి ఆమె వద్దకు వెళ్ళి రెండుచేతు లూ ఆమె భుజాలమీద వేశాడు.

"నీ కోర్కె నెరవేరింది కార్నీలియా! మన మాతృభూమి నీకు కృతజ్ఞతలు చెప్పు కుంటుంది" అని అన్నాడు.

"మరి మీరు డాక్టర్?"

"ఆఁ... నేను కూడా నీకు కృతజ్ఞుడినే"

"హెన్రిక్" అంటూ ఆ అమ్మాయి అరి చింది. గుండె లోతుల్లోనుండి వచ్చిన పిలుపు అది. "నాకు నమ్మకముంది. మనం చేసిన పనికి మీరు ఏదోఒకరోజు గర్విస్తారు డాక్టర్" అంటూ ఉద్వేగంగా మాట్లాడసాగింది.

"ఇకచాలు" అంటూ ఆ అమ్మాయి ఇంకే మి మాట్లాడుతుందోనన్న భయంతో మాట్లాడ కుండా చేశాడు. "గర్భవతులకు కేటాయించిన

భవనంలోకి నిన్ను పంపుతాను. నేను చెప్పిందంతా గుర్తుంచుకొని ప్రవర్తించు. ఇక నీవు వెళ్ళవచ్చు" అంటూ ఆ అమ్మాయిని పంపివేసి, చేతులు దులుపుకున్నాడు డాక్టర్.

★ ★ ★

లెఫ్టినెంట్ వెర్నర్ హార్న్ విమానం స్థావరంనుండి అందంగా పైకి లేచి వెనువెంటనే నింగికెగిరింది. విమానం విమానాశ్రయం చుట్టూ వలయంగా తిరుగుతున్న ప్రతిసారీ అతను తన కింద భూమిమీద పరచుకొని వున్న ప్రకృతి దృశ్యాలను ఆనందంగా తిలకిస్తూవున్నాడు. వచ్చని పట్టుకుచ్చులాంటి పచ్చిక మైదానం. నల్లగా ముద్దల్లాగా కనిపిస్తూన్న చెట్లు, నీలి రిబ్బనులాగా గోచరిస్తూవున్న నది.

అవిగో, చేపలు పట్టే వలలు నదిమీద విసురుతున్నారు. అక్కడికి యాభై బారల దూరంలో నిలబడి ఎర్నా నదికేసే చూస్తూ వుంటుంది. జర్మనీ నుండి తిరిగివచ్చిన తరువాత అతను ఎర్నాను చూడ్డంపడలేదు. నరానరి తన స్క్వాడ్రన్‌లో చేరిపొమ్మని ఉత్తర్వులందుకున్న వెర్నర్ ఎర్నా కోరినరీతిగా వాళ్ళయింటికి వెళ్ళలేకపోయాడు. పాపం ఎర్నా చాలా బాధపడుతూ వుంటుందనుకున్నాడు... కానీ తాను తిరిగి తన పాత యూనిట్‌లోకి రావడం మాత్రం చాలా ఆనందంగా వుంది. ఇప్పుడు గనుక తాను ఎర్నాకు దొరికివుంటే తనను అడ్డదిడ్డమైన ప్రశ్నలతో ముంచెత్తేది. ఇప్పుడా ప్రమాదం తప్పిపోయింది. ఎర్నా అంత తెలివైందేమీ కాదు. కానీ అందరు ఆడపిల్లల్లాగే ఆ అమ్మాయికి గూడా తాను ప్రేమించిన మగాడి మనసులోని భావాలను పసికట్టగల దివ్యదృష్టి వుంది. సెయింట్ జర్మయిన్‌లో హెడ్విగ్ పక్కన నిలబడితేనే తానెక్కడ ఆ అమ్మాయిపై మనసు పడతానో అని ఈర్ష్యతో వేగిపోయింది. మదనసదనంలో జరిగిన సంగతంతా యిప్పుడు ఎర్నాకు తెలిస్తే, అక్కడ తాను ఈర్ష్యపడిన పిల్లే తనకు సవతిగా దాపురించిందని పసిగడితే, ఇప్పుడేం చేస్తుంది...?

అతని మనసులో ఎర్నా ఓ క్షణం మెరుపులా మెరిసింది.

అప్పుడు అతని విమానం ఆ అమ్మాయి వుండే భవనంపైగా ఎగురుతూ వుంది. అదే భవనం నదికి ఎదురుగా టెర్రాస్. ఆ జ్ఞాపకాలు ఒక్కక్షణమే. కానీ అతని మనస్సంతా ఇంకా మదనసదనంలోనేవుంది. కామకేళీ మందిరంగా మార్చబడిన క్రైస్తవ మఠంలో తాను చేసిన ఘనకార్యాలూ, ఆ మఠంలో 'పుత్రకామేష్టి' కోసం మందలుగా తోలబడిన అమాయకపు కన్నెపిల్లలు, అన్నీ అతనికి గుర్తువచ్చాయి. పాపం... అకుంఠితమైన భక్తిశ్రద్ధలతో సైనికులను ఆత్మాహుతికోసం యుద్ధాగ్నిగుండంలోకి ఉరికిస్తున్న చందంగానే ఆ ముగ్ధబాలికలను కామాగ్నిగుండంలోకి గుడ్డిగా నెడుతున్నారు...

అతను తిరిగి నది ఉపరితలాన్ని చూశాడు. వందలాది జలకన్యలు నయ్యాటలతో మధిస్తే నురగలుకక్కినట్లుగా వుందా నది. సాయంకాలపు సూర్యాస్తమయ ప్రశాంత సుందరదృశ్యం ప్రతిఫలిస్తూన్న ఆ నదిలో హెడ్విగ్ వివర్ణమైన పాలిండ్లు తెల్లకలువల్లా తేలియాడుతున్నట్లు అనిపించిందతనికి. ఆ ఊహరాగానే హెడ్విగ్ ఫిడేలునాదం శ్రవణపేయంగా తిరిగి ప్రతిధ్వనించింది. ఇంద్రజాలికుని మంత్రదండంలాంటి ఆమె కమానుకట్టె కింద మొత్తం కుటీరమే మానవాత్మలాగా ప్రతిధ్వనించేది.

హెడ్విగ్... హెడ్విగ్... హెడ్విగ్! అతను ఆమె పేరును బిగ్గరగా, మాటిమాటికీ, అతని విమానం ఇంజను లయకు తగినట్లుగా తారక మంత్రంలా జపించసాగాడు. అతను మదనసదనం నుండి తిరిగివచ్చిన క్షణం నుండీ ఆమె సుకుమార సుందర శరీరమే అతని కనుల ముందు నిరంతరం ప్రత్యక్షమవుతూవుంది. ఆమె గుండెచప్పుడూ, ఆమె నగ్నశరీర స్పర్శలోని వెచ్చదనం అతనికి అత్యంత ప్రీతిపాత్రమైనవిగా సదా గుర్తుకొస్తున్నాయి.

"అనాగరికం, అసహ్యం" అంటూ ఎర్నా ఒకసారి అన్నది. అది నిజంకాదు. సౌందర్యం లేని ఏ ప్రాణీ ఎంత విశ్వాసం కలిగినదైనప్పటికీ గుర్తుండదు. "అద్భుత రహస్యం" అని ఎర్నా ఒకప్పుడంది. కానీ హెడ్విగ్ మాత్రం ఈ అద్భుత రహస్యాన్నంతటినీ తనముందు విప్పివరిచింది. ఆమె ఓ ప్రేమాభిదేవత. ఆమె తనను పూర్తిగా భిన్నమైన మనిషిగా




# ULIPలో ప్రతి సంవత్సరం-రూ. 4,800 పది సంవత్సరాలకు రూ. 1,13,156+ అవుతుంది!*

* యు.టి.ఐ. యొక్క యూనిట్ అనుబంధిత భీమా పథకం 1971 (ULIP) వల్ల 20% వరకూ మీకు పన్ను పొదుపు లభ్యమౌతుంది. ప్రతి సంవత్సరం రూ. 6000/-ల మదుపుపై - మీరు రూ. 1200/- పొదుపు చేస్తారు. ఆ విధంగా పది సంవత్సరాలకు ప్రతి సంవత్సరం రూ. 4800/- చొప్పున ఫలప్రదమైన మీ చెల్లింపులు అధికమౌతూ వుంటాయి.
'15 సంవత్సరాల పథకం'లో ఒకో సంవత్సరానికి రూ. 4000/-లు మదుపు చేయవలసి వుంటుంది. (పన్ను పొదుపు రూ. 800/-, ఫలప్రదమైన చెల్లింపు రూ. 3200/-)

దీనిపై - ULIP - పన్ను పొదుపుతోపాటు, యూనిట్స్ ద్వారా లభించే నమ్మకమైన రాబడి, జీవిత భీమా ఆకస్మిక ప్రమాదాల కవరు మరియు మెచూరిటీ బోనస్ ప్రతిపాదిస్తోంది. సురక్షిత మదుపుకు అవకాశం ఏర్పరచడమేకాక - ఏ ఇతర పథకమూ ప్రతిపాదించని బహువిధ లాభాలను ఈ పథకం అందజేస్తోంది.

ULIP గురించి, యు.టి.ఐ. యొక్క ఇతర పథకాలకు సంబంధించిన వివరాలకు - మా ఏజెంట్లు, ముఖ్య ప్రతినిధులు, ఎఎన్‌జడ్ గ్రిండ్లేస్ బ్యాంక్, స్పెన్సర్ & కో., స్టాప్ & షాప్ చెయిన్ స్టోర్స్ (మద్రాసు) లేదా పంచవటి సూపర్ మార్కెట్ (హైదరాబాద్)ను సంప్రదించండి.

*యూనిట్ అనుబంధిత భీమా పథకం*



## UNIT TRUST OF INDIA

(A Public Sector Financial Institution)
H.O. Bombay 400 020.

**Regional Office:** 45, Second Line Beach, Madras 600 001. Ph: 587433, 580938.
**Branch Offices: Hyderabad:** 203/204, Moghul Court Complex, II Floor, Basheer Bagh, Hyderabad 500 001. Ph: 240030 • **Vijayawada:** 29-3-12, Venkateshwara Rao Street, Near APCO Bhavan, West of Rehman Park, Governorpet, Vijayawada 520 002. Ph: 63964.

**Our Chief Representatives in Andhra Pradesh** ☐ ADILABAD • **Sanwal Ram Sah,** Ph: 91 (PP) ☐ ANANTAPUR • **V.L. Narayana,** 3/217, 3rd Road, New Town, Anantapur 515 004 ☐ CUDDAPAH • **A.R. Krishna Reddy,** Ph: 2701 ☐ EAST GODAVARI • **P. Venkataramana,** Ph: 76047 ☐ GUNTUR • **K.B. Tilak,** Ph: 24964, 31839 ☐ KARIMNAGAR • **T. Ahalya Sreenivas,** Ph: 312 ☐ KHAMMAM • **G. Amarnath,** Ph: 8711, 8709 ☐ KURNOOL • **T. Seetharamaiah,** Ph: 22335 (PP) ☐ MEDAK • **P.V. Krishna Reddy,** Ph: 2820 ☐ MEHABUBNAGAR • **N. Venkatanarayana,** H. No. 10-87, B.R. Compound, Jadcherla 509 301 ☐ NALGONDA • **M. Shankar Gupta,** Ph: 545 ☐ NELLORE • **A. Sathyanarayana,** Ph: 22002 ☐ NIZAMABAD • **D. Narasaiah,** H. No. 5-5-18, Behind Tahsil Office Road, Khaleelwadi, Nizamabad 503 003 ☐ PRAKASAM • **M.V. Ramanaiah,** Ph: 3337, 3244 ☐ RANGAREDDY • **S. Veeraraghavalu,** Govinda Krupa, 26-75, Safilguda, Secunderabad 500 047 ☐ VISAKHAPATNAM • **C. Narayanaswamy,** Ph: 63116 ☐ VIZIANAGARAM • **M.S.N. Sarma,** Ph: 2666 (PP) ☐ WARANGAL • **B.S.N. Murthy,** Ph: 8631 ☐ WEST GODAVARI • **Y. Somasundara Rao,** Ph: 2440.

Sista's-UTI 1537 90TE A

మార్చింది. తన సహచరులు తమ ప్రియు రాండ్రకు సుదీర్ఘమైన ప్రేమలేఖలు రాస్తూ వుంటే చూసి తాను ఫక్కున నవ్వేవాడు. ఇప్పు డిక అలా నవ్వలేకపోతున్నాడు. శరీరాన్నీ ఆత్మనూ ఒకరు మరొకరికి అంకితం చేయడ మంటే ఏమిటో ఇప్పుడతనికి అర్థమైంది.

పరవశత్వం నిండిన తమ ఆలింగనాన్ని తిరిగి గుర్తుచేసుకున్నాడు. ఆ బిగికౌగిలి అపు రూపమైనదనుకున్నాడు. మదననదనంలో ఆదిలోనే హెడ్విగ్ ఉపేక్షనూ, జడతనూ తా నెందుకు పోగొట్టలేకపోయాడు? అర్థంలేని ఆమె నియమనిష్ఠలను ఆదిలోనే తుంచివేయ కుండా ఎందుకు బలపరిచాడు? జీవితం అందించిన అవకాశాన్ని తానెందుకు పాడుచే సుకున్నాడు?

ఇంతజరిగినా తామిద్దరూ పరస్పరం ప్రే మించుకున్నారు. ఇప్పటికీ ప్రేమించు కుంటూనే వున్నారు. హెడ్విగ్‌ను ఇక ఎంతో కాలం మదననదనంలో ఉంచకూడదు. తాను ఇంతవరకూ తనకోసం ఏదీచేయమని ఎవరినీ కోరలేదు. కానీ, సుప్రీంకమాండర్ కొద్దిరోజు ల్లోనే తమదళాన్ని తనిఖీచేయడానికి వస్తాడు. ఆయనను తొలిసారిగా తాను ఒక కోరిక కోరతా డు. వెర్నర్‌కు గోరింగ్ బాగాతెలుసు. మార్షల్ ఒకసారి బహుమతిపతకాన్ని స్వహస్తాలతో తనకు అలంకరించి మెచ్చుకున్నాడు. తనకు అత్యంత ముఖ్యులైనవారి కోర్కెను ఆయన మన్నించకపోడు. సుప్రీం కమాండర్ తనిఖీకి వచ్చేసరికే తాను ఇరవైఎనిమిదవ విమానాన్ని కూడా కూల్చివేస్తాడు. ఇంత తీవ్రకాంక్షతో యు ద్ధంచేయాలని అతను ఎన్నడూ అనుకోలేదు. ఇప్పుడతను హెడ్విగ్ స్వేచ్ఛకోసం పోరాడుతూ వున్నాడు.

వెర్నర్ నడుపుతూవున్న యుద్ధవిమానం, దానివెనుక వస్తూవున్న మరోరెండు జపాన్ యు ద్ధవిమానాలకు దారిచూపే సంకేతాలిస్తూ, జల సంధిని అడ్డంగా దాటింది. ఇంతలో దూరంగా శత్రువిమానం పొడగట్టింది. వెర్నర్ వెంటనే తన విమానమార్గాన్ని చక్కదిద్ది శత్రువిమా నంపై విమానవిధ్వంసక శతఘ్నిని పేల్చాడు. శత్రువిమానచోదకుడు తనను మూడు జపాన్ విమానాలు వెన్నాడుతున్న విషయాన్ని పసిగ ట్టాడు. శత్రువిమానం పారిపోవడానికి ప్రయ త్నించింది. కానీ ఇంజన్ ట్రబులిచ్చింది. మూ డు జపాన్ విమానాలూ శత్రువిమానంమీదికి దూసుకెళుతూవున్నాయి.

వెర్నర్ శత్రువిమానాన్ని చూస్తూనే వున్నా డు. దాన్ని ఎప్పుడెప్పుడు కాల్చి కూల్చుదామా అని త్వరపడుతూవున్నాడు. కానీ అది తన శతఘ్ని కాల్పుల పరిధిలోకి రావడంలేదు. శత్రువిమానం వేగం తగ్గింది. మరోకొన్ని వందల గజాలు పోతే ఆ విమానాన్ని అలవో కగా కూల్చివేయవచ్చు.

ఆకస్మికంగా శత్రువిమానం మబ్బుల్లోకి పారిపోయింది. జర్మన్ విమానాలు మూడూ దానివెంటబడ్డాయి. ఎటుచూసినా తెల్లని మబ్బులు తప్ప కింది భూప్రపంచం ఏమాత్రం పొడగట్టడంలేదు. వాళ్ళకింద ఎటుచూసినా ఆదీ, అంతంలేని సువిశాలమైన సముద్రం మాత్రమే గోచరిస్తూవుంది.

మబ్బులకు కాస్త కిందుగా నాలుగు శత్రువి మానాలు ఎగురుతూవున్నాయి. ఇది చూసిన వెర్నర్ వికృతంగా తనలోతాను నవ్వుకున్నాడు. తనను శత్రువులు చాలాతేలిగ్గా చక్రబంధంలో బిగించారు. తొలుత తనకు కనిపించిన విమానం గూఢచారి విమానమై వుంటుంది. అది తనకు అందినట్లే అంది తనను వాళ్ళ ఉచ్చులోకి లాగింది.

లెఫ్టినెంట్‌హార్న్ పోరాటంలో దూకినప్పుడు అజాగ్రత్తగా ఎప్పుడూ ఉండడు. అతని ఇంద్రి యగ్రహణశక్తి చాలా నిశితంగా వుంటుంది. అతని చూపు గ్రద్దచూపులా చాలా సూక్ష్మలక్ష్యా న్నైనా చూడగలుగుతుంది. అతని చెవులు ఏ చిన్న సద్దునైనా వినగలుగుతాయి. అతని చే తులు, అతని మేధ ఎలాంటి ఉత్తర్వులు జారీచేయకుండానే యాంత్రికంగా లక్ష్యాన్ని ఛేదిస్తాయి.

మొత్తం ఆ ఏడు విమానాలూ పరస్పర హననంకోసం, తమ వధ్యప్రాణికోసం దానిచు ట్టూ ఝుమ్మని రాగాలు తీస్తూ తిరిగే కందిరీగ ల్లా వలయంగా కలదిరుగుతున్నాయి.

వెర్నర్ తన శతఘ్నులు సరిగా పనిచేస్తు న్నాయో లేదో చూసుకోవడానికి కాల్పులు జరి పాడు. తరువాత తాను సైనిక విద్యార్థులకు శిక్షణ గరిపేటప్పుడు అతిప్రశాంతంగా, యాంత్రికంగా శిక్షణా విమానాలను నడిపే

చందంగా తన విమానాన్ని పోరాటస్థానంలోకి తిప్పి శత్రువిమానాలపై కాల్పులు సాగించాడు.

తొలి గుండు కిందుగా దూసుకుపోయింది. రెండవ గుండు శత్రువిమానాల ఎడమవక్క రాచుకుంటూ పోయింది. మూడవ గుండు గురితప్పకుండా లక్ష్యాన్ని ఛేదించింది. శత్రువిమానం తిరిగి ఎదురుకాల్పులుకూడా జరపలేక



పోయింది. గిరికీలుకొడుతూ, ముందు నెమ్మదిగా, తరువాత వేగంగా తోకవెంట నల్లనిపొగలు చిమ్ముతూ నేలకు కూలిపోయింది.

శత్రువిమానం జలసంధిలో కూలిపోయిందనడానికి నిదర్శనంగా దట్టమైన తెల్లని పొగమేఘాలు ఆకాశాన్ని కమ్ముకున్నాయి. వెర్నర్ ఇరవైఎనిమిదవ శత్రువిమానాన్ని కూల్చివేశాడు. ఇక మార్షల్ గోరింగ్ లెఫ్టినెంట్ వెర్నర్ కోర్కెను మన్నించి హెడ్విగ్‌ను మదననదనంనుండి విముక్తి చేయిస్తాడు.

వెర్నర్ తన విమానాన్ని వెనుకకుతిప్పి, మిగిలిన రెండు జర్మన్ యుద్ధవిమానాలతో కలవడానికి పైకి ఎగిరించాడు. జర్మన్ వైమానికులు తమ విమానాలను యింకా ఎత్తుకు తీసుకొని వెళుతున్నారు. ఇంతలోనే 'మిత్రమండలి' విమానాల్లో ఒకటి అకస్మికంగా వరుసలోనుండి తప్పుకుని ఒక జర్మన్ విమానం పొట్టకిందకు చేరింది.

జర్మన్ విమానం దెబ్బతిన్నపక్షిలా గిలగిలలాడింది. ఒక రెక్కమీదికి ఒరిగింది. కంట్రోల్ కేబుల్స్ దెబ్బతిన్నట్లుగా దిక్కుమారింది.

మిత్రమండలి విమానం వెంటనే దానిపైకి లేచి, జర్మన్ విమానంమీద అగ్నివర్షం కురిపించింది.

వెర్నర్ తన విమానంనుండి శత్రువిమానాలపై కాల్పులు జరపుతూ తన సహచరుని విమానాన్ని రక్షించడానికి సాయంగా వెళ్ళాడు. అతన్ని రక్షించే ప్రయత్నంలో వెర్నర్ ఎంత నిమగ్నమైపోయాడంటే, శత్రువిమానం జరుపుతున్న కాల్పులకు తన యుద్ధవిమానం తోక అంటుకుని, పొగలు చిమ్ముతున్న విషయాన్ని కూడా గమనించలేదు.

కల్నల్ ఓంకోల్జ్ మదననదనానికి రాకముందే కార్నీలియాను అక్కడినుండి వదిలించుకోవాలని డాక్టర్ ఆత్రపడ్డాడు. వాలంటీర్‌గా వచ్చి తనకు బిడ్డను కనబోతున్న ఆ అమ్మాయిని ఆ దగుల్బాజీ కల్నల్‌గాడు శల్యపరీక్ష చేయడం డాక్టరుకు సుతరామూ ఇష్టంలేదు.

కల్నల్ మఠానికి వచ్చిన వెంటనే డాక్టర్ అతనిని కలిసి మదననదనంలో కనీసం నలుగురు అమ్మాయిలు గర్భవతులైనారనీ, వారిలో ఒక అమ్మాయి సదనానికే సరాసరి స్వచ్ఛందంగా వచ్చిందనీ, ఆ అమ్మాయి హిట్లర్ యువజన సంఘం మహిళా విభాగం ప్రధాన కార్యదర్శిని గనుక తాను చేర్చుకొనడం మంచిదని భావించానీ మాటమాత్రంగా వివరించాడు.

"కడుపుతో వున్న వాళ్లందర్నీ అప్పుడే పంపేశావా?" అడిగాడు కల్నల్.

"అవును" డాక్టర్ సమాధానం.

భోగలాలసతో కూడిన మదననదన వాతావరణం గర్భవతులకు అంత మంచిదిగాదనీ, అందుకే వాళ్ళను వారు ఉండవలసిన కొత్తచోటికి హుటాహుటిని తరలించాననీ, అక్కడ

గర్భస్థ పిండం ఆరోగ్యంగా పెరగడానికి అవసరమైన ప్రశాంత పరిస్థితులు వున్నాయనీ డాక్టర్ వివరించాడు.

"మంచిది... అయితే హాంబర్గ్ నుండి వచ్చిన భామ మాటేమిటి? ఆ పిల్ల పేరు హీన్టర్ బాక్ అనుకుంటా" అని అడిగాడు కల్నల్.

"ఆ అమ్మాయిని మూడువారాల క్రితం ఒక సైనికుడికి అప్పగించడం జరిగింది. ఆ పిల్ల కూడా గర్భవతి అయినట్లు ఫ్రాలాజర్ చెప్పింది" డాక్టర్ వివరణ.

"సరే... హెడ్విగ్ సంగతేమిటి?"

ఈ ప్రశ్నకు డాక్టర్ ఊర్జర్ నిటూర్పు విడిచాడు. ఇది క్లిష్టమైన కేసు. ఈ అమ్మాయి విషయంలో కల్నల్‌కు వివరించడం కష్టమైనపని.

కల్నల్ అపర దూర్వాసుడు. ఏమాత్రం పట్టువిడుపులు లేని మొండిమనిషి. ఏ పరిస్థితిలోనూ హెడ్విగ్‌కు ప్రత్యేక మినహాయింపు ఉండటానికి వీల్లేదని గట్టిగా చెప్పాడు. మిగతా అమ్మాయిల్లాగే హెడ్విగ్ కూడా నిబంధనలను తు.చ. తప్పకుండా పాటించితీరాలి. ఆ అమ్మాయిని ఎంచుకున్న సైనికుడికి ఆ అమ్మాయిని పొందే హక్కు వుంది.

'ఈ తెలివితక్కువ ముండకి వెర్నర్‌లాంటి మహావీరుడు దొరకడం దాని అదృష్టం. కానీ చేజేతులా, అందివచ్చిన అదృష్టాన్ని కాలదన్నుకుంది. పెద్దపత్తిత్తులా ఫోజు వేసే దీని పొగరు అణచాల్సిందే' ననుకున్నాడు ఓంకూల్జ్.

"నా ఉత్తర్వులు తు.చ. తప్పకుండా అమలు జరిపే బాధ్యత మీది.
ఫలితాలను ఎప్పటికప్పుడు నాకు తెలియజేస్తూ వుండండి" కల్నల్ డాక్టరును ఆదేశించాడు.

హెడ్విగ్ విషయంలో కల్నల్ ఉత్తర్వులు అమలు జరిగాయి. అంకెకురాని ఆడపిల్లకు డజను కొరడాదెబ్బలు. ఫ్రాలాజర్ కొరడాతో గొడ్డును బాదినట్లు బాదుతున్నా హెడ్విగ్ కిక్కురు మనలేదు. మౌనంగా శిక్షను భరించింది. ఆమె హృదయాన్ని భగ్గున దహిస్తున్న కార్చిచ్చుతో పోల్చితే ఈ శారీరక బాధ అంత లెక్కలోనిది గాదు.

మదనసదనం క్రమశిక్షణను ఆదిలోనే ధిక్కరించి కొరడా దెబ్బలు తిన్న ఎల్లెన్ అదే శిక్షను మరో అమ్మాయి అనుభవిస్తువున్న తీరు విధిగా చూసి తీరాలి. ఇక్కడికి వచ్చిన అమ్మాయిల్లో తానూ, హెడ్విగ్ యిద్దరు మాత్రమే ఉన్నత కుటుంబాలకు చెందిన వారమని ఎల్లెన్ ఎప్పుడో తెలుసుకుంది. హెడ్విగ్‌మీద ఆ అమ్మాయికి జాలి కలిగింది. అందుకే ఓదార్చింది.

"తిరుగుబాటు వల్ల మంచి జరగదు. నాలాగే తిరుగుబాటు మానేసి, వాళ్ళు చెప్పినట్లు బుద్ధిగా నడుచుకోవడం మంచిది" అంటూ సలహా యిచ్చింది ఎల్లెన్.

ఈ సలహాతో హెడ్విగ్ స్వాతిశయం, ఆత్మభిమానం పూర్తిగా దెబ్బతిన్నాయి దాంతో. "బహుశా నీవు నీజన్మలో ఎవర్నీ ప్రేమించివుండవు" అంటూ ఎల్లెన్‌ను అవహేళన చేసింది హెడ్విగ్.

"ప్రేమ గురించి నీకేం తెలుసు?" అంటూ ఎల్లెన్ ఎదురు వాదానికి పూనుకుంది.

"నీవు స్వచ్ఛందంగా యిక్కడికి వచ్చావని సర్జన్- మేజర్ చెప్పాడు. నిన్ను అందరికీ ఆదర్శంగా చూపుతూ వుంటాడు" హెడ్విగ్ తనకు తెలిసిన విషయం బయటపెట్టింది.

ఈ మాటతో ఎల్లెన్ భుజాలెగురవేసింది. "నేను ఈ వెధవల ఆదేశాలను చాలా యాంత్రికంగా శిరసా వహిస్తున్నాను" అని చెబుతూ "చూడమ్మాయ్... మనిద్దరమూ ఒకే పరిస్థితిలో వున్నాం. ఒకర్నొకరం దెప్పుకొనడంగాక, ఒకరి కొకరం సాయంచేసుకొనడం మంచిది. నేనిక్కడనుండి త్వరలోనే బయటపడుతున్నాను. నువ్వు కూడా అలా ఎందుకు చేయగూడదు? అదేమంత కష్టంగాదు" అని సలహా యిచ్చింది.

"బయటపడటానికి నీకున్న కారణాలు నాకు లేవు" అంది హెడ్విగ్.

"కారణాలు, కర్తవ్యాల గురించిన మీమాంస అనవసరం అమ్మడూ! నీవు తెలుసుకోవలసింది ఒకేఒక్క సత్యం. ఈ మదనసదనం బీగాలు, బంధాలు ప్రేమకు అడ్డుగావు" అంటూ నవ్వింది ఎల్లెన్. "ఈ మఠం గోడలు ప్రేమికుడిని రాకుండా అడ్డుకునేంత ఎత్తయినవేంగాదు. ఈ విషయం నీప్రియుడికి చె




వ్వు'' అంటూ హితోపదేశం చేసింది.

"థాక్స్'' అంది హెడ్విగ్. నిజానికి ఈ విషయం చెప్పినందుకు ఎల్లెన్‌కు హెడ్విగ్ రుణపడివుండాలి. చాలా మంచి ఐడియా అనుకుంది. దీనికి కృతజ్ఞతగా హెడ్విగ్ తన పేరును ఎల్లెన్‌కు తెలిపింది.

"ఓ... నువ్వు ప్రపంచ ప్రసిద్ధి చెందిన సంగీత సామ్రాట్ స్పిట్జ్ ముల్లర్ కుమార్తెవా?'' అంటూ ఆశ్చర్యపోయింది ఎల్లెన్. "మరి మీ తండ్రి నిన్నిక్కడకు ఎలా రానిచ్చారు?'' అని అడిగింది.

"నన్నిక్కడకు పంపకుండా వుండేందుకు ఆయనకు సాధ్యమైనదంతా చేశారు. కానీ ప్రయోజనం లేకపోయింది. మరి నీ విషయంలో మీ నాన్నగారేంచేశారు?'' ప్రశ్నించింది హెడ్విగ్.

★ ★ ★

ఆ రాత్రి హెడ్విగ్ వెర్నర్‌కు ఉత్తరం రాసింది:

"డియర్ వెర్నర్... నేను గర్భవతిని కాలేదు. దీనివల్ల నాకు ఏమి జరిగేదీ నీకు తెలును. నేను భయంతో కుమిలిపోతూవున్నాను.

"నా బుద్ధి తక్కువగాకపోతే మనం చివరి రాత్రి వరకూ, చివరి సూర్యోదయం వరకూ ఎందుకు ఊరుకున్నాం? ఇతర్లలాగే మనమూ వుండవలసింది. అన్నా లీసెల్ గర్భవతుల య్యారు. దీనిఫలితంగా కారల్, ఓట్టోలను తిరిగి మదననదనానికి పిలిపిస్తూ వున్నారు. నిన్ను యిక్కడికి తిరిగి పంపవలసినదిగా నీవు అడగలేవా?

"అవసరమైతే ఇక్కడేమి జరిగిందో, చివరి రోజు వరకూ నీకు నేనెలా దూరంగా వున్నానో మీ కమాండర్‌కు నీవు వివరించి చెప్పి అయినా యిక్కడికి రావలసినది. ఇదేమీ డాక్టర్‌కు ఆశ్చర్యం కలిగించదు.

"ఏదో ఒక పిల్ల చపలచిత్తంతో వ్యవహరించినంత మాత్రాన నీవు తిరిగి మదననదనం రాకుండా ఈ డాక్టరు అడ్డుకోలేడు. నీ పేరుప్రతిష్టలు అలాంటివి. వాళ్ళు మన ఈ కోర్కెను అంగీకరిస్తారని నేను నమ్ముతున్నాను. ఈ దఫా మనం విజయం పొందుతాము. ఇదే నా జీవితాశయమైంది వెర్నర్. నా ఆశయాన్ని నీవు నెరవేర్చగలవని ఆశిస్తాను.

"కల్నల్ ఓంకోల్జ్ ఉదంతం నీకు తెలుసుగా. వాడు యిక్కడికి వచ్చాడు. నన్ను బయటికి పంపివేయమని నేను డాక్టర్ ఊర్జర్‌ను అడిగిన విషయం వాడికి తెలిసింది. నన్ను బయటికి పోనివ్వరాదనీ, యిక్కడే వుంచి వేరే సైనికులకు అప్పగించాలనీ వాడు డాక్టరును ఆదేశించాడు. అందువల్ల దయచేసి వెంటనే రా వెర్నర్! జరిగినదానికి నన్ను క్షమించు. నా మనసు నా స్వాధీనం తప్పుతూ వుంది. నీవు ఒకవేళ యుద్ధరంగానికి వెళ్ళవలసివచ్చినా, కొద్ది సమయం చూసుకుని మఠానికి రా. కుక్కలు అడ్డురానీ, మరేమి జరిగినాగానీ నేను నిన్ను పార్కులో కలిసితీరతాను. నీవు వెంటనే రాకపోతే నాకు ఏమి జరుగుతుందో నీకు తెలును.' నీకోసం వేయికన్నులతో ఎదురుచూస్తూ వుంటాను వెర్నర్'' అంటూ ఉత్తరం ముగించింది.

★ ★ ★

హెడ్విగ్ ఉత్తరానికి లెఫ్టినెంట్ వెర్నర్ నుండి సమాధానం రాలేదు. కానీ అతని వింగ్‌కమాండర్ సమాధానం రాశాడు. అతని సమాధానం చాలా సంక్షిప్తంగా, సూటిగా వుంది.

ఒక యుద్ధంలో లెఫ్టినెంట్ వెర్నర్ ఇరవై ఎనిమిదవ శత్రువిమానాన్ని కూల్చివేసినందుకుగాను, ఆయన మరణానంతరం ప్రభుత్వం యిచ్చిన అత్యున్నత హోదాపతకాన్ని హెడ్విగ్‌కు పంపుతూ ఆ యుద్ధంలో లెఫ్టినెంట్ చనిపోయాడని వింగ్‌కమాండర్ తెలియజేశాడు.

"ఆయన మృతితో జర్మనీ ఒక మహావీరుణ్ణి కోల్పోయింది. ఆయన మృతి ఆయన సహచరులకూ, వ్యక్తిగతంగా నాకూ తీరనినష్టం. ఆయన మృతికి ప్రతీకారం తీర్చుకుంటాం.

"ఆయనంటే, ఆయన సహవైమానికులకు అమిత ప్రేమ, గౌరవం. ఆయన చాలా మితభాషి. కొన్నివారాల క్రితం ఆయన తన స్క్వాడ్రన్‌కు తిరిగి వచ్చినప్పుడు ఆయన చాలా చిత్రంగా, పూర్వంకంటె పూర్తి భిన్నంగా కనిపించారు. మదననదనంలో ఆయన గడిపిన రోజుల గురించి సహచరులు వేళాకోళంగా

మాట్లాడితే ఆయన వాళ్ళమీద విరుచుకుపడ్డారు. అప్పటినుండీ పూర్తిగా ఏకాంతంగా గడిపేవారు.

"మదననదనంలో ఏమి జరిగిందో ఆయన నాకు కూడా చెప్పలేదు. అయినా ఒకవేళ తాను యుద్ధరంగం నుండి మరలిరాకపోతే తనకు బవేరియా నుండి వచ్చే ఉత్తరాలను చించి, చదివి సమాధానం రాయవలసినదిగా ఆయన నన్ను కోరారు. నీవు రాసిన ఉత్తరాన్ని చదివిన పిమ్మట దానిని మూడోకంట పడనివ్వకుండా కాల్చివేశాను. మీ దయనీయమైన రహస్యం ఇకముందుకూడా మరెవ్వరికీ తెలియనివ్వనని వాగ్దానం చేస్తూ వున్నాను హెడ్విగ్"- అంటూ వింగ్‌కమాండర్ ఉత్తరం ముగిసింది.

★ ★ ★

కమాండర్ సమాధానం చదువుకుని హెడ్విగ్ తల్లడిల్లిపోయింది. ఆమె జీవితంలో అంత భయంకరమైనరోజు మరొకటిరాదు. ఆమె శోకానికి ప్రతిమూర్తిగా నిలిచింది. ఆమె నిర్వేదాన్ని చూసిన డాక్టర్ ఊర్జర్‌గూడా చలించిపోయాడు. ఆమెను ప్రత్యేకంగా కావలా కాస్తూ వుండమని ఫ్లిట్టర్‌ను ఆదేశించాడు. ఆమె ఈ పరిస్థితిలో అతితెగువతో తప్పించుకొని పారిపోవడానికి ప్రయత్నించవచ్చునని లేదా ఆత్మహత్య చేసుకోవచ్చుననీ డాక్టర్ భయపడ్డాడు.

సెంటిమెంట్ అంటే ఏమిటో ఎరుగని శాస్త్రవేత్త డాక్టర్ ఈ కేసును చాలా నిరావేశంగా, తన వృత్తి దృష్టితో చూశాడు. ఇలాంటి కేసుల్లో కాలమే గొప్ప మందని అతనికి తెలుసు.ఒకర్ని విడిచి మరొకరు బతకలేమన్నంతగా తపించిపోయిన ప్రేమికులుగూడా కొన్ని వారాలు గడిచేసరికే విచిత్రంగా తమ హృదయావేదనను మరచిపోయి ఊరటచెందుతారు. ఉదాహరణకు లీసెల్‌షాఫ్ తనతో వివాహ నిశ్చితార్థం జరిగిన వరుణ్ణి త్వరలోనే మరచిపోయింది. అలాగే హెడ్విగ్ కూడా ఒక మాసంపాటు ప్రత్యేక జాగ్రత్తలు గైకొన్న పిమ్మట మామూలు మనిషి అయినట్లు గోచరించింది. డాక్టరు ఆమెను మదననదనంలో ఇతర అమ్మాయిలు చేసే రొటీన్ పనులలోకి తిరిగి పంపాడు.





ఒక ఉదయం మదననదనంలోకి కొత్తగా వచ్చిన మనుగుడుపుల పెళ్ళికొడుకుల్లో సార్జెంట్ ఒట్టోవార్ ఊఫ్ కనిపించాడు. అతను పూర్వకంటె మాంచి ఉల్లాసంగా వున్నాడు. డాక్టర్ అతనిని అభినందించి అతని ఎడమ చేతి రెట్టకు స్వస్తిక్ గుర్తు కట్టాడు. ఎన్ని ఆవులనైనా దాటి కట్టించగల మాంచి ఆవటెద్దుకు మెలుగుల మీద చక్రాంకితాలు వేసినట్టే, అమ్మాయిలను త్వరగా గర్భవతులను చేయగల మగవీరులకు మదన నదనంలో స్వస్తిక్ గుర్తు కడతారు.

అన్నా ఊహించినట్లుగానే ఒట్టో తిరిగి మదననదనానికి వచ్చేసరికి ఆమె అక్కడలేదు. సార్జెంట్ ఒట్టో కూడా అన్నా ఊసే ఎత్తలేదు. ఆ పొమరేనియన్ పిల్లతో ఒక వారంరోజులు అనుభవించిన స్వర్గసుఖాన్ని అతను మరచిపోకపోయినప్పటికీ, తిరిగి ఆ అమ్మాయే ఇప్పుడు అతని ఎదుట నిలబడినా ఆ పిల్లను మాత్రం ఎంచుకునేవాడు గాదు. వెరైటీకోసం కొత్తమ్మాయిని వరించేవాడు.

"ఆహారపదార్థాలను మారుస్తూ వుండటం ఆకలికి మంచిది. నిజమా, అబద్ధమా ఫ్లిట్టర్" అని అడిగాడు ఆమెకు కన్నుకొడుతూ.

నిజమేనన్నట్లుగా ఆమె చిరునవ్వు నవ్వింది. అమ్మాయిల ప్రదర్శనలో మొదటిదానిగా నిలబడినందుకు ఫ్లిట్టర్‌కు మహదానందంగా వుంది.

అమ్మాయిలందరూ ఒట్టో ముందు నగ్నంగా నడిచారు. అందంగా, పొందికగా వున్న శాక్సన్ అమ్మాయిపై అతని దృష్టి పడింది. అతను తాను అంతకుముందు అనుభవించిన దుక్కల్లాంటి అమ్మాయిలతో సౌఖ్యాన్ని నెమరేసుకుంటూ, తన ఎదురుగా వడ్డించిన భక్ష్యాలలా ఉన్న అందాల భామలను చూసి లొట్టలేస్తూ వున్నాడు. తర్వాత అతని దృష్టి హెడ్విగ్‌మీద పడింది.

సన్నగా, నాజూకుగా వుండే పిల్లంటే అతనికి అంతగా గిట్టదు. పైగా ఈ అమ్మాయి నిర్వికారంగా వుంది. ఎవరికీ ఎలాంటి చనువూ యివ్వదు. "హెడ్విగ్ అంటే అసామాన్య పిల్లనుకోకు. ఆ అమ్మాయి ఎప్పుడూ డాన్సు కూడా చెయ్యదు. ఇతర పిల్లలతో ముచ్చట్లకు అసలు రానేరాదు. చాలా డాబూ, దర్పం గల పిల్ల" అని అన్నా చెప్పిన మాటలు ఒట్టోకు గుర్తు

న్నాయి.

మనిషి చాలా విచిత్రమైన జంతువు. చదువూ, సంస్కారమూ లేకుండా ఎద్దు మొద్దు స్వరూపంలా వుండే మగాడు అందరికంటె చాలా విచిత్రంగా ప్రవర్తిస్తాడు. ఆ పిల్లను చూస్తూనే అతనిలో ఈర్ష్యలాంటిదేదో ప్రవే శించింది. అంతేగాదు 'ఆ లెఫ్టినెంట్ హార్న్ గొప్పేమిటీ? వాడికన్ని హొదాలూ, బిరుదు లూ ఏమిటి? వాడికంటె మగాడు జర్మనీలో లేడా? వాడి పక్కలో పడుకున్న పిల్లను నాపక్క లోకి తెచ్చుకుని వాడికంటె నేనే పైచెయ్యని పించుకుంటా' నంటూ తలపోశాడు. అందుకే హెడ్విగ్‌ను అనుభవించి తీరాలనుకున్నాడు.

"అమ్మాయిల వరుసలో ఆఖర్న నిలబడివు న్న పొడవాటి చామనఛాయ పిల్లను ఎంచుకు న్నా అని చెప్పాడు డాక్టర్‌తో.

సార్జంట్ ఒట్టో ఆ అమ్మాయిని ఎంచుకోన డంలోని ఆంతర్యాన్ని డాక్టర్ పసిగట్టినప్పటికీ, తనకు తెలియనట్లే నటించాడు. అయితే డాక్ట రు ఆ అమ్మాయిమీద జాలిచేతనో లేదా ఆ పిల్లకు మనసులేని మరో సంగమాన్ని బల వంతంగా ప్రోత్సహించడం యిష్టంలేకనో ఒట్టోకు కొన్ని సలహాలిచ్చాడు.

"ఆ అమ్మాయి చాలా గొప్ప కుటుంబం నుంచి వచ్చింది. ఆమె జీవితం నాశనమైంది. మాతృభూమి ఏ పవిత్ర కర్తవ్యం కోసమైతే ఆ అమ్మాయిని యిక్కడికి పిలిపించిందో, ఆ పనికి ఆ అమ్మాయి తలవంచడం కష్టం. ఆ బాలిక నిర్వర్తించవలసిన కర్తవ్యం యొక్క గొప్పతనాన్నీ ఉపయోగాన్నీ ఆమె అర్థంచేసు కునేలా నీవు చేయగలగాలి. ఆ పిల్లను బల వంతం చెయ్యకు. ప్రేమగా ఒకటికి పదిసార్లు చెప్పి ఒప్పించు. ఇంతవరకూ ఆ అమ్మాయి అదృష్టవంతురాలుగాదు" అని డాక్టర్ వివ రించాడు.

"నాకు అంతా తెలుసు డాక్టర్... క్రితంసారి నాతోపాటే రైల్లోవచ్చిన లెఫ్టినెంట్ ఈ అమ్మా యిని ఎంచుకున్నాడు" అని ఒట్టో పళ్లికి లించాడు.

"మంచిది... అప్పటినుండీ ఈ అమ్మాయికి ప్రేమికులెవరూలేరు. నీకాపిల్ల నచ్చింది గాబ ట్టి, నీవు కూడా కర్తవ్య నిర్వహణలో సమర్థుడ వని రుజువుచేసుకున్నావు గనుక..." అంటూ ఏదో చెప్పబోయాడు డాక్టర్.

"నన్ను నమ్మండి డాక్టర్" అంటూ ఒట్టో భావగర్భితంగా నవ్వాడు.

ఎంత ప్రయత్నించినా హెడ్విగ్ తేలిగ్గా ఒట్టో వడిలో వచ్చివాలడంలేదు. మధ్యాహ్నం భోజనసమయంలో ఆ అమ్మాయికి ఒట్టో ఎంతో చెప్పిచూశాడు. కానీ ఆ పిల్ల సమాధానం గూడా యివ్వడం లేదు. చివరకు తాకడానికి ప్రయ త్నించినా భయంతో గువ్వలా ముడుచుకుపో తూవుంది. జీవితంలో ఎంతోమందిని చిటికెలో వశంచేసుకున్న ఒట్టో ఈ పిల్ల వ్యవహారం సహించలేకపోతున్నాడు.

"ఏయ్... నీవింకా కన్యవేనా?" అంటూ ప్రశ్నించాడు అసహనంగా.

"కాదు" అని ముక్తసరిగా సమాధానం చె ప్పింది హెడ్విగ్.

"నువ్వు చెప్పేదాంట్లో నాకేం నమ్మకంలేదు గానీ, నువ్వా లెఫ్టినెంట్ దగ్గర ఆడిన ఆటల న్నీ నా దగ్గర ఆడాలంటే కుదరదు. నేనూ వాడిలాంటి చవటననుకున్నావేమో"

"నిన్ను యిక్కడికి పంపింది నీకంటె చాలా పెద్దఅధికారి అయిన ఒక జాతీయ వీరుడిని కించపరుస్తూ మాట్లాడటానికి కాదు" తీవ్రంగా అన్నది హెడ్విగ్.

తన కింది తరగతి హొదాను గుర్తుచేస్తూ ఆ అమ్మాయి చేసిన వ్యాఖ్యకు, పిలుస్తూనే తనకౌగిలిలో వాలకుండా రెటమతంగా నిరాక రిస్తున్న దాని పొగరుమొత్తనానికీ ఒట్టో ఆగ్ర హంతో చిందులేశాడు. తనను ఆ అమ్మాయి ఏమాత్రం లక్ష్యపెట్టడంలేదని భావించడంతో అతని పురుషాహంకారం దెబ్బతిన్నది. సర్జ న్-మేజర్ ఇచ్చిన సలహాను మరిచిపోయాడు. ఆగ్రహంతో పళ్ళు పటపట కొరుకుతూ, ఆ పిల్ల మణికట్లు రెండూ పట్టుకుని జరజరా పడక దగ్గరకు లాక్కుపోయాడు.

ఈ మూర్ఖుణ్ణి రెచ్చగొడితే లాభం లేదనుకు న్నది హెడ్విగ్.

ఆ రాత్రి ఒట్టో చేత బాగా తప్పతాగిస్తే తాను వాడి భల్లూకపు పట్టునుండి తప్పించుకోవచ్చు నని హెడ్విగ్ అనుకుంది. రాత్రి భోజన సమ యంలో తన గ్లాసునిండా మద్యం నింపుకుంది. ఒట్టోతో పాటే తానూ తాగింది. అందువల్ల



అతనికేమాత్రం అనుమానం కలగలేదు. రాత్రి పడుకునేసమయంలో హెడ్విగ్‌కు కొద్దిగా మత్తెక్కిందిగానీ సార్జెంట్ మాత్రం మామూలుగానే వున్నాడు. పైగా మద్యం అతని కామవాంఛను రెట్టింపు పెంచింది. దానితోపాటే హెడ్విగ్ ప్రతిఘటన కూడా పదిరెట్లు పెరిగింది.

అతను ఏడుసార్లు ఆ అమ్మాయిని కౌగలించుకోబోయాడు. ఆ పిల్ల అన్నిసార్లూ వాడిపట్టుకు అందకుండా తప్పించుకొనేసరికి వాడి కోపం తారాస్థాయికి చేరింది.

"దొంగలంజా... తప్పించుకుంటావా?" అంటూ వాడు ఆ అమ్మాయి మీద కమరబడ్డాడు. ఆ పిల్ల వంటి మీద బట్టలు బలవంతంగా లాగేశాడు. రెండుచేతుల్లో హెడ్విగ్‌ను ఎత్తుకొని మంచం మీదకి విసిరికొట్టాడు.

హెడ్విగ్ వాణ్ణి దగ్గరకి రానివ్వకుండా పోరాడుతూ వుంది. వాళ్ళిద్దరూ కుస్తీపట్లు పడుతున్నారు. హెడ్విగ్ పట్టుదల చూస్తే ప్రాణం పోయినా వాడికి లొంగేలాలేదు. కానీ అది సమఉజ్జీల మధ్య పోరాటంగాదు. బాగా తాగి మత్తెక్కివున్న ఆ మదపుగొడ్డు ఆ అమ్మాయిని తన పశుబలంతో లొంగదీసుకోబోతున్నాడు. మరికొన్ని క్షణాల్లో హెడ్విగ్‌వాడికి లొంగక తప్పదు.

ఆ అమ్మాయి వాడితో పోరాడుతూనే మనస్సులో దేవుణ్ణి ప్రార్థిస్తూ వుంది. 'ఓ ప్రభూ... ఈ నరపశువును ప్రతిఘటించి నిలిచేశక్తి నాకు ప్రసాదించు' అని. ఆమె ఉచ్ఛ్వాస-నిశ్వాసాలు కలిసి భారంగా వినిపిస్తూ వున్నాయి. ఆమె బలవంతాన ఒక చేతిని విడిపించుకుని, తన శక్తినంతా కూడగట్టుకొని వాడి గుండెల మీద చెయ్యేసి దూరంగా నెట్టింది. ఆమెను వాడు రాతిగోడలకేసి అదుముతున్నాడు. వాడు తన మోకాళ్ళతో ఆ అమ్మాయి పిరుదులను నజ్జునజ్జుగా నొక్కుతూ వుంటే, ఆ పిల్ల బాధతో గిలగిలలాడుతూవుంది. వాడు గట్టిగా ఆ అమ్మాయిని తన చేతుల్లో ఒడిసి పట్టుకుని తన దగ్గరికి లాక్కుంటూ వున్నాడు.

హెడ్విగ్ ఇక సహించలేకపోయింది. వాడి భుజం మీద పళ్ళతో గట్టిగా కొరికింది. ఆమె పళ్ళు సాంతం వాడి శరీరంలోకి దిగాయి.





ఆ బాధకు వాడు ఆ అమ్మాయిని పట్టుకున్న తన చేతులను సడలించాడు. కానీ మోకాళ్ళతో ఆ పిల్లను మంచం మీదనే నొక్కిపట్టి వుంచాడు.

"నీయమ్మ కరుస్తావంటే... ఈ తప్పుడు చేష్టలతో నా చేతుల్లో నుండి తప్పించుకోవచ్చు ననుకున్నావేమో? అది నిన్ను పుట్టించినోడి తరం గూడా కాదు" అంటూ అడ్డమైన తిట్లూ తిడుతూ వున్నాడు.

హెడ్విగ్- "సదా నీకే విశ్వాసపాత్రురాలిగా వుంటా"నని ఆనాడు వెర్నర్‌తో ప్రమాణం చేసి చెప్పింది. అతను ఇహలోకంలో లేకపోయినా ప్రమాణం ప్రమాణమే.

"చేసిన గొడవంతా యిక చాల్లే భడవా! నువ్వు పత్తిత్తువేసని ఒప్పుకున్నాన్లే. ఇంక సరిగ్గా పడుకో... నాకు కావాల్సింది నాకిచ్చేయ్" అంటూ కర్కశంగా గర్జించాడు ఓట్టో.

అతను మరోసారి తన భల్లూకపు కౌగిలిలో ఆమెను బందీచేశాడు. వాడి పట్టులో ఆ అమ్మాయి బాధతో మెలికలు తిరిగిపోతూ వుంది. వాడు ఆ పిల్లను ఇంకా గట్టిగా పట్టుకున్నాడు. ఆ అమ్మాయి వాడి రొమ్ముమీద బలంకొద్దీ గుద్దుతూ వుంది. వాడికి గుద్దులు కామోద్దీపన సరాగాల్లా గిలిగింతలు పెడుతూ వుంటే వాడు పెద్దపెట్టున నవ్వుతూ వున్నాడు. 'ఇంతేనా నీ బలం... ఇంకా గట్టిగా గుద్దు' అంటూ వున్నాడు. ఆమె నిరాశా నిస్పృహతో కూడిన తెగింపుతో తనను తాను చూసుకుంది. ఏదో ఒక అద్భుతం జరిగి తాను వీడి కబంధ హస్తాల నుండి తప్పించుకోవాలని మనసులో దేవుణ్ణి ప్రార్థిస్తూ వుంది.

మంచం పక్కనే వున్న బల్లమీద ఏదో లోహపు ముక్క ఆమె దృష్టిని ఆకర్షించింది. అది కాగితాలు చింపే కత్తిపిడి. కాలక్షేపానికి పుస్తకం చదువుతూ, గుర్తుగా పేజీలమధ్య పెట్టి వదలివేసిన కత్తి. ఏదో భయంకరమైన కాంతి ఆమె కళ్ళలో మెరిసింది. ఆమె తన రెండు చేతులనూ అతని శరీరం చుట్టూ చాపింది.

ఆమె కళ్ళలోని వెలుగును వాడు అపార్థం చేసుకున్నాడు. ఆమె తన చుట్టూ చేతులువేయడం తనకు లొంగిపోవడానికి సంకేతమనుకున్నాడు. తన బలమే చివరకు జయించిందనుకున్నాడు. ఆ పిల్లను గట్టిగా అదిమిపట్టి

వున్న చేతులను నడలించాడు. మెల్లిగా, వీలై నంత నాజూకుగా తన చేతులతో ఆమె శరీరా న్ని నిమరసాగాడు.

ఆ కత్తి హెడ్విగ్ చేతికి అందింది. ఆ లోహపు ముక్క చల్లగా చేతికి తగులగానే ఆమె శరీరంలో వణుకు ప్రారంభమైంది. అది ప్రేమ పులకింత అని ఆ సార్జెంట్ అనుకున్నాడు. కామంతో మత్తుగా ఆ పిల్లమీద ఒరిగిపోయా డు.

ఆ అమ్మాయి మెల్లిగా కత్తి అందుకుంది. ఒట్టో మెడ వెనుక వక్కగా పైకెత్తింది. ఎర్రని బెడ్‌లాంప్ వెలుగులో ఆ కత్తి ఎర్రటి నెత్తుటి రంగులో మెరుస్తూవుంది.

ఆమె పెదాలు చిట్లిపోయేటట్లుగా అతి పాశవికంగా ముద్దుపెట్టుకున్నాడు సార్జెంట్. ఆ పిల్ల తన రక్తాన్ని తానే రుచిచూసింది. ఆమె తన నోటిని బలవంతంగా ఇవతలకు లాక్కుంది. "వెర్నర్ అంటూ శ్వాస పీల్చు కుంది.

బలాన్నంతా కూడగట్టుకుని వాడి మెడ కింది భుజం ఎముకపైగా సర్రున చేతిలోని కత్తిని దింపింది.

అంతే... అంత పశుబలంగల ఓట్టో వార్ ఊఫ్ ఆమె చేతుల్లో చేష్టలుడిగి శక్తి హీనుడిగా వేలాడిపోయాడు. వాణ్ణి ఆమె రెండుచేతులతో దూరంగా నెట్టింది. వాడు మంచం మీది నుండి చాపచుట్టలా దొర్లుకుంటూ, పెద్దబండ రాయిలా ధన్‌మని నేలమీద కూలిపోయాడు.

ఆమె మంచంమీదనుండి ఎగిరి లేచింది. నిర్జీవంగా నేలమీద వెల్లకిలా పడివున్న సార్జెంట్‌ను రెప్పలార్పకుండా చూసింది. ఆ శవం కూడా కాంతిలేని కళ్లతో తననే చూస్తూ తిడుతున్నట్లనిపించింది. అతని శవం చుట్టూ రక్తం మడుగు కట్టింది.

ఒక మనిషిని చేతులారా చంపినా తనకు భయమనేదే కలగకపోవడం ఆమెకు ఆశ్చ ర్యంగా వుంది. అనుకోకుండానే, ఆ చచ్చిన మనిషిమీద జాలి లాంటిది కలిగింది. వాళ్ళు అతనికి 'దేశభక్తియుతమైనపని' అని చెప్పిన దానిని చేయబోయి అతను చచ్చాడు. వాడొక సైనికుడు. కానీ తాము 'దేశభక్తియుతవిధి'గా విశ్వసించినపనిని చేయబోయి పదిలక్షల మంది జర్మన్ సైనికులు చచ్చారు. ఎందు కోసం? ఏది దేశభక్తియుతమైన విధి? ప్రపంచా న్నంతటినీ జయించాలనే హిట్లర్ దురాశకు వారు బలిఅయ్యారు. సమస్త ప్రపంచాన్నీ సర్వనాశనం చేసి తన పాదాక్రాంతం చేసుకోవా లన్న హిట్లర్ దురాక్రమణకాంక్షను నెరవేర్చే ప్రయత్నం దేశభక్తి విధి అవుతుందా? తరతరా లూ నాజీయిజంనే ఆరాధిస్తూ తనకు, తన వారసులకు నమ్మకమైన బంట్లుగా, విశ్వాసపా త్రమైన పెంపుడు కుక్కల్లా బతికే బానిసజా తిని సృష్టించాలనే ప్రయత్నంలో ఉచ్చనీచా లూ, నైతిక విప్లవాలూ మరిచి దేశంలోని కన్నెపిల్లలందరినీ వ్యభిచారిణులుగా మార్చి, వాళ్ళను నరపశువుల్లాంటి సైనికులకు తార్చి, వాళ్ళచేత బిడ్డలను కనిపించి, అమ్మ,అబ్బ ఎవరో తెలియని ఆ అక్రమ సంతానాన్ని 'స్వచ్ఛమైన ఆర్యజాతి'గా ముద్రవేయాలన్న వినాశకర ఆలోచన దేశభక్తియుత విధి అవు తుందా? ఈ ఆలోచన రాగానే ఆమెలో జాలి కూడా అంతరించింది.

హెడ్విగ్ మెల్లిగా డ్రెస్సింగ్ టేబుల్ దగ్గరకె ళ్ళి అద్దంలో ముఖం చూసుకుంది. కన్నులు గుంటలువడి, ముఖమంతా కన్నీరు చారికలు కట్టి, జుత్తంతా విడిపోయి, వళ్ళంతా నెత్తుటి మరకలతో వరమవికారంగా కనిపిస్తూవున్న తన రూపాన్ని చూసి తానే భయపడింది. తన రొమ్ముల మీద చిందిన నెత్తుటి మరకలను చూసి గట్టిగా కళ్ళు మూసుకుంది.

ఆమె తిరిగి కళ్ళు తెరిచేసరికి కన్నీళ్ళతో నిండి మసకమసగ్గా కనిపించాయి.

"నీకోసమే ఈ పని చేశాను వెర్నర్!" అంటూ హెడ్విగ్ బిగ్గరగా అరిచింది. "మన ప్రేమను పవిత్రంగా వుంచాలి. వీణ్ణి నేనెందుకు చంపానో నీకు అర్థమైందిగా నా ప్రియా" అంది ఉద్విగ్నంగా!

ఇంతలోనే ఆమె శరీరంలో తీవ్రమైన వణుకు ప్రారంభమైంది. ఆమె ఒక మనిషిని చంపింది. అవును... ఆమె ఇలాగే నిరంతరం హత్యలు చేస్తూనే వుంటుందా? ఎందుకంటే మదనసదనానికి ఇంకా ఎందరో సైనికులు వస్తూనే వుంటారు. తనను ఎవడో ఒకడు ఎంచుకుంటూనే వుంటాడు. తనను శిక్షించే పద్ధతి ఇదే. అవును... నిరంతరం సైనికులు

వస్తూనే వుంటారు. వ్యభిచారులు, పశుకామంతో ఆడదాన్ని నఖశిఖపర్యంతం చూసేవాళ్ళు. రోజు మార్చి రోజు. రాత్రి తర్వాత రాత్రి...

ఆమె అక్కడ నుండి కాలికొద్దీ పరుగెత్తసాగింది. చచ్చినేలమీద పడివున్న శవంవైపు మరోసారి చూడకుండా, పంటిమీద చిందరవందరగా వున్న దుస్తులు సరిగ్గా వేసుకునే ఆలస్యం చేయకుండా, చివరకు విడిపోయి వ్రేలాడుతున్న కురులను కూడా ముడివేయకుండా ఆమె ఆ కుటీరం నుండి బయటికి పరుగెత్తింది.

"నీవే ఆఖరు వ్యక్తివి వెర్నర్. నేను ప్రమాణం చేశాను గుర్తుందిగా! నా బొందిలో ఊపిరి వున్న ఆఖరుక్షణంవరకూ నీవొక్కడివే నా ప్రియుడివి. ఒట్టు"- అంటూ ఉన్మాదినిలా పరిగెత్తింది.

ఆమె తన వాగ్దానాన్ని నిలబెట్టుకునే సమయం వచ్చింది. ఆమె నరస్సుదిశగా సర్వస్వం కోల్పోయిన విరాగినిలా, చంద్రప్రచండ జ్వాలాశిఖలా పరుగెత్తింది.

వేటకుక్కలు మొరుగుతూవున్నాయి. ఆమె నరస్సు తీరం చేరగానే కుక్కల అరుపులు మరింత దగ్గరగా, భయంకరంగా వినిపిస్తూవున్నాయి. ఆమె ఆ సరస్సులో శరీరాన్ని గడ్డకట్టించే చల్లని నీళ్ళలో దూకింది. వడిగా, వడివడిగా బారలు వేస్తూ బలంగా నరస్సు మధ్యకు వెళ్ళేవరకూ ఈదింది. అక్కడ ఆగి శ్వాస పీల్చుకుంది.

ఆకాశంలో సుదూరంగా విమానాల రొద వినిపిస్తూ వుంది. ఆ శబ్దం అంతకంతకూ దగ్గరై నిశా ప్రశాంతతనంతా మింగివేసింది. పైకి చూస్తే మిత్రమండలి విమానాలు బెర్లిన్ పై అగ్నివర్షం కురిపించడానికి వెళుతూ వున్నాయి.

విమానాల రొదతో ప్రతిధ్వనిస్తూన్న ఆకాశంవైపు హెడ్విగ్ తన చేతులెత్తింది వాటిని ఆహ్వానిస్తూ...

"రండి... త్వరగా రండి" -అంటూ బిగ్గరగా అరిచింది.

అవే ఆమె చివరి మాటలు. అనంత ప్రకృతిలో నింగీ నేలనూ సంధిస్తూ ప్రతిధ్వనిస్తూన్న మాటలు.



# చతుర కథలు



## జన్మజన్మల బంధం

గత ఆరేడు నెలలుగా తన కొలీగ్ పంకజాన్ని గాఢంగా ప్రేమించేయడం మొదలెట్టాడు శోభనాచలం. ఆమె కూడా మొదట్లో అతనిపై పిసరంత ప్రేమ చూపించింది. దాంతో చెట్టాపట్టాలేసుకొని ఇద్దరూ ఝుమ్మంటూ షికార్లు తిరిగారు.

అయితే కాలమెప్పుడూ ఒకేలా ఉండదు గదా! పంకజంలో ఏదో మార్పు వచ్చింది. కొద్ది నెలలుగా ఆమె శోభనాచలం ముఖాన్ని చూడ్డానిక్కూడా యిష్టపడటం లేదు. అతనెంత ప్రయత్నించినా ఆమె అలకకు కారణం తెలియలేదు. పైగా అతను ఎదురుపడితేనే కస్సుబుస్సులాడ్డం మొదలెట్టిందామె. మధ్యవర్తుల ద్వారా పంపిన రాయబారాలూ విఫలమయ్యాయి.

ఇంకేముంది? మనవాడు దేవదాసైపోయాడు. "ఒకరికిస్తే మరలిరాదు... పగిలిపోతే అతుకు పడదు..." అంటూ విషాదగీతాలు ఆలపించాడు. తిండీ తిప్పలు లేక అతడు కృంగి కృశించిపోతున్నా పంకజం మనసు కరగలేదు.

ఇక లాభం లేదని తుది ప్రయత్నంగా- తను సాయంత్రం హుస్సేన్‌సాగర్‌లో దూకి ఆత్మహత్య చేసుకోబోతున్నానని కడసారి చూడదలచుకుంటే 5 గంటలకల్లా అక్కడికి రమ్మని ఓ ఉత్తరం రాసి ఆమె టేబిల్ మీద పెట్టి వెళ్లిపోయాడు శోభనాచలం.

సాయంత్రం 5 గంటలైంది.

టాంక్‌బండ్ మీద నిల్చుని హుస్సేన్‌సాగర్‌లోని అలలను తిలకిస్తూ ఆలోచిస్తున్నాడు శోభనాచలం. పంకజం వస్తుందో రాదోనన్న శంక పీడిస్తోందతన్ని. రాకేం చేస్తుంది? తమది జన్మజన్మల బంధం అని మరోపక్క తనకితనే ధైర్యం చెప్పుకుంటున్నాడతను. ఒకవేళ తనమీది ప్రేమతో ఆమె గనుక వచ్చినట్లయితే పెళ్లి విషయం కూడా ఇక నాన్చకూడదు. ఇక్కడే తేల్చేసుకుని వీలైతే రేపే రిజిస్టర్ మ్యారేజీ చేసేసుకోవాలి అనికూడా తీర్మానించుకున్నాడతను.

నిముషాలు గడుస్తున్నాయి. ఆమె వచ్చే సూచనలెక్కడా కన్పించకపోవడంతో అతన్ని నీరసం ఆవహిస్తోంది.

ఇంతలో రోడ్డుకు అవతలివైపు ఆటో దిగిన పంకజం "శోభన్" అని అరిచింది. ఆ పిలుపు శతకోటి వసంతాల చిరుజల్లుల తాకిడిలా అతని కర్ణపుటాల్ని తాకింది. ఆనందంతో తలెత్తి, "హాయ్! జమ్" అని అరిచాడతను.

"ప్లీజ్ నేను రోడ్‌క్రాస్ చేసి వచ్చేదాకా ఆగు... దయచేసి నా మాట విను.." అని అరుస్తూ ఆ ట్రాఫిక్‌ను తప్పించుకుంటూ అతని వైపు పరుగెత్తుకొంటూ వస్తోందామె.

ఆమె కంగారుచూసి నవ్వుకున్నాడు చలం. "పిచ్చి 'జమ్'... నా మీద నీకెంత ప్రేమ! మనది జన్మజన్మల బంధమని నాకెప్పుడో తెల్సు. బతికితే ఇద్దరం కలిసి బతుకుతాం... చస్తే కలిసే చస్తాం" అనుకున్నాడతను మనసులో.






పంకజం దగ్గరకి వచ్చేసింది.

"హమ్మయ్యా... దూకేస్తావేమోనని భయపడి చచ్చాను బాబూ" అంది రొప్పుతూ.

"నేను పోతే మాత్రం నీకు నష్టమేమిటి పంకజం?" అన్నాడతను దిగులుగా.

"అవును - నాకేం నష్టం. మా ఫారిన్ రిటర్న్డ్ బావతో నాకు ఎంగేజ్‌మెంటయిపోయి రెండ్నెల్లయిందిగా" అనుకుందేగానీ పైకి అనలేదు పంకజం.

"చాల్లే బడాయి. నువ్విలా పోతే నష్టం నాకుకాక ఇంకెవరికి?" అందామె చిరుకోపంతో.

అతని కళ్లు ఆనందంతో మెరిశాయి. ప్రేమగా ఆమెని దగ్గరికి తీసుకోబోయాడు.

"శోభన్ డియర్! నేనొకటడుగుతాను కాదనవు గదా?" అందామె గోముగా.

"ఏమిటి చెప్పు జమ్? నీకోసం ప్రాణాలే తీసుకోబోయినవాడ్ని. నీకోరిక కాదంటానా?" అన్నాడతను ప్రేమగా.

"ఏంలేదు డియర్. బాస్ ఓ అర్జంట్ డ్రాఫ్ట్ రాయమన్నాడు నన్ను. కుదిరిచావడంలేదు. కాస్త అది రాసిద్దూ. దూకటం సంగతి రేపు చూసుకోవచ్చు" అంటూ బాగ్‌లోంచి కాగితాలు బయటకి తీసింది పంకజమ్.

"ఆ..." అంటూ తూలి వంకజంతోసహా సాగర్‌లో పడిపోయాడు శోభనాచలం.

-ప్రతాపచంద్ర

## టెన్షన్

**నే**వెళ్లేసరికి సాయంత్రం ఆరు గంటలే అయినా రామనాథం ఇంటితలుపులు మూసివున్నాయి. ఆఫీసునుంచి పోతూపోతూ వాళ్ల కాలనీలో అల్లర్ల పరిస్థితెలా ఉందో ఓసారి కనుక్కుని వెడదామని వచ్చిన నేను అది చూసి నవ్వుకుంటూ బెల్ కొట్టాను.

బెల్ మోగగానే "ఎవరూ?" అంటూ ఓ పాలికేకలాంటిది వినిపించింది.

అది రామనాథందే అని గుర్తించి-

"నేనేరా గుర్నాధాన్ని-తలుపు తియ్యి" అన్నాను. ముందు కిటికీ తలుపు తెరుచుకుంది. అందులోంచి రెండు కళ్లు మాత్రం కనిపించాయి. ఆ తరువాత రెండుమూడు నిమిషాలకి వీధి తలుపు నగం నగం తెరుచుకుంది.

"ఏమిట్రా రామం! అంత ఖంగారుపడుతున్నావ్? కర్ఫ్యూ ఏడింటికి కదా అప్పుడే తలుపులన్నీ మూసేశావేమిటీ" అన్నాను.

ఏడిసినట్టేవుంది నువ్వు చెప్పేది. ఆ గూండా మూకకి ఓ టైమా? పాడా?ఎప్పుడొస్తారో? ఏం చేస్తారో వాళ్లకే తెలియదు. ఇంక మనకేం తెలుస్తుంది. నీకేం లోపలి ఏరియాలో నాలుగో అంతస్థులో నిశ్చింతగా వున్నావ్. నేనేమో బొత్తిగా రోడ్డుమీద ఇల్లు కావటంతో హడలిఛస్తున్నాను" అన్నాడు రామనాథం.

వాడికా ఖంగారు వుండటంలో ఆశ్చర్యం లేదనిపించింది. నగరం అట్టుడికి పోతోంది కిరాతక చర్యలతో పిల్లా, పాపా, ముసలీ ముతకా, వాళ్లనీ వీళ్లనీ ఏమీ లేకుండా క్రూరంగా చంపేస్తున్నారు.

అందుకే ఈ అయిదారు రోజులుగా కర్ఫ్యూ కారణంగా ఆఫీసు మానేశాడు రామనాథం.

ఒరోజు పొద్దున్నే మళ్లీ ఓసారి వాడూ, వాడి కుటుంబం ఎలావున్నారో చూసొద్దామని బయలుదేరాను నేను. ఇంతలో వాడే ఏదో కాగితం పుచ్చుకుని హడావిడిగా వస్తూ నాకు ఎదురయ్యాడు.

"ఏరా రామం... ఎల్లావున్నారు మీరంతా? పొద్దున్నే ఎక్కడికీ బయలుదేరావ్?" అని అడిగాను.

"లాభం లేదురా! ఈ టెన్షన్ నేను భరించలేను. తిండి దిగటంలేదు, నిద్రలేకుండాపోతోంది. వాళ్లెప్పుడొస్తారోననే భయంతోనే కాలమంతా గడుస్తోంది. ఇహ ఈవాళ పేపర్లో నా అడ్రస్ ఇచ్చి ఓ ప్రకటన ఇద్దామని బయలుదేరాను" అన్నాడు.

"ఆ!... ఏమనీ...?" అంటూ నోరువెళ్లబెట్టిన నాతో అన్నాడు.

"అవున్రా! ఓ పోటు పొడిస్తే... చస్తే చావడం. లేకపోతే కనీసం ఆస్పత్రిలోనైనా నిశ్చింతగా పడుండచ్చు మరి అందుకని 'గూండాగార్లకు ఆహ్వానం' అంటూ నా అడ్రస్

తేసహా ఓ అడ్వెర్టయిజుమెంటిద్దామని బయ ల్దేరా'' అంటూనే పత్రికాఫీసు దిశగా పరుగెత్తా డు రామనాథం.

-సత్యం

## దివ్యౌషధం

శైలజ భర్త జీవన్‌రావు మొహమాటస్థుడు, మర్యాదస్థుడు. అతని డిక్షనరీలో జీవితానికి ఉన్న అర్థం మంచిగా, సరదాగా బతికేయ డమే. అందుకనే చేస్తున్నది మామూళ్ళు దండిగా వచ్చే ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ ఉద్యో గమే అయినా నాలుగురాళ్ళు వెనక వేసుకోలేక పోయాడు. అయితే భర్తకు ఉదయకుమార్‌తో సహవాసం శైలజకి నచ్చదు. ఉదయకుమార్ మంచివాడు కాదనిమాత్రంకాదుచాలా మంచి వాడు. మాటలపుట్ట. లోకాభిరామాయణంతో ఎదుటివారికి ఎన్ని గంటలైనా ఫ్రీ ఎంటర్‌టైన్ మెంట్ ఇస్తాడు. వయసు నలభై వుంటుంది. శైలజ అతణ్ణి బాబాయ్ అని పిలుస్తుంది. జీవన్‌రావు ఆఫీసు నుంచి వచ్చేసరికి ఇంటి దగ్గర హాజరైపోతాడు ఉదయకుమార్.

వారికోసం ఇంటి ముందు లాన్‌లో రెండు కుర్చీలు ఒక టీపాయి ఎదురుచూస్తాయి. వారి బాతాఖానీ మొదలవుతుంది. శైలజకి తిప్పలు ప్రారంభమవుతాయి. అరగంటకి ఓ కాఫీ చొప్పున వారు మాట్లాడుకుంటున్న రెండుమూ డు గంటలూ వారికి కాఫీలు అందించవల సిందే. జీవన్‌రావు మామూలుగా ఉదయం ఒక కప్పు, సాయంత్రం ఒక కప్పు కాఫీ తీసుకుంటాడు. ఉదయకుమార్‌తో కలిసినప్పు డు మాత్రం అన్నీ మరచిపోయి అతనితోపాటే అరగంటకో కప్పు కాఫీ తీసుకుంటాడు. భర్త మాటకి ఎదురుచెప్పడం శైలజకి అలవాటు లేని పని. వృధా శ్రమకి, వృధా ఖర్చుకి లోలో పలే విసుక్కుంటుంది.

ఉదయకుమార్ ఇంత వేగంగా వదిలేరకం కాదని ప్రత్యామ్నాయంకోసం ఆలోచించింది శైలజ. చదువుకున్న యువతి కాబట్టి మాంఛి ఐడియా రావడానికి ఎంతో టైమ్ పట్టలేదు.

కానీ తన ఆలోచన మంచిఫలితం ఇస్తుందని ఆశపడిన శైలజకి నిరాశే మిగి లింది. ఆమె కాఫీలో కలిపే విరేచన మాత్రల ప్రభావం ఉదయకుమార్ మీద పనిచేసినట్టే లేదు. 'ఇప్పుడు కాకపోతే ముందుముందైనా తన కాఫీ అతనిపై పనిచేయకుండా వుంటుందా?' అని సహనంతో శైలజ కాఫీలో ''డతిక్‌లిక్స్'' కలుపుతూనే వుంది. ఆ కాఫీని ఉదయకుమార్ ఆప్యాయంగా తాగుతూనే వున్నాడు.

ఈలోగా జీవన్‌రావుకి వారంరోజులు కేంప్ తగిలింది. ఉదయకుమార్ పీడ తాత్కాలి కంగానైనా విరగడయిందని నిట్టూర్చింది శై లజ.

కాని ఉదయకుమార్ కేంప్ వెళ్ళిన మరున టిరోజు కూడా యధావిధిగా వచ్చాడు ఉదయ కుమార్.

''ఆయన కేంప్ వెళ్ళారు ... మీకు తెలి యదా?'' అంది శైలజ.

''తెలుసమ్మా శైలజా ... నువ్వు నా చెల్లెలి లాంటిదానివి. ఏమీ అనుకోకు. ఇన్నాళ్ళు నీ భర్తతోపాటు నాకు కాఫీ ఇస్తున్నావు కాబట్టి అందులో నువ్వు పడ్డ శ్రమ గురించి ప్రస్తా వించనవసరం లేదు. ఇప్పుడు నాకు ఎప్పటి లాగే శ్రమ అనుకోకుండా కాఫీ ఇవ్వాలమ్మా. నేను అలా కోరడం సాంప్రదాయం కాదని నాకు తెలుసు కాని కోరక తప్పడం లేదు. ఎందుకంటే నేను మలబద్ధకం రోగిని. ఆ రోగానికి ఎన్నో మందులు వాడుతున్నాను. ఈమధ్య నీ కాఫీ ఆ మందుల నుంచి నన్ను దూరం చేసింది. అది నీ చేతి కాఫీ చలువ ... ప్లీజ్ కాదనకమ్మా''

ఉదయకుమార్ అలా అంటూంటే శిలాప్ర తిమలా నిలబడిపోయింది శైలజ.

-కె. అప్పారావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685,Visakhapatnam 52211, Tirupati 5291.

